క్షీణ యుగం కాదు ...

# ఉషోదయ యుగం

(19వ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్ర)

2008లో ఉస్మానియ విశ్వవిద్యాలయం నుండి
పిహెచ్.డి. పట్టం సాధించిన సిద్ధాంత గ్రంథం


పరిశోధన, రచన :

**డా॥ ఆచార్య ఫణీంద్ర**





పర్యవేక్షణ :

**ఆచార్య ఎస్వీ. రామారావుగారు**

(విశ్రాంత డీన్, ఆర్ట్స్ విభాగం, ఉస్మానియా విశ్వ విద్యాలయం)

హైదరాబాద్





**యువభారతి ప్రచురణ**

హైదరాబాద్

**Ushodaya Yugam**
A Ph.D. Thesis on 19th Century Telugu Poetry
by Dr. Acharya Phaneendra

**యువభారతి**

| | | |
|---|---|---|
| **ప్రచురణ సంఖ్య** | : | 208 |
| **ప్రథమ ముద్రణ** | : | 2024 |
| **పుటలు** | : | .... |
| **ప్రతులు** | : | 1000 |
| **ముద్రణ సహకారం** | : | 'పుస్తకశిల్పి' **తాళ్ళపల్లి మురళీధరగౌడు** |
| **లే అవుట్** | : | **యం. కవితారెడ్డి** |
| **ముద్రణ** | : | కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్. |
| **ప్రతులకు** | :1) | **యువభారతి**<br>తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు<br>తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001<br>చరవాణి : 93913 73684,<br>98499 09896 |
| | 2) | **శ్రీమతి జి. సావిత్రి,**<br>శ్రీకరం, 6-34/48/1, బాలాజీనగర్ కాలనీ<br>దుబాయి బిల్డింగ్ ఎదురుగా, దమ్మాయిగూడ,<br>హైదరాబాద్ - 500 083 (తెలంగాణ)<br>చరవాణి : 99598 82963 |
| **వెల రూ॥** | : | 300/- |

*ఈ గ్రంథం సెల్ఫ్ ఫైనాన్స్ స్కీమ్ క్రింద ముద్రించబడింది*



# అంకితం



కం. *శ్రీ వేంకట రమణుం దల*
*శ్రీ వేంకటగిరిని వెలసి, జీవుల గాచున్!*
*ఈ "వేంకట రమణు" డటులె*
*మా వరమున సంకటముల మము రక్షించున్!*

శా. *ధీరోదాత్తు, దుదారచిత్తుడు, స్ఫురద్దివ్య స్వరూపుండు, గం*
*భీరాంభోనిధి సార తుల్య కవితా విజ్ఞాన సంపన్నుడున్,*
*పేరుం గాంచిన దక్షపాలకుడు, సద్విద్వత్సభా బంధువున్,*
*'కారంచేటి' కులాన్వయుండు, 'రమణాఖ్యా' భూషితున్ గొల్చెదన్!*

మ. *అధికారంబిడు నెట్టి యున్నత పదంబందున్న, నే మాత్రమున్*
*పదవీ దర్పము జూపకుండ, ఘన సద్భావంబు నెల్లప్పుడున్*
*హృదయంబందున నిల్పి, అందరియెడన్ ప్రేమంబు వర్షించెడిన్*
*బుధుడౌ శ్రీ"రమణార్య" సద్గుణవరున్ పూజింతు నెల్లప్పుడున్!*

ఉ. మంచిని పెంచగా, మహిని మానవతన్ జనులందు నించగా –
ఎంచగ సాహితీ సృజన, మింక సుసాంస్కృతిక ప్రభాసమే
అంచిత మార్గమంచు విదులందురు! ఆదరమొప్ప, పోషణన్
పొంచి వహించెదు న్నపర భోజుడు – శ్రీ "రమణా"ఖ్య మ్రొక్కెదన్!

తే.గీ. సాహితీ సాంస్కృతిక రంగ సార్వభౌము
డగుచు – కవులు, కళాకారు లందరి నిటు
భవ్య మార్గమున నడుపు దివ్య యశుడు!
వేత్త – శ్రీ "రమణాచార్య" విశ్వగురువు!

చం. అతడు హిమాలయాద్రి శిఖరాగ్రము బోలుచు – నిత్య సాహితీ
వ్రతమును చేతబూను కవి, పండిత సభ్యుల సంస్థ లెల్లకున్
సతతము నండయై నిలిచి సాయమునే సమకూర్చుచుండు! ఆ
నుత ఘన కీర్తిశాలి – "రమణో"త్తమ నాముని కంజలించెదన్!

ఉ. ఎంతయొ శోధనన్ సలిపి, ఏను రచించిన భవ్య నవ్య సి
ద్ధాంత పిహెచ్.డి. గ్రంథ మిది! ధన్యత జెందగ నంకితం బిడన్
స్వాంతమునన్ దలంచితి రసజ్ఞులు శ్రీ "రమణా"హ్వయార్యుకున్!
ఇంతకు మించి ఈయగల నేమి మహోన్నత దివ్య మూర్తికిన్?

పూజనీయులు, పరిపాలనా దక్షులు
సాహితీ సాంస్కృతిక రంగ విరాణ్మూర్తులు
**డా. కె.వి. రమణాచార్య** గారికి
పాదాభివందనాలతో....

– **డా. ఆచార్య ఫణీంద్ర**





**డా॥ కె.వి. రమణాచార్యులు**
ఐ.ఏ.ఎస్. (విశ్రాంత)
తెలంగాణ రాష్ట్ర పూర్వ సలహాదారు
హైదరాబాద్

'స్వీకృతి' 24 మే 24

అగ్నింధన శాస్త్రవేత్త;
నా హితైషి;
పద్యవిధాన ధురుడు
ఆచార్య ఫణీంద్ర
తెలుగు భాషపై వున్న మక్కువతో
'19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో నవ్యత'
అన్న అంశంపై విశేష పరిశోధన చేసి
ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి
Doctorate పట్టం సాధించి,
మన కందిస్తున్న
Ph.D., సిద్ధాంత గ్రంథమిది: అదీను –
ఉత్తమ సాహితీ విమర్శకులు
ఆచార్య యస్వీ రామారావుగారి పర్యవేక్షణలో.
అంతకు మించి – వారి మార్గదర్శకత్వంలో.
19వ శతాబ్దిలో
పద్యకావ్యం, ఖండకావ్యం, గేయకావ్యం వంటి
రూపపరమైన ప్రక్రియలతో పాటు –

వస్తుపరమైన ప్రక్రియలు కూడ
రూపు దిద్దుకొన్నాయంటూ
సోదాహరణంగా వివరించి,
తెలుగు సాహిత్య చరిత్రలో 19వ శతాబ్ది
క్షీణయుగం కాదు; కాదు.....కానే కాదు..
'ఒక ఉషోదయ యుగమని పేర్కొన్న ఘనాపాటి.

- మిత్రులు ఫణీంద్ర నాన్నగారు
శ్రీమాన్ గోవర్ధనం దేశికాచార్యులు -
మా నాన్నగారు
శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు -
వీరిద్దరు 'మంచి మిత్రులు'!
ఇద్దరూ దేశికోత్తములు!!
అందుకే కాబోలు -
సోదరుడు, మిత్రుడు ఫణీంద్ర
ఈ సిద్ధాంత గ్రంథాన్ని నాకంకితమీయడం!!
ఇది మా మైత్రీబంధానికి ప్రతీక..
మా సోదరతత్త్వానికి పతాక.....
- ఈ 'కృతి స్వీకృతి'
నా సుకృతంగా సంభావిస్తూ
ఆచార్య ఫణీంద్రకు శుభాభినందనలతో -



**ఆచార్య ఎస్వీ. రామారావు**
విశ్రాంత డీన్, ఆర్ట్స్ విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్
చరవాణి : 98480 12053.



# పరిశోధనా శేముషి

**తె**లుగు సాహిత్య విమర్శపై ఉస్మానియా తెలుగుశాఖలో నేను పరిశోధన చేస్తున్న కాలంలో (1964–71) 19వ శతాబ్ది సాహిత్యానికి సంబంధించిన వినూత్న అంశాలు నాకు గోచరించాయి. తొలి విమర్శ గ్రంథాలతో పాటు నవల, నాటకం, వ్యాసం, జీవిత– దేశ చరిత్రలు, యాత్రాచరిత్రలు మున్నగు ప్రక్రియల్లో ప్రాతః స్మరణీయమైన గ్రంథాలు ఆ కాలంలోనే విరచితమైనాయి. 20వ శతాబ్దిలో ఊపందుకున్న ఆధునిక కవితా రీతులకు నాడే రచయితలు నాందీ వచనాలు పలికారు. 19వ శతాబ్ది సాహిత్యంలోని నూత్నరీతులపై ప్రత్యేకమైన పరిశోధన జరగవలసిన అవసరం వుందని గుర్తించాను. సాహిత్య విమర్శ ప్రక్రియా పరిశోధనలో తలమునుకలవుతున్న నేను పై అంశంపై పరిశోధన చేయగల విద్యార్థి కోసం ఎదురుచూశాను.

ఆర్ట్స్ విభాగం డీన్‌గా కొనసాగుతున్న కాలంలో అనుకుంటాను... సాహిత్యాభినివేశంతో ఫణీంద్ర పరిశోధన కోసం నా ముందుకు వచ్చాడు. పై అంశాన్ని సూచించగా ఆసక్తితో విస్తృత పరిశోధన చేసి 2008లో డాక్టరేట్ పట్టం పొందాడు.

ప్రబంధ యుగానంతర సాహిత్యంలోని క్షీణ లక్షణాలపై మాత్రమే దృష్టిపెట్టి అంధయుగంగా ప్రచారం చేస్తున్న కాలంలో నూత్న ప్రయోగాలతో కూడిన అది 'అంధయుగం' కాదని 'సంధియగం' అని నిరూపిస్తూ యండమూరి సత్యనారాయణ రావు 'శ్రీవాత్సవ' వెలువరించిన 'ఉషః కిరణాలు' గ్రంథం (1960) ఈ పరిశోధనకు మార్గదర్శనం చేసింది. దాని ననుసరించి 'కవిత్వవేదీ' కల్లూరి వెంకటనారాయణ రావు 'వీరేశలింగ యుగము' కూడా (1963) వెలువడింది.

19వ శతాబ్ది సాహిత్యాన్ని సమగ్రంగా అవలోడన చేసి కవిత్వ ప్రక్రియలోని నవ్యతా గుణాలను విస్పష్టంగా వివేచించిన ఉత్తమ సిద్ధాంత గ్రంథం ఆచార్య ఫణీంద్ర

‘19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో నవ్యత’. 11 అధ్యాయాలలో నాటి తెలుగు కావ్యాలలో నవ్యతకు శ్రీకారం చుట్టిన పలు అంశాలను ప్రకాశమానం చేశారు. అవతారికా సంప్రదాయాన్ని పాటించని శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి ‘సర్వకామదా పరిణయం’, శ్రీకారంతో కావ్యారంభం చేయని ఆదిభట్ల నారాయణదాసు, శొంఠి భద్రాద్రి రామశాస్త్రి కావ్యాలను కావ్య పాత్రలలో నాయకునికి కాకుండా నాయకీ ప్రాధాన్యమొసగిన కట్టమంచి ‘ముసలమ్మ మరణము’ను పరామర్శించారు.

ఛందోనవ్యత ప్రకరణంలో గురజాడకు వందేళ్ల ముందే ముత్యాలసరం ఛందస్సులో రేవణూరి వేంకటార్యుని ‘శ్రీపాదరేణు ప్రభావము’ విరచితమైన అంశాన్ని (1810) వెలికి తెచ్చారు. వెండి, బంగారం, తేటబోటి, ఆటబోటి ఛందస్సులను ప్రవేశపెట్టిన కొక్కొండ వెంకటరత్నం గేయ కవితకు శ్రీకారం చుట్టాడన్న విషయం గమనింపదగింది. ఫ్రెంచి, ఆంగ్లం మున్నగు అన్యదేశ్యాలతో భాషా నవ్యతకు దారి తీసిన అంశాన్ని; తెలుగు రచయితలపై పాశ్చాత్య ప్రక్రియా ప్రభావాన్ని విశదీకరించారు. 1864లో బందరులో చెలరేగిన తుపానును రాయభట్ల వీరరాఘవ కవి (గాలివాన సీసమాలిక), గోదావరి వరదను వడ్డాది సుబ్బారావు గ్రంథస్థం చేసిన వస్తు నవ్యతను గుర్తించారు. సమాపనంలో తెలుగు సాహిత్యంలో 19వ శతాబ్ది కాలాన్ని ‘ఉషోదయ యుగం’గా పరిగణించాలని సముచితమైన ప్రతిపాదన చేశాడు. సాహిత్య చైతన్యానికి దోహదం చేసిన చారిత్రక సంఘటనల వివరాలను పొందుపరచటం పరిశోధకులకు ఉపయోగకరం.

పద్య, గేయ కృతులతో లబ్ధప్రతిష్ఠుడైన ఫణీంద్రుని పరిశోధనా శేముషికి ఈ గ్రంథం కలికితురాయిగా నిలుస్తుంది. నా పర్యవేక్షణలో పిహెచ్.డి. పరిశోధన చేసిన వారిలో చివరివాడైన ఫణీంద్రశయన్ *(కలంపేరు : ఆచార్య ఫణీంద్ర)* సిద్ధాంత గ్రంథం ఆలస్యంగానైనా నేడు ముద్రిత రూపంలో పాఠకులకు అందుబాటులో వస్తున్నందుకు ఆనందిస్తూ ఆత్మీయ శుభాకాంక్షలు అందిస్తున్నాను.

25-12-2023 **- ఎస్వీ. రామారావు**





**Prof. G. Trivikramaiah**
*Dept. of Telugu,*
*Banaras Hindu University,*
*Varanasi, Uttar Pradesh.*

# New Vision to the Modern Literature



At the outset, I appreciate the Scholar for his absorbing research work on the topic - "The Modernity in the Telugu Literature of 19th Century", which was ably supervised by Prof. S.V. Rama Rao.

The very first sentence of his thesis answers many of the doubts which might have occurred in the minds of many scholars. The thesis expresses the fact that the Scholar has read the Literature of the 19th Century with intensity that is required for better analysis. The bibliography at the end testifies the truth.

The most admirable matter of the thesis is the language used for presentation and the manner in which material has been depicted. Rarely one finds this kind of neat presentation. He approached the topic with a new vision and I believe contributed further to the studies of Modern Literature.

The Scholar has organized the data properly and the data collected has been adequate. He has drawn right conclusions. There was clarity of thought and has control over his objective.

I wish all the best both for the Scholar and the Supervisor.

Varanasi
Dt.10/12/2008 ***(G . Trivikramaiah)***



**Dr. T.S. Giriprakash**
Chairperson, School of Indian Languages,
Madhurai Kamaraj University, Madhurai, Tamilnadu.

# An Eye Opener for Future Researchers



The researcher has taken an excellent topic, entitled "Modernism in Telugu Literature of 19th Century". I think the researcher did not leave any aspect untouched in the Telugu Literature of 19th Century. He has excellently touched modernism in all the aspects like Telugu Prosody, genre, linguistics, influence of English Literature on Telugu and the last, but not the least the modernism in the content. Regarding the preparation of the History of the Literature in Telugu, the researcher has given an apt suggestion to prepare the same as per time aspect, I.e., for example, Telugu Literature before 11th Century, Telugu Literature of 11th Century, Telugu Literature of 12th Century, 13th Century and so on so forth. His explanation for preparing the History of the Literature on this basis of the social aspects of that particular age is quite scientific and provides an eye opener for the future scholars.

The researcher's analytical explanations of modernism in the work - "Sarvakamada Parinayam" are quite interesting. His bold comments on the work - "Musalamma Maranam" are worth mentioning. He said the poem is not 'Mangalantham' as was stated by the previous scholars Prof. Pingali Laxmikantham and Prof. C. Narayana Reddy. It is quite interesting to note that the prosody viz. 'Muthyala saralu' was not newly introduced by the great poet Gurajada Appa Rao. But it was already introduced by the previous poets. The scientific explanation and apt examples show that the researcher has got very keen interest in the Telugu Language & Literature and a research bent of mind.

I am very happy to congratulate the researcher on being awarded with Ph.D. by Osmania University on submission of an excellent thesis. I suggest the University to publish the thesis, which will be an eye opener for the future researchers as to how a thesis can be written.

Dt. 21/12/2008  ***(T.S.Giriprakash)***



***డా॥ టి.గౌరీశంకర్***
పూర్వ రిజిస్ట్రార్, తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్, చరవాణి : 94401 69896



# కొత్త వెలుగును ప్రసరించిన పరిశోధన



**‘19వ** శతాబ్దిలో తెలుగు కవిత్వంలో నవ్యత’ అనే అంశంపై ఆచార్య ఎస్.వి. రామారావుగారి పర్యవేక్షణలో శ్రీ జి.వి. ఫణీంద్ర శయన్ (ఆచార్య ఫణీంద్ర) గారు పిహెచ్.డి. పట్టా కోసం సమర్పించిన పరిశోధనా గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలించాను.

ఈ పరిశోధనకు స్వీకరించిన అంశం వినూత్నమైనది, ఇంతవరకూ ఎవరూ స్పృశించనిది. సాహిత్యలోకంలో క్షీణయుగంగా, అంధకారయుగంగా భావింపబడుతూ వచ్చిన 19వ శతాబ్దిలోని సాహిత్యంపై ముఖ్యంగా కవిత్వంపై ఈ పరిశోధన ద్వారా ఒక కొత్త వెలుగును ప్రసరింపజేసినందుకు ఈ పరిశోధకుణ్ణి ముందుగా మనసారా అభినందిస్తున్నాను.

ఈస్టిండియా కంపెనీ రాకతో భారతీయ జనజీవితంలో పెను మార్పులు సంభవించాయి. ఇవి కేవలం సామాజిక, సాంస్కృతిక, వైజ్ఞానిక, ఆర్థిక, రాజకీయ విద్యారంగాలనే కాదు సాహిత్యరంగాన్ని కూడా స్పృశించాయి. అందుకే ఆంగ్ల విద్యాప్రభావంతో హేతువాద దృష్టి, మార్క్సిస్టు దృక్కోణం భారతీయులలో మొదలైంది. అంతవరకు సనాతన సంప్రదాయాలను అనుసరిస్తూ వచ్చిన తెలుగు సాహిత్యం నెమ్మది నెమ్మదిగా ఆ ఛాయలను తొలగించుకొని నూతనత్వం వైపు తప్పటడుగులు వేస్తూ వచ్చింది.

అయితే సాహిత్య చరిత్ర నిర్మాతలు తెలుగు సాహిత్యాన్ని గురించి చెప్పేటప్పుడు ప్రాచీన సాహిత్యం ఆధునిక సాహిత్యం అంటూ కాలసూచితో గిరి గీసి చెప్పటం జరిగింది. కానీ ఆ గీతకు మధ్యనున్న సన్నని కాలాన్ని రాత్రి గడిచాక సూర్యోదయానికి ముందు కాలాన్ని గురించి ఎవరూ ఎక్కువగా చెప్పలేదు. అటువంటి ఒక విస్మృత, అస్పృశ్య అంశాన్ని తీసుకొని దీనిని లోతుగా పరిశీలించి ఎన్నో కొత్త విషయాలు చెప్పడం పరిశోధకుని సాహసమే అవుతుంది.

సాహిత్య విమర్శకులు 18వ శతాబ్ది చివరికల్లా ప్రాచీన సాహిత్యం బీటలు వారిందనీ, 20వ శతాబ్దం ఆరంభంలోనే నవీన కవిత్వం మొలకెత్తిందని అభిప్రాయ పడుతుంటారు. కానీ ఇది నిజం కాదనీ, దీనివల్ల 19వ శతాబ్దిలోని కవిత్వానికి ఎంతో అన్యాయం జరిగిందనీ పరిశోధకుడు వెల్లడించాడు.

చరిత్రలో స్థిరపడిన 19వ శతాబ్దిలోని కవిత్వాన్ని పరిశోధించి పరిశీలిస్తే ఈ పాత అభిప్రాయం తుడిచిపెట్టుకుపోతుందనే ఉద్దేశ్యంతోనే ఈ పరిశోధనకు పూనుకొన్నట్లు పరిశోధకుడు విన్నవించుకొన్నాడు. ఈ పరిశోధన ద్వారా ఆ ప్రయత్నంలో కృతకృత్యుడయ్యాడు. తెరమరుగున, చీకటిలో ఉన్న 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వాన్ని పరిశీలనకు స్వీకరించడం జరిగింది. అందులో నవ్యతను వెతికాడు. నిజమే అంతవరకు సంప్రదాయ ధోరణిలో సాగిన సాహిత్యానికి 18వ శతాబ్దిలోనే చరమగీతం పాడడం జరిగింది. అప్పుడప్పుడే బ్రిటిషువారి పాలనలో ఆంగ్ల విద్యావ్యాప్తిలో కొత్త కొత్త రచనలు పొటమరిస్తున్న తరుణంలో వెలువడిన తెలుగు కవిత్వం అటు ఇటు కాని సంధి దశలో పోయిన నూతన పోకడలను ఈ పరిశోధకుడు 'నవ్యత' పేరుతో ఈ పరిశోధనలో ప్రస్తావించాడు.

ఈ సిద్ధాంత వ్యాసాన్ని మొత్తం 11అధ్యాయాలుగా వింగడించడం జరిగింది.

మొదటి అధ్యాయంలో 20వ శతాబ్దంలోని ఆధునిక కవిత్వం అమాంతంగా పుట్టుకొచ్చింది కాదనీ, దానికి 19వ శతాబ్దంలోనే బీజావాపనం జరిగిందనీ చెప్పాడు. దీనిని అంధకారయుగం అనడానికి కారణాల్ని పరిశోధించి ఇది 18వ శతాబ్దంలో అంతరించిన ప్రాచీన సంప్రదాయ కవితకు ఆధునిక కవితకు మధ్య వారధి లేక సేతువు వంటిదని తెలిపాడు. దీనిని సంప్రదాయపు కోణంలో నుంచి గాక ఆధునిక కోణంలో నుంచి అధ్యయనం చేయవలసి ఉంటుందని అన్నాడు.

రెండవ అధ్యాయంలో కవిత్వం, నవ్యత్వం గూర్చి వివిధ భారతీయ, విదేశీ విమర్శకులు తెలిపిన అభిప్రాయాలను గురించి చర్చించడమైంది. దార్శనికత, రసానందం, సందేశం ఈ మూడు ఉత్తమ కవితా లక్షణాలుగా చెప్పబడ్డాయి. వీటన్నిటిలో నవ్యత అన్నది అంతర్వాహినిగా ప్రవహిస్తుందని తెలుపడమైంది. 19వ శతాబ్దిలోని కవిత్వంలో పది రకాల నవ్యతలున్నాయనీ, అవి క్రమంగా ఎదుగుతూ, ద్విగుణీకృతమవుతూ 20వ శతాబ్దపు ఆధునిక కవిత్వంగా వికసించాయని పరిశోధకుడు తెలిపాడు.



మూడవ అధ్యాయంలో వివిధ సాహిత్య నిర్మాతలు తెలుగు సాహిత్యాన్ని వింగడించిన తీరుతెన్నులను గూర్చి అధ్యయనం చేయడం జరిగింది. అయితే వీరు చేసిన యుగ విభజన కంటే కూడా శతాబ్దాల వారీగా సాహిత్యాన్ని అధ్యయనం చేయడం వల్ల కలిగే ప్రయోజనాల్ని, అవసరాల్ని వివరించడమైంది. దీనివల్ల పై వింగడింపు ఏ రకంగానూ 19వ శతాబ్దపు తెలుగు సాహిత్యం వెలుగు చూడడానికి దోహదపడలేదు అని పరిశోధకుడు భావించాడు.

నాల్గవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని ఆంధ్రదేశం– ఇటు ఆనాటి నిజాం పాలనలో ఉన్న తెలంగాణా, అటు బ్రిటీషు పాలనలో ఉన్న కోస్తా రాయలసీమలోని సాంఘిక, రాజకీయ పరిస్థితుల్ని అధ్యయనం చేస్తూ, అవి కవిత్వాన్ని ఏ రకంగా ప్రభావితం చేశాయో చెప్పడమైంది.

అయిదవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వంలో ఉన్న సంప్రదాయానికి విరుద్ధమైన నవ్యతను గూర్చి వివరించడమైంది.

ఆరవ ఆధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు ఛందస్సు నవ్యతకు వేసిన బాటను గురించి వివరించడమైంది.

ఏడవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు భాషా నవ్యతకు వేసిన బాటను గురించి వివరించడమైంది.

ఎనిమిదవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వంలో కనిపించే వివిధ రకాల ప్రక్రియలను గురించి తెలియజేయడమైంది.

తొమ్మిదవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావం చేత కనిపించే నవ్యతను గురించి అధ్యయనం చేయడం జరిగింది.

పదవ అధ్యాయంలో 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వంలోని వస్తు నవ్యతను, ముగింపు అధ్యాయంలో 20వ శతాబ్దిలోని ఆధునిక తెలుగు కవిత్వంలోని ఎనిమిది ప్రత్యేక లక్షణాలను గురించి చర్చిస్తూ, ఈ ఆధునిక తెలుగు కవిత్వం మూలాలు లేక పునాదులు 19వ శతాబ్దిలోని కావ్యాలలో కనిపిస్తుందన్న అంశాన్ని పరిశోధన ద్వారా అధ్యయనం చేసి, దానిని సోపపత్తికంగా నిరూపించడమైంది.

చివరికి, 20వ శతాబ్దిలోని ఆధునిక తెలుగు కవిత్వానికి 19వ శతాబ్దిలోనే బీజావాపనం జరిగిందనీ, అందువల్ల ఈ శతాబ్దిలోని తెలుగు కవితా యుగాన్ని క్షీణయుగం లేక అంధకార యుగమని అనకుండా ఉషోదయ యుగమని పిలవడం సబబు అని పరిశోధకుడు తన సిద్ధాంతాన్ని సోదాహరణంగా, ఎంతో బలంగా చాటి చెప్పాడు.

ఆధునిక తెలుగు కవితారంగంలో ఇంతవరకు ఉన్న అభిప్రాయాల్ని, అనుమానాల్ని, పటాపంచలు చేస్తూ ఒక కొత్త అంశాన్ని తన పరిశోధన ద్వారా సాహితీలోకానికి చాటిచెప్పడం అభినందనీయం. ఎంతో శ్రమకోర్చి లోతుగా అధ్యయనం చేసి నూతన అంశాన్ని ప్రతిపాదించిన పరిశోధకుడు శ్రీ ఫణీంద్ర శయన్ చేత ఇంతమంచి పరిశోధన చేయించిన పర్యవేక్షకులు ఆచార్య ఎస్వీరామారావు గారిని మనఃపూర్వకంగా అభినందిస్తూ, పరిశోధకుడు ఆచార్య ఫణీంద్రకు నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

**టి.గౌరీశంకర్**





**డా. వెలుదండ నిత్యానందరావు**
విశ్రాంతాచార్యులు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
చరవాణి : 94416 66881



# ప్రాచీనతకు భరత వాక్యం- నవీనతకు నాంది వాక్యం



**ఆ**త్మీయ మిత్రులు ఆచార్య ఫణీంద్ర సైన్సును, సెన్సును సమపాళ్లల్లో మేళవించుకున్న సమన్వయమూర్తి. ఉద్యోగరీత్యా అణుఇంధనశాఖలో అత్యున్నతస్థాయి శాస్త్రవేత్త. యురేనియం నాణ్యతను రష్యాలో ఇండియాలో పరిశీలించిన బృందంలో సభ్యులు అంటేనే ఆయన స్థాయి ఏమిటో తెలుస్తుంది. మనం సాహిత్య జీవులం. ఆయన విజ్ఞాన శాస్త్ర రంగంలో ఎంత గొప్పవాడైనా హర్షిస్తామే తప్ప పట్టించుకోం. ఫణీంద్ర సాహిత్య రంగంలో సుస్థిరస్థానం సంపాదించుకొన్నవారు. ప్రముఖపద్యకవులు.; పద్యప్రసూనాలు, ముద్దుగుమ్మ, తెలంగాణామహోదయం లాంటి కావ్యాలను వెలువరించినవారు. విజయ విక్రాంతి దీర్ఘ కవితాకర్త, ముకుంద మాల అనువాదకులు, వరాహశతకకర్త, ఏకవాక్య కవితా సంపుటి నిర్మాత. మాస్కో స్మృతులు పేరిట సమగ్ర విదేశయాత్రా పద్యకావ్యనిర్మాత. వైష్ణవ ప్రపత్తి, పాండిత్యానురక్తి ఆనువంశికంగా అందుకొన్నవారు. వీరి పితామహ, మాతామహులు - సురవరం ప్రతాపరెడ్డి గోల్కొండ కవుల సంచికలో ఆనాడే స్థానం పొందిన విద్వాంసులు.

ఆచార్య ఫణీంద్ర ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే ఎం.ఎ (తెలుగు) చేసి, "19వ శతాబ్దిలో తెలుగు కవిత్వంలో నవ్యత" అనే అంశంపై ఆచార్య ఎస్.వి.రామారావు గారి పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి 2008లో డాక్టరేట్ పట్టం పొందడం ముదావహం. 19వ శతాబ్దాన్ని తెలుగు సాహిత్యంలో చాలామంది క్షీణయుగంగా అభివర్ణించారు. కానీ నిజానికి అది చాలా విచిత్రమైన కాలం. పాతది పూర్తిగా పోక, కొత్తది పూర్తిగా రాక పాతదనం నిష్క్రమించడానికీ, కొత్తదనం ప్రవేశించడానికీ మార్గాలను

సుగమం చేసుకొంటున్న సంధికాలం. 20వ శతాబ్దం ఆధునిక కాలమైతే దానికి కావలసిన నేపథ్యాన్ని సంతరించిన కాలం 19వ శతాబ్దం. జ్యోతిష శాస్త్రంలో శిశువు శీర్షోదయం నుంచి జనన కాలాన్ని లెక్కిస్తారు. అది బాహిరంగా కనిపించేది. అసలు గర్భంలోనే ఎప్పుడు పడిందో ఆనాటి నుంచి లెక్కించే సంప్రదాయం కూడా మరొకటి ఉంది. కానీ అది మనకు అనుభవైకవేద్యమే తప్ప దృగ్గోచరమయ్యేది కాదు. ఫణీంద్ర చేసింది ఈ రెండవకోవకు చెందిన పరిశీలన. ఆధునిక యుగ భావజాలానికి సంబంధించిన సర్వ సరంజామాను సిద్ధపరిచి అందించిన కాలమది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాచీనతకు భరత వాక్యం, నవీనతకు నాంది వాక్యం.

అటువంటి 19వ శతాబ్దం తెలుగు సాహిత్యాన్ని సాధికారికంగా, సప్రమాణంగా 11 అధ్యాయాల్లో నమోదు చేశారు. ఆనాటి రాజకీయ, సామాజిక, సాహిత్య స్థితి గతులకు తమ గ్రంథంలో దర్పణంపట్టారు. విలియం కేరి, కర్నల్ కాలిన్ మెకంజి, ఈశ్వరచంద్రవిద్యాసాగర్, రామకృష్ణ పరమహంస, దయానంద సరస్వతి, బంకించంద్ర చటర్జీ, 7-3-1835న ప్రారంభమైన మెకాలే ఆంగ్లవిద్యావిధానంతో అంది వచ్చిన ఆంగ్లభాష, పత్రికలస్థాపన, చారిత్రక సాంస్కృతిక సాహిత్యపరిశోధనలు, సంస్కరణోద్యమాలు, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఇలా.... ఎంతో సంభరితమైన సముజ్జ్వలమైన కాలం 19వ శతాబ్దం. ఆంగ్ల భాషా సాహిత్య సామాజిక సంపర్కంతో నూతన వ్యవస్థలు, సంస్థలు, పత్రికలు, భావజాలాలు ఎన్నెన్నో ఏర్పడ్డాయి. కొంతకాలంపాటు ఆ మెరుపుల్లో మైకేల్ మధుసూదన్ దత్ లాంటివారు తమను తాము మరచిపోయారు. కానీ వెంటనే అదే ఆంగ్ల ప్రభావంతో భారతీయ వైశిష్ట్యాన్ని వివరించే వ్యాఖ్యాతలు కూడా పుట్టుకొచ్చారు. ఇక్కడ పేర్కొన్న ఒక్కో అంశం మీదనే ఎన్నో గ్రంథాలు వచ్చిన సంగతి అందరికీ తెలిసిందే. అందుకే సూచనప్రాయంగా నామ ప్రస్తావన మాత్రమే చేస్తున్నాను.

విద్యా విధానంలో, వేష భాషల్లో, సాంకేతిక ప్రగతిలో, మూఢాచారాల నిరసనలో, వివక్షా నిరసనలో, ఆలోచనా తీరులో 19వ శతాబ్దం తెలుగు సమాజ పురోగమనాన్ని సోదాహరణంగా ఫణీంద్ర చిత్రించిన తీరు ప్రశంసనీయం. ఒకే పరిపాలన కింద ఉన్న తెలుగు ప్రాంతం రెండు ముక్కలై ఒకటి నిజాం ప్రాంతంగా, మరొకటి బ్రిటిషాంధ్రగా మారిన వైనం, దానివల్ల కలిగిన పరిణామాలు సాకల్యంగా వివరించారు. ముఖ్యంగా ఏనుగుల వీరాస్వామి కాశీయాత్ర చరిత్రలో చిత్రితమైన తెలంగాణ స్థితిగతులను ఫణీంద్ర



వివరించిన తీరు నన్నెంతో ఆకట్టుకొంది. స్థానిక జమీందారుల భోగలాలసత, దౌర్జన్యాలు, దుర్భర జీవితాలు, ఆంగ్ల ప్రాంతంలోని సాంకేతిక రాజకీయ అభివృద్ధి ఫలాలు అందకపోవడం, ఆంగ్లభాష-ఆంగ్ల విద్యా ప్రభావం, మానవతావాదం, హేతువాదం, సాంఘిక సమానత్వభావన, నూతన సంస్థలు, పత్రికలు కళాశాల చదువులు, వివిధ సాహిత్య ప్రక్రియలు ఆంధ్రప్రాంతంలో విలసిల్లినట్టుగా కాక తెలంగాణలో కుంటుబడిన తీరు, రైల్వే, విద్యుత్సౌకర్యం, ధవళేశ్వరం ఆనకట్ట నూతన కార్యాలయాలవల్ల ఆంధ్రలో నవ్యత, ఆర్థిక సామాజిక విద్యారంగాల్లో ఎదిగిన తీరు చర్చించారు.

పద్య నాటకాలు, ఖండకావ్యాలు, గేయ కావ్యాలు, వ్యంగ్య రచనలు, స్మృతి కావ్యాలు, యాత్రాచరిత్రలు, యాత్రాకావ్యాలు, చరిత్రలు, స్వీయచరిత్రలు, జీవిత చరిత్రలు, నవలలు, నాటకాలు, అనువాదాలు, సంగీత రూపకాలు, క్రైస్తవ సంకీర్తనలు మొదలైన సవా లక్ష నూతన ప్రక్రియలకు తలుపులను తీసిందీ, తలపులను పెంచింది 19వ శతాబ్దమే. ఈ శతాబ్దంలోనే సి.పి.బ్రౌన్, కాల్డ్వెల్, చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, వావిలాల వాసుదేవశాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు, వేదం వేంకటరాయశాస్త్రి, తిరుపతి వెంకట కవులు లాంటి మహానుభావులెందరో ఉదయించి వారివారి రంగాలను పరిపుష్టం చేశారు. ఈ శతాబ్దంలోని గురజాడ కన్నా నూరేళ్ళముందే రేవణూరి వెంకటార్యుడనే కవి "శ్రీపాద రేణు ప్రభావం" అనే కావ్యంతో ముత్యాలసరం రాశాడు అనే కొత్త విషయాన్ని ఫణీంద్ర వెలుగులోకి తేవడం గమనార్హం. అభినందనీయం. చర్చనీయం.

సామాజిక, సాంఘిక, రాజకీయ, సాహిత్య, ఆర్థిక, విద్యాది అనేకరంగాల్లో 20వ శతాబ్దంలోని నవ్యతను అందరికీ అనుభవంలోకి వచ్చేలా స్థిరమైన పునాదులు వేసిన చారిత్రాత్మక శతాబ్దం 19వ శతాబ్దం. అది క్షీణయుగం కానే కాదు.; 20వ శతాబ్దపు నవ్యతా ఫలాలను గర్భీకరించుకొన్న మహత్తరకాలమైన 19వశతాబ్ది తెలుగు సాహిత్య పరిణామాన్ని, పురోగమనాన్ని, విస్తృతిని, వైవిధ్యాన్ని సాధికారికంగా విశ్లేషించిన మా మిత్రులు ఆచార్య ఫణీంద్రను మనః పూర్వకంగా అభినందిస్తున్నాను.

12-12-2023  *- వెలుదండ నిత్యానందరావు*



**డా. బ్రాహ్మణపల్లి జయరాములు**
సంపాదకులు, యువభారతి,
సాహితీ సాంస్కృతిక సంస్థ
హైదరాబాద్. చరవాణి : 98498 74207



# సాహిత్య చరిత్రకు చక్కటి "ఉపాయనం"



**ఆ**చార్య ఫణీంద్రగారు పద్యంలోను వచనంలోనూ సుమనోహర కవిత్వ సృజన చేసి, ఖ్యాతి గడించిన వారు. కవిగా తెలుగునాట ప్రసిద్ధి గాంచిన వీరు తెలుగు సాహిత్యాన్ని తలస్పర్శిగా అధ్యయనం చేసి, 19వ శతాబ్దిలో వచ్చిన కవిత్వంపై ప్రధానంగా దృష్టి సారించి దాన్ని విమర్శకులు క్షీణయుగంగా, అంధయుగంగా పేర్కొనడాన్ని మరింత లోతుగా అధ్యయనం చేసి, ఈ శతాబ్దిలోని ఉషః కిరణాలను దర్శించి, "నాటి కవిత్వంలోనూ నవ్యత" నవనవలాడుతూ ఉన్నదని, దాన్ని సాహిత్యలోకానికి దర్శింప చేయడానికి తీవ్రమైన పరిశోధన సాగించి, 11 అధ్యాయాలలో నిగ్గుదేల్చారు.

మౌలిక సత్యాన్ని శోధించి సమన్వయించి చూపడం, సత్యసాధన జిజ్ఞాన కలిగి నిజాల్ని, విలువల్ని 19వ శతాబ్ది కవిత్వంలోని వాటిని (నాటి) ''నవ్యత''గా సిద్ధాంతీకరించడం ఈ గ్రంథంలో ఆచార్యుల వారి పరిశోధనా పటిమను చాటుతూ ఉంది. 19వ శతాబ్ది సాహిత్యమంతా అంధానుకరణం అనే ఆ భాగాన్ని తొలగించి, సాహిత్యలోకానికి ఒక నవ్యాలోకాన్ని ప్రసాదించారు. నూత్న దృక్పథ ప్రతిపాదనం, సాహిత్య సమాలోచనం, సమన్వయం- మూడు పాయలుగా సాగిన ఈ సిద్ధాంత గ్రంథం తెలుగువారికి ఉపాదేయమైంది. ఎందుకంటే- వినూత్న సిద్ధాంత ప్రపంచనమే పరిశోధనకు ప్రధానమైన అంగం కాబట్టి.

విశ్వవిద్యాలయాల్లో సాగే పరిశోధనకు సుప్రసిద్ధమైన మార్గాలున్నాయి. ఆ మార్గ పరిధిలోనే ఈగ్రంథం రచింపబడింది.



ప్రవేశిక; కవి, కవిత్వం, నవ్యత; సంధియుగ విశిష్టత (యుగ విభజన); ఆంగ్ల సాహిత్య సంబంధం వల్ల తెలుగులో కనిపించే నవ్యత; సంప్రదాయ భిన్నమైన అభ్యుదయాత్మక నవ్యత, నాయికా ప్రాధాన్యం; ఛందోనవ్యత, భాషానవ్యత, మణి ప్రవాళం; ప్రక్రియా బాహుళ్యం; తెలుగుపై పాశ్చాత్య ప్రభావం, అనువాదం, అనుసృజన; వస్తు నవ్యత; ఆధునికాంధ్ర కవిత్వ అష్టలక్షణాల బీజాలు; 19వ శతాబ్దికి 'ఉషోదయయుగం'గా నామకరణం- లాంటి ప్రధాన అంశాలతో పరిశోధన క్రమానుసార పద్ధతిలో సాగింది.

19వ శతాబ్ది నాటి తెలుగు కవిత్వంలో కనిపించే వస్తు నవ్యతను చతుర్విధంగా విభజించి, పరిశోధకులు వాటిని క్రమంగా 1) అల్ప వస్తువులకు కావ్యగౌరవం, 2) సమకాలీన సంఘటనాత్మక వస్తువులు, 3) సోషియో ఫాంటసీ కథా వస్తువులు 4) విచిత్ర కల్పన గల కావ్య వస్తువులు- అని విభజించి పరిశీలించడం ఉత్తమ పరిశోధకునకుండే లక్షణాన్ని తెలుపుతుంది.

ఈ గ్రంథంలో నూత్న ప్రతిపాదనలు, పరిశీలనలు, అనుశీలనతో పాటు ఈ శతాబ్ది సాహిత్యం మొత్తాన్ని ఒక యుగంగా పరిగ్రహించి, దానికి 'ఉషోదయ యుగం" అనే నామాన్ని నిర్ధారించడం కూడా పరిశోధకుని పరిణతిని చాటుతుంది. క్షీణయుగంలో వచ్చిన ప్రబంధాలను పరిశీలిస్తూ యండమూరి సత్యనారాయణరావు గారు "ఉషః కిరణాలు" పేర ఒక గ్రంథం రచించారు. ఆ గ్రంథం కూడా వీరికి కొంత దారి చూపినట్లుంది. ఏది ఏమైనా, ఒక చక్కటి పరిశోధన గ్రంథాన్ని "యువ భారతి"కి ప్రచురించే అవకాశం లభించడం ముదావహం. ఇది సాహిత్య చరిత్ర పాఠకులకు చక్కని ఉపాయనం. ఆచార్యులవారి శ్రమను ప్రశంసిస్తూ, వారిని మనసా, వాచా అభినందిస్తున్నాను.

**- బ్రాహ్మణపల్లి జయరాములు**





డా. ఆచార్య ఫణీంద్ర
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ,

# క్షీణ యుగం కాదు...



అరువదేళ్ళుగా "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ- "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటం కంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది" అన్న సూక్తి స్ఫూర్తిగా, తెలుగు నాట - సామాజికోపయుక్తమైన అనేక సత్సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది. యువతకు సాహిత్యాభిరుచి, తద్వారా సౌమనస్యం, సౌశీల్యం సంతరింపజేసేందుకు "యువభారతి" సంస్థ పండితోత్తముల, సాహితీ వేత్తల ప్రసంగ పాఠాలతో "కావ్య లహరి", "చైతన్య లహరి", "మహతి", "హాస్య లహరి", "సంస్కృత సాహితీ లహరి", "వేద విజ్ఞాన లహరి" వంటి ఎన్నో ప్రజాదరణ పొందిన గ్రంథాలను అందించిన విషయం అందరికీ తెలిసిన విషయమే!

కడచిన ఆరు సంవత్సరాలలో కూడ, మా యువభారతి ప్రస్తుత కార్యవర్గం - యువతకు, సాహిత్యాభిమానులకు ఉపయుక్తమైన అనేక కార్యక్రమాలను నిర్వహిస్తూ, అనేక పఠనీయ సద్గ్రంథాలను ముద్రించింది. వానిలో ప్రధానంగా .. "గాంధీ మహాత్ముని సూక్తులు", "తెలుగువారి నాల్కలపై నడయాడిన నాటక పద్యాలు", "పుంభావ సరస్వతి- పుట్టపర్తి", "అభినవ పోతన వానమామలై వరదాచార్యులు", "తెలుగు సొగసులు", "అమృత భారతి", "ద్విశత భారతి", "దక్షిణభారత వనితా వాగ్గేయవాఙ్మయం", "మహాభారతోపన్యాస లహరి", "శ్రీమద్రామాయణం - మానవీయ సంబంధాలు", "యువభారతి - వజ్రోత్సవ హారతి", "నన్నయ సూక్తిసుధ" మొదలైన పలు గ్రంథాలను ప్రచురించి పాఠక లోకానికి అందించింది.

తెలుగు సాహిత్య చరిత్రలో 19 వ శతాబ్ది తెలుగు సాహిత్య కాలం పట్ల క్షీణ యుగం .. అంధ యుగం.. అంటూ అపప్రథ నెలకొని ఉండడం దురదృష్టకరం. నిజానికి 20 వ శతాబ్ది ఆధునిక యుగానికి ఆవశ్యకమైన బీజాలు 19 వ శతాబ్దిలోనే పడ్డాయన్న విషయం ఆ శతాబ్దిలోని మరుగునపడిన అనేక కావ్యాలను సేకరించి, అధ్యయనం చేస్తే అవగతమవుతుంది. పదిహేను సంవత్సరాలకు పూర్వం 19 వ శతాబ్ది తెలుగు కావ్యాల నెన్నింటినో వెలికి తీసి, విస్తృత పరిశోధన చేసి, క్రోడీకరించిన అనేక నూత్న విషయాలతో సిద్ధాంత గ్రంథం రచించి, ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్.డి. పట్టాను పొందే మహద్భాగ్యం నాకు దక్కింది. ఆ సిద్ధాంత గ్రంథమే మీ చేతిలో ఉన్న



ఈ "ఉషోదయ యుగం".

మెకానికల్ ఇంజనీరింగ్ పట్టభద్రుడనై, భారత ప్రభుత్వ "అణు ఇంధన సంస్థ"లో శాస్త్రవేత్తగా పని చేస్తున్న నాలోని కవిని, సాహితీ చైతన్యాన్ని గుర్తించి, నన్ను తెలుగులో పి.హెచ్.డి చేసేందుకు ప్రేమతో ఆనాడు ఆహ్వానించి, పరిశోధనకు ఇంత చక్కని అంశాన్ని సూచించి, ప్రోత్సహిస్తూ నా పరిశోధనను పర్యవేక్షించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ విభాగం పూర్వ "డీన్", సుప్రసిద్ధ విమర్శకులు ఆచార్య ఎస్.వి. రామారావు గారు .. మళ్ళీ ఇప్పుడు ముందుమాట రూపంలో నన్ను ఆశీర్వదించారు. వారికి నా వినయపూర్వకాభివాదాలు!

నా సాహితీ జీవితాన్ని చరితార్థం చేసిన ఈ పరిశోధన గ్రంథాన్ని, నేను దైవాంశ సంభూతులుగా సంభావించే పవిత్ర మానవతామూర్తి, విశ్రాంత ఐ.ఏ.ఎస్. అధికారి, తెలుగు సాహితీ సుక్షేత్రంలో కల్పవృక్ష సమానులు, "యువభారతి" సంస్థ గౌరవ సభ్యులు - డా. కె.వి.రమణాచారిగారికి అంకితం చేయడం నా పురాకృత సుకృతంగా భావిస్తున్నాను. దయతో ఈ గ్రంథాన్ని స్వీకరించేందుకు అంగీకరించి, నాపై తమ వాత్సల్యాన్ని అక్షర రూపంలో వర్షించిన ఆ మహనీయునికి పాదాభివందనం!

నా ఈ పరిశోధనపై తమ అమూల్యాభిప్రాయాలను వెల్లడించిన గురు తుల్యులు, తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ రిజిస్ట్రార్ ఆచార్య టి. గౌరీశంకర్ గారికి, బనారస్ హిందూ విశ్వవిద్యాలయం - తెలుగు శాఖ ఆచార్యులు డా. జి. త్రివిక్రమయ్య గారికి, మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం - భారతీయ భాషల విభాగం అధ్యక్షులు డా. టి.ఎస్. గిరిప్రకాశ్ గారికి, సాహితీ మిత్రులు - ఉస్మానియా విశ్వవిద్యాలయం విశ్రాంత ఆచార్యులు డా. వెలుదండ నిత్యానందరావు గారికి, మా "యువభారతి" ప్రచురణల సంపాదకులు, సాహితీ మిత్రులు డా. బి. జయరాములు గారికి నా హృదయపూర్వక ధన్యవాద సహిత నమస్సులు! ఈ గ్రంథ ముద్రణలో సహకరించిన యువభారతి మిత్రులు, పుస్తక శిల్పి శ్రీ తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్ గారికి నా కృతజ్ఞతలు!

శతాబ్దాల తెలుగు సాహిత్య జలధి లోతులకు వెళ్ళి, ఆణిముత్యాల వంటి అంశాలను వెలికితీస్తూ, దశాబ్దాలుగా ప్రస్తుత తరం ప్రజలకు గ్రంథాలుగా ప్రచురించి అందిస్తూ ప్రఖ్యాతి వహించిన సంస్థ - "యువభారతి". అదే మార్గంలో ఇప్పుడు 19 వ శతాబ్ది తెలుగు సాహిత్య సమగ్ర చరిత్రను ఈ "ఉషోదయ యుగం" గ్రంథ రూపంలో అందించడం ఆనందంగా ఉంది. అందునా .. అది నా స్వీయ పరిశోధనాత్మక రచన కావడం నాకు మరింత ఆనంద దాయకం. యువభారతి గ్రంథాలను అభిమానించే పాఠకులు, తెలుగు సాహిత్యాభిమానులు ఈ గ్రంథాన్ని తప్పక చదివి ఆనందిస్తారని, విశేషంగా ఆదరిస్తారని, ఈ గ్రంథ రచయితగా, సంస్థ అధ్యక్షునిగా ఆకాంక్షిస్తున్నాను.

**- ఆచార్య ఫణీంద్ర**

క్షీణయుగం కాదు ...

# ఉషోదయ యుగం

## క్రమ సూచిక :





# 1

# ప్రవేశిక



పురాణ మిత్యేవ న సాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్య వద్యం

**- కాళిదాసు**

"**పం**దొమ్మిదవ శతాబ్దిలో తెలుగు కవిత్వంలో నవ్యత" – ఈ శీర్షిక చూడగానే ఇంతవరకు తెలుగు సాహిత్య చరిత్రను అధ్యయనం చేసిన వారు చాలా మంది కనుబొమలు ముడివేయకపోరు. "పందొమ్మిదవ శతాబ్ది క్షీణయుగంగా ప్రసిద్ధి చెందింది కదా! ఇరవయ్యవ శతాబ్దిలోగాని నవ్యకవిత్వం అంకురించలేదు కదా! మరి, అంధకారం ఆవరించియున్న 19వ శతాబ్దిలో నవ్యత ఎక్కడిది?" అన్న సందేహం ఒక్కసారి కలుగక మానదు.

ఇదీ 19వ శతాబ్ది తెలుగు కవిత్వానికి జరిగిన అన్యాయం. నిజంగా 19వ శతాబ్దిలో వెలువడిన కావ్యాలను కూలంకషంగా అధ్యయనం చేస్తే, వాటిలోని నవ్యతా పరిమళాలను ఆస్వాదించగలిగితే, ఈ అభిప్రాయాన్ని మార్చుకోక తప్పదు. అసలు 20వ శతాబ్దిలోని ఆధునిక కవిత్వాన్నే నవ్య కవిత్వంగా భావిస్తున్న వారు ఆ నవ్యత ఒక్క మారుగా ఆ శతాబ్దిలో ఊడిపడిందని ఎలా భావించగలరు? దానికి పూర్వ రంగంలో జరిగిన ఆద్యవస్థల గురించి ఆలోచించక పోతే ఎలా? పూర్ణ గర్భం దాల్చకుండానే, పురిటి నొప్పులు లేకుండానే పుత్రజననం ఎలా జరుగుతుంది? నాయక రాజుల కాలం వరకు అవిచ్ఛిన్నంగా తెలియ జెప్పిన మన సాహిత్య చరిత్రను అక్కడ నిలిపివేసి, నూరు నూట యాభై సంవత్సరాలు ముందుకు జరిపి, 20వ శతాబ్ది చరిత్రను చెప్పడం మన సాహిత్య చరిత్రకారులకు అలవాటైపోయింది. ఎవరైనా ఒకరిద్దరు చరిత్రకారులు ఆ యుగం గురించి ఒకటి రెండు పుటలలో చర్చించినా, దానిని అంధకారయుగంగానే చిత్రించారు. మితిమీరిన శృంగారం,

వెఱ్ఱితలలు వేసిన ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలను ఒకటి రెండు (–అవీ 18వ శతాబ్దికి చెందినవో లేక 19వ శతాబ్దికి చెందినవో సరిగా నిర్ధారించకుండానే) తెలిపి వాటిని క్షీణయుగం కావ్యాలుగా పేర్కొంటూ వచ్చారు. ఇంతవరకు ఆరుద్ర, కొర్లపాటి శ్రీరామమూర్తి తప్ప తక్కిన ఏ సాహిత్య చరిత్రకారుడైనా, ముద్దుపళనిచే రచింపబడిన 'రాధికా సాంత్వనము', లేదా ఒకటి–రెండు పిల్ల వసు చరిత్రలను పేర్కొని, 19వశతాబ్దిలో కూడా అవే మూసలో గ్రంథాలు వెలువడ్డాయని, ఆ యుగానికి న్యూనతా భావాన్ని పులిమి, దాటవేసే ప్రయత్నమే చేశారు కాని, కించిత్తు శ్రమకోర్చి ఆ శతాబ్దిలో నవ్యతా స్పర్శ గల గ్రంథాలను సాధించి, అధ్యయనం చేసి, లోతుపాతులను స్పృశించే ప్రయత్నం చేయలేదనే చెప్పాలి. ఆరుద్ర, కొర్లపాటిగార్లు మాత్రం 19వ శతాబ్ది కవులు, వారి కావ్యాల గురించి కొంత పరిచయం చేసినా వారిలో కూడా క్షీణయుగమన్న ముద్ర ఉండడం వలన నవ్యతా దృష్టితో పరిశీలన జరుగలేదనే చెప్పాలి.

ఒకవేళ బ్రౌను మహాశయుడు మన దేశానికి వచ్చి ఉండకపోతే, ఒక్క 19వ శతాబ్దికే కాదు – అంతకు పూర్వం (11వ శతాబ్ది నుండి 19వ శతాబ్ది వరకు) కూడా మనకు సరైన సాహిత్యమే లేదు – అన్న అపప్రథ నెలకొని ఉండేదేమో!

బ్రౌను పరిశోధనల కన్న పూర్వం, ఆంగ్లేయులు తెలుగువారికి మౌఖిక సాహిత్యమే తప్ప చెప్పుకోదగ్గ లిఖిత సాహిత్యమే లేదని భావించారు. బ్రౌను పుణ్యమా అని 18వ శతాబ్ది వరకు గల గ్రంథాలు ముద్రించబడి ప్రజా బాహుళ్యంలో అందుబాటులోకి రావడం వలన ఆ గ్రంథాల అధ్యయనంతో మన సాహిత్య చరిత్రకు రూపకల్పన చేసే ప్రయత్నాలు జరిగాయి. 19వ శతాబ్దిలోనే గురజాడ శ్రీరామమూర్తిగారు 'కవి జీవితములు' అన్న గ్రంథాన్ని, కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'కవుల చరిత్రము' అన్న గ్రంథాన్ని వెలయించారు. అయితే వీటిలో 18వ శతాబ్ది వరకు గల కవుల ప్రస్తావన మాత్రమే ఉంది. 20వ శతాబ్ది ఆదిలో వంగూరి సుబ్బారావుగారు రచించిన 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' లో చిన్నయ సూరికి పూర్వ వాఙ్మయమే చర్చించబడింది. అనగా గురజాడ శ్రీరామమూర్తిగారు, కందుకూరి వీరేశలింగంగారు రచించు కాలానికి సమకాలికుల రచనలను వారు ఉపేక్షించడం, వంగూరి సుబ్బారావుగారి కాలానికి, ఆ శతాబ్ది గ్రంథాల వివరాలు



సులభంగా అందుబాటులో లేకపోవడం జరిగి ఉండాలి. పైగా వీరి రచనలలో కవుల వివరాలకు ఇచ్చిన ప్రాధాన్యత వారి సాహిత్య అధ్యయనానికి ఇవ్వలేదు. వంగూరి సుబ్బారావుగారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' గ్రంథానికి పీఠిక వెలయిస్తూ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు –

"కవుల చరిత్రల ననేకులు మహనీయులు వ్రాసియున్నారు. కాని యవి వాఙ్మయ చరిత్రలు కావని నా మనవి."[1]

కట్టమంచి రామలింగారెడ్డి గారన్నట్టు సాహిత్య చరిత్ర నిర్మాణంలో ఆ విధంగా సమగ్ర సాహిత్యాధ్యయనం జరుగనంత వరకు అంధకార యుగంగా ముద్రపడిన 19వ శతాబ్దికి ఆ మచ్చ చెరిగిపోయే అవకాశం లేదు.

మరి, బ్రౌను మహాశయుడు సమకాలికుల రచనలు సేకరించి ముద్రించ లేదా? అంటే, దాదాపుగా లేదనే చెప్పాలి. ఇందుకు ప్రధానంగా రెండు కారణాలు చెప్పుకోవాలి. ఒకటి – అంతకు ముందు తొమ్మిది శతాబ్దుల తాళపత్ర గ్రంథాలను సేకరించి, పరిష్కరించి, పండితులతో తిరగ రాయించి, ముద్రింపజేయడమే శారీరకంగా, ఆర్థికంగా కొండంత కార్య భారం. ఇక సమకాలికుల ఉద్ధరణకు శక్తి ఎక్కడిది? సమయ మెక్కడిది? పైగా ఆనాటి సామాజిక ఆర్థిక స్థితిగతుల మూలాన, ఆనాటి కవులు తమ పాండిత్య ప్రదర్శనతో బ్రౌనును మెప్పించి పొట్ట కూటి మార్గాలను వెదుక్కొన్న సందర్భాలే కనిపిస్తున్నాయి కాని, తమ కవిత్వాన్ని వెలుగులోకి తెమ్మని వేడుకొన్న సందర్భాలు కనిపించడం లేదు. ఇక రెండవ కారణం – " ఏ గతి రచియించి రేని సమకాలము వారలు మెచ్చరే గదా!" అని ఏనాడో చేమకూర వేంకట కవి అన్నట్టుగా, బ్రౌనే కాదు – ఆ శతాబ్దిలోని ఏ పండితుడూ సమకాలిక సాహిత్యాధ్యయనానికి, వాటి ఔన్నత్య వ్యాఖ్యానానికి ఆసక్తి చూపి ఉండకపోవచ్చు. అప్పుడు నవ్యతా దృష్టితో ఏ కవియైనా ప్రయోగాలు చేసినా, వాటిలో కించిత్తు పాశ్చాత్య ప్రభావం కనిపించి బ్రౌను దొరకు పెద్దగా రుచించి ఉండకపోవచ్చు. ఇక తెలుగు పండిత కవులలో ఆనాడు చాలా మంది వైదిక సంప్రదాయ బద్ధులే కావడం వలన నవ్య ప్రయోగాలను ఈసడించి ఉండే అవకాశం ఎక్కువ. అలా ఆదరించవలసిన సమయంలో ఆదరణ లభించక, చాలా గ్రంథాలు ముద్రణ పొందక మరుగునపడి ఉంటాయి.

అదీగాక 19వ శతాబ్ది పూర్వార్ధం తెలుగు సాహిత్య చరిత్రలో, తాళ పత్రగ్రంథాల, ముద్రిత గ్రంథాల మధ్య సంధికాలంగా చెప్పవచ్చు. సుప్రసిద్ధ పరిశోధకురాలు డా. జోలెపాళెం మంగమ్మగారు అంటారు –

"శ్రీరాంపురంలో అచ్చు అక్షరముల తయారీ 19వ శతాబ్దారంభంలో మొదలయింది. శ్రీరాంపురం మిషనరీలు 6000 రూపాయలకు ఒక ఇల్లు కొన్నారు 40 పౌండ్ల స్టర్లింగ్‌కు కొయ్యతో తయారయిన ముద్రణ యంత్రాన్ని కొన్నారు. ఆ తర్వాత ముద్రణ వ్యాసంగం అక్కడ అమితంగా జరిగింది. హాలెలో షుల్జ్ తరువాత తెలుగులో ముద్రణ అంతగా జరిగినట్టు ఆధారాలు లేవు. శ్రీరాంపురంలో ముద్రణ యంత్రం ఏర్పాటయ్యాక స్థానికంగా 'పంచానన్' అనే కమ్మరి ఉద్యోగాన్వేషణలో అక్కడికి చేరాడు. అక్షరాలు పోతపోయడం అతడు చార్లెస్ విల్కిన్స్ వద్ద నేర్చుకొన్నాడు. తనకు సహాయంగా మరొకరిని తెచ్చుకొమ్మన్నప్పుడు 'మనోహర్' అనే వ్యక్తిని పంచానన్ తనతో కలుపుకొన్నాడు. మనోహర్ దాదాపు నలభై సంవత్సరాలు శ్రీరాంపురం మిషనరీలతో కలిసి పనిచేశాడు. దేశంలో తెలుగు అక్షరాల అచ్చులను బహుశా మనోహర్ శ్రీరాంపురంలో పోతపోసి ఉండవచ్చు."[2]

దీనిని బట్టి 19వ శతాబ్ది పూర్వార్ధంలో అతికొద్ది మంది కవులకు మాత్రమే ముద్రణ అవకాశం, అవగాహన ఉండి ఉండాలి. 1820లో తెలుగు ముద్రణను శ్రీరాంపురం నుండి మద్రాసు ఆక్సిలరీ బైబిల్ సొసైటికి బదలాయించాలని నిర్ణయించడం జరిగిందని డా. మంగమ్మగారు 'తెలుగులో అచ్చయిన తొలి పుస్తకాలు' అన్న గ్రంథంలో వివరించారు. అలా ముద్రణ యంత్రాలు విస్తృతంగా లేని ఆ రోజుల్లో బ్రౌను వంటి అధికారులకో లేక మహా ధనవంతులకో అవి అందుబాటులో ఉంటాయి గాని కవులందరూ తమ గ్రంథాలను ముద్రించుకొని ప్రచారంలోకి తెచ్చుకొనే పరిస్థితులు ఉండవు గదా! పత్రికారంగం కూడా ప్రారంభ దశలోనే ఉండడం వలన కవులు తమ కావ్య భాగాలను ముద్రణలో చూచుకొనే అవకాశాలూ తక్కువే. అలా 1801 నుండి 1850 వరకు వచ్చిన రచనలలో ఎక్కువ మట్టుకు వ్రాత ప్రతులు, కొన్ని మాత్రమే ముద్రిత గ్రంథాలుగా ఉండే అవకాశం ఉంది. ఇటువంటి పరిస్థితులలో 20వ శతాబ్దిలో సాహిత్య చరిత్ర రచనకు పూనుకొన్న చరిత్రకారులకు ఆ వ్రాతప్రతులు దొరికే అవకాశాలు తక్కువే. ఒకటి రెండు



దొరికినా అంతకు ముందు తరంలోని కంకంటి పాపరాజు, ఏనుగు లక్ష్మణ కవి వంటి కవుల రచనలతో పోల్చి, చిన్న చూపు చూసి ఉంటారు. వాటిలో నవ్య ప్రయోగాలు కనిపించినా, సంప్రదాయం పట్ల స్వభావ సిద్ధంగా ఉండే అనురక్తి వలన ఉపేక్షించి ఉంటారు. పిలకను వదలి జన బాహుళ్యం క్రాపును తలకెక్కించుకోడానికి కొన్ని తరాలు పట్టినట్టు తెలుగు సాహిత్యంలో నవ్య ప్రయోగాలను సాహిత్యాభిమానులు, పండితులు పూర్తిగా తలకెక్కించుకొని ఆదరించడం ప్రారంభించే సరికి 20వ శతాబ్ది వచ్చేసింది. ఆ దశలో 18వ శతాబ్ది అంతం వరకు ఉన్న కవిత్వం గురించి బ్రౌను మహాశయుని కృషి వల్ల వెలువడిన ముద్రిత గ్రంథాల ద్వారా, 20వ శతాబ్ది ఆరంభంలో విజృంభణతో వస్తున్న నవ్య కవిత్వం గురించి, ఆనాటి ప్రచార మాధ్యమాల ద్వారా తెలుసుకొంటున్న సాహిత్యాధ్యాయులకు సమగ్రంగా 19వ శతాబ్ది కవిత్వం గురించి, దానిలో నవ్యత గురించి, తెలుసుకొనే అవకాశం లేకుండా పోయింది. ఇందుకు ఉదాహరణగా శేషాద్రి రమణ కవుల వ్యాఖ్య ఉటంకించదగ్గది –

"ఈ రాష్ట్రము (నిజాము) నందలి యాంధ్ర సంస్థానములలో వాఙ్మయ చరిత్రమున సువర్ణాక్షరములలో వ్రాయదగినవి గద్వాల, వనపర్తి, ప్రాగుటూరు, సురపురము, ఆత్మకూరు, దోమకొండ, జటప్రోలు సంస్థాన చరిత్రములు. ఈ సంస్థానాధీశ్వరులలో పేరెన్నికగన్న కవులు గలరు. వారి పోషణమున విరాజిల్లిన వాఙ్మయ మెంతయేని కలదు. దొంతి, నారాయణపురము, పాపన్నపేట, గోపాల పేట సంస్థానములు కవుల నాదరించి, కవితా కళను బెంపొందించెను గాని యా సంస్థానములలోని రాజకవుల పేరులు, నాటి కవుల గ్రంథములు, ఆంధ్రుల దురదృష్ట వశమున నేటి దనుక మిగులక పోవుట సంతాపకరము."[3] ఇలా ఒకమారు నిర్లక్ష్యానికి గురైన కావ్యాలు మళ్ళీ లభించే అవకాశాలు సన్నగిల్లడం వల్ల ఈ శతాబ్ది సాహిత్య చరిత్రకు తీరని నష్టం వాటిల్లింది. అయితే పెనుమార్పు సంభవించినప్పుడు సంధికాలానికి నష్టం వాటిల్లడం సహజమే కదా!

20వ శతాబ్ది పూర్వార్ధం ముగిసే నాటికి గాని ప్రచార మాధ్యమాలు పూర్తిగా ఉచ్ఛస్థితికి చేరుకోలేదు. ఆంధ్రప్రదేశ్ కూడా 1956 వరకు రెండు ముక్కలుగా ఇతర భాషీయులతో కలిసి ఉండేది. అలా సమగ్ర తెలుగు రాష్ట్రం లేని కాలంలో

వివిధ ప్రాంతాలలో ఉన్న గ్రంథాల వివరాలు ఇతర ప్రాంతాల వారు తెలుసుకొనే అవకాశం కూడా తక్కువగా ఉండేది. ప్రాంతీయ పరిమితులతో, విస్తృత ప్రచార సాధనాలు లేని కాలంలో ఉపేక్షించబడిన 19వ శతాబ్ది తెలుగు సాహిత్యం గురించి నిజంగా అధ్యయనం చేసే అవకాశం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ తరువాతే లభించిందని చెప్పక తప్పదు. అంతకు ముందు వచ్చిన సాహిత్య చరిత్రలన్నింటిలో మరి సాహిత్యకారులు 19వ శతాబ్దిని గురించి దాటవేయక ఏం చేయగలరు – చెప్పండి !

ఇక్కడ డా. మంగమ్మ గారి వ్యాఖ్యను స్మరించాలి – "చరిత్రలో ఆఖరి మాటంటూ ఏదీ లేదు. కొత్త విషయాలు వెలుగులోనికి వచ్చినపుడు కొన్ని అంశాలను తిరిగి రాయాల్సి వస్తుంది. తెలుగు భాష, సాహిత్యం విస్తరణకు దూరమవుతున్న సమయంలో అంటే 18వ శతాబ్దం మధ్య కాలం నుండి 19వ శతాబ్దం మధ్య కాలం వరకు యూరోపియన్లు స్వార్థంతోనైనా చూపిన శ్రద్ధతో తెలుగు భాష నవీన పుంతలు తొక్కేందుకు నాంది ఏర్పడి, భాషకు పునరుజ్జీవం కలిగింది. వ్యాకరణాలు, నిఘంటువులు, పదకోశాలు ఎంతో ప్రయోజనకరంగా వెలువడినాయి. భాషా ప్రయోగాలతోబాటు విదేశీయులు చేసిన భాషాసేవ ప్రశంసనీయం. ఈ వందేండ్లు భాషారంగంలో చరిత్రాత్మక మనుకోవాలి."[4]

అలాంటి ఆలోచనతో 19వ శతాబ్ది తెలుగు సాహిత్యానికి న్యాయం చేసే ప్రయత్నం, నిజానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు తరువాత, తొలిసారి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి చేసింది. 1959వ సంవత్సరంలో అకాదమి – '19వ శతాబ్ది సాహిత్య చరిత్ర' అన్న అంశాన్ని నిర్దేశించి, కవి పండితులను రచన చేయవలసిందిగా ఆహ్వానించగా, వచ్చిన వ్యాసాలలో అత్యుత్తమమైన వ్యాసంగా బహూకృతమైన రచన చేసిన ఘనత శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారికి దక్కింది. ఆ తరువాత ఆయన ఆ వ్యాసాన్ని ఇతర రచయితలు వ్రాసిన వ్యాస భాగాలను కూడా చేర్చి 'ఉషః కిరణాలు' పేరిట గ్రంథంగా వెలయించారు. ఆ గ్రంథంలో శ్రీ యండమూరి సత్యనారాయణరావు గారి ఆవేదన ఇలా ఉంది –

"సమష్టి భాషాచరిత్ర రచనా విధానమును కన్నడ, హిందీ, బెంగాలీ భాషా వాఙ్మయుల చరిత్రలు రచించిన కొందరు, పాశ్చాత్య పండితులు కొంత వరకు అనుసరించినారు. తెనుగులో వంగూరి సుబ్బారావును, 'కవిత్వ వేది' యును యీ పద్ధతిని తమ గ్రంథ రచన చేసినారు. అయినను 19వ శతాబ్దికి చెందిన వాఙ్మయ ప్రసక్తి యిందంతగా లేదు. కవుల చరిత్రలు వ్రాసిన చాగంటి శేషయ్యగారు తమ 'ఆంధ్ర కవి తరంగిణి' లో పెక్కురు 19వ శతాబ్ది కవి జీవితములను గూర్చి వ్రాసిరి కాని, వాఙ్మయ చరిత్ర ఎక్కువగా స్పృశించలేదు. 'ఆంధ్ర రచయితలు' పేరున శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు రచించిన గ్రంథములో 1800–1900 వరకు గల మధ్యకాలములో జన్మించిన వారి కావ్యముల ప్రసక్తి తెచ్చిరి గాని, 1800కు ముందే జన్మించి ఆంధ్ర భాషా సరస్వతికి అమూల్యాలంకారములర్పించిన అనేక కవులను విడిచి వేయుట జరిగినది. ఇటీవల వెలువడిన 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము'లోను, 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహములోను స్థాలీపులాకముగా తప్ప 19వ శతాబ్ది చరిత్రను చర్చించలేదు. ఇంకను అనేకులు వ్రాసిన వాఙ్మయ సూచికలో 19వ శతాబ్ది వచ్చునప్పటికి అలక్ష్యముగా వదలివేయుట జరిగినది."[5]

దానికి కారణం విశ్లేషిస్తే ఒక విషయం గోచరిస్తుంది. 19వ శతాబ్దిని 'అంధయుగం' లేక 'క్షీణ యుగం' అని పేర్కొంటూ ఆంధ్ర విశ్వ విద్యాలయ స్థాపన తరువాత, పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థులకు వాఙ్మయ చరిత్రను బోధించేందుకు తెలుగు శాఖ వారు ఒక పాఠ్య ప్రణాళికను రూపొందించుకొన్నారు. తరువాతి కాలంలో మద్రాసు, ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయాలలో దానినే అనుసరించారు. ఇది సవరించడానికి గానీ, పునర్విమర్శ చేయడానికి గానీ ప్రయత్నం జరుగలేదని యండమూరి సత్యనారాయణరావు గారు అభిప్రాయపడ్డారు.[6]

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా ఉన్న పింగళి లక్ష్మీకాంతం గారి స్వాభిప్రాయం ఇందుకు దోహదమై ఉంటుందని భావించవలసి వస్తుంది. ఆయన అంటారు –

"క్షీణ యుగమున (1775–1875) చోళ, పాండ్య రాజ్యముల పతనముతో సామ్రాజ్య స్థాపకులైన ఆంధ్రులకు సామంత రాష్ట్రములైనను లేకుండ పోయినవి. స్వాతంత్ర్య రహితములు, ప్రాచీనైశ్వర్య శూన్యములు అయిన జమీలు మిగిలినవి. జాతి ముఖకళ క్షీణించినది. ఆ క్షీణ లక్షణమే కవిత్వమునకు పట్టినది."[7]

ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఎలాంటి ప్రతికూల పరిస్థితులలోనైనా, ప్రతిభావంతమైన ఒక జాతిలోని ప్రజ్ఞా పాటవాలు ఒక్కమారు అడుగంటవు. ఒక వేళ అడుగంటినా, మళ్ళీ అనతికాలంలోనే మహోధృతితో విజృంభించవు. 1785 వరకు దక్షిణాంధ్ర యుగంలో ఉత్తమ కవిత్వం వచ్చిందని అంగీకరిస్తూ మళ్ళీ 1901 నుండి (అనగా 20వ శతాబ్దిలో) ఆధునిక కవిత్వం నవ్య మార్గాలలో విజృంభించిందని పేర్కొనే విమర్శకులు మధ్యలో ఒక శతాబ్దిలో మాత్రం అధమ స్థాయి కవిత్వం వచ్చిందని తేల్చి పారేయడం ఎంతవరకు సబబు? 19వ శతాబ్దిలో అత్యధికంగా రచనలు వచ్చాయి. యండమూరి సత్యనారాయణరావుగారు అంటారు –

"ఈ యుగమున అత్యధిక సంఖ్య గల గ్రంథములు వచ్చినవి. సంఖ్యాధిక్యమే కాక విషయ వైవిధ్యములో కూడా ఈ శతాబ్దిదే పై చేయి. కవులు, రచయితలు ఇంత ఎక్కువ మంది మరియే శతాబ్దిలోనూ రాలేదు."[8]

అలాంటప్పుడు ఏ శతాబ్దిలోనైన ఉత్తమ కావ్యాలు, అధమ కావ్యాలు రెండూ ఉంటాయి. రచనలే జరుగకపోతే అవకాశం లేదు కాని, ఇంత విస్తృతిగా రచనలు వెలువడ్డాక ఉత్తమ కవిత్వం బొత్తిగా రాలేదని ఘంటాపథంగా ఎలా చెప్పగలరు? అందుకే ఈ శతాబ్ది రచనలపై విస్తృతమైన పరిశోధన చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. సత్యనారాయణరావు గారన్నట్లు–

"19వ శతాబ్ది వాఙ్మయ దశ తెనుగు సాహిత్య చరిత్రలో ఒక నూతన యుగమును ప్రారంభము చేసిన సంధికాలము. రానున్న మహోదయమునకు వైతాళిక గీతులు పాడిన ఉషఃకాలము"[9] – అన్న విషయాన్ని ఆ శతాబ్ది కావ్యాలను పరిశీలిస్తే అంగీకరించక తప్పదు.

19వ శతాబ్ది సాహిత్యంపై తొలిసారిగా 'ఉషఃకిరణాలు' పేరిట యండమూరి సత్యనారాయణ రావుగారు తొలి కిరణాలను ప్రసరించినా, ఆనాటి (1960) పరిమితులకు లోబడి ఆయన పరిశోధన పూర్తి సమగ్రతను సంతరించుకోలేక పోయింది. ఆ గ్రంథం వెలువడిన నాటి నుండి 21వ శతాబ్ది ప్రారంభం వరకు గల మధ్యకాలంలో, ఇంకా ఎన్నో విలువైన విమర్శన, పరిశోధన గ్రంథాలు, సాహిత్య పదకోశాలు వెలువడ్డాయి. కొందరు 19వ శతాబ్దికి చెందిన అముద్రిత గ్రంథాలను సాధించి ముద్రించారు. ఉదాహరణకు 19వ శతాబ్దిలో 'రంగరాజు కేశవరావు' అనే కవిచే రచింపబడిన 'ఇంద్రద్యుమ్నీయము' అన్న కావ్యాన్ని దాదాపు 90 సంవత్సరాల తరువాత 1968లో పేర్వారం జగన్నాథం గారు తొలిసారిగా ముద్రించారు. అలాగే 19వ శతాబ్దికి చెందిన 'ఆంధ్రతులసీ రామాయణం' ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు 1984లో తొలిసారి ముద్రించారు. తెలుగు అకాడమి వారు 'తెలుగు సాహిత్య పదకోశా'లను రెండు భాగాలుగా నిర్మించి ముద్రించారు. 1980, 1986 సంవత్సరాలలో వెలువడ్డ ఆ కోశాలలో 19వ శతాబ్దికి చెందిన అనేక గ్రంథాల వివరాలను పొందుపరిచారు.

ఆధునిక చరిత్రకారులు, విమర్శకులు కూడా గత అర్ధ శతాబ్ది కాలంలో కొన్ని 19వ శతాబ్ది కావ్యాల ప్రస్తావన అక్కడక్కడా చేశారు. రెండు ప్రసిద్ధ వాఙ్మయ చరిత్రలు – ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యం' 1968లో, కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'తెలుగు సాహిత్య చరిత్ర' (పంచమ భాగం) 1999లో వెలువడ్డాయి. వీటిలో 19వ శతాబ్దికి చెందిన కొందరు కవులు, వారి కావ్యాల గురించి కొంత చర్చించబడ్డాయి. అలాగే తూమాటి దొణప్పగారి 'ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము' గ్రంథం 1969లో వచ్చింది. ఇవన్నీ యండమూరి సత్యనారాయణరావుగారి గ్రంథం వెలువడిన అనంతరం వెలువడ్డాయి. ఇవన్నీ 19వ శతాబ్ది సాహిత్యం గురించి అందులోని నవ్యత గురించి సమగ్రమైన, నిర్దిష్టమైన, నిర్దుష్టమైన అధ్యయనం, పరిశోధన, విశ్లేషణ జరిపేందుకు వేదిక నేర్పరిచాయి. అయితే ఇంతవరకు అలాంటి పరిశోధన జరుగకపోవడంతో, 'అంధయుగ' మన్న అపప్రథ మాత్రం పండితులు సాహిత్యాభి మానుల మనస్సులలో అలాగే ఉండిపోయింది. ఇది నిజంగా విచారించదగ్గ విషయం.

కాబట్టి ఈ '19వ శతాబ్దిలో తెలుగు కవిత్వంలో నవ్యత' అన్న పరిశోధన ద్వారా, ఇరువయ్యో శతాబ్దిలో వైభవాన్ని సంతరించుకొన్న ఆధునిక నవ్య యుగానికి సంబంధించిన బీజాలు, 19వ శతాబ్దిలోనే పడ్డాయన్న సత్యాన్ని చాటే ప్రయత్నం చేశాను. ఆ ప్రయత్నమే ఈ పరిశోధన లక్ష్యం.

19వ శతాబ్దిని తెలుగు సాహిత్య చరిత్రలో 'అంధయుగం'గా, 'క్షీణ యుగం'గా కాక, 'ఉషోదయ యుగం'గా పునర్నామకరణం చేయవలసిన అవసరం ఉందని

ఈ పరిశోధన ద్వారా సహృదయులకు విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రాచీన సాహిత్యానికి, ఆధునిక సాహిత్యానికి మధ్య ఈ యుగం ఒక ద్వార బంధంగా నిలిచిందని నా ఉద్దేశ్యం. ఆ ద్వార బంధాన్ని ప్రాచీన సాహిత్యం వైపు నుండి కాక ఆధునిక సాహిత్యం వైపు నుండి దర్శించవలసిన అగత్యాన్ని నొక్కి వక్కాణిస్తున్నాను.

**పాద సూచికలు :**

1. వంగూరి సుబ్బారావు : 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' – కట్టమంచి రామలింగారెడ్డి గారి పీఠిక
2. డా. జోలెపాళెం మంగమ్మ : 'తెలుగులో అచ్చయిన తొలి పుస్తకాలు' (పుట. 7)
3. సురవరం ప్రతాపరెడ్డి : 'గోలకొండ కవుల సంచిక' – శేషాద్రి రమణ కవుల పూర్వకవి పరిచయ పీఠిక (పు. 391)
4. డా. జోలెపాళెం మంగమ్మ : 'తెలుగులో అచ్చయిన తొలి పుస్తకాలు' – రచయిత్రి ముందుమాట– ('నా మాట')
5. యండమూరి సత్యనారాయణరావు : 'ఉషః కిరణాలు'–ఉపక్రమణిక (పు. 4)
6. యండమూరి సత్యనారాయణరావు : 'ఉషః కిరణాలు' – ఉపక్రమణిక (పు. 5)
7. పింగళి లక్ష్మీకాంతము : 'ఆంధ్ర సర్వస్వము' (పు. 298)
8. యండమూరి సత్యనారాయణరావు : 'ఉషః కిరణాలు' – రెండవ అధ్యాయం (పు. 23)
9. యండమూరి సత్యనారాయణరావు : 'ఉషః కిరణాలు' – రెండవ అధ్యాయం (పు. 24)





# 2

# కవిత్వం – నవ్యత



**"19వ** శతాబ్దిలో తెలుగు కవిత్వంలో నవ్యత" అన్న అంశాన్ని పరిశీలించే ముందు, కవిత్వం, నవ్యత వంటి మౌలిక విషయాలను గురించి అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది.

*జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః*
*నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్*

*– భర్తృహరి నీతి శతకము*

"జరా మరణ రహితమైన శాశ్వత కీర్తి కాయం దక్కిన రససిద్ధులు, సుకృతులు అయిన కవీశ్వరులకు జయము" అన్న భర్తృహరి ప్రశంస కవి ఔన్నత్యాన్ని తెలియజేస్తుంది. భారతీయ ఆలంకారికులు కవిని పరమోత్కృష్ట స్థానంలో నిలిపి గౌరవించారు. ఈశావాస్యోపనిషత్తులో "కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అని పేర్కొనబడింది. పరమాత్మలాగే కవి స్వయంగా జన్మించిన వాడు అని దాని అర్థం. కవిని పరమాత్మకు సమానంగా భావించడం వైదిక ధర్మంలో కనిపిస్తుంది.

తరువాతి కాలంలో పరమాత్మను దర్శించే ఋషులలాగా కవులు కూడా ద్రష్టలు అన్న భావన సమాజంలో బలపడింది.

"నా నృషిః కురుతే కావ్యం", "కవయః క్రాంత దర్శనః" – అన్న లోకోక్తులు కవులను దివ్యదృష్టి కలవారుగా, లోకధర్మా లెరిగిన వారిగా ప్రకటిస్తున్నాయి. "రవి కాననిచో కవి కాంచు నెయ్యెడన్" అన్న ఆర్యోక్తి కవి సామర్థ్యాన్ని విశదపరుస్తున్నది. రోమన్లు సైతం కవిని ఋషిగా భావించారు. వారి భాషలో కవిని 'వాటిస్' (Vates) అంటారు. ద్రష్ట అని దాని అర్థం.[1]

ప్రాచీన కాలంలో క్రాంత దర్శులైన ఋషులే తాము దర్శించిన దానిని వర్ణించి తెలుపడం వలన కవులయ్యారు. ఉపనిషత్తులు, ఋక్కులు ఆనాటి ఋషుల కావ్యాలు. ఆదికవి వాల్మీకి సైతం తొలుత ఋషి. లోకోత్తరంగా రామాయణాన్ని వర్ణించి వ్రాయడం వలన ఆయన కవి అయ్యాడు. మమ్మటాచార్యుని "లోకోత్తర వర్ణనా నిపుణః కవి కర్మ కావ్యం" అన్న నిర్వచనం ఇక్కడ గమనార్హం. ఈనాటికీ కవికి కావలసిన ప్రతిభ దైవ దత్తమని, ద్రష్టలయిన కవులే లోకోత్తర రచనలు చేయగలరని భారతీయులు విశ్వసిస్తున్నారు. అలా భగవద్దత్తమైన ప్రజ్ఞతో కవి సలిపే విశిష్టమైన కర్మే కవిత్వం లేక కావ్యం.

**కవిత్వం :**

ప్రాచీనుల దృక్పథంలో కవిత్వమంటే కావ్యమే ! అందుకే భారతీయ ఆలంకారికులు కవిత్వానికి పర్యాయపదంగా కావ్యాన్ని నిర్వచించే ప్రయత్నం చేశారు. "కవిత్వం కావ్య రూపంలో ఉందా? లేక మరో ప్రక్రియ రూపంలో ఉందా?" అన్నది కాసేపు ప్రక్కన బెట్టి, దాని ప్రయోజనమేమిటి? – అన్నది ఆలోచిస్తే ఈ క్రింది విషయాలు అవగతమవుతాయి.

ఆర్యులు సప్త సంతానాలలో ఒకటిగా కావ్యాన్ని పేర్కొన్నారు. తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, ప్రబంధము (లేక కావ్యము), పుత్రుడు[2] – అన్న ఈ సప్త సంతానాలలో మిగితా వానిలాగే కావ్యం కూడా మానవునికి అజరామరకీర్తిని సంతరించి పెట్టే సాధనాలలో ఒకటి. అయితే ఈ సప్త – సంతానాలలో శాశ్వతమైనది కావ్యమే అని 'గువ్వల చెన్న శతక' కర్త అన్నమాట ఇక్కడ గమనార్హం.

*గుడికూలును, నుయిపూడును,*
*వడి నీళ్ళను చెరువు తెగును, వనములు ఖిలమౌ !*
*చెడనిది పద్యం బొకటియె*
*కుడి ఎడమల కీర్తిగన్న గువ్వల చెన్నా !*

ఆ లెక్కన మంచి కావ్యం ఉద్భవించినప్పుడు నవ్యమై, సార్వకాలీనం, సార్వజనీనమైతే శాశ్వతంగా నిలుస్తుందన్నమాట. అటువంటి కావ్య ప్రయోజనాలను మమ్మటాచార్యుడు సవిస్తరంగా వివరించాడు.



*"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే, శివేతరక్షతయే*
*సద్యః పర నిర్వృతయే కాంతా సమ్మిత యోపదేశయుజే!"*

కావ్యం యశస్సు (కీర్తి) కొరకు, అర్థం (ధనం) కొరకు, అశుభ నివారణం (సమాజంలోని చెడును ఖండించి మార్గదర్శనం చేయడం అశుభ నివారణమే కదా!) కొరకు, సద్యః పరనిర్వృత్తి (ఐహికమును విస్మరింపజేసి, పుడమి కవ్వలి వెలుగులు దర్శింపజేసి, తత్క్షణము ఆనంద తన్మయత్వము కలిగించడం–[3]) కొరకు, కాంతా సమ్మితంగా ఉపదేశమందించడం (మనోహరియైన ప్రేయసిలాగా హృదయంగమంగా వ్యంగ్య ఫణితిలో ధ్వని ప్రధానంగా కర్తవ్యోపదేశం చేయడం–[4]) కొరకు అని మమ్మటుని శ్లోకార్థం. అయితే వీనిలో చివరి రెండు ప్రయోజనాలైన ఆనందోపదేశాలే ప్రధానమైనవని అత్యధిక ఆలంకారికులు తేల్చారు. ఆనంద వర్ధనుడు, అభినవ గుప్తుడు 'ప్రీతి రేవ ప్రధానం' అని ఆనందానికి పెద్దపీట వేశారు. ఇక్కడ ఆనందం అంటే రసానందమే అని గ్రహించాలి. పాశ్చాత్యులలో కూడా చాలా మంది కావ్య ప్రయోజనాలుగా ఆనందోపదేశాలనే పేర్కొన్నారు. వర్డ్స్‌వర్తు ఆనందమే ప్రధానమన్నాడు. మిల్టన్ నీతిబోధ ప్రధానమన్నాడు. డ్రైడెన్, బ్లేక్, ఫిలిప్ సిడ్నీ తదితరులు రెండూ ప్రధానమే అన్నారు. తెలుగులో ఆదికవియైన నన్నయ భట్టారకుడు

*"సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో*
*నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప, నా*
*నా రుచిరార్థ సూక్తినిధి నన్నయ భట్టు తెలుంగునన్, మహా*
*భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగాన్!"* [5] –

అన్న పద్యంలో తన కవితా లక్షణాలుగా పేర్కొన్న ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానా రుచిరార్థసూక్తి నిధిత్వం అన్న మూడంటిలో మొదటి రెండు రసానందాన్ని, మూడవది ఉపదేశాన్ని సూచిస్తున్నాయి. 'జగద్ధితము' అన్నమాట కూడా ఉపదేశ ప్రయోజనాన్ని చాటుతోంది.

అయితే వీటిలో, 'కళ కళ కోసమే' అని నమ్మేవారు ఆనంద ప్రయోజనం వైపు ఎక్కువగా మొగ్గు చూపుతుంటారు. ఉపదేశ ప్రయోజనం వైపు, 'కళ ప్రయోజనం కోసమే' అని భావించేవారు మొగ్గు చూపుతుంటారు. మన తెలుగు సాహిత్యంలో

నన్నయ వేసిన బాటలో రెండింటికీ ప్రాధాన్యం ఏర్పడింది. మన ప్రాచీన కవులు ప్రబోధించిన జగద్ధితమే ఈనాటి అభ్యుదయ కవుల ఆశయంగా రూపుదిద్దుకొంది.

కవిత్వానికి ఎందరో భారతీయ ఆలంకారికులు పాశ్చాత్య పండితులు ఎన్నో నిర్వచనాల నందించారు – అవి అన్నీ ఆనంద ప్రధానంగా రూపొందినవే. అన్ని నిర్వచనాలలో కెల్ల – భారతీయ ఆలంకారికుల నిర్వచనాలలో జగన్నాథ పండితరాయల – "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అన్న నిర్వచనం; పాశ్చాత్య నిర్వచనాలలో అలెన్ ఎడ్గార్‌పో కవి యొక్క "Poetry is the rythemic creation of beauty అన్న నిర్వచనం ఉత్తమోత్తమమైనవిగా అందరూ అంగీకరిస్తున్నారు.

ఏదేమైనా, పై చర్చనంతా వడపోసి చూస్తే కవిత్వానికి మూడు ప్రధాన లక్షణాలు ఉండాలని తెలుస్తూంది. అవి –

**1. ద్రష్టత్వం; 2. రసానందం; 3. జగద్ధితం.**

విచిత్రమేమిటంటే – ఈ మూడూ కూడా 'నవ్యత' లేకుండా ఉండలేవు. ఎలాగంటే

**ద్రష్టత్వం :** – ద్రష్ట అంటే – చూచువాడు, మనస్సుచే కనుగొనువాడు, గుణదోషములను కనుగొనువాడు, నిర్ణయకర్త, న్యాయాన్యాయములు పరిశీలించువాడు[6] అని అర్థం. అంటే సాధారణ వ్యక్తుల కంటె కవి అన్నవాడు విశేషంగా మనస్సుతో ముందుగా దర్శించేవాడు, అందరికంటె భిన్నంగా నవ్యంగా చూచేవాడు అని చెప్పుకోవచ్చు. అందుకే ద్రష్టత్వంలో నవ్యత అంతర్లీనంగా ఒదిగి ఉంటుంది.

**రసానందం :**– 'రసం యన్నిష్ఠం?' అంటే 'సహృదయ జననిష్ఠం' అని పండితుల సమాధానం. అయితే ఎంతటి సహృదయులైనా, నవ్యత లేకుండా నలిగిన బాటలోనే రససృష్టి చేస్తూ పోతే ఆదరించగలరా? జిలేబీ ఎంత ఇష్టమయినా రోజూ అవే అంటే ఏదో ఒక నాటికి మొహం మొత్తకపోదు. కాబట్టి కవి అన్నవాడు రసానందంలో ఎప్పటికప్పుడు నవ్యతను జోడిస్తూ అందించవలసిందే.



**జగద్ధితం :** – 'సాహిత్యం' అంటే హితంతో కూడుకొన్నది అని అర్థం. హితమెవరికి? అంటే 'జగద్ధితం' అని ఆదికవి చెప్పనే చెప్పాడు. అంటే జగత్తుకు హితం. ఇక్కడ జగత్తు అంటే జగత్తులోని జనానికి అని. 'దేశమంటే మట్టి కాదోయ్ – దేశమంటే మనుషులోయ్' అని గురజాడ అన్నట్టుగానే. 'జనము' అంటే సమకాలీన జనమే అవుతారు. అంటే సమకాలీన సమాజంలోని రుగ్మతలను, దురాచారాలను ఎత్తి చూపి సందేశం అందించడం కవి బాధ్యత. వారికి మార్గదర్శనం చేయడం కవి కర్తవ్యం. కాలాన్ని బట్టి యుగాన్ని బట్టి సామాజిక పరిస్థితులు మారుతుంటాయి. పరిస్థితులను బట్టి సమాజంలోని దురాచారాలు, దుర్నీతులు మారుతుంటాయి. వాటిని బట్టి సందేశాలు మారుతుంటాయి. కాబట్టి ఏయుగంలోనైనా నవ్య సందేశాలుండక తప్పదు. అలా ఇక్కడా నవ్యతకు చోటు లేకపోలేదు.

ఒక్కమాటలో చెప్పాలంటే నవ్యత అన్నది లేకుండా సాహిత్య పరిణామం, సాహిత్య ప్రస్థానం ఉండదు. అలా నవ్యతతో సాహిత్యాన్ని ముందుకు నడిపినప్పుడే, షెల్లీ కవి అభిభాషించినట్టు – "Poets are the unacknowledged legislators of the world అన్న స్థాయిలో కవులు గౌరవింపబడతారు. భర్తృహరి ప్రబోధించినట్టు – "సుకవితా యద్యస్తిన రాజ్యేన కిం?" (మంచి కవిత్వముంటే రాజ్యమెందుకు?) అన్న స్థాయిలో కవిత్వమూ గౌరవింపబడుతుంది.

ప్రతి శతాబ్దిలో ప్రపంచం అంతో, కొంతో ఆధునికతను సంతరించుకొంటుంది. ముఖ్యంగా 18వ శతాబ్దిలో విదేశీయుల సంపర్కంతో భారతీయ సమాజంలో ఆధునికత మరింత ఊపందుకొంది. ఆ ఆధునికత కాస్త ముందు వెనుకలుగా, సాహిత్యంలో ప్రతిఫలించింది. దానికి అటు తెలుగు సాహిత్యంగానీ, ఇటు 19వ శతాబ్దిగానీ మినహాయింపు కాదు – అన్నది గుర్తించాలి.

**నవ్యత :**

'నవ్యము' అంటే క్రొత్తది, ఆధునికము, ఇప్పటిది, నుతింపదగినది అని నైఘంటికార్థం.[7] దీనిని బట్టి నవ్యత అంటే కొత్తదనం, ఆధునికత అని అర్థం చేసుకోవచ్చు. ఆంగ్లంలో దీనిని Novelty అంటారు. Novelty = Something novel; a new (or) unusual thing or event; the quality (or) state of being

novel; Recentness (or) origin (or) introduction; newness. [8] అని ఆంగ్ల నిఘంటువులో పేర్కొనబడింది.

భామహుడు కవిత్వంలో నవ్యత అన్నది ఒక ప్రధానాంశంగా భావించాడు.

*"ప్రజ్ఞా నవ నవోన్మేషశాలినీ ప్రతిభామతా*
*తదను ప్రాణనోజ్జీవేద్వర్ణనా నిపుణః కవిః"*

నవనవోన్మేష శాలిని యగు ప్రజ్ఞయను ప్రతిభతో వర్ణన సల్పగల నిపుణుడు కవి – అని భామహుడు వక్కాణించాడు. కాబట్టి కవిత్వం రసవంతం కావడమే కాకుండా, నవ్యతను సంతరించుకోవడం కూడా ఆవశ్యకమే అని భామహుడు చెప్పకనే చెప్పాడు.

ఆధునికులలో శ్రీశ్రీ తన 'నవకవిత' లో "కదిలేదీ, కదిలించేదీ, మారేదీ, మార్పించేదీ – కవిత్వం" [9] అంటారు. డా. దాశరథి – "ముసలి మోహం పడిన వృక్షం మీద యౌవనం చిగురించడం కవిత్వం"[10] అంటారు, 'పునర్నవం' అన్న కవితలో. గురజాడ సైతం – "గుత్తునా ముత్యాల సరములు, కూర్చుకొని తేటైన మాటల – కొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా" [11] అని వ్రాసుకొన్నారు. కాబట్టి కవిత్వమంటే నవ్యతే అని తీర్మానించకపోయినా, నవ్యత కవిత్వంలో ఒక ప్రధానమైన అంతర్భాగమని అంగీకరించక తప్పదు.

అనూచానంగా వస్తున్న పద్ధతి నుండి వెలువడిన ఒక అసహజమైన ధోరణిని 'నవ్యత' అనవచ్చు. అప్పుడప్పుడే ఏర్పడిన ఒక అపూర్వరీతిని నవ్యత అని పిలుస్తున్నారు. "ఒక నిర్దేశ కాలానికీ, సన్నివేశానికీ సంబంధించి రూపుదిద్దుకొన్న ఒక అసామాన్య ప్రక్రియను, ప్రయోగాన్నీ మనం నవ్యమైనదిగా పేర్కొనడం పరిపాటి అయింది"[12] – అంటారు డా. కలువగుంట రామమూర్తిగారు.

ఆ విధంగా ఆంధ్ర సాహిత్య చరిత్రలోని ప్రతియుగంలోనూ మనకు నవ్యత గోచరిస్తుంది. ఆ నవ్యత ఆధారంగానే ఆ యుగ విశిష్టత, ప్రత్యేకతను విమర్శకులు గుర్తిస్తారు. సద్విమర్శకులు ఏ శతాబ్ది లేక ఏ యుగ కవిత్వంలోనైనా నవ్యతను ఒక విశిష్టమైన కవితా గుణంగా భావించి, పరిశీలన, పరిశోధన జరపాలి. ఆ నవ్యత తరువాతి తరాలకు ఏ విధంగా మార్గదర్శకం అయిందో తరచి చూడాలి.



శాసనకాలంలో విషయ వివరణ కోసం దేశీయ ఛందస్సులలో వ్రాయబడ్డ పేలవమైన పద్యాల స్థాయి నుండి, 11వ శతాబ్దిలో నన్నయ యుగంలో నన్నయ భట్టారకుడు అక్షరరమ్యతతో, ప్రసన్నకథాకలితార్థయుక్తితో, నానారుచిరార్థ సూక్తినిధియై జగద్ధితం కోసం మహాభారత సంహితా రచనకు పూనుకోవడమే ఒక నవ్యత. అపారమైన ధారాశుద్ధితో, అమోఘమైన శాబ్దిక లయతో నన్నయ రచించిన ప్రతి పద్యం హృద్యమై, నవ్యతకు ప్రతీకగా నిలిచింది. తరువాతి తరాలలోని కవులకు నన్నయ మార్గదర్శకుడయ్యాడు. ఆయన ప్రవేశపెట్టిన నవ్యకవితా మార్గం – మార్గ కవితగా భాసిల్లింది.

*"మును మార్గ కవిత లోకం*
*బున వెలయగ, దేశి కవిత బుట్టించి తెనుం*
*గును నిలిపి రంధ్ర విషయం*
*బున జన చాళుక్య రాజు మొదలగు పల్వుర్"* [13]

అంటూ "సరళము గాగ భావములు, జానుతెనుంగున నింపు పెంపుతో బరిగొన వర్ణనల్–––" చేశాడు నన్నెచోడుడు. ఆ విధంగా జాను తెనుగులో దేశికవిత, నన్నయ మార్గాన్ని ఒకింత నిలిపి రూపొందిన నవ్యత. ఆ నవ్యత 12వ శతాబ్ది శివ కవుల యుగంలో మహోద్యమ స్థాయికి చేరుకొంది. సర్వ సామాన్యులకు కవిత్వాన్ని అందుబాటులోకి తేవాలన్న ప్రజాస్వామ్య భావనను ఆ కాలంలోనే కలిగి –

*"ఉరుతర గద్య పద్యోక్తులకంటె*
*సరసమై పరగిన జాను తెనుంగు*
*చర్చింపగా సర్వ సామాన్యమగుట*
*కూర్చెద ద్విపదలు కోర్కిదైవార"* [14]

అంటూ తెనుగు ఛందమైన ద్విపదలో కావ్య సృజన చేసిన ఘనత, నవ్యత పాల్కురికి సోమనాథునిది. సంస్కృత సమాస భూయిష్ట రచన సర్వ సామాన్యం కాదని, జాను తెనుగులో కావ్యాలను రచించి శివకవులు నవ్యతను సాధించారు. నన్నయ భట్టారకుని వంటి కవుల విష్ణు ప్రాధాన్య కావ్యాలను నిరసించి, శివతత్త్వ సారాన్ని వస్తువుగా తీసుకోవడం కూడా నవ్యతే కదా!

ఆపైన 13వ శతాబ్దిలో తిక్కన యుగంలో తిక్కన సోమయాజి సాధించింది మరొక రకమైన నవ్యత. సాహిత్య రంగంలో నెలకొన్న శైవ, వైష్ణవ వైరుధ్యాలకు; అచ్చతెనుగు, సంస్కృత పద బాహుళ్యాంధ్రం మధ్య వైరుధ్యాలకు అడ్డుకట్టవేసి, సమన్వయాన్ని కూరుస్తూ ఆయన మహాభారతేతిహాసంలో పదిహేను పర్వాలను ఏకబిగిని రచించాడు. శివుడు, విష్ణువులకు ఏకీకృత రూపంగా హరిహరనాథుని రూపొందించి ఆ స్వామికే తన కావ్యేతిహాసాన్ని అంకితం చేశాడాయన. అటు – "దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫురత్ గర్వాంధ ప్రతి వీర నిర్మథన విద్యాపారగుల్ -- " వంటి సంస్కృత సమాస ప్రయోగాలతో, ఇటు 'పగయె గలిగెనేని పామున్న ఇంటిలో నున్నయట్లుగాన --" వంటి అచ్చ తెనుగు నుడికారాలతో ఆంధ్ర భాషను సుసంపన్నం చేసి, భవిష్యత్తులో

*"కొందరికి తెనుగు గుణమగు –*
*కొందరకును సంస్కృతంబు గుణమగు – రెండున్*
*కొందరకు గుణములగు – నే*
*నందర మెప్పింతు కృతుల నయ్యై యెడలన్"*[15]

అన్న పోతన వంటి కవులకు మార్గదర్శకుడయ్యాడు. అలాగే 14వ శతాబ్దిలో శ్రీనాథుడు, పోతన, వారి వారి శైలులలో నవ్యతను ప్రదర్శించారు. పోతన మృదుమధుర పద సంయుతమైన అనుప్రాసలతో ఆలంకారిక నవ్యతను సాధించగా, శ్రీనాథుడైతే – "కుసి హెచ్చెన్, పస హెచ్చెన్" అంటూ 14వ శతాబ్దిలోనే పారశీక పదాలను ప్రయోగించి ఆశ్చర్యకరమైన భాషా నవ్యతను చూపాడు. అంతే కాకుండా సీసపద్యంలో ఒక కొత్త లయను సాధించి, ఈనాటికీ 'శ్రీనాథుని సీసం' అంటూ మన్ననలందుకుంటూనే ఉన్నాడు.

ఇక 15వ శతాబ్ది సంగతి సరేసరి. ప్రబంధమనే ఒక నూతన ప్రక్రియే అవతరించింది. పురాణాంతర్గతమైన చిన్న చిన్న కథలను వస్తువులుగా స్వీకరించి, వాటిని విశేషమైన వర్ణనలతో విస్తరించి, రసాత్మకంగా, ప్రౌఢంగా, శృంగార భరితంగా ప్రకృష్టమైన బంధ రచనలైన 'ప్రబంధాలు'గా రాయలవారు, పెద్దనాదులు రూపుదిద్ది విశిష్టమైన నవ్యతను చూపారు.



*"అట జని కాంచె భూమిసురు డంబర చుంబి శిరస్సరః ఝరీ*
*పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన*
*స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్ –*
*కటక చరత్కరేణు కర కంపిత సాలము, శీతశైలమున్ !"*[16]

వంటి భావ చిత్రాలకు ఆనాడే నాంది పలికారు ప్రబంధకవులు. ఇదే శతాబ్దిలో తొలి తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య అవతరించి తెలుగు సాహిత్య జగతిలో సంకీర్తనాచార్యునిగా గణుతికెక్కాడు. పదహారవ శతాబ్దిలో రామరాజ భూషణుడు –

*"కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము, లాద్య సత్కథల్*
*వావిరి పుట్టు రత్నము, లవారిత సత్కవి కల్పనా విభూ*
*షావహ పూర్వ వృత్తములు సానదీరిన జాతి రత్నముల్*
*గావున నిట్టి మిశ్ర కథగా నొనరింపుము నేర్పు పెంపునన్"*[17]

అంటూ విశిష్టమైన మిశ్ర కథతో వసు చరిత్ర వంటి అపూర్వ ప్రబంధాన్ని రచించి నవ్యతను సాధించాడు. అదే శతాబ్దిలో పింగళి సూరన 'కళాపూర్ణోదయం" వంటి అపూర్వ కల్పనా కథతో ప్రబంధ రచన కావించి, నవ్యతకు నూత్న ప్రమాణాలను చేకూర్చాడు. డా. వాడపల్లి చక్రపాణిరావు గారు "తెలుగు సాహిత్య చరిత్రలో ఈ కావ్యము ఆధునికమగు నవల వంటిది" అని శ్లాఘించారు. 16వ శతాబ్దిలోనే తెలంగాణంలో 'పొనగంటి తెలగన్న' అన్న కవి 'యయాతి చరిత్ర'మనే మొట్ట మొదటి అచ్చ తెనుగు కావ్యాన్ని రచించి నవ్యతకు నవ్య భాష్యం చెప్పాడు. "కావ్యంలో అచ్చతెనుగు పద్యాలు ఒకటో రెండో ఉంటేనే మెచ్చుకొంటారు. అలాంటిది మొత్తం కావ్యమే అచ్చ తెనుగులో ఉంటే పఠిత అచ్చెరువొందకపోడు" అని ఈ కవి తన అవతారికలో వ్రాసుకొన్నాడు.

17వ శతాబ్దిలో రఘునాథ నాయకుని ఆస్థాన కవి చేమకూర వేంకట కవి – "అమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్" వంటి చమత్కారాలతో, "ప్రతి పద్యము నందు చమత్కృతి గలగం జెప్పనేర్పు"తో నవ్యత నందించాడు. అలాగే ఈ శతాబ్దిలోనే జనరంజకమైన సమాహారకళాస్వరూపంగా 'యక్షగానం'

కొత్త పుంతలు తొక్కి పరమోత్కృష్ట స్థాయికి చేరింది. మరోప్రక్క భక్తి శృంగార రస భావాల మయమైన క్షేత్రయ్య పదాలతో గేయ సాహిత్యం నూత్న పథంలో ప్రయాణించింది ఈ శతాబ్దిలోనే. ఇదే శతాబ్దిలో సమకాలీన సమాజంలోని దురాచారాలను, దుష్ట సంప్రదాయాలను, దుర్నీతులను ఎత్తి చూపుతూ, భాషలో సారళ్యతను సాధించి వేమన తన శతకంలో ఆధునికతను ప్రదర్శించాడు. ఆటవెలదిని జనసామాన్యుల నాల్కలపై ఆడించాడు.

ఇక 18వ శతాబ్దిలో గోగుల పాటి కూర్మనాథుడు, కాసుల పురుషోత్తమ కవి వంటి కవులు శతక సాహిత్యంలో వ్యాజస్తుతిని ప్రవేశపెట్టి ఆంధ్ర సాహిత్యానికి మరొక నవ్యతను సంతరించారు. ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో "సంగీత జ్ఞానము భక్తి వినా సాఫల్యము కానేరదు" అంటూ త్యాగయ్య భక్తిని, వాగ్గేయకళను మేళవించి, శిఖర స్థాయిలో నిలబెట్టాడు.

ఇంత వరకు సహృదయ విమర్శకులందరూ ఆంధ్ర సాహిత్యంలోని నవ్యతా పరిమళాలను ఆఘ్రాణించిన వారే. అయితే ఏ యుగం కవులకు ఆ యుగ కవిత్వమే నవ్యమైనదిగా, అంతకు ముందుదంతా పాత చింతకాయ పచ్చడిగా కనిపించడం సహజమే. అసలు ఎంతో కొంత నవ్యతను సాధించకుండా సాహిత్య ప్రస్థానం ముందుకు సాగదు. ఒక యుగంలో సాధించిన నవ్యత, అంతకు ముందు యుగంలోని సాహిత్యానికి, ఆపై యుగంలో వచ్చే సాహిత్యానికి మధ్య వారధిగా నిలుస్తుంది. భవన నిర్మాత ఇటుకను, ఇటుకను కాంక్రీటుతో అనుసంధించినట్టు, సాహిత్య చరిత్రకారుడు ఒక యుగ సాహిత్యాన్ని, మరొక యుగ సాహిత్యాన్ని, ఆ యుగంలో రూపొందిన నవ్యతతో అనుసంధించాలి. ఇటుకకు, ఇటుకకు నడుమ కాంక్రీటు లేకపోతే ఆ భవనం పటుత్వం కోల్పోయినట్లు, ఈ అనుసంధానం కొరవడితే సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణం జరుగదన్న సత్యాన్ని సాహిత్య చరిత్రకారులు గమనించాలి. కాని 20వ శతాబ్ది ఆరంభంలో సాహిత్య చరిత్రకారులు మొట్టమొదటిసారిగా సాహిత్య చరిత్ర నిర్మాణం చేస్తూ, 19వ శతాబ్దికి సంబంధించినంత వరకు ఆ ప్రయత్న మేదీ చేయకుండా దాటవేసి, తిరిగి 20వ శతాబ్దిలో నవ్య కవిత్వ మహోదయం జరిగినట్టు చిత్రించే ప్రయత్నం చేశారు. దీని వలన 19వ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్ర డోలాయమాన స్థితిలో నిలిచిందని చెప్పవచ్చు. ఇంతకు ముందు అధ్యాయంలో పేర్కొన్నట్టు ఎంతటి ప్రతికూలమైన పరిస్థితులున్నా జాగృతమైన ఒక జాతి ప్రతిభ ఒక్కమారుగా నిర్వీర్యం కాదు. ఒక వేళ అయినా అనతికాలంలోనే అది తిరిగి విజృంభణతో వెలికిరాదు. ఎనిమిది శతాబ్దులుగా యుగయుగానికి ఎంతో నవ్యతను సాధించి, ప్రస్థానించిన తెలుగు సాహిత్య చరిత్రలో, ఎంత విస్తార సామ్రాజ్య వ్యవస్థలు నశించినా, చిన్న, చిన్న సంస్థానాలు ఏర్పడినా, ఒక శతాబ్ది మొత్తంలో కొందరైనా ప్రతిభావంతులైన కవులు తమ సాహితీ వ్యవసాయంలో కొత్త పుంతలు తొక్కకపోరు. అయినా తెలుగు నేలపై ఈ శతాబ్దంలో అనేక జమీందారులు ఇతోధిక సాహిత్య సేవ చేశారు. ఆచార్య తూమాటి దొణప్పగారు ఈ విషయంపై 'ఆంధ్ర సంస్థానములు – సాహిత్యా పోషణము' అన్న బృహద్గ్రంథాన్నే వెలయించారు. అందులో ఆయన వ్యాఖ్య –

"ఉంద్రాజవరము, ఎర్రగూడెము, కపిలేశ్వరపురము, గద్వాల, దోమకొండ, పాపన్నపేట, బొబ్బిలి, ముక్త్యాల, వనపర్తి, విజయనగరము, వుయ్యూరు, వేంకటగిరి వంటి జమీందారులు కొందరు అచ్చుకూటముల స్థాపించియు, ప్రాచీనార్వాచీన గ్రంథముల ననేకము ప్రచురించియు భాషోపకార మొనర్చిరి. చల్లపల్లి, పాల్వంచ, పిఠాపురము, ముక్త్యాల, వల్లూరుల వంటి జమీందారులు ఇతరులు స్థాపించిన ముద్రణ యంత్రశాలలకు ఆర్థిక సాహాయ్యము గావించిరి. అష్టావధానాశుకవితా శతావధానాది సాహితీ ప్రచారక రూపములకు చేయూతనిచ్చి, సర్వాంధ్రలోకమున సాహితీ జిజ్ఞాసను నవనవోన్మేషముగ నిషేవణ మొనర్చిరి. ఆస్థాన కవి పండితుల నాదరించుటయే గాక, తెలుగు దేశము నాలుగంచుల నుండియు, ఇతర రాష్ట్రములనుండియు తమ యాస్థానములకు వచ్చు కవి పండితులచే శతావధానాదికములు, శాస్త్రార్థములు చేయించి వారిని, సత్కారములు, వార్షికములు, భూదానాదికములు, అగ్రహార ప్రదానము, గజారోహణాది సమ్మానములు మొదలగు వానిచే గౌరవించి, పురా భారత సంప్రదాయములను పునరుద్ధరించిరి. ఉర్లాము, పిఠాపురము, వనపర్తి వంటి సంస్థానములలో వేదశాస్త్ర పరీక్షలు నిర్వహించి, ఆర్షధర్మ విజ్ఞాన జ్యోతి ఆరిపోకుండ నిలిపిరి. కార్వేటినగరము, గద్వాల, నూజివీడు, పిఠాపురము, బనగానపల్లి, బొబ్బిలి, ముక్త్యాల, వల్లూరు, విజయనగరము – మున్నగు సంస్థానములు సంగీత నృత్యాది లలిత కళలను ప్రోత్సహించినవి"[18]

కొందరు ఇతర విమర్శకుల వ్యాఖ్యలు ఇలా ఉన్నాయి – “19వ శతాబ్దారంభము నుండియు పండితులకు, కవులకు, సాహిత్య ప్రియులకు, నిర్మాతలకు తావొసగి, తాము సాహిత్య ప్రియులై ఆంధ్ర సారస్వతమును సముదార ప్రవర్తనముతో రక్షించి, నేటి ప్రజాయుగము వచ్చు వరకు బోషించిన యాంధ్ర జమీందారులందరికిని మనమెంతయో ఋణపడి యున్నాము”[19] – కల్లూరి వేంకట నారాయణరావు.

“హయిదరాబాదు రాష్ట్రములో సాంస్కృతిక దీపము ఆరిపోకుండ కాపాడిన గౌరవము సంస్థానాధీశ్వరులకు చెందుచున్నది. ఆ సంస్థానములలో ప్రత్యేకముగా ప్రశంసింపదగినవి గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాలు. ఈ మూడు సంస్థానాలు తెలుగు భాషకు గొప్ప సేవ చేసినవి. 1880 ప్రాంతములో గద్వాల, వనపర్తి సంస్థానాలలో తెలుగు అచ్చు యంత్రాలు స్థాపితమై గ్రంథాలు ముద్రితమయ్యెను.... కవులను, గాయకులను, పండితులను పోషించి, యీ సంస్థానాలు సంస్కృతాంధ్రములను కాపాడినవి. ఈ సంస్థానాల పోషణలో ఉద్దండులైన పండితులు, కవి చక్రవర్తులు ఉండిరి” [20] – దేవులపల్లి రామానుజరావు.

“ఈ రాష్ట్రము (నిజాము) నందలి యాంధ్ర సంస్థానములలో వాఙ్మయ చరిత్రమున సువర్ణాక్షరములలో వ్రాయదగినవి గద్వాల, వనపర్తి, ప్రాగుటూరు, సురపురము, ఆత్మకూరు, దోమకొండ, జటప్రోలు సంస్థాన చరిత్రములు. ఈ సంస్థానాధీశ్వరులలో బేరెన్నిక గన్న కవులు గలరు. వారి పోషణమున విరాజిల్లిన వాఙ్మయ మెంతయేని కలదు. దొంతి, నారాయణపురము, పాపన్నపేట, గోపాలపేట సంస్థానములు కవుల నాదరించి కవితాకళను బెంపొందించెను”[21] – శేషాద్రి రమణ కవులు.

వీటన్నిటిని బట్టి చూస్తే, 19వ శతాబ్దిలో కవిత్వ పోషణకు కొరత లేదు. సమర్థ కవులకు లోటు లేదు. సంస్థానాధీశ్వరుల ప్రోత్సాహంతో బాటు బ్రౌను వంటి ఆంగ్లేయ పండితుల, మిషనరీల ప్రోత్సాహం కూడా అంతో ఇంతో తోడయింది. అయితే ఆనాటి చాలా కావ్యాలు 20వ శతాబ్ది ఆరంభంలో అందుబాటులో లేకపోవడానికి కారణం, బహుశా 19వ శతాబ్ది కవి పండితులు, అంతకు ముందు శతాబ్దుల ప్రాచీనమహాకవుల కావ్యాల సేకరణ, అధ్యయనం పట్ల చూపిన శ్రద్ధ, సమకాలీనుల సాహిత్యంపై చూపకపోవడమే అని చెప్పాలి.



సాహిత్య వివరాలెప్పుడూ, ఒక తరం నుండి మరొక తరానికి రసజ్ఞులైన పండితులు, విమర్శకుల వల్లే సంక్రమిస్తాయి గాని కృతిపతుల వల్ల కాదుకదా! కృతిపతులు కృతికర్తలకు ఆర్థిక సహాయం చేసి, చేతులు దులుపుకోవడం కద్దు.

ఈ పరిస్థితులలో 20వ శతాబ్ది ఆరంభంలో పింగళి లక్ష్మీకాంతం గారు 19వ శతాబ్దిని క్షీణయుగంగా పేర్కొనడం జరిగింది. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు వంటి సమున్నత గురు పీఠం నుండి వెలువడిన ఆ అభిప్రాయాన్ని తరువాతి విమర్శకులు, చరిత్రకారులు అందరూ శిరోధార్యంగా భావించారు. ఆ అభిప్రాయాన్ని చెరిపేందుకు యండమూరి సత్యనారాయణరావుగారు, తూమాటి దొణప్పగారు కొంత కృషి చేసినా, నేటికీ పండిత విమర్శకుల మదులలో ఆ ముద్ర చెరిగిపోలేదనే చెప్పాలి.

అయితే ఇప్పుడు ఆధునిక ప్రగతి వలన పరిణతి చెందిన పరిశోధనలు, విమర్శల వలన, జిల్లాల వారీగా వెలువడుతున్న సాహిత్య సర్వస్వాల వలన, 19వ శతాబ్దికి చెందిన చాలా కావ్యాల వివరాలు అక్కడక్కడా బయటపడుతూనే ఉన్నాయి. అయితే వీటన్నింటినీ ఒక్క చోట చేర్చి, పరిశీలించి, 19వ శతాబ్ది తెలుగు సాహిత్యాన్ని సమగ్రంగా పరిశోధించి అధ్యయనం చేస్తే, దానిపై గల దురభిప్రాయం తొలగిపోగలదు.

యండమూరి సత్యనారాయణరావు గారన్నట్లు ఏ శతాబ్దిలో రానంతటి సాహిత్యం ఒక్క 19వ శతాబ్దిలోనే వచ్చింది. కవుల సంఖ్య కూడా ఎక్కువగానే ఉంది. పింగళి లక్ష్మీకాంతం గారికి కూడా ఈ విషయంలో భిన్నాభిప్రాయం లేదు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే – “ఇంతకు పూర్వయుగములన్నిటిలో నెన్ని పుస్తకములు పుట్టినవో, అంతనెక్కువ యీ యొక్క యుగములో పుట్టినవి.” [22]. కానీ ఆ గ్రంథాలన్నీ ఇప్పుడు లభ్యం కావడం లేదన్నది వాస్తవం. అయితే అన్ని గ్రంథాలు దొరకక పోయినా, దొరికిన గ్రంథ సమాచారాల వలన, కొన్ని కొత్తగా లభించిన గ్రంథాల వలన సుమారు నలభైకి పైగా గ్రంథాలలో ఏదో ఒక నవ్యత చోటు చేసుకొన్న విషయం ఈ పరిశోధనలో రాబట్టగలిగాను. ఒక్క శతాబ్దిలో ఇన్ని నవ్యతా స్పర్శ గల గ్రంథాలు వెలువడటం అంతకు ముందు శతాబ్దులలో కనీ వినీ ఎరుగని విషయం. ఈ అధ్యయనం, పరిశోధన వలన తెలిసిన మరొక విషయం

ఉంది. అంతకుముందు శతాబ్దులలో అక్కడక్కడ ఒక్కోరకమైన నవ్యత గోచరిస్తే, 19వ శతాబ్దిలో పలు రకాల నవ్యతలు ఒక్క శతాబ్దిలోనే అగుపించి ఆశ్చర్యం కలిగిస్తాయి.

అసలు 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో నవ్యత ఎన్ని రకాలుగా ఉండవచ్చో ఆధునిక దృక్పథంతో ఆలోచిస్తే, ఈ క్రింది విభాజనం (Classification) సముచితంగా ఉంటుందని భావిస్తున్నాను.

1. సంప్రదాయ వ్యతిరేక నవ్యత
2. అభ్యుదయాత్మక నవ్యత
3. ఛందస్సుపరమైన నవ్యత
4. భాషాపరమైన నవ్యత
5. ప్రక్రియాపరమైన నవ్యత
6. విదేశీ సాహిత్య ప్రభావ నవ్యత
7. ఆంగ్లేయ సంస్కృతి, రాజకీయ ప్రభావ నవ్యత
8. అన్యమత ప్రభావ నవ్యత
9. సమకాలీన సంఘటన ప్రభావ నవ్యత
10. వస్తుపరమైన నవ్యత

19వ శతాబ్ది సాహిత్యంలో ఇన్ని రకాల నవ్యతలు గోచరిస్తాయి. నిజం చెప్పాలంటే 19వ శతాబ్దికే తొలిసారిగా ఇన్ని రకాల నవ్యతలను సంతరించుకొనే పరిస్థితులు నెలకొన్నాయి. ఇంతకు ముందు శతాబ్దులలో అటువంటి పరిస్థితులు లేవు. ఆ శతాబ్దులలో ఏదో ఒకటి రెండు నవ్యతలను సంతరించుకొనే పరిస్థితులే ఉన్నాయి. ఆ ఒకటి రెండే ఆ యుగ లక్షణాలుగా భాసిల్లాయి. ఏ సామాజిక రాజకీయ పరిస్థితుల వల్ల 19వ శతాబ్ది క్షీణ యుగంగా మారిందని ఇన్నాళ్ళు విమర్శక పండితులు భావించారో, ఆ పరిస్థితులే నిజానికి ఇన్ని రకాల నవ్యతలను సంతరించుకొనేందుకు దోహదం చేశాయని భావించవచ్చు. మునుముందు అధ్యాయాలలో ఆ సామాజిక, రాజకీయ పరిస్థితుల గురించి, పైన పేర్కొన్న పది రకాల నవ్యతలు 19వ శతాబ్దిలో ఎలా రూపుదిద్దుకొన్నాయో సమగ్రంగా చర్చించాను. 20వ శతాబ్దిలో ఈ నవ్యతలే విజృంభించి, ఆధునిక కవిత్వ మహావృక్షాన్ని నెలకొల్పాయి. ఆ నవ్య కవిత్వ మహావృక్షం ఒక్కమారుగా అవతరించ లేదు. 20వ శతాబ్ది నవ్య కవిత్వ మహావృక్షానికి సంబంధించిన బీజాలు 19వ శతాబ్దిలోనే పడ్డాయని సహృదయులు గమనించాలి.

**పాద సూచికలు :**

1. డా.సి.నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు – ప్రయోగములు (పుట. 43)
2. బహుజనపల్లి సీతారామాచార్యులు : శబ్దరత్నాకరము (నిఘంటువు) (పుట. 766)
3. డా. నందూరి రామకృష్ణమాచార్య : కావ్యాలోకము (పుట.2)
4. డా. నందూరి రామకృష్ణమాచార్య : కావ్యాలోకము (పుట.2)
5. నన్నయ భట్టారకుడు : ఆంధ్ర మహాభారతము (తి.తి.దే. ప్రచురణ) అవతారిక (పుట. 19)
6. సూర్యరాయాంధ్ర నిఘంటువు – మూడవ సంపుటం (పుట 882)
7. సూర్యరాయాంధ్ర నిఘంటువు – నాల్గవ సంపుటం (పుట. 84)
8. Websters third new International dictionary (పుట. 1546)
9. శ్రీశ్రీ : మహాప్రస్థానం (పుట. 69)
10. డా. దాశరథి : దాశరథి కవిత (పుట. 231)
11. గురజాడ అప్పారావు : గురజాడ రచనలు – కవితల సంపుటం (పుట. 3)
12. డా. కలువగుంట రామమూర్తి : శేషేంద్రకవిత – నవ్యత (పరిశోధన గ్రంథం – పుట. 35)
13. నన్నెచోడుడు : కుమార సంభవం – అవతారిక

14. పాల్కురికి సోమనాథుడు : బసవ పురాణము (అవతారిక)

15. పోతన : శ్రీ మహాభాగవతము : అవతారిక (పుట. 4) (శివజ్యోతి ప్రచురణ – గుంటూరు)

16. అల్లసాని పెద్దన : మనుచరిత్రము (తెలుగు విశ్వ విద్యాలయ ప్రచురణ) (పుట – 19)

17. రామరాజ భూషణుడు : వసు చరిత్ర (తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ) – అవతారిక (పుట. 6)

18. ఆచార్య తూమాటి దొణప్ప : ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము (పుట. 15)

19. కల్లూరి వేంకట నారాయణరావు : వీరేశలింగ యుగము (పుట. 19)

20. దేవులపల్లి రామానుజరావు : తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము (పుట. 93)

21. శేషాద్రి రమణ కవులు : పూర్వ కవి పరిచయ పీఠిక – గోల్కొండ కవుల సంచిక (పుట. 391)

22. పింగళి లక్ష్మీకాంతము : ఆంధ్ర సాహిత్య చరిత్ర (పుట. 435)





# 3

# తెలుగు కవిత్వం – యుగ విభజన 19వ శతాబ్ది స్థానం



ఇంతవరకు వెలువడిన తెలుగు సాహిత్య చరిత్రలలో వివిధ చరిత్రకారులు యుగ విభజన చేసిన విధానం, వాటి ఔచిత్యం, వాటిలో 19వ శతాబ్దికి ఇచ్చిన స్థానం తదితర విషయాలను ఈ అధ్యాయంలో చర్చిద్దాం.

మొదట 'యుగము' అంటే ఏమిటో తెలుసుకోవాలి. 'యుగము' అంటే కొన్ని విశిష్ట సమాన ధర్మాలు గల కాల పరిమితి అని చెప్పవచ్చు. ఆ కాల పరిమితి దాటిన పిదప సాహిత్యం కొత్తదైన, భిన్నమైన మార్గాన్ని అనుసరించవచ్చు. "ఒక మార్గం ప్రారంభం నుండి మరియొక మార్గం ప్రారంభమయ్యే వరకు గల మధ్య కాలాన్ని 'యుగ' మంటారు"[1] అని నిర్వచించారు కె. రామ్మోహన్‌రాయ్. ఒక యుగంలో అనుసరించిన నవ్య లేక భిన్న మార్గాన్నే ఆ యుగ సాహిత్య లక్షణంగా గుర్తిస్తారు.

అయితే ఇక్కడ ఒక విషయాన్ని గ్రహించాలి. 'లోకోభిన్న రుచిః' అన్నది ఆర్యోక్తి. ఒక యుగంలోని కవులందరూ ఒకేలా ఆలోచించరు. ఒకే లాంటి కావ్య నిర్మాణం చేయరు. అంతెందుకు – ప్రతి కవి తన కావ్యాలలోనే ఒక దానికొకటి భిన్నంగా నవ్యంగా ఉండేందుకు ప్రయత్నిస్తాడు. అలాంటిది ప్రతిభాపూర్ణమైన ఇరువురు కవుల్లో ఎవరు, ఏ సమయంలో ఎలాంటి రచన చేస్తారో ఎలా చెప్పగలం? అందుకే 'ముఖే ముఖే సరస్వతి' అంటారు. అయితే కవులలో సామాజిక అవగాహన పెరిగాక, సమకాలీన సామాజిక, రాజకీయ పరిస్థితులు చాలా మంది కవులను ఒకే లాంటి భావావేశానికి లోనుచేసి, ఒకే రకం కావ్య నిర్మాణం చేసేందుకు దోహదం చేస్తాయి. 'సునామి' ఉపద్రవం ఏర్పడినప్పుడు చాలా మంది కవులు 'సునామి' పై కవితలు

వ్రాయడం ఇలాంటిదే. కొన్ని సార్లు సామాజిక రాజకీయ పరిస్థితులు కాకుండా, ఆనాటి సామాజిక, రాజకీయ అవసరాలు కూడా ఒకే రకం కావ్యాలు రచించేలా చేస్తాయి. ఉదాహరణకు ప్రబంధ యుగంలో ఆనాటి మహారాజు శ్రీకృష్ణదేవరాయలే స్వయంగా ప్రబంధ కవి. 'ఆముక్త మాల్యద' అన్న ప్రౌఢ ప్రబంధాన్ని వెలయించాడు. కాబట్టి అతని పోషణలో ఉన్న కవులందరు అటువంటి ప్రబంధాలనే సృజించి రాజును మెప్పించే ప్రయత్నం చేసారు. ఆ యుగం ఒక ప్రత్యేక యుగంగా, ఆ పంథా ఆ యుగ లక్షణంగా గుర్తించబడింది. ఆ ప్రబంధయుగం తరువాతి కాలాల్లో అది ఒక 'ట్రెండ్'గా 'ఫ్యాషన్'గా మారిపోయింది. ఆ 'ఫ్యాషన్'కి, 'ట్రెండ్' కి అందరు మోజుపడి అలాంటి రచనలే చేయాలని ప్రయత్నించడం కూడా సామాజిక అవసరమే.

ఒక ప్రత్యేక యుగంగా గుర్తించిన కాలం కంటే ఆ తరువాతి కాలంలోనే అటువంటి రచనలు ఎక్కువ సంఖ్యలో వచ్చాయి. అంత మాత్రాన ఆ కాలాన్ని కూడా ఆ యుగంలోనే చేర్చలేము. ఎందుకంటే కవులు మోజుపడి రచించినా, వాటిలో 'మందెక్కువయితే మజ్జిగపలచన' చందంగా నాణ్యత తగ్గి ప్రజలకు మొహం మొత్తడం ప్రారంభమయింది. అదే సమయంలో కొందరైనా కవులు మారిన సామాజిక రాజకీయ పరిస్థితుల కనుగుణంగా కొత్తగా ఆలోచించి ఉంటారు. దానినే ద్రష్టత్వం అంటారు. అటువంటి వాళ్ళే కొత్త రకమైన రచనలు చేస్తారు. ఆ రచనలు, అందులోని కొత్తదనం పఠితలను విశేషంగా ఆకర్షిస్తాయి. సంఖ్యాబలంలో ఆ రచనలు తక్కువగా ఉన్నా అవే ఒక నవ యుగానికి తెరలు లేపుతాయి. భావిలో మరిన్ని విశిష్ట రచనలు ఆ పంథాలో వచ్చేందుకు దోహదం చేస్తాయి.

ఆ పంథా తన విశిష్టతను నిలబెట్టుకొంటూ గాఢంగా పఠితలను ప్రభావం చేస్తూ ఆకర్షించిన కాలమే ఆ నవ్యయుగ పరిమితిగా భావించాలి. అలాగే గత యుగ లక్షణం గాఢత, విశిష్టత కోల్పోగానే ఆయుగ పరిమితి ముగిసిందని అర్థం చేసుకోవాలి. అంతే కాని, గత యుగంలోని పంథా గాఢత, ప్రభావం కోల్పోయి, అలాంటి రచనలే చర్విత చర్వణంగా తరువాతి కాలంలో మితిమీరిన సంఖ్యలో వచ్చినా, ఆ కాలాన్ని కూడా కేవలం సంఖ్యాబలాన్ని బట్టి అదే యుగంగానో, లేక ఆ యుగ ప్రభావంతో సాగిన మరొక క్షీణ యుగంగానో భావించడం సరైన పద్ధతి



కాదు. అంటే ఒక యుగ ఆరంభ, సమాప్తులను, లేక లక్షణాన్ని ఆ కాలంలో వచ్చిన ఒకే రకం కృతుల సంఖ్యా బలాన్ని బట్టి నిర్ణయించడం తప్పు. ఆ కాలంలోనే నవ్య లక్షణాలు పుణికి పుచ్చుకొని ఒక్క కృతి వెలువడినా, అది భావి కాలాన్ని ప్రభావితం చేసి మార్గదర్శనం చేయగలిగితే, ఆ ఒక్క కృతి ఆవిర్భావమే ఒక నవ్యయుగానికి అంకురార్పణగా భావించాలి. అలాంటి కవి ఒక్కడే ఉంటే అతడే యుగకర్త అవుతాడు. ఒకరి కంటె ఎక్కువ మంది ఉంటే వారు యుగ వైతాళికులు అవుతారు.

"ఎవరు నడచిన మార్గమును అర్వాచీనులు శిష్యప్రాయులుగా ననుసరించెదరో, ఎవరి అవతారముకై ఆ కాలమునందలి పూర్వ కవుల సాధన తపః ప్రాయమగునో, ఎవడు సూత్రధారుడై కావ్య సరస్వతిని నూత్న వేషములో అలంకరించి, రంగమున ప్రవేశపెట్టునో, ఎవడు క్షీణ దశ యందున్న వాఙ్మయమును, నూత్న మార్గము దొక్కి శక్తిమంతము జేయునో, అతడు 'యుగకర్త' అనిపించుకొనును"[2] అంటారు పింగళి లక్ష్మీకాంతంగారు. భావ కవిత్వ కావ్యాలు ఉధృతంగా వస్తున్న కాలంలో శ్రీశ్రీ, శిష్ట్లా ఉమా మహేశ్వర రావు వంటి ఒకరిద్దరు మాత్రమే నవ్యమైన భావనలతో నవ్యరచనలు చేశారు. ముఖ్యంగా శ్రీశ్రీ ఒక్కరే 'మహాప్రస్థానం' వంటి విశిష్ట నవ్య కావ్యాన్ని వెలయించారు. భావకవితా గ్రంథాలు కోకొల్లలుగా వస్తున్నా, 'మహాప్రస్థానం' కావ్య మహోదయాన్నే భావ కవితా యుగానికి భరత వాక్యంగా, అభ్యుదయ కవితా యుగమనే నవ్యయుగానికి నాందీ వాక్యంగా భావిస్తున్నామే! శ్రీశ్రీని ఆ నవ్య యుగానికి యుగ కర్తగా గుర్తించామే!

మరి 19వ శతాబ్ది విషయంలో ఇలా ఆలోచించక పోవడం మన చరిత్రకారులు చేసిన తప్పిదమే కదా! దురదృష్టకరమైన విషయమేమంటే 'యుగ కర్త'ను పైన పేర్కొన్న విధంగా నిర్వచించిన లక్ష్మీకాంతంగారే చర్విత చర్వణరీతి వచ్చిన ప్రబంధాలను చూచి ఆ శతాబ్దిని క్షీణయుగంగా పేర్కొన్నారు గాని, ఆ శతాబ్దిలోని వైతాళికులను గురించి పట్టించుకోలేదు. 19వ శతాబ్దిలో తొలితరం స్మృతికావ్యాలను వెలయించిన వడ్డాది సుబ్బారాయకవి; తొలితరం ఖండ కావ్యాలను రచించిన ఆచంట సాంఖ్యాయన శర్మ; విదేశీ భాష నుండి తొలిసారిగా కావ్యాలను నాటకాలను అనువదించిన వావిలాల వాసుదేవశాస్త్రి, తొలి వ్యంగ్య, హాస్య కావ్యాలను రచించిన

కందుకూరి వీరేశలింగం; ఆధునిక నగర వర్ణన చేసిన మతుకుమల్లి నృసింహశాస్త్రి; కొత్త కొత్త ఛందస్సులను సృజించిన కొక్కొండ వెంకట రత్న శర్మ వంటి మహానుభావులను ఆయన గుర్తించలేదు.

19వ శతాబ్దిలో తెలుగు సాహిత్యం పూర్తిగా నవ్యమైపోయిందని ఎవరూ అనలేరు. ప్రబంధాల శృంగార వర్ణనల వైపరీత్యం, రసహీనమైన ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాల వెల్లువను కాదని ఎవరూ ఖండించలేరు. ఏ శతాబ్దిలోనైనా అంతకుముందు శతాబ్దిలో ప్రసిద్ధి చెందిన కావ్యాల అనుకరణ ఒక 'ఫ్యాషన్'గా వెల్లువెత్తడం సహజమే. యండమూరి సత్యనారాయణరావు (శ్రీవాత్సవ)గారు ఒక చోట అంటారు – "ఈ కాలపు కావ్యములలో నాటి యభిరుచుల ననుసరించి శబ్దాలంకారములకు, చమత్కారములతో కూడిన శ్లేషార్థములకు, ఛేకానుప్రాస, లాటానుప్రాసాది శబ్ద చమత్కృతికి కొంత ప్రాధాన్యమిచ్చిన మాట నిజమే. అది ఆ కాలపు సాహిత్యములో 'ఫేషన్'. దానిని గుణముగాగాని, దోషముగా గాని పేర్కొనవలసిన పనిలేదు."[3]

అయితే ఇటువంటి కావ్యాలు మిక్కుటంగా వెలువడినంత మాత్రాన, ఆ సంఖ్యాబలం చూచి ఆ యుగ లక్షణాన్ని నిర్ణయించడం సరికాదు. మారుతున్న కాలమాన పరిస్థితుల కనుగుణంగా 19వ శతాబ్దిలో నవ్య స్పర్శ గల కావ్యాలు కూడా రాకపోలేదు. ఇది గమనించకుండా 19వ శతాబ్దిని 'క్షీణయుగం' లేక 'అంధయుగం' అనటం సమంజసం కాదు. ఈ రోజుల్లో కూడా మన తెలుగు సినిమా ఒకటి హిట్టయితే, అదే ఫార్ములాతో మరో పది సినిమాలు వరుసగా రావడం చూస్తూనే ఉంటాం. మనం మొదటి సినిమా గురించి చెప్పుకొంటాంగాని, తరువాతి సినిమాల గురించి కాదు. పైగా అవన్నీ ప్రజాదరణ కూడా పొందవు. మళ్ళీ అనతికాలంలోనే కాస్త కొత్తదనంతో మరొక సినిమా వస్తుంది. అది మళ్ళీ సక్సెస్ అవుతుంది. మనం దాని గురించి చర్చించుకొంటాం. అలాగే సాహిత్యంలో కూడా విస్తృతంగా వస్తున్న పాత చింతకాయ పచ్చడి వంటి కావ్యాలను పక్కనబెట్టి, కాస్తైనా నవ్యత గల కొన్ని రసవంతమైన కావ్యాలపై మనం దృష్టి నిలపాలి. వాటిని కాపాడుకోవాలి కానీ, వాటినీ ఆ గాటిలోనే కట్టి పక్కకు తోస్తే మనకు మిగిలేది శూన్యమే. ఆరంభంలో మన సాహిత్య చరిత్రకారులు 19వ శతాబ్దికి అలాంటి అన్యాయమే చేశారు. అలా ఆనాటి ఎన్నో మధుర నవ్య కావ్యాలు ఈనాడు మనకు లభ్యం కాకుండా పోయాయి. కనీసం కొందరు మహానుభావుల కృషి వల్లనైనా ఆ శతాబ్దికి చెందిన కొన్ని నవ్య స్పర్శ గల కావ్యాలు తిరిగి వెలుగులోకి రావడంతో ఆలస్యంగానైనా ఆ శతాబ్దిలోని నవ్యతను ఆస్వాదించగలిగే అదృష్టానికి మనం నోచుకొంటున్నాం. ఆ మాటకొస్తే, మన ప్రాచీన కావ్యాలు కూడా మనకు అలా మిగిలినవే. ప్రాచీన గ్రంథాలన్నీ సేకరిస్తూ, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను, అందులో అంతో, ఇంతో విశిష్టత, నవ్యత గల సత్కావ్యాలను మాత్రమే అచ్చువేయించి మనకందించాడు. నిరర్థకమని భావించిన వాటిని వదిలి వేశాడు. కొన్ని కావ్యాలకు ఆయన వ్రాసుకొన్న నోట్సు ఇలా ఉన్నాయి –

1) గజవల్లి కొండయ్య రచించిన 'శ్రీ పర్వత పురాణం' గురించి – "It is a silly stupid book utter by worthless, yet written by a man of learning and in a good style of poetry."[4]

2) అక్కినేపల్లి నరసింహం రచించిన 'ఆది లక్ష్మీ విలాసం' గురించి – "This poem is so obscured with pandantry, it is quite worthless." [5]

3) సింహాద్రి వెంకటాచార్యులు రచించిన 'చమత్కార మంజరి' గురించి – "This poem is useless, it is composed in a bud pedentic style and is in many places nearly intelligible. Yet it is much admired by some learned Telugus. The subject of the poem is the marriage of Krishna which is the theme of at least twenty Telugu Poems."[6]

4) 'సకల కథా సార సంగ్రహము' గురించి – "This is an ellitrate poem of no merit, what ever parts are superior one stolen from better authors"[7]

5) 'పరశు రామాయణం' ద్విపద కావ్యం గురించి – "This poem is more rubbish and on persuing the beginning, I desired the transcriber to desist. The illeterate composer did not even know the laws of rhyme."[8]

అంటే, ఈ రోజు మనం గొప్పగా చెప్పుకొంటున్న తెలుగు కావ్యాలన్నీ ఎన్నో చెత్త కావ్యాల నడుమ ప్రకాశించిన జాతిరత్నాలన్న మాట. మనం పదకొండో శతాబ్ది అనగానే నన్నయ భారతాన్ని గుర్తు చేసుకొంటాం. ఆ శతాబ్ది మొత్తంలో ఆ ఒక్క రచనే వచ్చి ఉండదు కదా! కాని వచ్చిన ఎన్నో రచనలలో అదొక్కటే రస నిర్భరమై వినూత్నమై వెలసింది కాబట్టి, అది నిలిచింది. 14వ శతాబ్దిలో ఎందరో కవులుండగా, శ్రీనాథుడు, పోతనలకు వచ్చినంత ప్రఖ్యాతి ఇతరులకు రాకపోవడానికి కారణం కూడా అదే. వారి రచనల ముందు ఇతరుల రచనలు వెలవెలబోయాయన్న మాట. అంత మాత్రాన ఆ యుగాన్ని ఉపేక్షించలేం కదా! పైగా ఆ యుగ సాహిత్య ప్రస్థానానికి శ్రీనాథుడు, పోతనలనే సారథులుగా గుర్తిస్తున్నాం.

అలాగే 19వ శతాబ్దిలో కూడా ఎన్నో రచనలు వచ్చాయి. అందులో చాలా భాగం నలిగిన బాటలోనే నడచిన రచనలు; సంఖ్యలో తక్కువే అయినా, కొత్తదనంతో వెలసిన ఉత్తమ రచనలూ వచ్చాయి. కాని మనం ఆ శతాబ్దిని ఆ ఉత్తమ రచనలతోనే గుర్తించాలి. ఆ రచనలలోని నవ్యతనే ఆ యుగ సాహిత్య పరిణామంగా అంగీకరించాలి.

ఈ అవగాహనతో వివిధ తెలుగు సాహిత్య చరిత్రకారుల యుగ విభజనను పరిశీలిస్తే, వాటిలోని ఔచిత్యానౌచిత్యాలు ఇట్టే బోధపడతాయి. తెలుగు సాహిత్య చరిత్రకారులు తమతమ అభిరుచులను బట్టి, రచనా సౌలభ్యం కోసం వివిధ రకాలుగా యుగాలుగా విభజించారు. ప్రధానంగా వాటిని ఆరు రకాలుగా పేర్కొనవచ్చు.

1. కవులను బట్టి యుగ విభజన; 2. కవితా పోషకులను బట్టి యుగ విభజన; 3. కావ్య ప్రక్రియలను బట్టి యుగ విభజన; 4. కావ్య లక్షణాలను బట్టి యుగ విభజన; 5. కాలాన్ని బట్టి యుగ విభజన; 6. పై పద్ధతులలో కొన్ని కొన్ని కలగలిపి చేసే యుగ విభజన.

20వ శతాబ్ది ఆరంభంలో వంగూరి సుబ్బారావుగారు రచించిన 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'లో ప్రక్రియాపరమైన విభజన చేశారు. అది ఇలా ఉంది.

1. పురాణ కవులు; 2. ప్రబంధ కవులు; 3. గేయ కవులు అన్న ఈ విభజన స్థూలమైనదేగాని, సూక్ష్మ వివరణలను అందించలేదు.



కేవలం కావ్య లక్షణాలను బట్టి సాహిత్య యుగవిభజన చేసినవారు 'కవిత్వ వేది' కే.వి. నారాయణరావు. ఆయన విభాజనం ప్రకారం తెలుగు సాహిత్యం – 1. ప్రాచీన కవిత్వం (క్రీ.పూ. 28 – క్రీ.శ. 1000); 2. పురాణ కవిత్వం (క్రీ. శ. 1001–1380); 3. కావ్య, ప్రబంధయుగం (క్రీ. శ. 1381–1650); 4. అర్వాచీన కవిత్వం (క్రీ.శ. 1651–1900); 5. నవ్య కవిత్వం (క్రీ. శ. 1901 నుండి) అని ఐదు యుగాలు. దీని ప్రకారం నన్నయ నుండి ఎఱ్ఱన వరకు అందరూ పురాణ కవిత్వంలోకి రావడం వలన ఇది కూడా స్థూల విభజనే అవుతుంది తప్ప సూక్ష్మ పరిశీలన అనిపించదు. అలాగే నాయక రాజుల కాలం నుండి 19వ శతాబ్ది అంతం వరకు అర్వాచీన యుగంలో చేర్చడం వలన చేమకూర వెంకట కవి వంటి ప్రతిపద్య చమత్కృత కవి నుండి 19వ శతాబ్ది కవుల వరకు అంతా అర్వాచీనమని చెప్పడం జరిగింది. ఇది కూడా స్థూల విభజనే. ఈ గ్రంథంలో కవిత్వవేది 19వ శతాబ్దిలో వచ్చిన మార్పులను స్వల్పమైనా గమనించలేదనే చెప్పాలి. అయితే 19వ శతాబ్ది సాహిత్య చరిత్రని 'వీరేశలింగ యుగము' పేరుతో ప్రత్యేక చరిత్రగా ఆ తరువాత వెలువరించారు. ఇందులో ఆయన 19వ శతాబ్దికి చెందిన చాలా మంది కవులను పరిచయం చేసి స్థాలీపులాకంగా వారి రచనలు, వివరాలను పొందుపరిచారు. కాని ఈ గ్రంథం ఆనాటి రచనలలోని నవ్యతను స్పృశించింది తక్కువే అని చెప్పాలి.

ఖండవల్లి లక్ష్మీరంజనంగారు కవులను, కాలాన్ని, కావ్య లక్షణాలను మూడింటిని కలగలిపి యుగ విభజన చేశారు. ఆయన ఉద్దేశ్యంలో తెలుగు సాహిత్యం – 1. నన్నయ పూర్వ యుగం, 2. నన్నయ – తిక్కనల నడిమికాలం, 3. తిక్కన యుగం; 4. ఎఱ్ఱన యుగం; 5. శ్రీనాథయుగం; 6. అనంత ప్రబంధ యుగం – అని ఆరు యుగాలుగా విభజించబడింది.

ఇందులో కూడా నన్నయ – తిక్కన నడిమికాలాన్ని సూక్ష్మంగా కాక నన్నయ యుగాన్ని, శివకవుల యుగాన్ని కలిపి స్థూలంగా చూచినట్టయింది. అంతే కాకుండా, శ్రీనాథయుగం తరువాత సాహిత్యమంతా 'అనంత ప్రబంధయుగం' అనడం వల్ల ఆయా కాలాలలో వచ్చిన సాహిత్యంలో భేదాన్ని గుర్తించనట్టయింది. 19వ శతాబ్ది కూడా ఇందులోనే చేరడం వల్ల ఖండవల్లి వారు ఆ శతాబ్దిలో సంఖ్యా బలంలో

అధికంగా ఉన్న చర్విత చర్వణ రీతి ప్రబంధాలనే పరిశీలించారు గాని, కొత్తదనంతో వచ్చిన కొన్ని కావ్యాలను ఉపేక్షించారన్నది సుస్పష్టం.

పై ఇరువురు కూడా 19వ శతాబ్ది సాహిత్యానికి ఎలాంటి ప్రాముఖ్యాన్ని ఇవ్వలేదు. దానిని ఇతర యుగాలతో కలిపి చూశారు. అయితే పింగళి లక్ష్మీకాంతంగారు మరొక అడుగు ముందుకు వేసి, ఆ శతాబ్దిలోని అత్యధిక భాగాన్ని ఒక యుగంగా చేసి, దానిని క్షీణ యుగమని మొట్ట మొదటి సారిగా పేర్కొన్నారు. ఆయన చేసిన యుగ విభజన ఇలా ఉంది – 1. ప్రాఙ్నన్నయ యుగం (క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 1000 వరకు); 2. నన్నయ యుగం (క్రీ.శ. 11వ శతాబ్ది); 3. శివ కవి యుగం (12వ శతాబ్ది); 4. తిక్కన యుగం (13వ శతాబ్ది); 5. ఎర్రన యుగం (క్రీ.శ. 1300–1350 మధ్య); 6. శ్రీనాథ యుగం(క్రీ.శ. 1350–1500 మధ్య); 7. శ్రీకృష్ణదేవరాయల యుగం (క్రీ.శ. 1500–1600 మధ్య); దక్షిణాంధ్రయుగం (క్రీ.శ. 1600–1775 మధ్య); క్షీణయుగం (క్రీ.శ. 1775–1875 మధ్య); ఆధునిక యుగం (క్రీ.శ. 1875 నుండి). ఇందులో లక్ష్మీకాంతంగారు కవులను బట్టి, కాలాన్ని బట్టి, కవితాపోషకులను బట్టి, కావ్య లక్షణాలను బట్టి అన్నిరకాల పద్ధతులను సమయోచితంగా కలగలిపి యుగ విభజన చేశారు.

లక్ష్మీకాంతం గారి యుగ విభజన అన్ని విశ్వవిద్యాలయాల విద్యార్థులచే పఠించబడి సర్వజనామోదమై భాసిల్లింది. నిజానికి అది ఉన్నంతలో సూక్ష్మదృష్టితో చేసిన చక్కని విభజన. ఒక్క కవులను బట్టి, లేక ఒక్క కవిపోషకులను బట్టి, లేక కావ్య లక్షణాలను బట్టి, లేక కాలాన్ని బట్టి, అని కాకుండా సాహిత్య పరిణామాన్ని బట్టి, ప్రస్థానాన్ని బట్టి ఎక్కడికక్కడా అవసరమైన పద్ధతిని స్వీకరించి ఈ యుగ విభజనను చేసారు లక్ష్మీకాంతంగారు. అయితే ఒక్క 19వ శతాబ్ది విషయంలో మాత్రం, ఆయనకు అందుబాటులో కనిపించిన ప్రబంధాల వల్లనో, లేక ఆనాటి చర్విత చర్వణరీతి ప్రబంధాల వెల్లువను చూచిన ప్రభావం వల్లనో, ఆయన దృష్టి నవ్య స్పర్శ గల కావ్యాలపై పడి ఉండకపోవచ్చు. అయితే ఒక్క విషయంలో మాత్రం ఆయన్ని అభినందించాలి. అంతవరకు దక్షిణాంధ్రయుగం పట్ల కూడా పండితులకున్న చిన్న చూపును తొలగించి, గౌరవాన్ని సంతరింపజేసినందుకు నిజంగా



లక్ష్మీకాంతంగారు అభినందనీయులే. ఆయన ఆ పరిధిని కేవలం 19వ శతాబ్దికి పరిమితం చేసి వదలి పెట్టారు. ఆ తరువాత ఎన్నో పరిశోధనల ఫలితంగా వెలుగు చూసిన ఆనాటి నవ్య స్పర్శ గల కావ్యాలను చవి చూసిన నేటి తరంపై, ఆ శతాబ్దిపై గల అపప్రథను కూడా తొలగించుకోవలసిన బాధ్యత ఉందని భావిస్తున్నాను.

అలాంటి ఆశావహ దృక్పథాన్ని కొంత ప్రసరింపజేసిన వారు – ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. వీరిరువురూ కావ్య ప్రక్రియలను బట్టి యుగ విభజన చేసారు. దివాకర్ల వారు తమ యుగ విభజనలో – 1. ప్రాఙ్నన్నయ యుగం (లేక) అజ్ఞాత యుగం; 2. పురాణ యుగం (లేక) భాషాంతరీకరణ యుగం; 3. కావ్య యుగం; 4. ప్రబంధ యుగం; 5.గద్య, గేయ, యక్షగాన యుగం (లేక) దక్షిణాంధ్ర యుగం; 6. ఖండకావ్య యుగం (లేక) భావ కవితా యుగం (లేక) ఆధునిక యుగం – అన్న ఆరు యుగాలను ప్రతిపాదించారు. దీంట్లో 19వ శతాబ్దిని దక్షిణాంధ్ర యుగంలోనే చేర్చడం కొంత సబబుగా తోచదు. అయితే దీనిని ప్రత్యేకంగా క్షీణ యుగంగా పేర్కొనక పోవడం అభినందనీయం.

శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి యుగ విభజనం ఇలా ఉంది –

1. అజ్ఞాత యుగం (లేక) ప్రాఙ్నన్నయ యుగం (క్రీ.శ. 1000 వరకు)
2. భాషాంతరీకరణ యుగం (లేక) కవిత్రయ యుగం (క్రీ.శ. 1000 – 1350)
3. సంధి యుగం (లేక) శ్రీనాథ యుగం (క్రీ.శ. 1350–1500)
4. ప్రబంధ యుగం (క్రీ.శ. 1500 – 1700)
5. దక్షిణ దేశ వాఙ్మయ యుగం (క్రీ.శ. 1700–1800)
6. ఆధునిక యుగం (క్రీ.శ. 1800–1900)

ఇది కాస్త తేడాతో దివాకర్ల వారి విభజన లాగే ఉంది. ఈ ఇరువురి విభజనలలో భాషాంతరీకరణ యుగం అంటూ నన్నయ నుండి ఎర్రన వరకు స్థూల వర్గీకరణ, సూక్ష్మ పరిశీలనకు అవకాశం లేకుండా చేస్తుంది. అయితే కోరాడవారు 19వ శతాబ్ది ఆరంభం నుండి ఆధునిక యుగంగా భావించడం ఆశావహమైన, ఆహ్వానించదగ్గ పరిణామం. క్రీ.శ. 1350–1500 మధ్య కాలాన్ని కోరాడవారు

'సంధి యుగం'గా పేర్కొనడం ఒక విశిష్ట వర్గీకరణంగా భావింపవచ్చు. భాషాంతరీకరణ యుగానికి, ప్రబంధయుగానికి మధ్య అటు పూర్తిగా అనువాదాలు కాకుండా, ఇటు పరిపక్వమైన ప్రబంధాలు కాకుండా మధ్యస్థంగా వెలువడిన కావ్యాల కాలాన్ని ఆయన సంధియుగంగా పేర్కొన్నారు.

అసలు 'సంధి యుగం' అంటే ఏమిటి? – అని సాలోచన చేస్తే ఈ విషయం అవగతమవుతుంది ఒక ప్రస్ఫుటమైన లక్షణం గల యుగం అంతరించి, మరొక ప్రస్ఫుటమైన లక్షణం గల యుగం రూపుదిద్దుకొనే లోపు, మధ్య గల కాలంలో, అటు పాత పద్ధతిలో గ్రంథాలు వెలువడుతూనే ఉన్నా, వాటిలో ఆ పాత పద్ధతిలోని ప్రామాణికత పలచనై మొహం మొత్తి, సాహిత్యాభిమానులు కొత్తదనం కొరకు ఉవ్విళ్ళూరుతుండగా, రాబోయే విలక్షణ యుగానికి బీజాలుగా నిలిచే కొన్ని (సంఖ్యా బలంలో తక్కువే కావచ్చు) కావ్యాలు వెలువడితే, దానిని 'సంధి యుగ'మని చెప్పవచ్చు. సరిగ్గా 19వ శతాబ్దిలో కూడా అటువంటి పరిస్థితులే నెలకొన్నాయి. 18వ శతాబ్ది అంతం వరకు గల దక్షిణాంధ్ర యుగం అంతరించి, 20వ శతాబ్ది ఆరంభంలో ఆధునిక యుగం ప్రారంభమయ్యే వరకు మధ్య గల 19వ శతాబ్దిలో, అటు చర్విత చర్వణరీతిలో అనేక ప్రబంధాలు ప్రామాణికత క్షీణించి వెలువడుతున్నా, కొన్నైనా 20వ శతాబ్ది ఆధునిక యుగానికి బీజప్రాయమైన కావ్యాలు వెలువడ్డాయి. కాబట్టి ఆ యుగం 'సంధి యుగ'మని యండమూరి సత్యనారాయణ రావు భావించారు.[9]

ఇంత వరకు వచ్చిన సాహిత్య చరిత్రలన్నీ ఒక ఎత్తయితే, ఆ తరువాత వచ్చిన ఆరుద్ర గారి 'సమగ్రాంధ్ర సాహిత్యం'; కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'తెలుగు సాహిత్య చరిత్ర' మరొక ఎత్తులో నిలిచాయి. సమగ్రతకు చాలా దగ్గరగా వచ్చిన సాహిత్య చరిత్రలు ఇవి. వీరికి ప్రేరణ కలిగించిన గ్రంథం సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'. ఆ గ్రంథంలో ఆంధ్రుల సాంఘిక, రాజకీయ, పౌర జీవన చరిత్రను చాలా సవిస్తరంగా, పరిశోధనాత్మకంగా, సమగ్రంగా రూపొందించి అందించారు రెడ్డిగారు.

"స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఆంధ్ర సాహిత్యంలో వెలువడిన అనర్ఘ గ్రంథాలు కొన్నిటిలో ఈ గ్రంథము అగ్రగణ్యమని నమ్ముతాను."[10] అని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఈ గ్రంథాన్ని ప్రశంసించారు. ఇందులో ఆయన – 1. తూర్పు చాళుక్య యుగం; 2. కాకతీయుల యుగం; 3. రెడ్డి రాజుల కాలం; 4. విజయనగర సామ్రాజ్య కాలం (క్రీ.శ. 1530 నుండి 1630 వరకు); 6. క్రీ.శ. 1600 నుండి 1757 వరకు (పేరు పెట్టలేదు); 7. క్రీ.శ. 1757 నుండి 1857 వరకు (పేరు పెట్టలేదు); 8. క్రీ.శ. 1857 నుండి 1907 వరకు (పేరు పెట్ట లేదు) అని యుగ విభజన చేసారు. అయితే ఇది సాహిత్య చరిత్ర కాదు. సాహిత్య గ్రంథాల ఆధారంగా రూపొందించిన సాంఘిక చరిత్ర. అంత వరకు సాహిత్య చరిత్రకారులు, కవుల గురించి, వారి కావ్యాల గురించి, వారి పోషకుల గురించి, కావ్య భేదాలు, లక్షణాల గురించి వ్రాసారు కాని, వీటన్నిటి వెనుక సాంఘిక, రాజకీయ, పౌర జీవన విధానాల ప్రభావాన్ని అన్వయం చేసిన సందర్భం లేదు. ప్రతాపరెడ్డిగారి సాంఘిక చరిత్ర స్ఫూర్తితో ఆ పనిని ఆరుద్ర, కొర్లపాటి వారు చేసారు. ఇటీవలి కాలంలో డా. ముదిగంటి సుజాతారెడ్డిగారు 'చారిత్రక, సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర'ను క్లుప్తంగా 400 పేజీల గ్రంథంగా అందించారు. కొర్లపాటివారు ఐదు సంపుటాల్లో విపులంగా, ఆరుద్ర 14 సంపుటాల్లో మరింత విస్తారంగా, సాంఘిక చరిత్రతో అన్వయిస్తూ సాహిత్య చరిత్రలను అందించారు.

సురవరం ప్రతాపరెడ్డిగారి స్ఫూర్తితో ఆరుద్రగారు మొట్టమొదటిసారిగా సాహిత్య చరిత్రకు కవి పోషకుల ఆధారంగా యుగ విభజనను సమకూర్చారు.[11] పునర్ముద్రణలలో కాస్త అటు ఇటుగా మార్పులు చేసినా, ఆరుద్ర ముందుగా వేసుకొన్న ప్రణాళిక ప్రకారం చేసిన యుగ విభజన ఇలా ఉంది –

1. ఆదిమ, చాళుక్య యుగాలు (క్రీ.శ. 12వ శతాబ్ది చివరిదాకా)
2. కాకతీయ యుగం (క్రీ.శ. 1200 –1290)
3. పద్మ నాయక యుగం (క్రీ.శ. 1337 – 1399)
4. రెడ్డి రాజుల యుగం (క్రీ.శ. 1400 –1450)
5. తొలి రాయల యుగం (క్రీ.శ. 1450 – 1500)
6. మలి రాయల యుగం (క్రీ.శ. 1500 – 1550)

7. నవాబుల యుగం (క్రీ.శ. 1550–1600)

8. నాయక రాజుల యుగం (క్రీ.శ. 1600–1670)

9. కడపటి రాజుల యుగం (క్రీ.శ. 1670–1750)

10. కుంఫిణీ యుగం (క్రీ.శ. 1750–1850)

11. జమీందారీ యుగం (క్రీ.శ. 1850–1900)

12. ఆధునిక యుగం (క్రీ.శ. 1900 నుండి – )

వీటిలో 19వ శతాబ్ది 'కుంఫిణీ యుగం'లో, 'జమీందారీ యుగం'లో సగం, సగంగా విభజించబడింది. ఈ యుగాల సంపుటాలలో ఆరుద్ర చాలా మంది 19వ శతాబ్ది కవుల గురించి, అక్కడక్కడా వారి కావ్యాలలోని ఒకటి, రెండు పద్యాలను ఉటంకిస్తూ, వారి కవిత్వ పరిచయం చేసారు.

కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ 'తెలుగు సాహిత్య చరిత్ర'ను ఈ క్రింది విధంగా విభజించారు –

1. ప్రాఙ్నన్నయ యుగం; 2. నన్నయ యుగం; 3. శివకవి యుగం; 4. తిక్కన యుగం; 5. ఎఱ్ఱన యుగం; 6. శ్రీనాథ యుగం; 7. రాయల యుగం; 8. దక్షిణాంధ్రయుగం; 9. క్షీణయుగం; 10. ఆధునిక యుగం.

ఐదో సంపుటంలో 19వ శతాబ్ది అంతం వరకు వివరించబడింది. ఇది 1999లో వెలువడింది. మరి 20వ శతాబ్ది సాహిత్య చరిత్ర (ఆధునిక యుగం), ఆరవ సంపుటంగా భావిలో వెలువడుతుందేమో! ఐదో సంపుటంలో కొర్లపాటి వారు 17, 18, 19 శతాబ్దులను ఒక యుగంగా చేర్చి, దానికి పింగళి లక్ష్మీకాంతం గారి బాటలో క్షీణయుగమని పేరు పెట్టారు. అయితే లక్ష్మీ కాంతంగారు కుదించిన క్షీణయుగాన్ని ఈయన మళ్ళీ పెద్దదిగా చిత్రించారు. 19వ శతాబ్దిని అందులో చివరి అంకంగా పొందు పరిచారు. అయితే కొర్లపాటివారు చాలామంది 19వ శతాబ్ది కవులను పరిచయం చేసారని చెప్పవచ్చు.

ఆరుద్ర, కొర్లపాటి ఇరువురు కూడా 19వ శతాబ్దికి చెందిన చర్విత చర్వణ రీతిలో ఉన్న చాలా ప్రబంధాలను విశ్లేషిస్తూ, కొన్ని, కొన్ని నవ్య స్పర్శగల కావ్యాలను గురించి కూడా అక్కడక్కడా పరిచయం చేసారు. అయితే వీటికి వారంతగా ప్రాధాన్యం ఇచ్చినట్టు కనిపించదు. అక్కడక్కడా 'ఇది కొత్తదనం', 'ఇది ఇంతకు ముందు కనిపించదు' – అంటూ తేలిక మాటలతో సరిపుచ్చారు. దీనికి కారణం వీరి దృష్టిలో 19వ శతాబ్ది క్షీణయుగంలో భాగమన్న ముద్ర ఉండడమే అని స్పష్టంగా గ్రహించవచ్చు. అయితే, వీరిరువురూ కూడా కొన్ని నలిగిన బాటలోనే నడచిన ప్రబంధాలలో కూడా కవిత్వం బాగుంటే ప్రశంసించడం గమనార్హం. కాని నవ్య స్పర్శ గల కావ్యాలను నవ్యతా దృష్టితో పరిశీలించడం కాని, 20వ శతాబ్దిలోని ఆధునిక కావ్యాలతో వాటిని తులనాత్మక అధ్యయనం చేయడం గానీ, 19వ శతాబ్ది నవ్య స్పర్శ గల కావ్యాల ప్రభావం భావిలో ఎలా ప్రసరించింది అన్న అంశాలపై గాని వారు దృష్టి సారించిన దాఖలాలు గాని అగుపించవు. 19వ శతాబ్దిలో వచ్చిన సామాజిక, రాజకీయ, సాంకేతిక పరిణామాల ప్రభావం ఆ శతాబ్ది కావ్యాలపై ఎలా పని చేసాయన్న అధ్యయనం కూడా కనిపించదు. 19వ శతాబ్ది క్షీణ యుగాంతర్భాగం అన్న ముద్ర, 20వ శతాబ్దిలోనే నవ్యయుగం అంకురించిందన్న భావన, కించిత్తు రస పక్షపాతం – వారిని, భావి నవ్య సాహిత్య మహావృక్షానికి బీజాలుగా నిలిచిన 19వ శతాబ్ది కావ్యాల ఔన్నత్యాన్ని గుర్తించకుండా చేసాయని చెప్పవచ్చు.

డా. ముదిగంటి సుజాతారెడ్డి గారు రచించిన 'తెలుగు సాహిత్య చరిత్ర'లో యుగ విభజన కవుల పేరిటనే జరిగింది. ఈమె పట్టు సడలకుండా ఇదే పద్ధతిని చివరి వరకు పాటించడానికి ప్రయత్నించడం అంతకు ముందు చరిత్రకారుల కన్న విలక్షణంగా ఉంది. ఆమె – 1. ప్రాఙ్నన్నయయుగం; 2. నన్నయ యుగం; 3. నన్నయ, తిక్కనల మధ్య యుగం; 4. తిక్కన యుగం; 5. ఎఱ్ఱన యుగం; 6. శ్రీనాథ యుగం; 7. శ్రీకృష్ణ దేవరాయల యుగం; 8. రఘునాథ నాయక యుగం; 9. వీరేశలింగ యుగం; 10. కృష్ణశాస్త్రి యుగం; 11. శ్రీశ్రీ యుగం – అని విభజించారు. అయితే శివకవుల యుగంగా ప్రసిద్ధి చెందిన 12వ శతాబ్దిని – 'నన్నయ, తిక్కనల మధ్య యుగం' అని 'కాలం' ఆధారంగా యుగ నిర్ణయం చేసినా, నన్నయ, తిక్కనల పేర్లు కనిపించగానే, పాఠకుడు తొందరలో ఆ విషయాన్ని

గ్రహించకుండా, కవుల పరంగానే ఈ విభజన కూడా ఉందని భ్రమిస్తాడు. బహుశః సుజాతారెడ్డిగారు కూడా ఇలాగే భావించి ఉంటారు.

సుజాతారెడ్డిగారిని ముఖ్యంగా అభినందించవలసిన విషయం ఏమిటంటే, ఆమె 19వ శతాబ్దిని క్షీణ యుగమని, లేక కుంఫిణీ, జమీందార్ల యుగమని కాకుండా 'వీరేశలింగ యుగం' అని ఆనాటి వైతాళికుని పేరుతో పేర్కొనడం. "ఆధునిక యుగానికొచ్చేసరికి వీరేశలింగం, కృష్ణశాస్త్రి గార్ల పేర్లతో యుగాలను నిర్దేశించడం ఈవిడ చూపిన విలక్షణ దృక్పథం"[12] అని ప్రశంసించారు డా. సి. నారాయణరెడ్డిగారు. అయితే ఈమె వ్రాసింది చాలా సంక్షిప్త చరిత్ర. ఈ అధ్యాయంలో ఆమె ఆశయం మేరకు సగం పుటలలో సామాజిక నేపథ్యాన్ని వివరించి, ఆ పైన పుటలలో కొంత మంది కవులు, వారి కావ్యాల పేర్లు చాలా క్లుప్తంగా తెలియజేసారు.

ఇటీవలే వచ్చిన మరొక 'తెలుగు సాహిత్య చరిత్ర'ను ద్వా. నా. శాస్త్రి గారు రచించారు. ఇందులో ఆయన ఏ సాహిత్య చరిత్ర కారుడూ చేయనంత స్థూల విభజన చేసి ఆశ్చర్యం కలిగించారు. ఆయన కేవలం రెండే రెండు భాగాలుగా సాహిత్య చరిత్రను విభజించారు. ఒకటి – ప్రాచీన సాహిత్యం; రెండు – ఆధునిక సాహిత్యం. ఈ స్థూల విభజనలో మళ్ళీ అనేక అధ్యాయాలు రచించారు. అవి కొన్ని కవుల గురించి, మరి కొన్ని ప్రక్రియలు, వాదాల గురించి ఉన్నాయి. ప్రాచీన సాహిత్య విభాగంలో చివరలో 'ఆంధ్ర సంస్థానాలు – సాహిత్య పోషణ' అన్న అధ్యాయంలో మాత్రం చాలా క్లుప్తంగా కేవలం, నాలుగు పుటలలో 19వ శతాబ్ది గురించి, ఆనాటి కొందరు కవులు, వారి కావ్యాల పేర్లు ఉటంకిస్తూ పరిచయం చేసారు. ఏమైనా, 19వ శతాబ్ది నాటి కావ్యాల గురించి, వాటిలోని నవ్యత గురించి ద్వా.నా. శాస్త్రిగారు పరిశీలించింది ఏమీ లేదు.

'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము' పేరిట ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు రచించిన గ్రంథంలో 16,17,18 శతాబ్దులను ఉషఃకాలముగా, 19వ శతాబ్ది పూర్వార్ధాన్ని బ్రౌణ్యయుగంగా, 19వ శతాబ్ది ఉత్తరార్ధాన్ని వీరేశలింగ యుగంగా పేర్కొన్నారు. ఆ రకంగా అందరికన్నా ఎక్కువగా, 19వ శతాబ్ది కవిత్వంలోని నవ్యతను ముఖ్యంగా ఇంగ్లీషు ప్రభావ దృష్టితో విపులంగా చర్చించిన పరిశోధకులు, విమర్శకులు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు అని చెప్పవచ్చు. అంతేకాదు 19వ శతాబ్దిని బ్రౌణ్య, వీరేశలింగయుగాలుగా విభజించి, అంతకు ముందు మూడు శతాబ్దులను 'ఉషః కాలము'గా పేర్కొని కొత్తపల్లి వారు 19వ శతాబ్దికి ప్రత్యేక గౌరవాన్ని, గుర్తింపును కొని తెచ్చారు. ఆ విషయంలో కొత్తపల్లి వారు యండమూరి సత్యనారాయణరావు గారి కంటె ముందంజలో ఉండి అభినందన పాత్రులయ్యారు. ఈయన మతుకుమల్లి నరసింహ శాస్త్రి రచించిన 'చెన్నపురీ విలాసము;' వావిలాల వాసుదేవ శాస్త్రి రచించిన 'సీజరు చరిత్రము', గురజాడ శ్రీరామమూర్తి రచించిన వెనిసు వణిజ నాటకము ఇత్యాదుల గురించే కాకుండా, వీరేశలింగం పంతులుగారి అనేక రచనలపై సమగ్ర పరిశీలన జరిపారు. అయితే ఈయన దృష్టి కేవలం కవిత్వానికే పరిమితం కాక పోవడం వల్ల నవల, కథ, వచన నాటకాలు, శాసనాలు, పత్రికలు – ఇలా అనేక రంగాలపై ఆంగ్ల భాషా ప్రభావాన్ని చర్చించారు. అందువల్ల నవ్య కావ్యాల పరిశీలనకు కొంత పరిమితిని విధించుకోవలసి వచ్చింది. అంతే కాకుండా ఆయన నవ్యతా పరిశీలన కేవలం ఇంగ్లీషు భాషా ప్రభావ దృష్టితోనే సాగింది.

మొత్తానికి ఇన్ని సాహిత్య చరిత్రలలో దేనిలోనూ, 19వ శతాబ్ది తెలుగు సాహిత్యానికి సరైన న్యాయం జరుగలేదనే చెప్పాలి. అయితే కొంతలో కొంత ఆరుద్ర, కొర్లపాటి 'చరిత్రలు' నయమని అంగీకరించాలి. అయినా అవి కూడా లక్ష్మీకాంతం గారి 'క్షీణ యుగ' ముద్రకు వత్తాసు పాడినవే గాని, ఆ ముద్రను చెరిపే ప్రయత్నం చేయలేకపోయాయి. ఇవి యండమూరి సత్యనారాయణరావుగారి 'ఉషః కిరణాలు' గ్రంథం వెలువడ్డాకే వచ్చినా, ఆయన ప్రతిపాదించినట్లుగా, 19వ శతాబ్ది – రాబోయే నవ్య సాహిత్య యుగానికి ముందు ఉషఃకాలమన్న సిద్ధాంతానికి మద్దతు పలుకలేదు. యండమూరి సత్యనారాయణ రావుగారి ఆవేదన ఆవేదనగానే మిగిలింది.

తెలుగు సాహిత్యంలో విమర్శ ప్రక్రియ 19వ శతాబ్దిలోనే అవతరించిందని ఆచార్య ఎస్వీ రామారావుగారు పేర్కొన్నారు. ఆయన అంటారు – "తెలుగు సాహితీ సుక్షేత్రమునందు విమర్శనా స్రవంతిని అవతరింప జేసిన భగీరథుడు కందుకూరి వీరేశలింగం పంతులు. తొలి తెలుగు విమర్శనా గ్రంథమును వెలయించిన కీర్తి మూర్తి ఆయన. పంతులుగారు రచించిన 'విగ్రహతంత్ర విమర్శనము' 1876లో

వివేక వర్ధని పత్రిక యందు వెలువడినది. ఆంధ్ర వాఙ్మయమున వెలసిన ప్రప్రథమ సాహిత్య విమర్శనా గ్రంథమిదియే." కందుకూరి వారు రచించిన 'సరస్వతీ నారద విలాపము' సమకాలీన సాహిత్య విమర్శనార్థం రచించిన లఘు కావ్యం అన్నది సుస్పష్టం. "కందుకూరి సమకాలీనులైన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రి. గురజాడ అప్పారావు ప్రభృతులు నాడు విమర్శ రంగమును సుసంపన్నము గావించిరి"[13] అని ఎస్వీ రామారావుగారు పేర్కొన్నారు.

అలా, తెలుగు సాహిత్యం 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఆత్మ విమర్శనం చేసుకొనే స్థాయికి ఎదిగిందంటేనే, అంతకు కొంత కాలం ముందే, తెలుగు కవి పండితులు నవ్యంగా ఆలోచించడం ప్రారంభించారని నా అభిప్రాయం. ఆ విధంగా చూసినా 19వ శతాబ్దిని క్షీణ యుగంగా చూడడం భావ్యం కాదని నా భావన. కాని ఈనాటికీ 19వ శతాబ్దిని చాలా మంది సాహితీవేత్తలు క్షీణయుగంగానే భావించడం శోచనీయం.

దీనికి ప్రధానంగా వివిధ సాహిత్యకారులు తమ యుగ విభజనలలో అనుసరించిన పద్ధతులు కూడా ఒక కారణమని చెప్పాలి. వీటిలో ఏ పద్ధతి కూడా 19వ శతాబ్ది సాహిత్యాన్ని సమగ్రంగా, నిర్దిష్టంగా అధ్యయనం చేసేందుకు అనుకూలంగా లేదు. అయినా, వీటిలో ఏ పద్ధతి కూడా పరిపూర్ణమైనదని చెప్పలేము. ప్రతి పద్ధతిలో కూడా ఏదో ఒక పరిమితి ఉంది. కవులను బట్టి చేసే విభజనలో ఒకటి రెండు యుగాలలో, యుగకర్తగా పేర్కొనదగిన కవి కనిపించక, వేరే మార్గాన్ని అనుసరించడమో, లేక యుగకర్త స్థాయి లేని కవిని యుగకర్తగా పేర్కొనడమో జరుగుతుంది. కవి పోషకులను బట్టి చేసే విభజనలో కొన్ని యుగాలలో ఆ స్థాయి పోషకుడు లేకున్నా, ఎవరో ఒకరికి పెద్ద పీట వేయడమో, లేక అన్య మార్గాన్ని వెదుక్కోవడమో జరుగుతుంది. అలాగే మిగితా పద్ధతులలో కూడా ఇలాగే పరిమితులున్నాయి.

ఇలాంటి యుగ విభజనల వల్ల నిజానికి సాహిత్య చరిత్ర పరిణామాన్ని, ప్రస్థానాన్ని నిర్దిష్టంగా వివరించలేము. ఏ యుగంలోనైనా కేవలం సమకాలీన సామాజిక రాజకీయ పరిస్థితులే సాహిత్యాన్ని ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు – శివ, కేశవ వైరుధ్యం ప్రబలి ఉన్నప్పుడు హరిహరనాథ తత్త్వం ప్రబోధిస్తాడు తిక్కన. ప్రజలు భోగ భాగ్యాలతో తులతూగుతున్నప్పుడు శృంగార ప్రబంధాలు వెలువడుతాయి. 'కన్యాశుల్కం' దురాచారం ప్రబలి ఉన్నప్పుడు 'కన్యాశుల్కం'వంటి నాటకాన్ని రచించడం జరుగుతుంది. అలాగే 'నిజాం' వంటి నిరంకుశ పాలకులకు వ్యతిరేకంగా పోరాటం జరుగుతున్నప్పుడు కాళోజి, దాశరథి వంటి కవులు ఉద్యమ కవిత్వాన్ని విరచిస్తారు. ఈ విషయం గుర్తెరిగి సాహిత్య చరిత్రను రచించిన ఆరుద్ర, కొర్లపాటి, ముదిగంటి సుజాతారెడ్డి ప్రభృతులు కూడా యుగ విభజన విషయానికి వచ్చేసరికి పాత పద్ధతులనే అనుసరించారు. కారణం –సామాజిక, రాజకీయ పరిస్థితులను విభజించి, వాటి ఆధారంగా యుగ విభజన చేయడం అసాధ్యం.

కాలాయ నమః. కాలాన్ని బట్టి సామాజిక రాజకీయ పరిస్థితులు మారుతుంటాయి. ఆ పరిస్థితులే ప్రజల, పాలకుల మానసిక స్థితిగతులను నిర్దేశిస్తాయి. ఆ స్థితి గతులను బట్టి కవి పోషకుల సాహిత్యాభిరుచులుంటాయి. వారిని బట్టి కవుల రచనలుంటాయి. ఆ కవులను బట్టి వివిధ ప్రక్రియలు, కవితా లక్షణాలు రూపొందుతాయి. ఇంతవరకు వచ్చిన సాహిత్య చరిత్రలలో, కాలాన్ని ఉపేక్షించి, దాని ప్రభావంతో ఏర్పడ్డ తరువాతి ఫలితాలతో ప్రమేయం గల – కవి పోషకులను, కవులను, ప్రక్రియలను, సాహిత్య లక్షణాలను ఆధారంగా చేసుకొని యుగ విభజనలు చేసారు. కాని వీటన్నిటికీ మూలమైన కాలాన్ని బట్టి యుగ విభజన చేసినవారు లేరు – ఒక్క వీరేశలింగం పంతులు గారు తప్ప. అయితే ఆయన విభజన – 1. ప్రాచీన కవులు (క్రీ.శ. 1100–1500); 2. మధ్యయుగం కవులు (క్రీ.శ. 1500–1650); 3. ఆధునిక కవులు (క్రీ.శ. 1650–1900) అంటూ మరీ స్థూలంగా ఉండి, సూక్ష్మాధ్యయనానికి అవకాశమీయక సమంజసంగా తోచదు. పైగా ఆయన చేసిన కాల విభజన ఆనాటికి తగింది గానీ, ఈనాటి కాలానికి అది ఔచిత్యం కోల్పోయింది.

కాబట్టి, ఆధునిక దృష్టితో తెలుగు సాహిత్య చరిత్ర యుగ విభజన కాలం ఆధారంగా, సూక్ష్మ రీతి అధ్యయనానికి అవకాశమిచ్చేలా ఇలా ఉండటం సముచితం.

1. పదకొండవ శతాబ్దికి పూర్వం తెలుగు సాహిత్యం.
2. పదకొండవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

3. పన్నెండవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

4. పదమూడవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

5. పద్నాలుగవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

6. పదిహేనవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

7. పదహారవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

8. పదిహేడు, పద్దెనిమిదవ శతాబ్దుల తెలుగు సాహిత్యం.

9. పందొమ్మిదవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

10. ఇరువయ్యవ శతాబ్ది తెలుగు సాహిత్యం.

ఇలా-ప్రతి శతాబ్ది సాహిత్యాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేస్తూ కొనసాగించవచ్చు. ఈ రకమైన యుగ విభజన వల్ల ఈ క్రింది లాభాలున్నాయి.

1. ప్రతి శతాబ్దిలో మారుతున్న సామాజిక, రాజకీయ పరిస్థితులకనుగుణంగా సాహిత్య పరిణామాన్ని చక్కగా విశ్లేషించే అవకాశం ఉంటుంది.

2. సాహిత్య చరిత్రాధ్యాయులకు కాలానుగుణంగా సాహిత్యంలో వచ్చిన మార్పులపై కూలంకషమైన అవగాహన ఏర్పడుతుంది.

3. అనవసరంగా ఏ కాలంలోనూ, ఏ కవికీ, లేక కవి పోషకునికీ పెద్దపీట వేయవలసిన పని లేదు.

4. ఒకరి కంటె ఎక్కువ మంది గొప్ప కవులు లేక కవి పోషకులు ఉన్నప్పుడు, అనవసరంగా ఇతరులను తక్కువ చేయవలసిన పని లేదు. ఉదాహరణకు 'శ్రీనాథయుగం' అనడం వల్ల పోతనను తక్కువ చేసినట్లే గదా!

5. కొన్ని ప్రక్రియలు లేదా లక్షణాలలో కావ్యాలు విరివిగా వెలువడుతుంటే, వాటి పేరుతో యుగ నామాలుంచితే, ఇతరప్రక్రియలను ఉపేక్షించే అవకాశముంటుంది. కాలాన్ని బట్టి యుగ విభజన చేస్తే అలాంటి ఆస్కారం ఉండదు.

6. ఒకే రకంగా వెలువడుతున్న కావ్యాల సంఖ్యాబలాన్ని బట్టి యుగ నిర్ణయం జరుగక, సాహిత్యంలో వస్తున్న కొత్త పోకడలను కూడా గమనించే అవకాశం ఉంటుంది.

7. ప్రతి శతాబ్దిని, ఆ శతాబ్దిలోని ఉత్తమోత్తమ కవులు, వారి కావ్యాలతో గుర్తించవచ్చు.

8. అనవసరంగా, ఒక కాలానికి క్షీణ యుగమని లేక వైభవోపేత యుగమని, సాహిత్య చరిత్రకారుల స్వాభిప్రాయాలను రుద్దే అవకాశం ఉండదు.

9. సాహిత్య చరిత్రకారుడు ఒక కవి లేదా పోషకునిపై గల ప్రత్యేక అభిమానంతో ఆ యుగాన్ని అతని పేర దత్తం చేసే అవకాశముండదు.

10. ప్రతి భాగంలో ఒక నిర్దిష్టమైన కాల పరిమితిలోని సాహిత్యాన్ని చక్కగా విశ్లేషించే అవకాశముంటుంది.

11. ఒక నిర్దిష్టమైన కాల పరిమితిలోని సాహిత్య మూల్యాలతో, మరొక నిర్దిష్టమైన కాల పరిమితిలోని సాహిత్య మూల్యాలను పోల్చి, తులనాత్మక అధ్యయనం చేసే అవకాశముంటుంది.

12. శాస్త్రీయ పద్ధతిలో నిర్దిష్ట కాల పరిమితులలో తులనాత్మకంగా కవుల సంఖ్య, కావ్యాల సంఖ్య పెరుగుదల, తరుగుదలల అధ్యయనం చేసే అవకాశముంటుంది.

13. శాస్త్రీయ పద్ధతిలో నిర్దిష్ట కాల పరిమితులలో తులనాత్మకంగా సాహిత్య ప్రమాణాలు, స్థాయి, ఔన్నత్యాల పెరుగుదల, తరుగుదలల అధ్యయనం చేసే అవకాశం ఉంటుంది.

14. ప్రతి శతాబ్ది సాహిత్యంపై, అంతకు ముందు శతాబ్ది సాహిత్య ప్రభావాన్ని, తరువాతి శతాబ్ది సాహిత్యానికి – ఆ శతాబ్ది సాహిత్యం అందించే ప్రేరణను అంచనా వేయ గలిగే అవకాశముంటుంది.

15. ఒక శతాబ్దిలోని ఉత్తమ కవులను, రచనలను సులభంగా జల్లెడపట్టి

గుర్తించవచ్చు.

16. భావిలో కవులు, కావ్యాల కాలాలను గురించి వాదోపవాదాలు చెలరేగే అవకాశానికి తావీయదు.

కావున ఆగామి కాలంలో, శతాబ్దుల పరంగా యుగ విభజన చేసి ప్రతి శతాబ్ది సాహిత్యాన్ని ఒక ప్రత్యేక సంపుటంలో ఆయా శతాబ్దుల సామాజిక, రాజకీయ పరిస్థితుల కనుగుణంగా విశ్లేషిస్తూ, ప్రతి శతాబ్ది సాహిత్యానికి పరిపూర్ణ న్యాయం జరిగేలా ఒక సమగ్ర సాహిత్య చరిత్ర వెలయగలదని ఆశిద్దాం. ఇప్పటికే 'పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం' వారు '20వ శతాబ్ది తెలుగు సాహిత్యం' అన్న ఒక గ్రంథాన్ని కె. రామమోహన రాయ్‌గారిచే వ్రాయించి, వెలువరించి ఆ దిశలో అడుగులు కదుపడం ముదావహం. యుజిసి ప్రాజెక్టు క్రింద, ఉస్మానియా విశ్వవిద్యాలయ పూర్వ సాహిత్యాచార్యులు, సుప్రసిద్ధ విమర్శకులు ఆచార్య ఎస్వీ రామారావుగారు '20వ శతాబ్ది తెలుగు కవిత్వం' అన్న అంశంపై ఒక సమగ్రమైన పరిశోధన జరుపడం మరింత ఆనందదాయకం.

**పాదసూచికలు :**

1. డా. కె. రామ్మోహనరాయ్ : ఆంధ్ర సాహిత్య చరిత్ర (ద్వితీయ ముద్రణ : 1996) పుట. 4
2. పింగళి లక్ష్మీకాంతం : ఆంధ్ర సాహిత్య చరిత్ర
3. యండమూరి సత్యనారాయణరావు : ఉషః కిరణాలు (1960) పుట. 116
4. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (తొమ్మిదో సంపుటం : 1990) – అనుబంధం 3 పుట. 330
5. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (తొమ్మిదో సంపుటం : 1990) – అనుబంధం 3 పుట. 331
6. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (తొమ్మిదో సంపుటం : 1990) – అనుబంధం 3 పుట. 332
7. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (తొమ్మిదో సంపుటం : 1990) – అనుబంధం3 పుట. 340
8. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (తొమ్మిదో సంపుటం : 1990) – అనుబంధం3 పుట. 345
9. యండమూరి సత్యనారాయణరావు : ఉషః కిరణాలు (1960) 'అంధయుగమా? సంధియుగమా?' అధ్యాయం – పుట. 11
10. సురవరం ప్రతాపరెడ్డి : ఆంధ్రుల సాంఘిక చరిత్ర – (ఓరియంట్ లాఙ్మన్ ప్రచురణ : 1996) అనుబంధము 2 పుట. 360
11. ఆరుద్ర: సమగ్రాంధ్ర సాహిత్యం – మొదటి సంపుటం (ద్వితీయ ముద్రణ : 1990)లో 'మనవి మాటలు' – పుట. 6
12. డా. ముదిగంటి సుజాతారెడ్డి: చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర (1996) – అభిప్రాయం : సినారె – పుట. 111
13. డా. ఎస్వీ రామారావు – తెలుగులో సాహిత్య విమర్శ – పుటలు 103 & 110

అ



4

# 19వ శతాబ్దిలో సామాజిక, రాజకీయ పరిస్థితులు



ఒక్కసారి వాగ్గేయకారుడు త్యాగరాజు జీవితకాలం నాటి ఆంధ్ర దేశాన్ని ఊహించండి – ఆంధ్ర దేశాన్ని అనేక భాగాలుగా చేసుకొని ఎందరో రాజులు, సంస్థానాధీశులు పాలిస్తున్న కాలం. విద్యాభ్యాసానికి సనాతన సంప్రదాయ పరంపరగా వస్తున్న గురుకులాలు. బోధన సంస్కృతాంధ్రాలలోని కావ్యాలే. కావ్య రచనలు తాళ పత్ర గ్రంథాలలో. స్త్రీలకు విద్యావకాశాలు మృగ్యం. ప్రజలలో భగవద్భక్తి, నగర సంకీర్తనలు, పురుషుల తలలపై కొప్పులు, పిలకలు. మతపరమైన నమ్మకాలు, భగవంతుని మహిమలపై విశ్వాసం, స్త్రీలు – పతియే ప్రత్యక్ష దైవంగా భావించే సాధ్వీమణులు. ప్రాచీన సంప్రదాయ వస్త్రధారణ, కాస్త వయసు మీరగానే ప్రాపంచిక విషయాలకన్న మోక్షసాధన పట్ల ఆసక్తి. ఇవన్నీ తలచుకొంటే ఏదో ఒక ప్రాచీనకాలానికి సంబంధించిన చిత్రం మన కళ్ళలో మెదులుతుంది.

ఇప్పుడొక్కసారి సంఘసంస్కర్త, సాహితీవేత్త కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవిత కాలంలో ఆంధ్ర దేశాన్ని ఊహించండి –

విస్తరించిన ఆంగ్లేయుల పాలన, విద్యాభ్యాసానికి ఆధునిక పాఠశాలలు, కళాశాలలు. ఆధునిక విశ్వవిద్యాలయాల ఆవిర్భావం, ఆంగ్ల భాషా బోధన, విజ్ఞాన గణిత శాస్త్రాల ప్రాధాన్యం, అచ్చు పుస్తకాలు, సంఘ సంస్కరణోద్యమాలు, మీటింగులు, ఉపన్యాసాలు, స్త్రీలకు కూడా విద్య అవసరం అన్న భావనకు అంకురార్పణ, పత్రికా ప్రచురణలు, స్త్రీలకు ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తించేందుకు సంస్కర్తల ప్రయత్నాలు, పురుషులలో ఆధునిక వస్త్ర, వేషధారణల పట్ల ఆకర్షణ, హేతువాద దృక్పథం, ప్రాపంచిక విషయాలపై ఆసక్తి, సంఘంలో పలుకుబడికై ఆరాటం, తెల్ల దొరలతో పరిచయాలు, ఆంగ్ల సమాజ, సాహిత్య ప్రభావాలు – ఇవన్నీ తలచుకొంటే ఆధునిక కాలంలోని ప్రథమ చరణానికి చెందిన చిత్రం కళ్ళకు కడుతుంది.

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే త్యాగరాజు పరమపదించింది క్రీ.శ. 1846లో. వీరేశలింగం పంతులు జన్మించింది క్రీ.శ. 1848లో.[1] ఈ రెంటికి నడుమ తేడా కేవలం రెండు సంవత్సరాలే. ఇది చాలు – 19వ శతాబ్దిలో ఎంత త్వరగా పెను మార్పులు సంభవించాయో తెలుసుకోవడానికి. అందుకే 19వ శతాబ్దిని ప్రాచీన కాలానికి ఆధునిక కాలానికి మధ్య సంధికాలంగా అంగీకరించక తప్పదు. అదే సంధితత్వం కొన్ని తెలుగు కావ్యాలలోనూ ప్రతిఫలించింది. ముఖ్యంగా 19వ శతాబ్ది ఉత్తరార్ధ సాహిత్యంలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ప్రతిఫలనాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే, 19వ శతాబ్దిలో తెలుగు దేశంలోని సామాజిక, రాజకీయ పరిస్థితులను సంపూర్ణంగా అధ్యయనం చేయాలి.

**పూర్వరంగం :–** క్రీ.శ. 1686లో మొగల్ పాదుషా ఔరంగజేబు, విశాల తెలుగు సామ్రాజ్యం – గోలకొండను ముట్టడించి, ఆఖరు నవాబు తానీషాను ఓడించి, దానిని తన సామ్రాజ్యంలో 'దక్కను సుబా'గా కలుపుకొన్నాడు. దానిని పాదుషా ప్రతినిధిగా పరిపాలన చేసేందుకు కమరుద్దీన్ ఆసఫ్‌జా నియమింపబడ్డాడు. దక్కను సుబాకు కొన్నాళ్ళు గోలకొండ రాజధానిగా ఉన్నా, తరువాత హైదరాబాదు రాజధాని అయింది. క్రీ.శ. 1707లో ఔరంగజేబు మరణించాక మొగల్ సామ్రాజ్యం బలహీనపడింది. దాంతో ఆసఫ్‌జా నామకార్థానికి మొగల్ సామంతుడుగా ఉన్నా, సర్వస్వతంత్రుడుగా దక్కను సుబాను పాలించుకోసాగాడు. దక్కను సుబాలో హైదరాబాదు (నేటి తెలంగాణ ప్రాంతం; కర్నాటకలోని రాయచూర్, గుల్బర్గా, బీదర్ జిల్లాలు; మరాఠ్వాడాలోని నాందేడ్, పర్భణి, ఔరంగాబాద్, ఉస్మానాబాద్ జిల్లాలు కలిపి) తో బాటు ఆర్కాటు, కర్నూలు, రాజమహేంద్రవరం, చికాకోలు నవాబుగిరీలు ఉండేవి. క్రీ.శ. 1766లో కుంఫిణీ వారితో కుదిరిన ఒడంబడిక ప్రకారం అప్పటి దక్కను సుబాదారు నిజామలీఖాను మూర్తిజాన్నగర్ (గుంటూరు), ముస్తఫానగర్ (కొండవీడు), ఏలూరు, రాజమహేంద్రవరం, చికాకోలు పరగణాలను

కుంఫిణీలకు కవులుకిచ్చాడు.[2] సంవత్సరానికి 9లక్షల రూపాయలు నిజామలీకి చెల్లించే ఒప్పందం మీద దాదాపు కోస్తా ప్రాంతమంతా కుంఫిణీలకు ధారాదత్తమయింది.

క్రీ.శ. 1799లో మైసూరు పాలకుడు, మహావీరుడు టిప్పు సుల్తాను మరణించడంతో, ఆ రాజ్యంలోని సుక్షేత్రమయిన మైసూరు నుండి కోయంబత్తూరు వరకు గల ప్రాంతం కుంఫిణీ పరమైంది. టిప్పుకు వ్యతిరేకంగా జరిపిన యుద్ధంలో తోడ్పడినందుకు కుంఫిణీవారు నిజామలీఖానుకు బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను ఇచ్చారు. కాని ఒకటి, రెండు సంవత్సరాలలోనే నిజాముకు సైనిక సహాయం అందిస్తున్న నెపంతో ఆ జిల్లాలను మళ్ళీ కుంఫిణీవారు దత్తం చేసుకొన్నారు. అందుకే ఆ జిల్లాలకు 'దత్త మండలాలు' అని పేరు వచ్చింది.[3] బళ్ళారి జిల్లా ఈనాడు కర్నాటకలో చేరింది. ఆనాటి ఆర్కాటు ప్రాంతంలోని చిత్తూరు జిల్లాను, మిగిలిన అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలతో కలిపి ఇప్పుడు మనం 'రాయల సీమ'గా వ్యవహరిస్తున్నాం. ఆ విధంగా 19వ శతాబ్ది ప్రారంభం (క్రీ.శ. 1800) నాటికి కోస్తా, రాయల సీమ ప్రాంతాలు మొత్తం ఆంగ్లేయుల వశమై, తెలంగాణ ప్రాంతం మాత్రం ఆసఫ్జా (నిజాము) పాలకుల పరిపాలనలో నిలిచింది.

### 19వ శతాబ్దిలో తెలంగాణ ప్రాంతం :

19వ శతాబ్ది ఆరంభం నుండి అంతం వరకు కూడా, తెలుగు దేశం రెండు ముక్కలై హైదరాబాదు (తెలంగాణ) ప్రాంతం నిజాముల పాలనలో; రాయలసీమ, కోస్తా ప్రాంతాలు ఆంగ్లేయుల అధీనంలో ఉన్నాయి. రెండు ప్రాంతాల్లోనూ తెలుగు వాళ్ళు బానిసలుగానే బ్రతికినా రెండింటికీ ఎంతో తేడా ఉంది. నిజాము ప్రాంతీయులు ఉరుదూ భాషా ప్రాబల్యంతో, కోస్తా, రాయలసీమ ప్రాంతాల్లోని తెలుగు వాళ్ళలా భాషా స్వాతంత్ర్యాన్ని అనుభవించలేకపోయారు. అంత మాత్రాన నిజాము ప్రాంతంలో 19వ శతాబ్దిలో తెలుగు భాషా సాహిత్యం వెలువడలేదని కాదు. నిజాము పాలనా పరిధిలోని తెలుగు సంస్థానాధీశులు ముఖ్యంగా, ఆత్మకూరు, ఆనెగొంది, గద్వాల, జటప్రోలు, దోమకొండ, పాపన్నపేట, పాల్వంచ, బోరవెల్లి, వనపర్తి, సురపురం సంస్థానాధిపతులు ఎందరో తెలుగు కవులను ఆదరించి, అపారమైన సాహిత్య పోషణం చేశారు.[4] గద్వాల, వనపర్తి సంస్థానాధీశులయితే అచ్చు యంత్రాలను కూడా ఏర్పాటు చేసి అనేక కావ్యాలను ముద్రింపించారు.[5] అయితే నిజాము పరిపాలనంలో, బ్రిటిష్ పరిపాలనంలో వచ్చినంత, ఆధునిక విద్యాసంబంధ, శాస్త్ర సాంకేతిక సంబంధ చైతన్యం, పరిణతి లేకపోవడం వలన 19వ శతాబ్దిలో ఇక్కడి సాహిత్యాన్ని కొత్త పుంతలు తొక్కించే ఆస్కారం ఈ ప్రాంతం కవులలో కొరవడింది.

దీనికి ప్రధాన కారణం – నిజాము ప్రభువులు స్వీయ సుఖభోగాలను అనుభవించడమే గాని, ప్రజా సంక్షేమాన్ని అంతగా పట్టించుకొనేవారు కాదు. క్రీ.శ. 1830 ప్రాంతంలో ఏనుగు వీరాస్వామయ్య అనే వ్యక్తి చెన్నపట్నం నుండి కాశీయాత్రకు బయలు దేరాడు. ఆయన ఈ యాత్రలో భాగంగా జూన్ 21, 1830 నుండి ఆగస్టు 9, 1830 వరకు నిజాము రాజ్యంలో ప్రయాణించాడు. ఆయన యాత్రానుభవాలను 'కాశీ యాత్రా చరిత్ర' పేరిట ఒక యాత్రా చరిత్రంగా వెలయించాడు. ఇది "తెలుగులో వెలువడిన సర్వ సమగ్రమయిన తొలి యాత్రా చరిత్ర"[6] అని ఆచార్య సి. నారాయణరెడ్డిగారు వ్యాఖ్యానించారు. 19వ శతాబ్దికి చెందిన తెలంగాణ పరిస్థితులను వీరస్వామయ్య చాలా వివరంగా తెలియజేసారు.

ఆ సంగతులన్నీ చదివితే ఈ క్రింది విషయాలు అవగతమవుతాయి.

1. నిజాము రాజ్యంలో జమీందారుల నడుమ తరచుగా విద్వేషాలు చెలరేగడం వలన ప్రజలకు శాంతిభద్రతలు కరువయ్యేవి. ఇరువురు జమీందారుల జగడంలో న్యాయం చెప్పవలసిన నిజాము ప్రతినిధి అయిన దివాన్ వారి మధ్య ద్వేషాలను పెంచి, వేడుక చూస్తూ, అటు నుండి, ఇటునుండి డబ్బులు గుంజేవాడు.
2. జమీందారులకు కోటలు, బురుజులు గట్టిగా, ఘనంగా కట్టుకోడంపై ఉన్న ఆసక్తి ప్రజాబాహుళ్యానికి, రైతులకు ఉపయోగపడే బావులను, చెరువులను తవ్వించడంపై ఉండేది కాదు. స్వీయ సుఖభోగాలే కాని ప్రజా సంక్షేమం పట్టేది కాదు.
3. గ్రామ ప్రాంతాల్లోని జమీందారులు దేవాలయాల పోషణే పెద్ద ఘనకార్యంగా భావించేవారు.

4. నగరంలో దేవాలయాల కన్న మసీదులు, దర్గాలు ఎక్కువగా ఉండేవి. తెలుగు భాషలో ఉర్దూ పదాలు ఎక్కువగా దొర్లేవి.

5. సాధారణ ప్రజలు, ఆయుధ పాణులైన దౌర్జన్యకారుల వలన నిత్యము భయభ్రాంతులై జీవించేవారు. రైతుల పంటలు దోపిడీకి గురయ్యేవి. రైతులు పంటలు వేసుకోడానికే భయపడేవారు. ప్రయాణికులు, వర్తకులు తమ రక్షణార్థం స్వంతంగా కొంత సిబ్బందిని ఉంచుకోవల్సిన పరిస్థితి ఉండేది.

6. కూరగాయలు, ఫలాల ధరలు ఆకాశాన్నంటేవి. సామాన్యుల జీవనం దుర్భరంగా ఉండేది.

7. ప్రజలు నిజాము రాజ్యం బయట, ఆంగ్లేయుల పాలనలో ఉన్న ప్రాంతాల్లోని సమాజంలో వస్తున్న పెను మార్పులతో ఏ మాత్రం సంబంధం లేకుండా బావిలో కప్పల్లాగా బ్రతుకుతుండేవారు.

ఇలాంటి పరిస్థితులలో అభిరుచి గల కొందరు జమీందారుల పరిపాలనలో మాత్రమే భాషా సాహిత్యాలు పరిఢవిల్లే అవకాశం ఉంది. ఆంగ్లేయులతో పోలిస్తే, వీరి పాలనలో ఆధునికాభివృద్ధి, ఆర్థిక పురోగతి, శాంతి భద్రతలు అధ్వాన్నంగా ఉండడం వలన ప్రజలు సాహిత్యోన్ముఖులు అయ్యే అవకాశం తక్కువ. ఎక్కడో ఒక చోట జమీందారుల ఆదరణ ఉంటే, వారి అభిరుచి మేరకు, ఆ సాహిత్యం కూడా ప్రాచీన పద్ధతిలోనే సాగే అవకాశాలే మెండుగాని, కొత్త పుంతలు తొక్కే అవకాశాలు దాదాపుగా మృగ్యం. అయినప్పటికీ ఆత్మకూరు, గద్వాల, జటప్రోలు, దోమకొండ, పాపన్నపేట, పాల్వంచ, వనపర్తి వంటి సంస్థానాలలో జరిగిన సాహిత్య కృషి గణనీయమైనదని తెలుస్తున్నది.

అంతే కాకుండా, ఏ రాజాశ్రయం ఆశించకుండా ఆ రోజుల్లో తెలంగాణంలోని పల్లెల్లో ఆవహించి యున్న ఆధ్యాత్మిక తత్త్వం, భక్తి భావన కూడా చాలా మంది భక్త కవులను సృజించేందుకు దోహదం చేసాయన్నది నిర్వివాదాంశం. 19వ శతాబ్దిలో తెలంగాణ ప్రాంతంలో అనేక భక్తి శతకాలు వెలువడ్డాయనడానికి ఆధారాలున్నాయి. వరంగల్ మండలంలో రంగరాజు కేశవరావు, పరశురామ అనంతుల కవి, తూము రామదాసు, మాడభూషణం రంగాచార్యులు, ముదిగొండ శంకరారాధ్యులు, మరింగంటి లక్ష్మణ దేశికులు[7]; కరీంనగర్ మండలంలో పాత పాపయ శాస్త్రి, కాకుత్థ్సం శేషప్పకవి, కాకుత్థ్సం నరసింహదాసు, కృష్ణగిరి వేంకట రమణయ్య, గోవర్ధనం యామునాచార్యులు, ఖందేరావు రామారావు, సిరిశెనహళ్ శీనయ్య, సీతారామయతీంద్రులు, ఆచి రాఘవాచార్య శాస్త్రులు, జైశెట్టి రాజయ్య[8]; నిజామాబాదు మండలంలో గోవిందుల నింబగిరి శాస్త్రి, మఠం మడివ్యాళయ్య; నల్లగొండ జిల్లాలో మరింగంటి వేంకట రాఘవాచార్యులు, తిరువాయిపేట వేంకట కవి[9] మొదలయిన వారెందరో ఎన్నో భక్తి శతకాలను, స్తుతులను 19వ శతాబ్దిలో వెలయించినట్లు తెలుస్తున్నది. వీటిలో కాకుత్థ్సం శేషప్పకవి రచించిన 'నరసింహ శతకము', కాకుత్థ్సం నరసింహదాసుకవి రచించిన 'కృష్ణ శతకము' యావదాంధ్రంలో బహుళ ప్రసిద్ధినొందాయి.

'కృష్ణ శతకము' కర్తృత్వంలో కొన్ని సందేహాలున్నా, ఆ శతకకర్త, కరీంనగర్ జిల్లాకు చెందిన ధర్మపురి పుణ్యక్షేత్రంలో జీవించిన కాకుత్థ్సం నరసింహదాసని, ఆయన జీవించిన కాలం సుమారుగా క్రీ.శ. 1820 నుండి 1880 అని డా.మలయశ్రీ ఇటీవలే తమ 'కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్రలో ఆధారాలతో నిరూపించారు[10]. అలాగే శేషప్ప కవి కాలం గురించి కూడా కొంత సందిగ్ధం ఉంది. ధర్మపురి శేషాచల కవి అన్న వ్యవహార నామం గల ఈ కవి కాలాన్ని తెలుగు సాహిత్యకోశంలో క్రీ.శ. 1780 ప్రాంతంగా పేర్కొన్నారు. డా. మలయశ్రీ ఈయన 1750 ప్రాంతం వాడని అభిప్రాయ పడ్డారు. అయితే ఆయన క్రీ.శ. 1800 ప్రాంతంలో ధర్మపురి పుణ్యక్షేత్రంలో జీవించాడని, 'ఆంధ్ర శతక సాహిత్య వికాసము' సిద్ధాంత వ్యాసకర్త డా. కే గోపాలకృష్ణారావు పేర్కొన్నారు. ఇటీవల పావని సేవా సమితి వారు వెలువరించిన 'నరసింహశతకము' వ్యాఖ్యాన సహిత నవీన ముద్రణంలో వ్యాఖ్యాత విద్వాన్ డా. కసిరెడ్డి వెంకటపతిరెడ్డి కూడా ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[11] ఈ అభిప్రాయాన్ని ఆ పుణ్యక్షేత్రంలోని అత్యధిక పండితులు, ముఖ్యంగా ఆయన వంశీయులు అంగీకరిస్తున్నారు. మొత్తానికి ఈ కవి క్రీ.శ. 1750 – 1820 మధ్య జీవించి ఉండవచ్చని తెలుస్తున్నది. అయితే పరిణతి చెందిన ఆధ్యాత్మిక తత్త్వాన్ని, జీవితానుభవసారాన్ని రంగరించి కూర్చిన ఈ శతకాన్ని కవి తన జీవిత చరమాంకంలో అంటే 19వ శతాబ్ది ప్రథమ చరణంలో (క్రీ.శ. 1800 –1810 ప్రాంతంలో) రచించి ఉంటాడని భావించవచ్చు.

ఈ శతకంలో శేషప్పకవి ధర్మపురి లక్ష్మీనరసింహస్వామిని స్తుతించడంతోబాటు అనేక సామాజికాంశాలను, నీతులను వివరించడం విశేషం. ముఖ్యంగా

"ఆడు బిడ్డల సొమ్ము నపహరించుట కంటె
బండ గట్టుక నూత బడుట మేలు"

"బ్రదుక జాలక దొంగ పనులు చేయుట కంటె
కొంగుతో ముష్టెత్తుకొనుట మేలు" వంటి ఆదర్శాలను;

"పసరంబు బందైన పసుల కాపరి తప్పు
ప్రజలు దుర్జనులైన ప్రభుని తప్పు"

భార్య గయ్యాళైన ప్రాణనాథుని తప్పు
తనయుడు దుష్టైన తండ్రి తప్పు" వంటి నీతులను;

"మాన్యంబులీయ సమర్థుడొక్కడు లేడు
మాన్యముల్ చెరప సమర్థులంత"

"ఎండిన ఊళ్ళ గోడెరిగింప దెవ్వడు
పరిడిన యూళ్ళకు ప్రభువులంత" వంటి లోక రీతులను;

"తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు
వెళ్ళి పోయెడి నాడు వెంటరాదు"

"లక్షాధికారైన లవణమన్నమె కాని
మెరుగు బంగారంబు మ్రింగబోడు" వంటి జీవిత సత్యాలను;

"అధిక విద్యావంతు లప్రయోజకులైరి
పూర్ణ శుంఠలు సభా పూజ్యులైరి"

"సత్యవంతుల మాట జన విరోధంబాయె
వదరుబోతుల మాట వాసికెక్కె"

వంటి సమకాలీన సామాజిక నిందలను;



"వ్యాసుడే కులమందు వాసిగా జన్మించె
విదురుడే కులమందు వృద్ధినొందె"

"శ్రీ శుకుండెచ్చట చెలగి జన్మించెను
శబరి ఏ కులమందు జన్మమొందె" వంటి కుల వ్యవస్థ నిరసనలను

పద్యాలలో పొందు పరిచాడు.[12]

ఇలా ఒకరిద్దరు కవులు సమకాలీన సామాజిక చిత్రణం, వ్యంగ్య విమర్శనం, కుల వ్యవస్థ నిరసనం చేసినా, అది పెద్దగా నవ్యతగా భావించలేం. మొత్తానికి 19వ శతాబ్దిలో తెలంగాణంలో వెలువడిన సాహిత్యంలో నవ్యత తక్కువే అని చెప్పవచ్చు.

ఇక కోస్తా – రాయలసీమ ప్రాంతంలోని 19వ శతాబ్ది నాటి సామాజిక రాజకీయ పరిస్థితులను పరిశీలిద్దాం.

## 19వ శతాబ్దిలో కోస్తా – రాయలసీమ ప్రాంతం :

భారతదేశంలో 19వ శతాబ్దిలో సాంఘిక సాంస్కృతిక సంస్కరణలు ప్రారంభమైనాయి. ఈ సాంస్కృతిక పునరుజ్జీవనం రాజా రామమోహనరాయ్‌తో ముడిపడి ఉంది. ఆ రోజుల్లో వంగదేశంలో ఏ ఉద్యమం బయలుదేరినా అది బ్రిటిష్ వారి పాలనంలోనే ఉన్న కోస్తా – రాయలసీమ ప్రాంతంలో ప్రవేశించేది. అందుకు కారణభూతమయిన పరిస్థితులు ఆ ప్రాంతంలో 19వ శతాబ్దిలోనే నెలకొన్నాయి. అందులో ముఖ్యమయినవి ఇవి.

**ఆంగ్ల విద్యావిధానం :–** 19వ శతాబ్ది ఆరంభం నాటికి ఆంధ్ర దేశంలోని పిల్లలు, గురుకులాలలో వీధిబడులలో ఓనమాలు, శతకాలు, సంస్కృతం, పంచకావ్యాలు చదువుకొనేవారు. ఇంకా ఉత్సాహం ఉన్న బ్రాహ్మణులు, వేదాలు, తర్క మీమాంసాది శాస్త్రాలను అధ్యయనం చేసేవారు. ఆ సమయంలో విలియం బెంటింక్ భారత దేశంలో ఆంగ్ల విద్యను ప్రవేశపెట్టి, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో విశ్వవిద్యాలయాలను స్థాపించాడు. ఆ ఫలితంగా 19వ శతాబ్ది ప్రారంభం నాటికే బ్రిటిష్ పాలనలోకి చేరిన కోస్తా – రాయల సీమ ప్రాంత ఆంధ్రులు పాశ్చాత్య

విద్యను అభ్యసించి ఆధునికతను సంతరించుకోడం ప్రారంభించారు. దాని వల్ల ముఖ్యంగా వ్యక్తి స్వేచ్ఛ, హేతువాదం, మానవతావాదం, సాంఘిక సమానత్వం, రాజకీయ స్వాతంత్ర్యాల గురించి మంచి అవగాహన ఏర్పడింది.

## క్రైస్తవ మిషనరీల కృషి :

క్రైస్తవ మత ప్రచార ధ్యేయంతో 19వ శతాబ్దిలో అనేక మిషనరీలు ఆంధ్ర దేశంలో ఆంగ్ల భాషా విద్యాలయాలను, సేవా సంస్థలను నెలకొల్పారు. ఆధునిక వైద్య సేవలను అందించారు. ముద్రణా యంత్రాలను ప్రవేశపెట్టారు. వారి ఉద్దేశ్యమేదైనా, అది కూడా పాశ్చాత్య విద్యా వ్యాప్తితో, వారి సాహిత్యంతో మన వారికి పరిచయమేర్పడడానికి, వారి సామాజిక రీతులపట్ల మన వారికి అవగాహన ఏర్పడడానికి దోహదపడింది. క్రీ.శ. 1805లో లండన్ మిషనరీ సొసైటీ వారు జమ్మలమడుగును కేంద్రంగా చేసుకొని క్రైస్తవ మత ప్రచారం చేశారు. 1835లో స్థాపితమైన అమెరికా బ్యాప్టిస్ట్ సంఘం రాయలసీమ జిల్లాలలో చురుకుగా పనిచేసింది. 1841లో స్థాపితమైన 'చర్చిమిషన్ సొసైటీ' కృష్ణా, గోదావరి జిల్లాలలో విశేషంగా కృషి చేసింది. ఆ తరువాత వచ్చిన 'గోస్పెల్ మిషన్' కడప, కర్నూలు జిల్లాలలో అనేక కేంద్రాలను నెలకొల్పి సేవ చేసింది.[13] క్రైస్తవ విద్యాసంస్థలలో చదువుకొన్న రఘుపతి వేంకటరత్నం నాయుడు, కొండా వెంకటప్పయ్య, ముట్నూరు కృష్ణారావు ప్రభృతులు కోస్తాంధ్ర ప్రాంతంలో ఆధునిక సమాజ నిర్మాణానికి దోహదపడ్డ మహనీయులుగా ఎదిగారు.

## వివిధ సామాజికోద్యమ సంస్థల కృషి :

రాజా రామమోహనరాయ్ స్థాపించిన బ్రహ్మసమాజం క్రమక్రమంగా ఆంధ్ర దేశానికి విస్తరిల్లి 1878లో రాజమండ్రిలో, 1882లో బందరులో, 1888లో కాకినాడలో, 1898లో గుంటూరులో శాఖలను ఏర్పర్చుకొన్నది. బ్రహ్మసమాజం కుల, మత, వర్గ భేదాలు లేకుండా మానవులంతా సమానులే అని చాటింది. భగవంతుడొక్కడే అని, విగ్రహారాధన కూడదని ప్రచారం గావించింది. సతీ సహగమనం, వేశ్యావృత్తి, త్రాగుడు, అంటరానితనం వంటి దురాచారాలను నిరసించింది. ఆ తరువాత దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజం కూడా ఆంధ్ర దేశంలో ప్రవేశించి హిందూ మత సంస్కరణోద్యమాన్ని కొనసాగించింది.



## పత్రికల పాత్ర :

19వ శతాబ్ది ప్రారంభంలోనే ఆంధ్ర దేశంలో పత్రికలు ప్రారంభమైనాయి. బళ్ళారి క్రైస్తవ మిషనరీ ప్రారంభించిన 'సత్యదూత' తెలుగు భాషలో మొట్ట మొదటి పత్రిక. తరువాత గాజుల లక్ష్మీనరసుశెట్టి 'క్రీసెంట్' అనే పత్రికను మద్రాసు నుండి ప్రారంభించాడు. తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ వెలువడిన 'సత్య సంవర్ధని', బుచ్చయ్య పంతులుగారు నడిపిన 'హిందూ రిఫార్మర్', రాయసం వెంకట శివుడు స్థాపించిన 'జనానా', మద్రాసు నుండి వెలువడిన 'థీయిష్టులు' – పత్రికలు బ్రహ్మ సమాజ సిద్ధాంతాలను ప్రచారం చేసాయి. ఇంకా 'అమృత బోధిని', 'ఆంధ్ర ప్రవేశిక', 'సుజానా', 'మనోవిలాసిని' మొదలగు పత్రికలు సాంఘిక, రాజకీయ సిద్ధాంతాలను ప్రచారం చేసి, ఆంధ్ర దేశంలో సామాజిక చైతన్యానికి దోహదమయ్యాయి. కందుకూరి వీరేశలింగం పంతులుగారు నిర్వహించిన 'వివేకవర్ధని', 'సతిహితబోధిని', 'సత్యసంవర్ధని' సంస్కరణోద్యమానికి గణనీయమైన సేవలందించాయి.[14] క్రీ.శ. 1839లో మొట్ట మొదటి తెలుగు వార్తా పత్రిక 'వృత్తాంతిని' వెలువడి ఆంధ్రులలో సామాజిక స్పృహను పెంపొందించింది[15].

## సంఘ సంస్కర్తల పాత్ర:

19వ శతాబ్దిలో ఆంధ్ర ప్రాంతంలో ఈ క్రింద పేర్కొన్న సంఘ సంస్కర్తలు సాంఘిక పునరుజ్జీవనానికి విశేషంగా కృషి చేశారు.

1. **ఏనుగుల వీరాస్వామి :** – మద్రాసు సుప్రీంకోర్టులో దుబాసీగా పని చేసిన ఈయన అస్పృశ్యతను ఖండించి, దేవాలయాలలో పూజా విధానాలను విమర్శించాడు. స్త్రీ విద్యా వ్యాప్తికి కూడా ఈయన ఎంతో కృషి చేశాడు.
2. **అనంత రామశాస్త్రి :** – నెల్లూరు ప్రాంతానికి చెందిన ఈయన హరిజనోద్ధరణకై విశేషంగా కృషి చేసి, వారికి దేవాలయ ప్రవేశాన్ని కలిగించాలని చాటాడు.
3. **గాజులశెట్టి లక్ష్మీనరసు :** – ఈయన సమాజంలో పాతుకు పోయిన వెట్టి చాకిరీని రద్దు చేయాలని కోరాడు. రైతుల కష్ట నష్టాలను ప్రభుత్వానికి తెలియ పరచి, విక్టోరియా మహారాణి నుండి హామీలు పొంది, వాటిని అమలు పరిచేందుకు ప్రభుత్వంతో పోరాడాడు.

4. **సామినేని ముద్దునరసింహం :–** ఇతడు 'హితసూచిని' అనే గ్రంథాన్ని రచించి, దాని ద్వారా, మూఢ విశ్వాసాలను, వేశ్యావృత్తిని, అస్పృశ్యతను, బానిసత్వాన్ని నిరసించాడు.

5. **ముత్తా నరసింహయ్య నాయుడు :–** రాజమండ్రిలో మున్సిఫ్ ఉద్యోగిగా ఉన్న ఈయన స్త్రీలకు సమానత్వం, శాస్త్రీయ విద్యావిధానం అమలు జరగాలని, స్త్రీలకు యుక్త వయసు వచ్చాకే వివాహం చేయాలని ప్రచారం చేశాడు.

6. **పరవస్తు వేంకటరంగాచార్యులు :–** 'మహామహోపాధ్యాయ' ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ప్రభావంతో ఈయన స్త్రీలకు పునర్వివాహం శాస్త్ర సమ్మతమేనని కర పత్రాలు ముద్రించి ప్రచారం చేశాడు.

7. **ఆత్మూరి లక్ష్మీ నరసింహం :** ఈయన వీరేశలింగం గారికి గురుతుల్యులు. బ్రహ్మ సమాజ సిద్ధాంతాల ప్రభావంతో ఈయన స్త్రీ పునర్వివాహ సమాజ సభ్యుడై, అందుకు పాటు పడ్డాడు.

8. **కందుకూరి వీరేశలింగం : –** 1848 ఏప్రిల్ 16న సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ఈ మహనీయుడు సనాతన సంప్రదాయ విద్యతోబాటు ఆంగ్ల భాషను కూడా అభ్యసించి, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో అధ్యాపకుడై విద్యార్థులలో విజ్ఞాన బీజాలను నాటాడు. మూఢ విశ్వాసాలను, శకునాలను, దురాచారాలను ఖండించి, పెద్దలు అరిష్టమన్న అరటిచెట్టు పళ్ళను తినడం, అమావాస్య రోజు కొత్త ఉద్యోగంలో చేరడం, భూత వైద్యులను బెదరగొట్టడం, విగ్రహారాధనను తృణీకరించడం, కుల వ్యవస్థను నిరసించడం వంటి పనులను చేసేవాడు. 'వివేక వర్ధని', 'హాస్య సంజీవని', 'సతీహిత బోధిని', 'సత్య సంవర్ధని', 'తెలుగు జనానా', 'సత్యవాదిని' వంటి పత్రికలు నడిపి, వాటి ద్వారా అనేక సాంఘిక దురాచారాలను రూపుమాపాలని ప్రజలను జాగృతం చేశాడు. వేశ్యాలోలత, కులవ్యవస్థ, విగ్రహారాధన వంటి దురాచారాలను నిరసించడమే కాకుండా వితంతువుల పునర్వివాహం, స్త్రీ విద్యాభివృద్ధి వంటి ఆదర్శాలను ప్రచారం చేసేవాడు. ఈయన ఆధునికాంధ్ర సాహిత్యంలో గద్య రచనలలో అనేక నూతన ప్రక్రియలకు ఆద్యుడై మార్గదర్శనం చేశాడు.

9. **రఘుపతి వెంకటరత్నం నాయుడు : –** బందరులో జన్మించిన ఈయన అస్పృశ్యత, బాల్య వివాహాలు, భోగం మేళాలు నిషేధించేందుకు జీవిత పర్యంతం కృషి చేశాడు. ఇందుకోసం 1891లో 'సాంఘిక శుద్ధి' అనే సంఘాన్ని కూడా స్థాపించాడు.

10. **దేశిరాజు పెదబాపయ్య : –** 26 ఏళ్ళకే అకాలమరణం చెందిన ఈయన జంధ్యాన్ని త్యజించి, తన బంధువులంతా వెలివేసినా, అత్తమామలు తన భార్యను కాపురానికి పంపక పోయినా తను నమ్మిన సిద్ధాంతాలు, ఆదర్శాలకు బ్రదికినన్నాళ్ళు అంకితమయ్యాడు.

11. **గురజాడ అప్పారావు :–** మూఢ విశ్వాసాలను నిరసించి, సామాజిక సేవ కోసం, వ్యక్తివాద, హేతువాద, సామాజిక వాదాలను రంగరించిన రచనలతో ప్రజలలో చైతన్యం రేపడానికి పాటుపడ్డాడు. 1896లో 'కన్యాశుల్కం' అన్న దురాచారాన్ని రూపు మాపేందుకు అదే పేరుతో రచించిన హాస్య, వ్యంగ్య నాటకం జగత్ప్రసిద్ధం.

## వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి :

వీటన్నిటికి తోడు ప్రపంచ స్థాయిలో 19వ శతాబ్దిలో జరిగిన ఆధునిక వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మానవుల జీవన విధానాన్ని, భావాలను పూర్తిగా మార్చి వేసింది. బ్రిటిష్ పాలనలోని ఆంధ్రులకు ఆయా ప్రగతి ఫలాలు సత్వరంగా అందుబాటులోకి రావడం వల్ల నిజాము రాష్ట్ర ఆంధ్రుల కన్న వారెంతో ముందు దశలో నిలిచారు. ఆధునిక విద్య వలన ఆ ప్రగతి వివరాల పట్ల కూడా వారికి తొందరగా పరిపూర్ణమైన అవగాహన ఏర్పడడానికి మార్గం కుదిరింది. 19వ శతాబ్దిలో కనిపెట్టబడిన ఈ ఆధునిక పరికరాల[16] ప్రభావం కోస్తా, రాయలసీమ ప్రాంత ఆంధ్రులపై కూడా ప్రసరించింది.

| | | |
|---|---|---|
| మోషన్ పిక్చర్ ప్రొజెక్టర్ | – | క్రీ.శ. 1805 |
| స్టీమరు | – | క్రీ.శ. 1807 |
| స్టెతోస్కోప్ | – | క్రీ.శ. 1819 |

| | | |
|---|---|---|
| రైల్వే ఇంజిన్ | – | క్రీ.శ. 1829 |
| కుట్టు మిషన్ | – | క్రీ.శ. 1830 |
| విద్యుత్తంతి | – | క్రీ.శ. 1835 |
| ఫోటోగ్రఫీ | – | క్రీ.శ. 1837 |
| రివాల్వర్ | – | క్రీ.శ. 1837 |
| బైసికిల్ | – | క్రీ.శ. 1840 |
| ఉక్కు | – | క్రీ.శ. 1856 |
| ఫౌంటెన్ పెన్ | – | క్రీ.శ. 1864 |
| డైనమైట్ | – | క్రీ.శ. 1867 |
| సెల్యులాయిడ్ | – | క్రీ.శ. 1870 |
| టైపు మిషన్ | – | క్రీ.శ. 1873 |
| టెలిఫోన్ | – | క్రీ.శ. 1876 |
| మైక్రోఫోన్ | – | క్రీ.శ. 1877 |
| విద్యుద్దీపం | – | క్రీ.శ. 1878 |
| ఫోటోఫిల్మ్ | – | క్రీ.శ. 1883 |
| మొదటి నమూనా మోటారు కారు | – | క్రీ.శ. 1886 |
| రబ్బర్ టైర్ | – | క్రీ.శ. 1888 |
| సినిమా యంత్రము | – | క్రీ.శ. 1893 |
| ఎక్స్‌రే | – | క్రీ.శ. 1895 |
| వైర్‌లెస్ | – | క్రీ.శ. 1895 |

ముఖ్యంగా 1852లో సర్ ఆర్థర్ కాటన్ గోదావరి నదిపై కట్టిన ధవళేశ్వరం ఆనకట్ట కోస్తా ప్రాంత ఆంధ్రుల స్థితిగతులను పూర్తిగా మార్చివేసి, 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో వారు ఆర్థికంగా పుంజుకొని అభ్యుదయ మార్గంలో పయనించేందుకు దోహదపడింది. ఆ విధంగా 19వ శతాబ్దిలో నిజాము ప్రాంతానికి పూర్తిగా వైరుధ్యమైన సామాజిక పరిస్థితులతో కోస్తా – రాయలసీమ ప్రాంతం ఆధునికతను సంతరించుకోవడం వల్ల, ఆ శతాబ్దిలోని తెలుగు సాహిత్యంలోని, నవ్య పరిమళాలలో నూటికి తొంభైశాతం అక్కడే గుభాళించాయి.

మొత్తానికి 19వ శతాబ్దిలో కోస్తా, రాయలసీమ ప్రాంతాల్లో ఆంగ్లేయుల పాలన బాగా సుస్థిరమై, వారి భాషా, సాంస్కృతిక, సాహిత్య, మత, రాజకీయాల ప్రభావంతో మన తెలుగు సాహిత్యం కొత్త పుంతలు తొక్కిందని భావించవచ్చు. అయితే 19వ శతాబ్దిలో వచ్చిన సాంఘిక, రాజకీయ, పరిణామాలకు స్పందించి రచనలు చేసే వారి కన్న, సంప్రదాయ పరంపరగా వస్తున్న పద్ధతిలో రచనలు చేసేవారే ఎక్కువగా ఉంటారు. వారు వ్రాసిన 'రామాయణాల'నే మళ్ళీ వ్రాస్తారు. చేసిన 'పరిణయాల'నే మళ్ళీ చేస్తారు. పైగా సంప్రదాయ విరుద్ధంగా వచ్చే రచనలను సత్వరమే అందరూ ఆహ్వానించలేరు. కొందరు సహృదయులు తప్ప, వ్యతిరేకించే వారే ఎక్కువగా ఉంటారు. కానీ, సంఖ్యలో తక్కువగానే ఉన్నా, ఆ నవ్య స్పర్శ గల కావ్యాలనే మనం అధ్యయనం చేయాలి. అవి ఆపై శతాబ్దిలో (20వ శతాబ్దిలో) వచ్చిన కావ్యాలకు ఎలా మార్గదర్శనం చేసాయో గమనించాలి. ఆ కావ్యాలలోని నవ్యత్వాన్ని ఆ శతాబ్ది సాహిత్య పరిణామంగా గుర్తించాలి. అప్పుడు 19వ శతాబ్దిని క్షీణ యుగం అనలేము. ఉషోదయ యుగంగా అంగీకరిస్తాం.

**పాద సూచికలు :**

1. డా. ముదిగంటి సుజాతారెడ్డి – "చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర" – పుట. 299
2. డా. తూమాటి దొణప్ప – "ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము" – పుట. 7
3. బి. ఎన్. శాస్త్రి – ఆంధ్రదేశ చరిత్ర – సంస్కృతి (మూడవ భాగము) పుట. 505

4. డా. తూమాటి దొణప్ప - ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము (పుటలు : 33, 54, 115, 165, 177, 224, 234, 315, 375 మరియు 512)

5. దేవులపల్లి రామానుజరావు : "తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము - పుట. 93

6. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ-ఏనుగుల వీరాస్వామయ్య, కాశీయాత్రా చరిత్ర - డా. సి. నారాయణ రెడ్డిగారి భూమిక

7. వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక - పుటలు 28 నుండి 31

8. కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర - పుటలు 108 నుండి 130

9. తెలుగు సాహిత్య కోశం (తెలుగు అకాడమి ప్రచురణ) - ఆధునిక సాహిత్యం.

10. కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర - పుట. 110

11. నరసింహ శతకము (పావని సేవా సమితి ప్రచురణ) - శేషప్పకవి జీవిత విశేషాలు

12. నరసింహ శతకము (పావని సేవా సమితి ప్రచురణ) - శేషప్పకవి విరచిత పద్యాల నుండి.

13. ఎం. హనుమంతరావు, కె.బి.వి.వి. ప్రసాద్: ఆధునిక ఆంధ్రదేశ చరిత్ర - పుట. 233

14. ఎం. హనుమంతరావు, కె.బి.వి.వి. ప్రసాద్: ఆధునిక ఆంధ్రదేశ చరిత్ర - పుట. 235

15. తెలుగు విజ్ఞాన సంచిక పుట. 18

16. Encarta general knowledge series compact disc.





# 5

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో సంప్రదాయ వ్యతిరేకత, అభ్యుదయాత్మక నవ్యత



*"శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే*
*లోకానాం స్థితి మావహన్త్యవిహతాం స్త్రీ పుంసయోగోద్భవాం*
*తే వేదత్రయ మూర్తయస్త్రి పురుషాస్సంపూజితా వస్సురై*
*ర్భూయాసుః పురుషోత్తమామ్బుజ భవ శ్రీ కన్ధరాశ్శ్రేయసే"*[1]

ఆదికవి నన్నయ ఆంధ్ర మహాభారత రచన ప్రారంభిస్తూ చెప్పిన మొట్ట మొదటి శ్లోకం ఇది. రచన ఆంధ్రంలోనైనా, మొదటగా దేవ భాషలో శ్లోకం చెప్పడం, అదీ 'మ' గణంతో ప్రారంభించడం మంగళకరమని భావించి, నన్నయ భట్టారకుడు ఈ శార్దూల విక్రీడిత శ్లోకంతో రచనను ప్రారంభించాడని పండితులు భావిస్తుంటారు. కావ్యారంభాన్ని శ్రీకారంతో చేయడం కూడా మంగళకరమని నన్నయ నమ్మిఉంటాడని పండితులు వివరిస్తుంటారు.

ఇటువంటి విశ్వాసాలు ప్రాచీన కాలం నుండి భారతీయులలో అధికంగా ఉండేవి. శతాబ్దుల తరబడి ఈ విశ్వాసాలు ఇలాగే చెక్కు చెదరకుండా ఒక సంప్రదాయంగా కొనసాగాయి. అయితే ఆంగ్లేయుల పరిపాలనలో క్రీ.శ. 1857లో ఆధునిక విశ్వవిద్యాలయాలు నెలకొన్నాక, ప్రజలలో అవగాహన పెరిగి, ఈ విశ్వాసాలు మెల్ల మెల్లగా సన్నగిల్లాయి. క్రీ.శ. 1917లో రష్యాలో కమ్యూనిస్టుపాలన ప్రారంభమయ్యాక, ప్రపంచ ప్రజల దృష్టి మార్క్సిజం వైపు మళ్ళింది. హేతువాద దృష్టి, మార్క్సిస్టు దృక్కోణం భారతీయులలో ప్రసరించాక ఈ విశ్వాసాలపై తిరుగుబాటు ధోరణి అక్కడక్కడా కనబడింది. ఆ ఫలితంగానే తెలుగులో శ్రీశ్రీ వంటి అభ్యుదయ కవులు ఉదయించారు. అంతదాకా తెలుగు కవులంతా తమ

తమ కావ్యాలను అదే సంప్రదాయంగా శ్రీకారంతో ప్రారంభించడం విధిగా పాటిస్తూ వచ్చారన్నది పండితాభిప్రాయం.

అంతేకాదు – నన్నయ చూపిన మార్గంలో ప్రతి తెలుగు కవీ తమ కావ్యంలో కృత్యాద్యవస్థలను పాటిస్తూ వచ్చాడు. అంటే ప్రతి కావ్యంలో కూడా 'అవతారిక', 'కృతి పతి ప్రశంస', 'షష్ఠ్యంతాలు' వంటి కావ్య భాగాలను కలిగి, ఆ పైనే అసలు 'కథా ప్రారంభము' జరుగుతుంది. అలాగే ప్రతి ఆశ్వాసాంతంలో 'ఆశ్వాసాంత గద్య'ను పొందుపరచడం జరుగుతుంది. శతాబ్దుల పాటుగా ఈ సంప్రదాయాన్ని ప్రతి కవి విధిగా పాటించాడంటే, కృత్యాద్యవస్థలకు కావ్యజగతిలో గల ప్రాముఖ్యాన్ని గుర్తించవచ్చు.

"శ్రీయన గౌరినా బరగు చెల్వకు జిత్తము బల్లవింప ..." అన్న పద్యంతో తిక్కన తన మహాభారత రచనలో అవతారికను ప్రారంభించి, కృత్యాద్యవస్థలతో బాటు ఆశ్వాసాంతగద్యలను రచించడం;

'శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్...."

అన్న పద్యంతో పోతన తన భాగవత రచనలో అదే సంప్రదాయాన్ని పాటించడం మనందరికీ తెలిసిన విషయమే. ఇంకా చెప్పుకొంటూపోతే ఉదాహరణలు కోకొల్లలు. దీనితో రాను రాను కావ్య రచన ప్రారంభానికి 'శ్రీకారం చుట్టడం' అన్న నుడికారం రూపుదిద్దుకొంది. ఇది ఎంత వరకు వెళ్ళిందంటే జన వ్యవహారంలో ఏ కార్యం ప్రారంభించినా 'శ్రీకారం చుట్టడ' మన్నది సర్వ సాధారణమయింది.

ఈ సంప్రదాయాన్ని ఇప్పటికీ కొందరు సంప్రదాయవాదులైన పద్యకవులు పాటిస్తున్నారు. ఉదాహరణకు ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడమిచే పురస్కృత మయిన 'శ్రీకృష్ణ చంద్రోదయం' అనే శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారి పద్య కావ్యంలో శ్రీకారారంభంతోపాటు, అవతారిక కూడా రచింపబడింది. కాని ఆధునిక కాలంలో ఈ సంప్రదాయాన్ని ఉల్లంఘించినవారే ఎక్కువ. వచన, గేయ కవులంతా తమకు మార్గదర్శకుడైన యుగకర్త శ్రీశ్రీని అనుసరిస్తూ, ఈ సంప్రదాయానికి వ్యతిరేకులుగా నిలచారు. అంతకు ముందే జాషువా, ఆపైన డా. దాశరథి కృష్ణమాచార్యులు, 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ శాస్త్రి తదితర పద్యకవులు సైతం తాము ఈ సంప్రదాయాన్ని పాటించక ఆధునికులమని చాటుకొన్నారు. అయితే వీరందరికన్నా ఎంతో ముందు, భారతీయులకు మార్క్సిజం గురించి పరిచయం కాకముందే, హేతువాద దృష్టి, అభ్యుదయ భావాలు బలపడకముందే ఒక కవి తెలుగులో ఈ విశ్వాసాలకు వ్యతిరేకంగా ఆధునికంగా ఆలోచించాడు.

19వ శతాబ్దిలోనే, అంత వరకు అవిచ్ఛిన్నంగా సాగుతున్న ఈ సంప్రదాయ ప్రవాహానికి అడ్డుకట్ట వేసి నవ్యతను చూపిన ఆ మహానుభావుడు శ్రీశిష్టు కృష్ణమూర్తిశాస్త్రి. ఇతని 'సర్వకామదా పరిణయము' అన్న ప్రబంధంలో అవతారిక లేదు. ద్వితీయాశ్వాస ప్రారంభంలో ఒక పద్యం తప్ప, మిగితా ఆశ్వాసాలన్నింటికీ ఆశ్వాసాది మరియు ఆశ్వాసాంత పద్య, గద్యలు లేవు. షష్ఠ్యంతాలు లేవు. ఇది ఆ రోజులలో సంచలనం అనదగ్గ సంప్రదాయ వ్యతిరేక నవ్యతగా గుర్తించవచ్చు. ఈ కవి 1835–40 సంవత్సరాల మధ్య 'రామచంద్రపురం' జమీందారుల ఆస్థాన కవిగా ఉన్నాడు.[2] ఈ 'రామచంద్రపురం' ప్రస్తుతం తూర్పు గోదావరి జిల్లాలో ఉంది. రామచంద్రపురం జమీందారు కాకర్లపూడి రామచంద్రరాజు సోదరుడైన పద్మనాభరాజుకు ఈ కృతి అంకితం చేయబడింది. అంటే సుమారు 1835–40 సంవత్సరాల మధ్య ఈ ప్రబంధ నిర్మాణం జరిగి ఉంటుంది. శిష్టు కృష్ణమూర్తి కవి సంప్రదాయానికి వ్యతిరేకంగా చూపిన నవ్యత భారతదేశంలో ఆధునిక విశ్వవిద్యాలయాలు ఏర్పడక ముందే – అంటే ఆంగ్ల సాహిత్య ప్రభావం భారత దేశంలో పడకముందే 19వ శతాబ్ది పూర్వార్ధంలోనే తటస్థించడం నిజంగా చెప్పుకోదగ్గ విశేషం.

ఈ కవి ఈ నవ్యతను సంతరించడానికి కొన్ని విశేష కారణాలున్నాయి. తొలుత ఈ గ్రంథాన్ని జమీందారు సోదరులలో ఒకడైన కాకర్లపూడి వేంకట కృష్ణంరాజుకు అంకితమివ్వాలని కవి రచించాడట. అయితే ఈ కవికి, పిండిప్రోలు లక్ష్మణకవి అనే మరోకవికి విరోధం ఉండేది. ఈ పిండిప్రోలు లక్ష్మణకవి 19వ శతాబ్దికి చెందిన విశిష్ట కవులలో ఒకడు. ఇతడు అనేకమైన చాటువులు, 'రావణ దమ్మీయము' అనే నవ్యత సంతరించుకొన్న ఒక అధిక్షేపాత్మక ద్వ్యర్థి కావ్యం రచించాడు. లక్ష్మణకవి కపట ప్రయత్నం వలన శిష్టు కృష్ణమూర్తి కావ్య సమర్పణను

కాకర్ల పూడి వేంకట కృష్ణంరాజు తిరస్కరించాడు. దానిని కృష్ణమూర్తి కవి చాలా అవమానంగా భావించాడు. తరువాత జమీందారు మరో సోదరుడు పద్మనాభరాజుకు ఈ కావ్యాన్ని అంకితం చేసాడు. బహుశః వేంకట కృష్ణంరాజును కృతిపతిగా సంభావిస్తూ వ్రాసిన అవతారిక, ఆశ్వాసాద్యంత పద్యాలను, షష్ఠ్యంతాలను కవి అప్పుడు తొలగించి (ద్వితీయాశ్వాసాదిలో గల పద్యాలలో ఒకటి కృష్ణంరాజు ప్రసక్తి లేక పోవడం వల్ల ఆ ఒక్క పద్యం అలాగే ఉంచి ఉంటాడు), కావ్య ప్రధాన భాగాన్ని మాత్రమే పద్మనాభరాజుకు అంకితం చేసి ఉంటాడు.

శిష్టు కృష్ణమూర్తి కవి పద్మనాభరాజును ప్రస్తుతిస్తూ కావ్యావతారికను, ఆశ్వాసాది పద్యాలను పునఃప్రయత్నంగా వ్రాయాలనుకొంటే వ్రాసి ఉండవచ్చు. కాని ఆయన ఆ పని చేయలేదు. దానికి కారణాన్ని సులభంగానే ఊహించగలం. సంప్రదాయ బద్ధంగా సాగుతున్న జీవనంలో ఒక అవమానం, హృదయానికి బాధ కలిగినప్పుడు – సంప్రదాయ వ్యతిరేకత, హేతువాద దృష్టి మొలకెత్తుతాయి. శిష్టు కృష్ణమూర్తి కవిలో అదే జరిగింది. "సంప్రదాయ బద్ధంగా దైవ ప్రార్థన, కృతి కర్త ప్రశంసలతో కూడిన అవతారిక, ఆశ్వాసాది పద్యాలను రచిస్తే ఏం శుభం జరిగిందని? కావ్య స్వీకారానికి తిరస్కారం, అవమానం జరిగాయి" అని కవి భావించి ఉండవచ్చు. అందుకే కావ్యావతారిక, ఆశ్వాసాద్యంత పద్య గద్యలు లేకుండానే కావ్యాన్ని పద్మనాభరాజుకు అంకితం చేసాడు. ఇందులో పద్మనాభరాజు సహృదయత కూడా ఎన్నదగింది. తన ప్రశంస లేకపోయినా, సంప్రదాయం పాటించకపోయినా, ఆయన కృతి స్వీకృతికి నిరభ్యంతరంగా అంగీకరించడం – ఆయన ఔన్నత్యాన్ని చాటుతుంది. అయితే కృష్ణమూర్తి కవి ఈ నవ్యతకు తెర తీయడానికి కేవలం ఇవే కారణాలని భావిస్తే పొరపాటవుతుంది.

శిష్టు కృష్ణమూర్తికి సర్ వాల్టర్ ఇలియట్ అనే తెల్ల దొరతో మంచి పరిచయం ఉండేది. ఆయనకు ద్రాక్షారామ శాసనాక్షర పరిశోధనలో కృష్ణమూర్తి కవి సాయపడ్డాడు. ఆ సంపర్కంలో ఆంగ్ల సాహిత్యంలో కృత్యాద్యవస్థలు లేని విషయం ఈ కవి తెలుసుకొని ఉంటాడు. అదే పద్ధతిని తొలిసారి ఆంధ్ర సాహిత్యంలో ప్రయోగించడానికి కవి ధైర్యం చేసి ఉంటాడు.



అంతే కాకుండా ఈ కవికి మండ కామేశ్వర కవి అనే మరొక నవ్యతకు పట్టం కట్టిన కవితో మైత్రి ఉండేది. మండ కామేశ్వర కవి ఆంధ్ర సాహిత్యంలో తొట్ట తొలిసారి 19వ శతాబ్దిలోనే సంప్రదాయ ఛందస్సులను కాదని, మాత్రాచ్ఛందస్సులను ప్రవేశపెట్టి 'ఆంధ్ర తులసీ రామాయణం' కావ్య నిర్మాణం చేసిన ఘనుడు. ఈయన గురించి సోదాహరణంగా '19వ శతాబ్ది తెలుగు కవిత్వం – ఛందస్సుపరమైన నవ్యత" అన్న అధ్యాయంలో చర్చిద్దాం. ఈ కవి రచించిన 'తులసీ రామాయణము' ఆంధ్రానువాదంలో కొన్ని అధ్యాయాలను శిష్టు కృష్ణమూర్తి కవి రచించి తోడ్పడ్డాడు. ఇటువంటి అధునాతన భావాలు గల స్నేహితుల సాంగత్యం కూడా శిష్టు కృష్ణమూర్తి కవి నవ్య మార్గంలో ప్రయాణించేందుకు దోహదం చేసిందని చెప్పవచ్చు.

ఏమైనా కృత్యాద్యవస్థలు లేకుండా శిష్టు కృష్ణమూర్తి వెలార్చిన 'సర్వకామదా పరిణయం' ఆంధ్ర సాహిత్యంలో ఒక మైలురాయిగా నిలిచిందని చెప్పాలి. ఇది సాధారణ 'పరిణయ ప్రబంధం' కాకుండా, ఇతర పరిణయ ప్రబంధాల కంటె కాస్త భిన్నంగా నడచి, ఆ విధంగా కూడా కొంత నవ్యతను చాటుకొంది. ఈ కావ్యాన్ని గురించి వివరిస్తూ ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి –

"ఇది పరిణయ ప్రబంధమైనను ఇతర పరిణయ ప్రబంధముల కంటె ఇంచుక భిన్నము. విజయనగరములోని రామలింగ క్షేత్రమునకు సంబంధించిన ఇతివృత్తము. రామలింగశంకరుని కోరికన పార్వతి మరల హిమవంతునికి జన్మించును. ఆమె పేరు సర్వకామద. ఆమె యౌవనవతి కాగానే దేవతలు ఆమె సౌందర్యమును వర్ణించి, రామలింగ శంకరునితో "నీ కాంత యగుట కనుగుణ" మనిన, రామలింగ శంకరుడు సప్తర్షులను రాయబారము పంపును. సర్వకామదా రామలింగ శంకరుల వివాహము జరుగును. వివాహముతో కావ్యము సమాప్తమగును. వివాహానంతర విశేషము లేకపోవుట విశేషము" [3] అని ప్రశంసించారు.

హరికథాపితామహులుగా ప్రసిద్ధులైన ఆదిభట్ల నారాయణదాసు క్రీ.శ. 1888లో 'బాటసారి' అన్న కావ్యంలో మరింత ముందుకు వెళ్ళి మరింత నవ్యతను ఆంధ్ర సాహిత్య ప్రస్థానంలో నిలిపారు. కవిగారి వయసు ఈ కావ్య నిర్మాణ సమయంలో కేవలం ఇరవై నాలుగేళ్ళే. దాసు గారు ఈ కావ్యంలో ఎటువంటి

కృత్యాద్యవస్థలు పాటించలేదు – సరికదా! పైగా, కావ్యాన్ని 'శ్రీ' అన్న అక్షరంతో ప్రారంభించకుండా, 'ఒ' అన్న అక్షరంతో ప్రారంభించి, సంప్రదాయానికి విరుద్ధంగా ముందడుగు వేసారు. ఈ కావ్యంలోని ప్రారంభ పద్యం ఇలా ఉంది.

*"ఒక్క మహానుభావుడు మహోదధి యానము చేసి, ముప్పున*
*నక్కి తొలంగిపోవు నిజదార, సుతార్థమునై సరోనదీ*
*పక్కణ సీమల న్వెదకి, వారలు సుస్థితి నుంటగాంచి, పెం*
*పెక్కెను బాటసారియయి – యిక్కథ పేర యశోవిహారియై"*[4]

'బాటసారి' కావ్యం కథావస్తుపరంగా కూడా నవ్యతను సంతరించుకొంది. ఆ వివరాలను 'వస్తు నవ్యత' ను వివరించే అధ్యాయంలో తెలియజేస్తాను.

19వ శతాబ్దిలోనే మరొక కవి కూడా శ్రీకారం చుట్టకుండా నవ్యతను తన కావ్యంలో నిలిపారు. ఆ కవి పేరు – శొంఠి భద్రాద్రి రామశాస్త్రి. ఈయన కూడా తన కావ్యంలో కృత్యాద్యవస్థలు పాటించక పోవడమే కాకుండా, కావ్య రచనను 'శ్రీకారం'తో కాకుండా

*"కలదొక రాచ కూతురతి కాంత విలోల దృగంత పాతమున్*
*వలనతి ధీర వృత్తులను వైచుచు బాముల బెట్టునట్టి దు*
*ర్లలిత పదారు వత్సరము లంగడి దాటని జవ్వనంపు సొం*
*పుల దుల లేని దవ్వలపు ముద్దియ కిట్లని రామె నెచ్చెలుల్!"*[5]

అని ప్రారంభించారు. అంతకుముందు 'కాళిందీ పరిణయము', 'శంతనూపాఖ్యానము' వంటి కావ్యాలను సంప్రదాయ పద్ధతితో వెలయించిన ఈ కవి 'చిత్ర సీమ' అన్న కావ్యంలో ఈ నూతనత్వాన్ని ప్రదర్శించారు. అయితే ఈ కావ్యాన్ని రచించిన సంవత్సరం కచ్చితంగా తెలియకపోవడం వలన నారాయణదాసు, భద్రాద్రిరామశాస్త్రి కవులలో ఎవరు ముందు ఈ నవ్యతను సాధించారో నిర్ధారించలేని పరిస్థితి ఏర్పడింది. రామశాస్త్రి 19వ శతాబ్ది చివరిభాగంలో ఈ కావ్యాన్ని రచించారని యండమూరి సత్యనారాయణ రావు పేర్కొన్నారు.[6] భావ కవితా రీతిలో ఈ విద్వత్కవి రచించిన ఈ కావ్య వైశిష్ట్యాన్ని వివరిస్తూ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి ఇలా అన్నారు –



"ఈ కవివరుడు ప్రాచీన కవితా ధోరణి కలవాడే గాక నవీన పథమున గబ్బములల్లు మేధావి కూడను. వీరి 'చిత్రసీమ' కావ్యము పరికించిన నిది స్పష్టపడును. చిత్రసీమ కళా పూర్ణోదయమును బోలు కల్పిత కావ్యము. ఇందు గృత్యాద్యవస్థ లేదు. ఇది క్రొత్త పద్ధతి. 'కలదొక రాచకూతురు ––' అని కావ్యము నుపక్రమించినారు. ఇందలి యాశ్వాసములకు దళములని పేరు. అవియు ద్వితీయ దళము మొదలుకొని యారంభింపబడినవి. తత్కారణము గ్రంథములో విశదమగును. 'మంగళాదీని, మంగళ మధ్యాని, మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' యను చొప్పున నాది మధ్యాంతములందు గృతి నాయకుని స్తుతించు పద్యములు రచించెను. ఆ పద్యములు కేవల షష్ఠ్యంతములు గాక ద్వితీయాద్యంతములుగా వ్రాయుట మరియు నూతనత. ఆ పద్యములలో భూత భావి కథలు సూచితములు. ఈ కావ్యములో గార్యము ముందును, గారణము వెనుకను కన్పించుటచే జదువుట కింపు పుట్టించుచుండును. ఇందు నాయకుడు 'చిత్రసీమ'. ఈ పేరులో నొక విచిత్రము. 'సీమ' నకారాంతము, ఆకారాంతము కూడ నుండుటచే స్త్రీత్వ, పుంస్త్వ వ్యవహారములకీ పేరే యుపయోగించెను. ఇది యవశ్య పఠనీయ కావ్యము."[7]

మధునాపంతులవారి అభిప్రాయంతో 99% ఏకీభవించినా, ఒక విషయంలో విభేదించక తప్పదు. శొంఠి రామశాస్త్రి కవి షష్ఠ్యంత్యముల బదులు – ఆదిలో, మధ్యలో, తుదిలో రెండేసి పద్యాల చొప్పున రచించడం సంప్రదాయానికి భిన్నంగా, నవ్యంగా ఉండాలనే గాని, మధునాపంతులవారు అభిప్రాయపడినట్లు 'మంగళాదీని, మంగళ మధ్యాని, మంగళాంతాని' అని మంగళాన్ని ఆశించి కాదు. 'మంగళం', 'అమంగళం' అని ఎంచుకొనే వాడే అయితే సంప్రదాయంగా పలువురు మంగళకరంగా భావిస్తున్న శ్రీకార ప్రారంభాన్ని తిరస్కరించేవాడు కాడు. ఏదేమైనా భద్రాద్రి రామశాస్త్రి కవి కావ్య రచనా సంప్రదాయాన్ని మార్చి, నవ్యత్వం చూపి, 20వ శతాబ్ది నవ్యకవులకు ఆదర్శంగా నిలిచాడని అందరూ ఒప్పుకోవలసిందే. రామశాస్త్రి కవి నవ్యత్వప్రీతి అంతటితో ఆగలేదు. మధునాపంతులవారు చెప్పినట్టు కథానాయకుని పేరు 'చిత్రసీమ' అని ఉంచడం కూడా ఒక క్రొత్తదనమే. అలాగే కథానాయకుని నామమే యథాతథంగా కావ్య నామంగా ఉంచడం కూడా ఆ కాలానికి నవ్యతే. ఎందుకంటే అంతవరకు ఏ కవి అయినా 'విలాసము', 'విజయము',

‘పరిణయము’, ‘కల్యాణము’, ‘చరిత్రము’, ‘సంవాదము’, విలాపము’ వంటి పదాలను, మూలకథా సంబంధ శబ్దాలకు చేర్చి, గ్రంథ నామాలుగా ఉంచడం ఆనవాయితీగా వస్తున్నది. ఆ సమయంలో, ‘చిత్రసీమ విలాసము’ అనో లేక ‘చిత్రసీమ చరిత్రము’ అనో కాకుండా కేవలం ‘చిత్రసీమ’ అని కావ్యనామం ఉంచడం నిజంగా నవ్యతే. మధునాపంతుల వారు ఈ కావ్యాన్ని ‘కళాపూర్ణోదయమును బోలు కల్పిత కావ్యము’ అని ప్రశంసించడం గమనార్హం.

ఇలా కావ్య నామాన్ని సంప్రదాయానికి విరుద్ధంగా నవ్యంగా ఉంచిన మరొక కవి డా. కట్టమంచి రామలింగారెడ్డి. ఈనాటికీ చాలా మంది ప్రజలు ‘మరణము’ అన్న శబ్దాన్ని అమంగళకరంగా భావిస్తుంటారు. అలాంటిది 19వ శతాబ్దిలోనే ఆ కవి తన కావ్యానికి ‘ముసలమ్మ మరణము’ అని నామకరణం చేశారు. పైగా ఆ రోజుల్లో ఏ కావ్యమైన మంగళాంతంగా ముగించాలన్న విశ్వాసం ఉండేది. ప్రాచీన కాలం నుండి సంప్రదాయంగా వస్తున్న ఆ విశ్వాసాన్ని ప్రక్కకు బెట్టి కట్టమంచి వారు ఆ కావ్యాన్ని నాయిక మరణంతో ముగించడం ఒక సంచలనాత్మక నవ్య మార్గం. రెడ్డిగారు ఈ కావ్యాన్ని అలా సంప్రదాయానికి వ్యతిరేకంగా నవ్యతతో విషాదాంతంగా ముగించడానికి కారణం, ఆయనకు ఆంగ్ల సాహిత్యం పట్ల గల విశేష పరిజ్ఞానమే అని చెప్పవచ్చు. ఆంగ్ల సాహిత్యంలోని ‘ట్రాజెడీ’లను గురించి తెలిసిన రెడ్డిగారు ఎంతో మంది పండితులు ఆ కావ్యాన్ని సుఖాంతంగా మార్చమని హెచ్చరించినా లెక్క చేయలేదు. అదే ఆ కావ్యానికి తొట్ట తొలి నవ్య కావ్యంగా విశేషమైన గుర్తింపును తెచ్చి పెట్టింది. ఆ కావ్యం రచించిన తరువాత సుమారు ఏబయి ఏళ్ళకు వెలువడిన పునర్ముద్రణకు ఉపోద్ఘాతం వ్రాస్తూ పింగళి లక్ష్మీకాంతం ఇలా వివరించారు–

“ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుబోకలో నక్షత్రము వలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో నావిర్భవించిన నూత్నాంధ్ర కావ్యము ‘ముసలమ్మ మరణము’. రెడ్డిగారు 19 సంవత్సరముల యువకులైయున్నపుడు (1899వ సంవత్సరములో) చెన్నపురి క్రైస్తవ కళాశాల – ఆంధ్ర భాషాభిరంజనీ సమాజ పోషకులగు శ్రీ సమర్థి రంగయ్య శ్రేష్ఠి గారు ఈ కావ్యము యొక్క పుట్టుకకు కారణ భూతులు. ఉత్తమ కావ్య రచనలను ప్రోత్సహించుటకై శ్రీ శ్రేష్ఠిగారు నెలకొల్పిన పోటీ పరీక్షలో నెగ్గి, పందెము గెల్చుకొని బహూకరింపబడిన యీ కావ్యమును, తత్కర్త యైన యువకవిని, సుప్రసిద్ధులైన ఆంధ్రకవి పండితులెందరో ముద్దుగా మెచ్చుకొని బహుగా నాశీర్వదించిరట! మన సంప్రదాయమును బట్టి కావ్యము శుభాంతముగా నుండెవలెను గనుక మరణాంతముగా రచింపబడిన యీ కృతిని ఎట్టైనను – కృత్రిమ కల్పనతోనైనను సరే – మంగళాంతముగా సంస్కరింపవలసినదని కొందరు ఈ బాల కవిని హెచ్చరించిరట. రామేశ్వర యాత్రాది బహు గ్రంథముల రచించి ప్రసిద్ధి వహించిన శ్రీ గుండు అచ్చమాంబగారు అందరి కంటె నెక్కువ హెచ్చరిక చేసిరట. మొగమాటమిచే నట్టి వారి కోరికను ఈ గ్రంథకర్త మన్నించియే యుండునేని ఈ కావ్యమునకు నుండవలసిన పరిపూర్ణ నవ్యత యుండెడిది కాదు”. [8]

19వ శతాబ్ది ముగింపు దశలో వెలువడిన ఈ కావ్యం ఇంకా అనేక విధాలుగా నవ్యతను సంతరించుకొని, 20వ శతాబ్ది ఆధునిక యుగానికి మార్గదర్శకంగా నిలిచింది. అంత దాకా ఆంధ్ర సాహిత్యంలో ఏ కావ్యమైనా నాయక ప్రాధాన్యంగా వెలువడినవే. ఒకటి రెండు కావ్యాల్లో నాయికా ప్రాధాన్యమున్నా, అవి నాయక పాత్రలతో సమ ఉజ్జీగా నిలిచేవే తప్ప, కేవల నాయికా ప్రాధాన్య కావ్యాలు మాత్రం లేవనే చెప్పాలి. ఇది ఒక రకంగా ఆంధ్ర సాహిత్యానికి పట్టుకొన్న పురుషాధిక్య భావజాలమే. కట్టమంచి వారు తొట్టతొలిసారి ఈ పురుషాధిక్యతను ధిక్కరించి, ముసలమ్మ అనే ఒక గ్రామీణ యువతి పాత్రను ప్రధాన పాత్రగా ఈ కావ్యాన్ని రూపొందించారు. మరొక విశేషం. ఈ కావ్యావతరణకు పూర్వం స్త్రీని ఒక సౌందర్య సాధనంగా, అంగాంగ శృంగార వర్ణనలకు ఆలవాలంగా కవులు భావించేవారు. ప్రబంధ యుగంలో ఆ తరువాతి కాలంలో ఇది మరింత పెచ్చుమీరి, 19వ శతాబ్దిలోనూ ఇలాంటి కావ్య నాయికలు ఎందరో మనకు దర్శనమిచ్చారు. కాని రెడ్డి గారు ముసలమ్మ పాత్రను సమాజహితం కోసం ఆత్మ బలిదానం చేసే త్యాగశీలగా తీర్చిదిద్దారు. కవి ఈ నవ్యతను కాకతాళీయంగా సాధించలేదు. ఒక నిర్దిష్టమయిన మనోదృక్పథంతో ఆయన ఈ కావ్య నిర్మాణం చేపట్టారు. కావ్య ప్రథమ ముద్రణలో కట్టమంచి వారు ఆంగ్లంలో అందించిన అభిప్రాయం చూస్తే ఈ విషయం మనకు అవగతమవుతుంది.

*"I seem to be incapable, in my lofty moods, of feeling joy at the sight of a beautiful woman. Human beauty I can never enjoy. Beauty in trees, mountains, birds etc, I do enjoy. Why is this? The moment I call to my imagination a most charming picture of a woman, my heart asks; Is life a matter of muscles? No doubt her muscles in the different parts are properly developed and she wears a delicate skin. But muscles are muscles and skin is skin. Muscles all over the world are intrinsically the same. They all sweat and emit odour. Cut the most beautiful and the most ugly to pieces and anatomize them. You find all things the same! Thus my heart positively hates human beauty. But it loves moral beauty. My creation of 'Musalamma' was from the moral point of view. The thing is, when I am absorbed in the contemplation of moral or spiritual excellence, my mind invests these abstract things with form and colour of the most ethereal nature and this beauty thrills every fibre of my heart. Humanity means morality and spirituality and nothing more. It was in this spirit, I wrote Musalamma.*

***- C.R. Reddy (Date : 8-2-1900)"[9]***

సహృదయ జన సదవగాహన కోసం ఈ విషయాన్ని తెలుగులోకి అనువదించాను –

"ఒక అందమైన స్త్రీ కనిపించగానే, పెద్దగా ఆనందించగలిగే మానసిక స్థితిని పొందడానికి నేను అశక్తుణ్ణేమో అనిపిస్తుంది. మానవ సౌందర్యాన్ని నేనెప్పుడు ఆస్వాదించలేను. వృక్షాలు, పర్వతాలు, పక్షులు మొదలైన వాని అందాన్ని నేను ఆస్వాదించగలను. ఎందుకిలా? ఒక స్త్రీ యొక్క అతి మనోహర చిత్రాన్ని నా ఊహల్లోకి దింపిన తత్ క్షణం నా హృదయం ప్రశ్నిస్తుంది – ప్రాణమంటే మాంస కండరాలతో కూడిన పదార్థమా? సందేహం లేదు ! ఆమె వివిధ దేహ భాగాలలో మాంస కండరాలు సౌష్ఠవంగా పెరిగాయి. ఆమె సున్నితమైన చర్మాన్ని ధరించి ఉంది. కాని మాంసం మాంసమే – చర్మం చర్మమే. ప్రపంచంలో ఎక్కడైనా మాంసకండరాలు సహజంగా ఒక్కటే! అవి అన్నీ చెమటను కక్కుతాయి – వాసనను గుప్పుతాయి. అతి సౌందర్యమైన, అతి వికారమైన శరీరాలను కోసి శాస్త్ర శోధన చేసి చూడండి. అన్నీ ఒకేలా కనిపిస్తాయి. అందుకే నా హృదయం మానవ సౌందర్యాన్ని నిస్సంశయంగా అసహ్యించుకొంటుంది. కాని అది యుక్తాయుక్త వివేక సౌందర్యాన్ని ప్రేమిస్తుంది. ఆ యుక్తాయుక్త వివేక దృష్టితోనే నా 'ముసలమ్మ' పాత్ర జనించింది. విషయమేమిటంటే, నేను ఈ యుక్తాయుక్త వివేక సంబంధమైన, ఆత్మ సంబంధమైన ఔన్నత్యపు ఆలోచనలో మునిగినప్పుడు, నా బుద్ధి ఈ విధమైన ప్రత్యేకమైన సూక్ష్మమైన స్వభావం గల విషయాలకు రూపురేఖలు దిద్దుతుంది. ఆ సౌందర్యానికి నా హృదయంలోని ప్రతి పొర పులకిస్తుంది. మానవత్వం అంటే యుక్తాయుక్త వివేకం మరియు తాత్త్విక దృక్పథం – అంతకు మించి ఇంకేం లేదు. ఈ స్ఫూర్తితోనే నేను 'ముసలమ్మ'ను రచించాను.

*– సి. ఆర్. రెడ్డి (తేది : 8–2–1900)"*

19వ శతాబ్దిలో 19 ఏళ్ళ వయసులో ఇంత మానసిక పరిపక్వత, విశాల భావనా పటిమ గల సాహితీమూర్తి ప్రబంధ సరణిలో అంగాంగ వర్ణనలు, శృంగార చేష్టలను ఎలా వర్ణించగలడు? అందుకే ఎంతో నవ్య దృష్టితో రెడ్డిగారు ఈ కావ్యాన్ని సృజించారని అందరూ అంగీకరించక తప్పదు.

స్థూలంగా ఈ కావ్య కథాక్రమం ఏమిటంటే – బుక్కరాయసముద్రం అన్న గ్రామంలో విపరీత వర్షాల వల్ల ఆ ఊరి చెరువు కట్ట తెగి గ్రామాన్ని ముంచి వేయబోతున్న సమయంలో, ఊరి రైతులు గ్రామ దేవతను ప్రార్థించగా, బసిరెడ్డి అనే రైతు చిన్న కోడలు ముసలమ్మ చెరువుకు బలి అయితే ఆపద తొలుగుతుందని ఆకాశవాణి పలుకుతుంది.

*"బసి రెడ్డి గడ కోడలు*
*ముసలమ్మ యనంగ నొప్పు పుణ్యాంగన తా*
*వెస బలిగా బోయిన మీ*
*కిసు మంతయు గష్ట మెన్నడేలా కలుగున్?"[10]*

అప్పుడు గ్రామ ప్రజల హితంకోసం ఆ ఇల్లాలు తన భర్తను అత్తమామలను ఒప్పించి, ఆత్మత్యాగం చేస్తుంది. సామాజిక హితం కోసం నిస్వార్థంగా ప్రాణ

త్యాగానికి సిద్ధపడిన మహనీయ సాధ్వి పాత్రను కట్టమంచి వారు ఎంతో కరుణ రసాత్మకంగా కళ్ళకు కట్టినట్టు చిత్రించారు. అనంతపురం మండలంలో ఒకప్పుడు జరిగిన యథార్థ సంఘటనకు కమనీయమైన కల్పనలు జోడించి రచించిన ఈ వినూత్న కావ్యం 1899వ సం.లో మదరాసు క్రైస్తవ కళాశాలలో నిర్వహించిన ఉత్తమ కావ్య రచన పోటీలో, సుప్రసిద్ధ పండిత కవి వేదం వేంకటరాయశాస్త్రి ప్రభృతుల న్యాయ నిర్ణయానుసారం ప్రథమ బహుమతిని సాధించింది.

ముఖ్యంగా, ఆత్మ త్యాగ నిర్ణయానందం, ఆత్మీయులతో వియోగ కారణ దుఃఖం, ఈ రెండూ కలగలసిన హృదయంతో భర్త ఎదుట నిలిచిన ముసలమ్మను కవి వర్ణించిన తీరు హృదయాలను కదిలిస్తుంది.

*"తనకు గడు గూర్పు ప్రజలకై తాను వేగ*
*బ్రాణముల్ వీడ సంతస పడియు బాల –*
*మగని, నత్తను, మామను, మరదుల, మరి*
*గల జనమ్ముల విడిచి పోగాళ్ళు రాక –*

*లేనగవును, గన్నీళ్ళును*
*గా నెద తట తట యనంగ, గాంతుని యెదుటన్*
*వానయు, నెండయు గలిసెడు*
*చో నొప్పెడు నభమనంగ, సుందరి నిలిచెన్"*[11]

అలాగే తన ప్రాణత్యాగానికి ముసలమ్మ తన భర్తను ఒప్పించుకొను సన్నివేశం మరింత హృదయ విదారకం.

*"కుదువను గట్టను దొరకక*
*కడు వగలం బొగలు జనుల గాంచెదవా? యీ*
*పుడమికి భారంబగు న*
*న్విడ నాడ దలంతువా? వివేక నిధానా!*

*తనకు దేవుడిచ్చిన శక్తి కనుగుణముగ*
*నన్నదమ్ములు నాదగు నఖిల జనుల*
*కలక నేనాడు దీర్పంగ దలపడేని*
*పుట్ట నేల నరుడు మరి గిట్టనేల?*

*జనులకు మేలొనరింపని*
*తనువేలా? కాల్పదగదొ? తానొక్కండై*
*తన వార లడల నేలా*
*గున దలయెత్తికొని తిరుగ గూడు నరునకున్?*

*మీరు కన్నార జూచుచు గారవింప*
*గన్ను మూసికొనుట నాకు ఘనము కాదొ?*
*తమకు దమ భార్య యిటు చేసె దగు దగునని*
*యెల్ల వారును వర్ణింప నింపు కాదొ?"* [12]

సమష్టిజీవన హితంకోసం వ్యష్టిజీవన త్యాగాన్ని ప్రబోధించే ఈ పద్యాలు తరువాతి కాలంలో ఆంధ్ర దేశంలోని ఏ కొందరు యువకులనైనా స్వాతంత్ర్య పోరాటానికై, స్వరాష్ట్ర సాధనకై త్యాగాలు చేయడానికి స్ఫూర్తి నిచ్చి ఉంటాయని నా ప్రగాఢ విశ్వాసం.

అయితే ఈ కావ్యంలో పంటి కింద గులక రాయిలా తగిలే విషయం ఒకటి ఉంది. అదేమిటంటే–

ఆకాశవాణి ఒక అబల ఆత్మత్యాగాన్ని కోరడం వల్ల అంధవిశ్వాసాన్ని కవియే చిత్రించినట్లయింది. అలాకాకుండా, ఆకాశవాణి ప్రమేయం లేకుండా, ఆ ఊళ్ళో తరతరాలుగా నెలకొన్న అంధ విశ్వాసానికి నాయిక స్పందించి ఆత్మత్యాగం చేసినట్లుగా చిత్రించి ఉంటే ఆ పాపం కవి కలానికి అంటుకొని ఉండేది కాదు. పైగా అంధ విశ్వాసాల వల్ల అమాయికులు ఎలా బలి అవుతున్నారో కవి సమాజానికి చాటినట్టయేది. కానీ, ప్రచారంలో ఉన్న ఒక యథార్థగాథను వస్తువుగా స్వీకరించడం వలన కవిని ఈ విషయంలో మనం ఏ విధంగానూ తప్పు పట్టనవసరం లేదు. అయినా కవి ఆనాటి పరిస్థితులలో ఈ కావ్యంలో ఇన్ని రకాలయిన నవ్యతలు సంతరించడమే ఆశించిన దాని కంటె ఎక్కువ. ఇంకా అది నవ్యంగా లేదు – ఇది

నవ్యత కాదు అని, వంద సంవత్సరాల పైన గడిచాక, మారిన పరిస్థితులలో మనం భావించడం సరికాదు.

అయినా కొన్ని సందర్భాలలో కొందరు ఆధునిక విమర్శకుల కన్న కట్టమంచివారే నవ్యులనిపిస్తారు. దుఃఖాంతంగా ముగిసిన ఈ కథా కావ్యాన్ని పింగళి లక్ష్మీకాంతం పండితులు మంగళాంతంగా నిరూపించేందుకు చేసిన ప్రయత్నం చూడండి.

“కథాంతమున జరిగెడి మరణము లోక కల్యాణప్రదముగా బ్రదర్శింపబడునేని అది మంగళాంతమనియే భావించవలెను. సంఘ శ్రేయమునకై నవ్వు మోముతో ఆత్మబలిని అంగీకరించి స్వయముగా మృత్యుదేవతాశ్లేషణ మొనర్చుకొన్న ఆ కాపు బిడ్డ ముసలమ్మ త్యాగము ఎంత లోకకల్యాణ హేతువో చెప్పనక్కరలేదు. ఆ మహానుభావురాలి యఖండ త్యాగమువలన ఆ గ్రామీణులందరు బిడ్డలతో బచ్చగా నిల్చియుండటమే ఈ కథ వలన కలిగిన మంగళము”[13]

నాయిక మరణం మరణమే. అశుభాంత కావ్యం అశుభాంతమే. అందువల్ల సాహిత్యానికి, కవికి, పాఠకులకూ వచ్చిన ప్రమాదమేమీ లేదు. అది మంగళాంతమని సరిపుచ్చుకొనవలసిన అవసరం కూడా లేదు. ఆంగ్ల సాహిత్యంలో “రోమియో జూలియట్'' నాటకం, భారతీయ సాహిత్యంలో ''దేవదాసు'' నవల విషాదాంతాలయినంత మాత్రాన ఏర్పడ్డ ప్రమాదం ఇసుమంతైనా లేదు. పైగా అవి పాఠకుల విశేషాదరణకు పాత్రమై, అజరామర ఖ్యాతిని పొందాయి. ఆ స్ఫూర్తితోనే “ముసలమ్మ మరణం” కావ్యాన్ని, కూడా మనం స్వీకరించాలి. పైగా తన ఆత్మ బలిదానం వల్ల సమాజ హితం చేకూరుతుందని ముసలమ్మ, ఆ ఊరి రైతులు మూఢ విశ్వాసాల వల్ల భావించినట్టు మనం గ్రహించాలి కాని, లక్ష్మీకాంతం గారు పేర్కొన్నట్టు, నిజంగా ముసలమ్మ మరణం వల్ల ఆ గ్రామీణులందరు బిడ్డలతో పచ్చగా నిల్చి ఉండటం కల్ల. ఆ ఆత్మ త్యాగం తరువాత ఆపద తొలగిందని గాని, ఆ గ్రామీణులు పచ్చగా విలసిల్లారని గాని, రెడ్డిగారు కూడా ఎక్కడా వ్రాయకుండానే కావ్యాన్ని ముగించడం గమనార్హం.



డా. సి. నారాయణరెడ్డి గారి వంటి అభ్యుదయ కవి సైతం లక్ష్మీకాంతం గారి ప్రభావానికి లోనయి – “ఒక వ్యక్తి ఆత్మార్పణము వలన వందల ప్రాణములు నిలిచినవి. అనగా అసంఖ్యాక జనావళికి మంగళము జరిగినది. కావున ఈ కావ్యములోని కథను బట్టి చూచినచో ఇది మరణాంతమైనను, మంగళాంతమనియే చెప్పవచ్చును. అనగా స్థూలముగా మరణాంతము వలె కనపించెడు ఈ కథ నిగూఢముగా సంప్రదాయము వైపు ములు సూపుచునే యున్నది”[14] అని ప్రకటించడం ఆశ్చర్యాన్ని గొలుపుతుంది. శోకాంత కావ్యాన్ని కూడా మంగళాంతంగా భావించడం ఆయా విమర్శకులకు గల కొద్దిపాటి సంప్రదాయ ప్రీతిని తెలియజేస్తుందేమోగాని ఇరవయ్యో శతాబ్ది ఆదిలో వచ్చిన “పూర్ణమ్మ”, “స్నేహలతాదేవి లేఖ” వంటి కావ్యాలకు ప్రేరణగా నిల్చేలా, కట్టమంచి రామలింగారెడ్డి 19వ శతాబ్ది అంత్యకాలంలో వెలిగించిన సంప్రదాయ వ్యతిరేకత, అభ్యుదయాత్మక నవ్యతకు ఎలాంటి భంగం వాటిల్లదు.

19వ శతాబ్దిలో ఆంధ్ర సాహిత్యంలో అనేక నూత్న ప్రక్రియలకు ఆద్యుడైన మహాకవి, రచయిత, సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారు వెటకారంగా, వ్యంగ్యంగా, హాస్య భరితంగా, ‘అభాగ్యోపాఖ్యానం’ పేరిట 1876వ సంవత్సరంలో ఒక వ్యంగ్య ప్రబంధాన్ని రచించి, ప్రబంధ ధోరణిలో రచించే ఆనాటి కవులు సిగ్గుతో తలదించుకొని, నవ్య మార్గంలో అభ్యుదయాత్మక కవిత్వ మల్లాల్సిన అగత్యాన్ని కల్పించారు. ఈ వ్యంగ్య ప్రబంధాన్ని గురించి మరొక ప్రత్యేక అధ్యాయంలో సవిస్తరంగా చర్చిస్తాను.

అంతటితో ఆగకుండా, పంతులుగారు ఈ దిశలో రచించిన మరో కావ్యం – ‘సరస్వతీ నారద విలాపము’. ఈ కావ్యం రచనా కాలంపై కొంత భిన్నాభిప్రాయాలు నెలకొని ఉన్నాయి. ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తమ ‘ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు; ప్రయోగములు”లో ఈ కావ్యం 1887లో రచింపబడినదని పేర్కొన్నారు.[15] తెలుగు అకాడమి వారు ప్రచురించిన ‘తెలుగు సాహిత్య కోశము’లో ఇది 1879గా ఉంది. అదే గ్రంథంలో మరోచోట ఈ కావ్యం రచనాకాలం 1895 అని ఉంది.[16] అయితే ఆరుద్ర, అక్కిరాజు రమాపతిరావు వంటి పండితులు దీని రచనా కాలాన్ని 1895గా పేర్కొన్నారు.[17] అయితే అత్యధికులు ఆమోదించిన 1895నే

దీని రచనా కాలంగా స్వీకరించవలసి ఉంటుంది.

ఇంతకు ముందు పేర్కొన్న కవులంతా సమకాలీన సాహిత్యంలో కొనసాగుతున్న సంప్రదాయాలకు వ్యతిరేకంగా, అభ్యుదయాత్మకంగా కొన్ని కొన్ని నూత్న ప్రయోగాలు చేస్తే, ఈ కావ్యంలో కందుకూరి వారు నేరుగా ఆ సాహిత్యం, ఆనాటి సంగీతంలో ఉన్న పెడధోరణులను విమర్శిస్తూ, సరస్వతీమాత, ఆమె పుత్రుడు నారదుడు సంభాషించుకొన్నట్టు, దిగజారిన ప్రబంధ శైలితో ఆంధ్ర సాహిత్యం అధ్వాన్న స్థితిలో ఉందని వాపోయినట్లు చిత్రించారు. ఆచార్య ఎస్. వి. రామారావు గారు వెలిబుచ్చిన అభిప్రాయం ఇక్కడ గమనార్హం. "స్పెన్సర్ కవి వ్రాసిన The tears of Muses 'సరస్వతీ నారద విలాపము'నకు ప్రోద్బలకము కావచ్చును. అందు Muses (విద్యా దేవతలు) ముఖమున స్పెన్సర్ ఆంగ్ల సాహిత్య ధోరణిని నిరసించినట్లుగానే పంతులుగారు కూడ ఇందు వాగ్దేవి అయిన సరస్వతి ముఖమున క్షీణ ప్రబంధ కవితా ధోరణిని ఖండించిరి."[18]

మొత్తానికి ఆంధ్ర సాహిత్యంలో 19వ శతాబ్ది పూర్వార్ధం వరకు కొనసాగిన కుసంస్కారాలను దుయ్యబట్టి, ఈ ధోరణులను విడనాడి, సాహిత్యాన్ని 20వ శతాబ్దిలో అభ్యుదయ పథంలోకి నడపాలన్న ఆలోచనను కలిగించే విధంగా 19వ శతాబ్దిలోనే వీరేశలింగం పంతులు ఈ కావ్యాన్ని రూపుదిద్దడం విశేషం. అందువల్ల ఇది కేవలం అభ్యుదయ రచన అనడం కన్న అభ్యుదయానికి బాటలు వేసిన కావ్యం అని ప్రస్తుతించవచ్చు. నిర్వచనంగా పూర్తిగా పద్యాలలో నడచిన ఈ కావ్యం నాటిక రూపంలో ప్రదర్శన యోగ్యంగా ఉండడం మరొక నవ్యత. ఈ విషయాన్ని "19వ శతాబ్ది తెలుగు కవిత్వం – ప్రక్రియాపరమైన నవ్యత" అన్న అధ్యాయంలో చర్చిస్తాను. ఈ అధ్యాయానికి సంబంధించినంత వరకు కవి అభ్యుదయ భావాలు కలిగి, ఆనాడు అధికంగా వెలువడుతూన్న వ్యర్థ ప్రబంధాలను చూచి ఎంతగా చింతించారో చూద్దాం.

కందుకూరి వారు ఆ రోజుల్లో ఆంధ్ర దేశంలో మితిమీరిన వేశ్యా వ్యాపారాలను నిరసిస్తూ ఉద్యమాన్ని నడిపారు. నారదుడు తన హరి కీర్తనాన్ని ఆదరించే వారు కరువవుతున్నారని, విటులు వేశ్యల బూతు కూతలనే సంగీతంగా భావిస్తున్నారని వేదన చెందినట్లుగా పంతులుగారు వ్యంగ్యంగా ఆనాటి సామాజిక స్థితిని వివరించారు. దేవముని ఆవేదన చూడండి –

*"కటువులె యీ హరి కీర్తన*
*లట మటమున విటుల కొక్క యర కాసునకున్*
*దటుకున మానమె యమ్మెడు*
*కుటిలాలక లరచు బూతు కూతల కంటెన్?"*[19]

ఇలా Anti - nautch ఉద్యమస్ఫూర్తిని కవితలలో ప్రకటించడం కూడ అభ్యుదయాత్మక నవ్యతే కదా! ఇక, సరస్వతీదేవి సైతం ప్రాచీన కాలంలో రమణీయోక్తులతో, అర్థ గుణ స్వారస్యాలతో కూడిన కమనీయ కావ్యాలతో తాను సుఖిస్తుండగా, ఆనాటి కవులు రసహీనమైన కావ్యాలు రచించి తనకు ఆర్తిని కలిగిస్తున్నారని వ్యథ నొందినట్లుగా ఆయన వర్ణించారు.

*"అటు సుఖియింపుచుండగ మదాస్యమునందు నిరర్థకంబులై*
*పటపటలాడు శబ్దముల బల్మిని బెట్టి, రసంబు నెట్టి య*
*క్కటికము లే కలంకరణ కైతవముం గొని మేను కుట్టి యి*
*ప్పటి ఘను లార్తి పెట్టెదరు ప్రాణము తీసి ననుం గలంచుచున్!*

*తెలియదు సుమ్మిప్పుడు నా*
*పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్*
*వెల భూషలు గాకివి సం*
*కెలలయి కడు నాదు మేనికిన్ వెత నించున్!"*[20]

కావ్యంలో ఒక చోట "ఛందోబద్ధంబగు పదబృందాటోపంబు తా కవిత్వంబగునే?" అని నేరుగా నారదునితో ప్రశ్న వేయిస్తారు వీరేశలింగం పంతులు. 20వ శతాబ్దిలో, తెలుగు సాహిత్యాన్ని చుట్టు కొన్న ఛందస్సు పరిష్వంగాలను తొలగిస్తామన్న కొందరు ఆధునిక అభ్యుదయ కవుల భావజాలానికి ఇది బీజంగా పని చేసిందని చెప్పవచ్చు.

పంతులుగారు ఇంకా ముందుకు వెళ్ళి, మరింత కటువుగా, తన నిశ్చితాభిప్రాయాన్ని ఇలా తెలిపారు.

*"విను – ఛందోబద్ధంబను*
*ఘన కారణముననె బ్రతుకు గననగునేనిన్*

*తనువది వదలి వెసం జ*
*క్కని మృతి నొందుటయె లెస్స కవితా సతికిన్!"* [21]

కాని, అలాంటి కవిత్వాన్నే ఆనాటి మేధావులనబడే వాళ్ళు పొగుడుతున్నారని సరస్వతి చింతిస్తున్నట్టు కవి వర్ణించారు.

*"అవునది నిజమే యైనను -*
*భువిలో ప్రాణంబు లేని బొందియె యిపుడీ*
*నవ మేధావుల చేతన్*
*వివిధంబుగ బొగడ బడెదు! విధినేమందున్?*

*దయమాలి తుదముట్ట దలకట్ల నిగిడించి*
*ధీరుడై నన్ను బాధించు నొకడు*
*పాదంబులోపల పాదంబు లిమిడించి*
*వీరుడై నన్ను నొప్పించు నొకడు*
*ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లొదవించి*
*పోటు బంటై నన్ను పొడుచునొకడు*
*బెండు పల్కులు గూర్చి నిండించి నగలంచు*
*దిట్టయై జెవులు వేధించు నొకడు*

*ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి*
*వర్ణములు మార్చి నను జిక్కు పరచునొకడు*
*కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములు తీయ*
*నొడలి పసలేక శుష్కించి యున్న దాన!"* [22]

అంటూ ఆనాటి క్షీణ ప్రబంధ కవులకు చిత్ర కవిత్వం, గర్భ కవిత్వం, బంధ కవిత్వం పట్ల గల వ్యామోహాన్ని, ప్రాసలకోసం వారి ప్రాకులాటలను నిశితంగా విమర్శించారు.

నారదుడు సైతం సశాస్త్రీయమైన సంగీత మాధుర్యాన్ని లెక్క జేయక వేశ్యల వెంట తిరిగే యువకులకు చురకలంటించే విధంగా పద్యాలు రచించారు వీరేశలింగం.



సంగీతసాహిత్యాలు భారతికి రెండు కళ్ళవంటివని, ఆ రెండు కళ్ళకు ఆనాడు పొరలు క్రమ్మాయని ఆయన ఆనాటి మేధావులకు వివరించారు. ఈ లఘు కావ్యాన్ని, ఆనాటి దీన స్థితిని చూడ లేక సరస్వతీదేవిని తన వీపుపై కూర్చుండబెట్టుకొని నారదుడు ఎక్కడికో పారిపోతున్నట్టుగా ముగించడం కందుకూరి వ్యంగ్య రచనా వైభవానికి పరాకాష్ఠగా భావించవచ్చు.

వీరేశలింగం పంతులు 19వ శతాబ్ది సాహిత్యంలో అసంఖ్యాకంగా వస్తున్న నీరస కావ్యాలను నిరసిస్తూ 19వ శతాబ్దిలోనే ఈ లఘు కావ్యాన్ని రచించి ఆనాటి కవులు నవ్య మార్గంలో ఆలోచించేందుకు దోహదపడి, మార్గదర్శకులయ్యారు. అసలు సమకాలీన సాహిత్యంలోని పెడ ధోరణులను, కుసంస్కారాన్ని విమర్శించడమే ప్రధానాంశంగా తీసికొని ఒక వ్యంగ్య కావ్యాన్ని వెలయించడం కన్న నవ్యత ఇంకేముంటుంది? "సమకాలికులారా! మీ దిశ మార్చుకోండి" అని చెప్పేవాని కన్న వైతాళికు డెవడుంటాడు?

ఆంధ్రదేశ చరిత్రలో వీరేశలింగం పంతులుగారు సాహితీమూర్తిగా ఎంత పూజనీయుడో సంఘ సంస్కర్తగా అంతకన్నా ఆదరణీయుడు. ముఖ్యంగా ఆయన స్త్రీజనోద్ధరణకై చేసిన సేవ తరతరాలకు మరవలేనిది. పురుషాధిక్య సమాజంలో స్త్రీలకు సమానమైన అవకాశాలు ఆదరణ గౌరవం దక్కాలని ఆయన భావించేవారు. అందుకొరకు ఆయన ప్రత్యేకంగా పత్రికలను స్థాపించి ఆ విషయాలను ప్రచారం చేసేవారు. స్త్రీలకై ప్రత్యేకంగా రచనలు చేసి ప్రచురించేవారు. వాటిలో 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' అన్న కథల సంపుటులు చాలా ప్రసిద్ధి చెందాయి. మొదటి సంపుటి పేరు 'ఆడు మలయాళం'. అయితే ఇవి గద్య రచనలు. ఈ పరిశోధన పరిధి కేవలం కవిత్వం వరకే కాబట్టి ఆ కథల సంపుటిని గురించి గాని అందులో అభ్యుదయ భావాల గురించిగాని, వ్యంగ్య హాస్య రచనా వైభవం గురించి గాని చర్చించదలచుకోలేదు. కాని అందులో 'పత్నీవ్రత ప్రబోధము' పేరిట రచించిన 9 పద్యాల ఒక లఘు ఖండ కావ్యం స్త్రీ జనాభ్యుదయ భావాలతో వ్యంగ్యంగా హాస్యమిళితంగా ఉండి, ఒక స్వతంత్ర కావ్యానికి గల ప్రతిపత్తిని పొంది యుండడం వలన ఆ ఖండ కావ్యం గురించి చర్చించవలసిన అవసరం ఉందని భావిస్తున్నాను.

కందుకూరివారు తమ స్వీయ చరిత్రలో 'సత్యరాజా పూర్వ దేశ యాత్రలు' గురించి ఇలా చెప్పుకొన్నారు –

"స్త్రీల విషయమున మన వారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజా పూర్వదేశ యాత్రల యొక్క ప్రథమ భాగమును రచించి ప్రకటించితిని."[23].

భారతదేశంలో స్త్రీల పట్ల జరుగుతున్న అన్యాయాలు, చూపుతున్న వివక్ష 'ఆడు మళయాళం'లో పురుషుల పట్ల జరుగుతున్నట్టు ఆయన కల్పన చేశారు. మన హిందూ సంస్కృతిలో చిన్న నాటి నుంచి ఆడపిల్లలకు పాతివ్రత్యం బోధిస్తున్నట్టు, అక్కడ ఆడు మలయాళంలో మగపిల్లలకి చిన్నవయసునుంచే 'పత్నీ వ్రత ప్రబోధం' చేస్తారని ఆయన హాస్యస్ఫోరకంగా రచించారు.

డా. అక్కిరాజు రమాపతిరావు దీనిని గురించి వివరిస్తూ "ఆడు మళయాళంలో అక్కడి పెద్దలు  పురాణాలు బోధించే 'పత్నీ వ్రత బోధిని' అనే శాస్త్ర సారాంశాన్ని వీరేశలింగం పంతులుగారీ విధంగా సత్యరాజాచార్యులు అనే పాత్ర ద్వారా వెల్లడింపజేసారు.  వెక్కిరింతకు, వెటకారానికి, వేళాకోళానికి ఆధునిక తెలుగు సాహిత్యంలో ఈ రచనే శ్రీకారం చుట్టిందని చెప్పాలి"[24] అన్నారు.  సులభగ్రాహ్యమైన ఆ పద్యాలు చదివితే, హాస్యంతోబాటు ఆ నవ్యత కూడా అవగతమవుతుంది.

*"పురుషున కిమ్మహి బత్నియె*
*పరమంబగు దైవతంబు! పత్నీ సేవన్*
*నిరతము జేసెడి పురుషుడె*
*పరమున నిహమున సుఖముం బడయుంజుమ్మీ !*

*ప్రతిదినంబును బురుషుండు పత్ని కంటె*
*ముందుగా లేచి నదిలోన మునిగి, జలము*
*కలశమున దెచ్చి, నిజపత్ని కాళ్ళు కడిగి*
*తాను శ్రీపాద తీర్థంబు తాగవలయు !*

*స్త్రీ పాద తీర్థ సేవన*
*మే పురుషుడు చేయు నెన్ని యేడులు ధరలో*
*నా పురుషు డన్ని యుగములు*
*పాపములంబాసి మోక్ష పదవి సుఖించున్.*

*కుష్ఠు రోగిణియైనను, గ్రుడ్డిదైన,*
*భూరి వికలాంగియైనను, ముసలిదైన –*
*బత్ని యెంగిలి భుజియింపవలయు సతము*
*పుణ్య లోకంబు గాంక్షించు పురుష వరుదు !*

*ఏ పురుషు డతివ యెంగిలి*
*పాపపు మతి నేవగించి భక్షింపండో*
*యా పాపాత్ముడు నారక*
*కూపంబున గూలు జూవె కోటి యుగంబుల్ !*

*దూరమున జూచి పత్నిని*
*గారవమున లేచి యొంటి కాలున బురుషుం,*
*డోరగ వంగగ వలయును*
*గూరిమి గూర్చుండ నిల్వగూడదు సుమ్మీ !*

*పురుషుడును గార్దభమున్*
*స్థిరముగ దండనము లేక చెడిపోదు రిలన్*
*గరుణయు దలపక నెలకొక*
*పరియైనను గొట్టవలయు బత్ని పురుషునిన్!*

*పత్ని గొట్టిన దిట్టిన బాధయిడిన*
*భోగ పురుషుల బొందిన బొదవ కీర్త్య*
*దరుణియే పురుషునకును దైవమనుచు*
*భక్తి ననయంబు సేవింప వలయు జుమ్ము!*

అతివలకు స్వేచ్ఛ భూషణమైన యట్లు
పురుషులకు లజ్జయే మహా భూషణంబు
సూర్య చంద్రులు మొగమైన జూడకుండు
పరమ పత్నీవ్రతుడె పొందు పరమగతులు" [25]

19వ శతాబ్దినాటి పురుషులు పాదపూజలు చేయించుకోవడం; తమ యెంగిలిని భార్యతో విధిగా తినిపించడం; తమ కనుసైగలతో భార్య కూర్చునేలా, నిలుచుండేలా శాసించడం; వంటింటిని దాటి బయటికి రానీయక పోవడం; తమకు ఎదురు తిరగకుండా ఉండేందుకు నెలకొక మారు కల్పించుకొని చితగ్గొట్టడం లాంటి దౌర్జన్యాలను సాగించడం చూసి, ఆవేదనతో అదే పరిస్థితి పురుషులకు కలిగితే ఎలా ఉంటుందో తెలియ జెప్పడానికి సున్నితమైన హాస్యాన్ని మేళవించి చేసిన వ్యంగ్య రచన ఇది. స్త్రీ, పురుషులు సమానమే – వారు పరస్పరం ఒకరినొకరు గౌరవంగా, ప్రేమగా ఆదరించాలన్న ఆలోచనను రేకెత్తించాలన్న ప్రయత్నంగా చేసిన అభ్యుదయాత్మక రచన ఇది. ఈ కవిత గురించి వ్యాఖ్యానిస్తూ డా. అక్కిరాజు రమాపతిరావు "సత్యరాజాచార్య కృత 'పత్నీహిత ప్రబోధ నవరత్నమంజరి' – స్త్రీల విషయమై పురుషాహంకారపు ప్రపంచాన్ని ఆయన ఎంతగా ఏవగించుకొన్నాడో తెలిపే రచన. మహిళా వికాసం కోసం ఆయన వకాల్తా పుచ్చుకొని పురుష జాతిపై ప్రయోగించిన కళాఘాతం ఈ రచన. ఇక్కడ ఈ దేశంలో స్త్రీలు అనుభవిస్తున్న బాధలు, అవమానాలు, అనుమానాలు, పరిభవాలు, నిరసనలు, నిందలు, హింసలు, హీనతలు పురుషుడే అనుభవించాల్సి వచ్చినప్పుడు ఎట్లా ఉంటుంది అనేది ఆయన సూటి ప్రశ్న. ఆయన హాస్య చమత్కార ప్రజ్ఞ, ఈసడింపు ఆ రచనలో వెల్లి విరిసాయి" [26] అని వివరించారు.

19వ శతాబ్దిలో ప్రధానంగా స్త్రీ జాతి పట్ల పురుషులు చూపే వివక్షను నిరసించడమే పలువురు రచించిన కావ్యాలలో ప్రధానంగా అభ్యుదయాంశంగా నిలిచింది. అయితే ఆ రోజుల్లోనే పరమత సహనం, మతసామరస్యం వంటి అంశాలు కూడ అభ్యుదయాంశాలుగా రూపొందించిన కవి కూడా లేకపోలేదు. క్రీ.శ. 1854లో వారణాశి అచ్యుతరామయ్య అనే కవి 'సురతాణీ పరిణయము' అన్న ఒక కావ్యాన్ని వెలయించాడు. ఇది బీబీ నాంచారి, శ్రీరంగ నాథుని ప్రణయ పరిణయ గాథ. ఈ కావ్యం భక్తి, శృంగారాత్మకంగా సంప్రదాయరీతిలో రసవంతంగా నడచినా, అక్కడక్కడా పరమత సహన ప్రబోధకంగా సాగి, మత సామరస్య భావనకు ప్రతీకగా నిలిచింది. ఒక మహమ్మదీయ వనిత, హైందవ దైవాన్ని పరిణయమాడిన కథ ప్రచారంలో ఉన్నా, దానిని ఒక కావ్య వస్తువుగా స్వీకరించి రసాత్మకంగా తీర్చిదిద్దడం ఆ రోజుల్లో ఒక సాహసమే కాకుండా, అభ్యుదయ పథానికి వేసిన ఒక పునాదిరాయిగా భావించవచ్చు.

మహమ్మదీయ ప్రభువును కవి – "సేకు ముఖ మ్లేచ్ఛకుల నిసర్గ ధర్మ పరిపాలనుడు" [27] అని ప్రస్తుతించడం, సురతాణుడు (సులతాను) హైందవ దేవతల విగ్రహాలను కొల్లగొట్టి బంధించినపుడు, విగ్రహరూపంలో ఉన్న శ్రీరంగనాథునికి సురతాణి (బీబీ నాంచారి) ప్రేమలభించడంతో, ఆ హైందవ దైవం – "చెర నుంచిన సురతాణుడు పరికింప మహోపకారి " [28] అంటూ ఆ మహమ్మదీయ ప్రభువును కీర్తించడం, సురతాణుడు "అచ్ఛా బహద్దురుగ యిది స్వచ్ఛంబుగ దోచుచుండె" [29] నని, శ్రీ వైష్ణవ మత సంస్థాపక ప్రవక్త శ్రీ రామానుజాచార్యను తన వద్దకు సగౌరవంగా రప్పించి – "మీ యవార్య తేజ మరయ నరుదు ! మీరలడిగిన నిచ్చెద బూజ్యమైన, నాదు రాజ్యమైన–" [30] అంటూ శ్రీరంగనాథాది దేవతావిగ్రహాలను అతనికి తిరిగి ఇచ్చి వేయడం వంటి ఘట్టాలు, రెండు వేర్వేరు మతాల పాత్రలు పరస్పరం గౌరవించుకోవడం ప్రబోధించి మతసామరస్య భావనకు దోహదం కావడం కవి అభ్యుదయ ధోరణికి తార్కాణాలు. ఆ విధంగా 19వ శతాబ్ది నడిమి భాగంలోనే సాహసోపేతమైన కావ్య వస్తువును ఎన్నుకొని, రసవంతంగా ఉదాత్త పాత్ర చిత్రణలతో అభ్యుదయాత్మక నవ్యతను చూపిన చక్కని కవి శ్రీ వారణాశి అచ్యుత రామయ్య.

ఇలాంటి అభ్యుదయాత్మక రచనల నెన్నో ఆంధ్ర సాహిత్య చరిత్రలో 19వ శతాబ్దిలోనే అందించిన మరొక కవి శ్రీ ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మ. ఈయన విద్వత్కవి. సంస్కృతం, వేదశాస్త్రాలు స్వయంకృషితో నేర్చుకొన్నారు. సంగీతం, నాట్యం, చిత్రకళ వంటి లలితకళలలో మంచి పరిజ్ఞానం కలవారు. ప్రాచీనాధునిక హైందవ రాజ్యాంగ విశేషాలను చక్కగా పరిశీలించినవారు. భౌతిక, రసాయనాది శాస్త్రాలలో విజ్ఞానాన్ని సముపార్జించుకున్న ఆధునికులు. భూ, వృక్ష, క్రిమి, కీటక,

ఖనిజ తత్వాలను అధ్యయనం చేసిన వైజ్ఞానికులు. తెలుగు అకాడమి వారు 1986లో వెలువరించిన తెలుగు సాహిత్య కోశం (రెండవ భాగం)లో వీరి సాహిత్య కృషిని గూర్చి గల విశేష పరిచయంలో ఈ క్రింది వివరాలు తెలుస్తున్నాయి.

"1885లో శతఘంట కవిత్వం చెప్పారు. తిరుపతి వేంకట కవులకు పూర్వమే (1884) శతావధానాలు చేశారు. 1921లో తణుకులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు వార్షికోత్సవ సభకు అగ్రాసనాధిపతులు. ఆంధ్ర నాటకకళాపరిషత్తు స్థాపకులలో వీరొకరు (1929). తెలుగులో కథానికారచనకు వీరే ఆద్యులనీ, కల్పలత పత్రికలో (1903 నవంబరు) ప్రచురితమైన వీరి 'లలిత' తొలి కథ అనీ విమర్శకుల అభిప్రాయం.[31] బాలాంబ, లలిత, చంద్ర వర్మ ఈ కథలోని ముఖ్య పాత్రలు. నాయిక పరంగా పేరు పెట్టడం, సమకాలీన సమాజాన్ని, దేశ కాలాదులను వర్ణించడం, శైలి వర్ణనాత్మకంగా ఉండటం, సంభాషణలు తక్కువగా ఉండటం దీనిలోని నవ్యతా గుణాలు. 'అపూర్వోపన్యాసము, సారసిక, విశాఖ' వీరి ఇతర కథలు. అపూర్వోపన్యాసంలో వితంతు వివాహ సమర్థనం, సారసికలో ఆదర్శ ప్రేమ, విశాఖలో ప్రేమ త్యాగం కథా వస్తువులు. వస్తు శిల్పం దృష్ట్యా ఇవి ఎన్నదగిన కథలు. తెలుగులో గేయ కవిత్వానికి శ్రీకారం చుట్టినవారు కూడా వీరే అని పండితాభిప్రాయం. 'ఆంధ్ర పద్యావళి' నవ్యకవితా సంపుటి. సంఘ సంస్కరణోద్దేశంతో రాసిన ఖండకృతులతోపాటు దీనిలో దాదాభాయి నౌరోజీ మొ. వారిని గురించిన పద్యాలు కూడా ఉన్నాయి."[32].

1892వ సంవత్సరంలో వెలువడిన సాంఖ్యాయన శర్మ రచించిన 'ఆంధ్ర పద్యావళి' తెలుగులో, లిరికల్ కవిత్వానికి (అనగా వర్ణనాత్మకమై, శ్రవ్యగుణ సంపన్నమైన కవిత్వానికి) శ్రీకారం చుట్టిన గ్రంథంగా ప్రసిద్ధం. సంఘ సంస్కరణాసక్తి, సామాజిక రుగ్మతలపై అధిక్షేపం, సుప్రసిద్ధ రాజకీయ నాయకుల ప్రశంస, రవివర్మ చిత్ర పటాలు వంటి ఆధునిక వస్తువులపై అనుభూతి కవిత్వం ఈ కవితలలోని విషయాలు. ఈ సంపుటిలోని శీర్షికలు భావాలు అన్నీ నూతన రీతులలో ఉన్నాయి. 20వ శతాబ్దిలో వ్యవస్థీకృతమై రాజ్యమేలిన ఖండ కావ్య ప్రక్రియకు ఈ కవితలు మాతృకలని చెప్పవచ్చు. అలా 19వ శతాబ్దిలోనే ఖండకావ్యాలకు తొలిరూపుదిద్దిన ఆద్యుడు సాంఖ్యాయన శర్మ. ఈ విషయాన్ని ప్రక్రియాపరమైన నవ్యతను పరిశీలించే అధ్యాయంలో సవిస్తరంగా చర్చిస్తాను. ఈ అధ్యాయానికి సంబంధించినంత వరకు ఆచంటవారి అభ్యుదయ కవితా రీతిని ప్రస్ఫుటింపజేసే పద్యాలు కొన్ని పరిశీలిద్దాం.

సాంఖ్యాయనశర్మ 'ఆంధ్రపద్యావళి' సంపుటిలో Anti nautch సాంఘికోద్యమం, ఇతర సాంఘిక సమస్యలపై ఎన్నో పద్యాలను రచించారు. మచ్చుకు ఒక పద్యంలో

*"బిందె బిందెడు కాఫీకి పిడుగు తునక*
*కట్ట చుట్టల కాల్చెడి పుట్టుభోగి*
*బుట్టెడాకులు నమిలెడి పుణ్య భోగి*
*నాగరికులన్న వేరె యున్నారె, వీరె !"* [33]–

అంటూ వ్యసనాలను నాగరికతా లక్షణాలుగా భావిస్తున్న ఆనాటి సామాజికులకు చురకలంటించారు.

ఆచంట వారు కందుకూరి వారి లాగే స్త్రీ పురుష సమానత్వాన్ని ప్రబోధించే పద్యాలను రచించారు. అయితే ఈయన శైలి వేరు. ఈయనకు గల వైజ్ఞానిక పరిజ్ఞానం వలన, వైజ్ఞానిక విషయాలను, సాంఘిక సమస్యలను మేళవించి చేసిన వ్యంగ్య చమత్కార రచనలు నవ్యతతో అని కాకుండా 'అతి నవ్యత'తో కూడుకొన్నవని ప్రస్తుతించక తప్పదు. 'సంఘ సంస్కరణము' అన్న ఖండకృతిలో డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతాన్ని స్త్రీ సమానత్వ ప్రబోధానికి అన్వయించిన తీరు కవి ధిషణా వైభవాన్ని, లలిత హాస్య చాతుర్యాన్ని చాటుతాయి.

*"నెలతలు చంటి బిడ్డలకు బాల్గుడుపుటే*
*ప్రకృతి ధర్మంబని పలుక రాదు*
*ప్రకృత శాస్త్రజ్ఞులౌ పండితుల్ డార్వినూ*
*మున్నగు వారలు కొన్ని చోట్ల*
*పురుషులు రొమ్మినం బొడమిన పాలతో*
*శిశు పోషణంబని చెప్పినారు*
*ప్రకృతి ధర్మంబులు ప్రభవించు నశియించు*
*నభ్యాస పద్ధతి ననుసరించి*

*మగువలకే గాని చన్నాలు మగలకెందు*
*పొడమవను మాటలన్నియు బూటకములు*
*పురుషులిక మీద స్తన్యంబు వొదమునట్లు*
*రొమ్ము సవరించుకొనుట కార్యమ్ము గాదె"*[34]

అలాగే ఈ సంపుటిలో శర్మగారు సుప్రసిద్ధ భారత జాతీయ నాయకుడు దాదాభాయి నౌరోజీపై ఒక ఖండ కృతిని వెలయించారు. దాదాభాయి నౌరోజీ భారత జాతీయ కాంగ్రెసు పుట్టక పూర్వం నుంచే స్వాతంత్ర్యంకోసం పోరాడిన మహనీయుడు. 1855లో వ్యాపారం నిమిత్తం ఇంగ్లండ్ వెళ్ళిన నౌరోజీ ఆంగ్లేయులకు భారత దేశ స్థితి గతులను వివరించేవాడు. లండన్‌లో ఇండియన్ సొసైటీ స్థాపించి, హక్కుల గురించి పోరాడాడు. 1855లో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబరయ్యాడు. 1886లో భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షుడయ్యాడు. అంతటి మహా జాతీయ నాయకునిపై ఖండ కావ్యం వెలయించడం వల్ల ఆచంట సాంఖ్యాయన శర్మ 19వ శతాబ్దిలోనే ఆంధ్ర సాహిత్యంలో జాతీయ భావాలను, స్వాతంత్ర్యేచ్ఛను కలిగించే అభ్యుదయ రచన చేశారని చెప్పవచ్చు. బహుశః తెలుగులో ఇదే తొలి జాతీయ వాద కవిత అయి ఉంటుంది. దురదృష్టమేమిటంటే ఈ కవితా సంపుటి ఇప్పుడు అలభ్యం.

ఇదిలా ఉంటే, క్రీ.శ. 1892 ప్రాంతంలోనే దాసు శ్రీరాములు పంతులు అనే కవి 'తెలుగునాడు అను ఆంధ్ర వీధిలో బ్రాహ్మణ ప్రశంస' అన్న ఒక వినూత్న కావ్యాన్ని రచించారు. ఈ కావ్య పీఠికలో కవి తన నవ్య దృష్టిని ఇలా వివరించారు.

"సంఘ విషయముల గూర్చి అబాధకములగు చమత్కార కావ్యములు మన దేశ భాషలలో లేవు. ఐరోపాఖండము వారి ప్రస్తుత నాగరిక ప్రవర్తనమునకు కారణ భూతములైనవి యిట్టి కావ్యములే యని జెప్పనవసరము లేదు." – ఇలా అభ్యుదయాత్మకమైన ఆలోచనతో ఈ కావ్య నిర్మాణం చేసిన శ్రీరాములు కవి తన కావ్య రచన లక్ష్యాన్ని గూడ ఈ పీఠికలో తెలియజేసారు. "మన దేశములో బ్రాహ్మణ శాఖలలో వివాహ సంబంధములుండుట శ్రేయోదాయకమని నా యభిప్రాయము."[35] ఇలాంటి ఆశయంతో 'ఆంధ్ర వీధిలో బ్రాహ్మణ ప్రశంస'గా రచించిన ఈ 'తెలుగు నాడు' కావ్యం నిజంగా ఒక అభ్యుదయాత్మక రచన అని చెప్పక తప్పదు. 19వ



శతాబ్దిలోనే చేసిన ఈ శాఖాంతర వివాహ ప్రబోధం 20వ శతాబ్దిలో ఆదర్శంగా నిలిచిన కులాంతర మతాంతర వివాహాలకు నాందీ వాక్యంగా భావించవచ్చు.

అంతే కాకుండా కవి ఈ కావ్యంలో అనాదిగా మన సమాజంలో నెలకొని ఉన్న 'కన్యాశుల్కం' దురాచారాన్ని నిరసిస్తూ పద్యాలు రచించి అభ్యుదయ పథంలో సాగిపోయారు.

*"చెప్పక యున్న దోషమగు – జెప్పిన గోపము లేమి సేయుదున్?*
*జెప్పక తప్పదీ వయిపు సీమల, బ్రాహ్మణ కోటి గన్యకల్*
*గొప్ప గిరాకి! పెద్దపడి గుండున నల్బది సేర్ల వెండికిన్*
*జప్పుడు లేక దూగు – నది చాలకయున్న మరొక్క సేరగున్!*

*చెప్పిన కార్యమే మెవరు చేతురు నా పలుకాలకించి, వెం*
*కప్పకు డెబ్బదేండ్లు, నరసమ్మకు నెన్మిది యేడు లీడుగా*
*జొప్పడెనంచు నాంధ్ర పద సూరులు తప్పక పొంతనంబులున్*
*జెప్పుదు రెంత తప్పు పని ఛీ! ముసలిం బసికాయ మెచ్చునే?"*[36]

ఇలా ఒక కావ్యంలో కన్యాశుల్కం' దురాచారంపై తన నిరసనను తెలియజేసిన తొలి కవి దాసు శ్రీరాములు అని చెప్పవచ్చు. అంతే కాకుండా గురజాడ వారి 'కన్యాశుల్కము' నాటకం ప్రథమ ముద్రణ క్రీ.శ. 1897లో వచ్చింది. అంతకుముందే శ్రీరాములు కవి ఈ రచనను చేయడం (క్రీ.శ. 1892 ప్రాంతంలో) గమనార్హం.

ఈ విధంగా 19వ శతాబ్ది పూర్వార్ధంలో శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి ప్రారంభించిన సంప్రదాయ వ్యతిరేకత, 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో మరింత విస్తృతమై, దానితో బాటు అభ్యుదయాత్మక రచనలు కూడా తోడై నవ్యతా మార్గానికి తెరతీసి, రాబోయే 20వ శతాబ్దికి మార్గదర్శకంగా నిలిచేలా, ఆయా వైతాళికులు విశిష్ట కృషిని సలిపారు. ఇదంతా 19వ శతాబ్దిలో రచింపబడి, ముద్రితమై ఇప్పటికీ అవసాన దశలో లభ్యమవుతున్న మూలగ్రంథాలు, ఇతర వివరణ గ్రంథాల ఆధారంగా చేసిన అధ్యయనం. ఇంకా ముద్రణకు నోచుకోక, ముద్రితమైనా సరియైన భద్రతకు నోచుకోక రాలిపోయిన 19వ శతాబ్ది నవ్య కవితా కుసుమాలెన్నో!

19వ శతాబ్దిలోని పైన పేర్కొన్న కవి వైతాళికులు చూపిన నవ్య మార్గాలను వ్యవస్థీకరించి 20వ శతాబ్ది కవులు నవ్యయుగాన్ని పరిపుష్టం చేశారు. ఈ విషయం తరువాతి అధ్యాయాలలో మరింత తేటపడుతుంది.

**పాద సూచికలు :**

1. శ్రీమదాంధ్ర మహాభారతము : ఆది పర్వము : అవతారిక 1
2. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి : తెలుగు సాహిత్య చరిత్ర – పంచమ భాగం – పుట. 329
3. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి : తెలుగు సాహిత్య చరిత్ర – పంచమ భాగం – పుట. 329
4. ఆదిభట్ల నారాయణదాసు : బాటసారి – పుట.1
5. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్ర సీమ – పుట. 1
6. యండమూరి సత్యనారాయణరావు : ఉషః కిరణాలు – పుట. 157
7. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి : ఆంధ్ర రచయితలు – పుట. 134
8. పింగళి లక్ష్మీకాంతం : ముసలమ్మ మరణము ఇత్యాదులు (1948 ముద్రణము)నకు ఉపోద్ఘాతము.
9. కట్టమంచి రామలింగారెడ్డి ముందుమాట – ముసలమ్మమరణము (ప్రథమ ముద్రణ)
10. కట్టమంచి రామలింగారెడ్డి ముందుమాట – ముసలమ్మమరణము (31వ పద్యం)
11. కట్టమంచి రామలింగారెడ్డి ముందుమాట – ముసలమ్మమరణము (43,44 పద్యాలు)
12. కట్టమంచి రామలింగారెడ్డి ముందుమాట – ముసలమ్మమరణము (63, 65, 66, 68 పద్యాలు)
13. పింగళి లక్ష్మీకాంతం : ముసలమ్మ మరణము ఇత్యాదులు (1948 ముద్రణము)నకు ఉపోద్ఘాతము.
14. డా. సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము– సంప్రదాయములు – ప్రయోగములు –పుట. 143
15. డా. సి. నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వము– సంప్రదాయములు – ప్రయోగములు – పుట. 139
16. తెలుగు అకాడమి తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యం) పుటలు. 925 & 1181
17. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యము (పదకొండో సంపుటం) – పుట. 85
18. ఆచార్య ఎస్వీ రామారావు : తెలుగులో సాహిత్య విమర్శ (పుట. 106)
19. కందుకూరి వీరేశలింగం : సరస్వతీ నారద విలాపము – (4వ పద్యం)
20. కందుకూరి వీరేశలింగం : సరస్వతీ నారద విలాపము – (11, 12 పద్యాలు)
21. కందుకూరి వీరేశలింగం : సరస్వతీ నారద విలాపము – (16వ పద్యం)
22. కందుకూరి వీరేశలింగం : సరస్వతీ నారద విలాపము – (18, 19 పద్యాలు)
23. కందుకూరి వీరేశలింగం : స్వీయ చరిత్ర
24. డా. అక్కిరాజు రమాపతిరావు : కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు – పుట. 35
25. కందుకూరి వీరేశలింగం : సత్యరాజా పూర్వదేశయాత్రలు
    – మొదటి భాగంలో – "శ్రీ సత్యరాజాచార్యకృతాంధ్రీకృత నవరత్నమంజరి".
26. డా. అక్కిరాజు రమాపతిరావు : కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు – సంపాదకీయం.
27. వారణాశి అచ్యుత రామయ్య : సురతాణీ పరిణయం : పుట. 23

28. వారణాశి అచ్యుత రామయ్య : సురతాణీ పరిణయం : పుట. 68

29. వారణాశి అచ్యుత రామయ్య : సురతాణీ పరిణయం : పుట. 114

30. వారణాశి అచ్యుత రామయ్య : సురతాణీ పరిణయం : పుట. 114

31. 1910లో వెలువడిన గురజాడవారి 'దిద్దుబాటు' తొలి కథ అని మరి కొందరి అభిప్రాయం – ఇది చర్చనీయాంశం (ఇది ఈ పరిశోధన పరిధిలోనికి రాదు).

32. తెలుగు అకాడమి: తెలుగు సాహిత్యకోశము (ఆధునిక సాహిత్యము :1851–1950)–పుట. 1023

33. ఆచంట సాంఖ్యాయన శర్మ : ఆంధ్ర పద్యావళి – సంఘ సంస్కరణము ఖండకృతి – (ఆధారం : ఆంధ్ర రచయితలు – పుట. 201)

34. ఆచంట సాంఖ్యాయన శర్మ : ఆంధ్ర పద్యావళి – సంఘ సంస్కరణము ఖండకృతి – (ఆధారం : ఆంధ్ర రచయితలు – పుట. 201)

35. దాసు శ్రీరాములు : తెలుగునాడు – ప్రథమముద్రణ పీఠిక

36. దాసు శ్రీరాములు : తెలుగునాడు – 'వివాహములు' శీర్షిక – 1, 2 పద్యాలు.





6

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో ఛందోనవ్యత



ఆదికవి నన్నయ కాలం (11వ శతాబ్ది) నుండి 19వ శతాబ్ది అంతం వరకు ఆంధ్ర కవిత్వం సంప్రదాయ పద్య ఛందస్సులతో కొనసాగిందని, 20వ శతాబ్ది నవ్య కవిత్వ యుగారంభంలో గురజాడ అప్పారావుగారు ఆ సంప్రదాయ ఛందస్సులను ప్రక్కకు నెట్టి, 'ముత్యాల సరము' అనే మాత్రా ఛందస్సును సృజించి తెలుగు కవితా ఛందస్సును కొత్త మలుపు తిప్పారని సాహిత్య రంగంలో ఒక అభిప్రాయం నెలకొని ఉంది. కానీ అది వాస్తవం కాదు.

గురజాడ కంటె ఒక వంద సంవత్సరాల పూర్వమే, అంటే 19వ శతాబ్ది ఆరంభంలోనే ఒక కవివతంసుడు ఇంచుమించు ఇదే ఛందస్సును తన కావ్యంలో ప్రయోగించాడని తెలిస్తే ఈనాటి ఆధునికులు ఆశ్చర్యంలో మునుగక తప్పదు. కాని ఇది సత్యం. 1810వ సంవత్సర ప్రాంతంలో రేవణూరి వేంకటార్యుడనే కవి తన 'శ్రీపాద రేణు ప్రభావము' అన్న కావ్యంలో ఈ ఛందస్సును ప్రయోగించాడు. తొట్ట తొలి తెలుగు వాగ్గేయ కారుడు, తిరుమల వేంకటేశ్వరుని పరమ భక్తుడు తాళ్ళపాక అన్నమయ్య పుత్రీ వంశీయుడైన రేవణూరి వేంకటార్యుడు ప్రయోగించిన ఈ ఛందస్సు పేరు 'తురంగ వృత్తము'. ఈ వృత్త లక్షణాన్ని పరిశీలిస్తే ఇలా గోచరిస్తుంది. ప్రతి పాదంలో మూడు మాత్రలు, ఆపైన నాలుగు మాత్రలు, మళ్ళీ మూడు మాత్రలు, ఆపైన నాలుగు మాత్రల చొప్పున ఉంటాయి. కవి ముప్పయి పాదాల మాలికగా ఈ వృత్తాన్ని వెలయించాడు.

ఇప్పుడొకసారి గురజాడ ముత్యాల సరాన్ని, అందులోని మాత్రా చాలనాన్ని గమనిద్దాం.

| | | | |
|---|---|---|---|
| 3మా. | 4మా. | 3మా. | 4మా. |
| U I | U U | U I | I I I I |
| గుత్తు | నాము | త్యాల | సరములు |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | I I U | U I | U I I |
| కూర్చు | కొని తే | టైన | మాటల |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | I I I I |
| కొత్త | పాతల | మేలు | కలయిక |
| 3 మా. | 4మా. | 3మా. | 2 మా. |
| U I | U I I | U I | U |
| క్రొమ్మె | రుంగులు | జిమ్మ | గా [1] |

(*చివరి పాదంలో 2 మాత్రల తగ్గింపు)

ఇప్పుడు రేవణూరి వేంకటార్యుని 'తురంగ వృత్తం' చూద్దాం.

| | | | |
|---|---|---|---|
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U I I |
| శ్రీల | నయ్యల | మేలు | మంగకు |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U I I |
| జాల | బుయ్యగ | జాలు | రేణువు |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U I I |
| భూమి | పాపట | బ్రోమ | గొల్చిన |



| | | | |
|---|---|---|---|
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U I I |
| కామి | తార్భిత | కామ | ధేనువు [2] |

వేంకటార్యుడు కూర్చిన యతిప్రాసలు, గురజాడ సడలించుకొన్నారు తప్ప–పై రెండు ఛందస్సులలో సామ్యం ఇట్టే అవగతమవుతుంది. కాకపోతే గురజాడ 4వ పాదంలో రెండు మాత్రలను తగ్గించి చిన్న మార్పు చేసారు. బహుశః ఆయన –

తకిట తకధిమి తకిట తకధిమి

తకిట తకధిమి తకిట తా

అన్న నృత్యానుగుణ్యమైన తాళంతో స్ఫూర్తి నొంది ఈ చిన్ని మార్పు చేసి ఉంటారు. అయినా గురజాడ కూడా కొన్ని కవితల్లో నాలుగవ పాదాన్ని కూడా మొదటి మూడు పాదాల్లాగా వ్రాసిన సందర్భాలు లేకపోలేదు. ఆయన రచించిన 'దించు లంగరు' కవితలో ఈ పంక్తులను గమనించండి.

| | | | |
|---|---|---|---|
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U U |
| దించు | లంగరు | దీర్ఘ | యుద్ధం |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | U I I | U I | U I I |
| ధర్మ | పక్షము | ముల్లు | చూపెను |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| I I I | U I I | U I | U I I |
| నరుల | పీనుగు | పెంట | పోకల |
| 3 మా. | 4మా. | 3మా. | 4 మా. |
| U I | I I I I | U I | U I I |
| నాటి | వెలయును | శాంతి | వృక్షము [3] |

ఇది యథాతథంగా, యతిప్రాసలు సడలించిన రేవణూరి వేంకటార్యుని తురంగ వృత్తమే. పైగా మూడు, నాలుగు మాత్రలతో సాగిన ఈ వృత్తంలో 'తురంగ వల్గనం' నడక కలిగి ఉండడంతో ఈ ఛందస్సును 'తురంగ వృత్తం' అనడమే ఔచితీమంతంగా తోస్తుంది. ఆ విధంగా 19వ శతాబ్ది ఆరంభంలోనే ఛందఃపరమైన నవ్యత సాధించిన మహాకవి రేవణూరి వేంకటార్యుడు.

ఈ కవి కాల నిర్ణయంలో కొంత భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఈ కవి 16వ శతాబ్దికి చెందిన వాడని తొలుత కొందరు పండితులు భావించారు. అందుకు కారణం ఈ కవి రచించిన 'శకుంతలా పరిణయం' అన్న కావ్యంలో స్వీయ పరిచయాన్ని అందిస్తూ –

*"శ్రీ వత్సాన్వయ రేవణూరి కులజున్, శ్రీపాద రేణు ప్రభా*
*సౌవర్ణ్యస్ఫుట కావ్య కల్పక కవిన్, సంకీర్తనాచార్య పు*
*త్రీ వంశోత్తము, నంద వైదిక బుధాది ప్రోక్త వృత్తి స్వయం*
*భావున్ దిర్మల కొండయార్య సుతు శుంభద్వేంకటాభిఖ్యునిన్ –"*[4]

అని తెలిపాడు.

ఇందులో 'సంకీర్తనాచార్య పుత్రీవంశోత్తము' అన్న మాటను చూచి పండితులు ఈయనను అన్నమాచార్య పుత్రికా పుత్రునిగా భావించి, ఇతడు 16వ శతాబ్ది వానిగా భావించారు. తెలుగు అకాడమి వారు ప్రచురించిన 'తెలుగు సాహిత్య కోశము'లో ఈ కవిని 16వ శతాబ్దికి చెందిన వానిగానే పేర్కొనడం జరిగింది[5]. అయితే 'సంకీర్తనాచార్య పుత్రీ వంశోత్తముడు' అంటే సంకీర్తనాచార్యుని పుత్రిక కుమారుడే కానక్కరలేదు. ఆ పుత్రిక వంశంలో తరువాతి తరంలోని ప్రసిద్ధుడైనా కావచ్చు. పైగా అన్నమయ్య కుటుంబీకులంతా తరతరాలుగా సంకీర్తనాచార్యుల కుటుంబంగా ప్రసిద్ధి చెందినప్పుడు సంకీర్తనాచార్యుడంటే అన్నమయ్యే కానక్కర లేదు. ఆ తరువాత తరంలోని ఆ కుటుంబీకులలో ఎవరైనా ప్రసిద్ధుడు కూడా కావచ్చు. ఇటీవలి కాలంలో అన్నమయ్య కుమారుడు పెద తిరుమలయ్య యొక్క నాలుగవ పుత్రుడు తాళ్ళపాక చిన్నన్న –



*"హరి యవతార మీతడు – అన్నమయ్య !*
*అరయ మా గురువితడు – అన్నమయ్య !!"*

వంటి ఎన్నో సంకీర్తనలు వెలయించినట్లు పరిశోధనలలో తేలింది. లోగడ కూడా, 'అల తాళ్ళపాక చిన్నన్న రోమములైతె – తంబురా దండెకు దంత్రులగునె' అని అర్వాచీనులు ఇతనిని వాగ్గేయ కారునిగా ప్రస్తుతించినట్లుగా ఆధారాలున్నాయి.[6] అంతే కాదు స్వయంగా రేవణూరి వేంకటార్యుడు కూడా తన 'శ్రీపాద రేణు ప్రభావము' కావ్యావతారికలో–

*"శ్రీలలరంగ మంగమకు శ్రీహరి కిన్నటు ధార వోయుచో*
*తాళులపాక యన్నమయ తా గడిగెన్ బదముల్ ధరిత్రి, మా*
*తాళుల పాక చిన్నన పదంబులు బాడిన నాడె సర్వరాట్*
*శైల విభుండు తత్పదరజంబును మాకు నొసంగ జెల్లదే,"*[5]

అన్న పద్యంలో చిన్నన్నను వాగ్గేయకారునిగా ప్రస్తుతిస్తూ, 'మా తాళ్ళపాక చిన్నన్న పదాలు పాడిన నాడె' అంటూ గతాన్ని స్మరించుకొన్నట్లుగా పేర్కొన్నాడు. ఒకవేళ వేంకటార్యుడు అన్నమయ్యకు దౌహిత్రుడే అయితే, అన్నమయ్యకు పౌత్రుడయిన తాళ్ళపాక చిన్నన్నకు దాదాపు సమ వయస్కుడయి ఉండాలి. అలాంటప్పుడు 'పదాలు పాడిన నాడె' అని పేర్కొనే అవకాశం లేదు. కాబట్టి రేవణూరి వేంకటార్యుడు చిన్నన్న కంటె ఎంతో నవీనుడై ఉండాలి. అంతే కాదు వేంకటార్యుడు తన గురించి 'సంకీర్తనాచార్య పుత్రీ వంశోత్తముడ' నని చెప్పుకొన్నప్పుడు, అక్కడ సంకీర్తనాచార్యుడు అంటే అన్నమయ్య కాకుండా చిన్నన్నయే అయి ఉండాలి. ఎందుకంటే పైన పేర్కొన్న పద్యంలో, అలుమేలు మంగమ్మను శ్రీహరికిచ్చి కాళ్ళు కడిగి కన్యాదానం చేసింది అన్నమయ్యగా, పదాలు పాడింది చిన్నన్నగా ఆయన వర్ణించాడు. ఆ విధంగా చిన్నన్న పుత్రిక వంశంలో పుట్టిన కవి రేవణూరి వేంకటార్యుడని స్పష్టమవుతుంది. (ఇక్కడ చిన్నన్న పుత్రికకు నేరుగా పుత్రుడు కాదన్న విషయం కూడా గమనార్హం.) దీనిని బట్టి రేవణూరి వేంకటార్యుడు 16వ శతాబ్ది వాడు కాదని, ఆధునిక కాలానికి సమీప కాలం వాడని తెలుస్తోంది. దీనికి బలం చేకూర్చే ఆధారం ఒకటుంది. 1899లో వెలువడిన 'కవుల చరిత్రము'లో వీరేశలింగం పంతులు ఈ కవి గురించి నూరు, నూటయేబది సంవత్సరములు

క్రిందటి వాడు' అని పేర్కొన్నాడు.[8] అనగా 1750, 1800ల మధ్య జన్మించి ఉండాలి. మధ్యస్థంగా 1775 అని తీసుకొన్నా, ఏ కవి అయినా ఆధ్యాత్మిక పరిణతి గల కావ్య రచన చేయాలంటే కనీసం ముప్పయి, ముప్పయి ఐదు సంవత్సరాల వయసు కలిగి ఉండడం సర్వ సాధారణం కాబట్టి 1810 ప్రాంతంలో 'శ్రీపాద రేణు ప్రభావం' కావ్యాన్ని రేవణూరి వేంకటార్యుడు రచించి ఉండాలి. తెలుగు సాహిత్య చరిత్రకారులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[9]

దీనిని బట్టి గురజాడ వారి 'ముత్యాల సరం' ఛందస్సుకు ఆద్యరూపమైన 'తురంగ వృత్తం' 19వ శతాబ్ది ప్రథమాంకం నాటికే ఉన్నదని తెలుస్తుంది. ఇందుకు బలం చేకూర్చే ఒక విషయాన్ని ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తమ "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు" గ్రంథంలో పేర్కొన్నారు. అదేమిటంటే - "ఆంధ్ర భారతి - పత్రిక (శా. శ. 1831 మాఘ సంచిక)లో 'మేలుకొలుపు' అను శీర్షికతో ఒక గేయము ప్రచురింపబడినది. కర్తపేరు లేదు. అప్పటికి గురజాడ వారి ముత్యాల సరములు వెలువడలేదు. ఈ 'మేలు కొలుపు' గేయము మిశ్రగతిలో నున్నది. అనగా గురజాడ వారు 1916లో ప్రచురించిన 'ముత్యాల సరము' ఛందస్సులో నున్నది[10]. అనగా 20వ శతాబ్దిలో కూడా గురజాడ కన్న ముందే ఈ ఛందస్సులో రచనలు చేసిన వారున్నారన్నమాట. కాబట్టి గురజాడ క్రొత్తగా మాత్రా ఛందస్సులో 'ముత్యాల సరం' ఛందస్సును సృజించాడన్నది పూర్తిగా వాస్తవం కాదన్న విషయం అంగీకరించక తప్పదు.

ఇలా పాత ఛందస్సుకే కొత్త పేరును పెట్టి, 20వ శతాబ్దిలోనే కాదు 19వ శతాబ్దిలోనే నూతనత్వాన్ని భ్రమింపజేసిన మరొక కవి సాక్షాత్తు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. పంతులుగారు తమ 'సత్యాద్రౌపదీ సంవాదం'ను 'ఏక పాద వృత్తము - పాట' అని పేర్కొన్నారు. భార్యాభర్తలకు పరస్పరం ప్రేమానురాగాలను పొందడానికి "ప్రేమ ఇచ్చిన ప్రేమ వచ్చును." అని సద్బోధ చేసిన ఒక చక్కని రచన అది.

"శ్రీకృష్ణుడొక నాడు చెలగు వేడుకను
విపినంబు లోపల వెతనొందుచున్న
పాండవులను జూచి పరతెంచుకొరకు
పయనమై యల సత్యభామను గూడ-"[11]

అంటూ ప్రారంభమయిన ఈ కవిత ఇదే ఛందోనియతితో ఆసాంతం సాగిపోతుంది. అయితే దీనిని జాగ్రత్తగా పరిశీలిస్తే, ఇది సుపరిచితమైన 'మంజరీ ద్విపద' అని ఇట్టే తెలిసిపోతుంది.

ద్విపద లక్షణాలు గమనిస్తే -

"ద్విపదకు రెండు పాదములుండును. ప్రతిపాదమునందును 3 ఇంద్ర గణములు + ఒక సూర్య గణమునుండును. ప్రాస నియతి గలదు. ప్రాస నియతి లేనిచో ద్విపదకు 'మంజరి' అని పేరు."[12]

వీరేశలింగం గారి పై రచనను పరికిస్తే -

| | | | |
|---|---|---|---|
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
| త | సల | నగ | న |
| U U I | I I U I | I I I U | I I I |
| శ్రీకృష్ణ | డొకనాడు | చెలగు వే | దుకను<br>('శ్రీ,' చె'లకు యతి మైత్రి) |
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
| సల | భ | సల | హ |
| I I U I | U I I | I I U I | U I |
| విపినంబు | లోపల | వెతనొందు | చున్న |

('వి','వె'లకు యతి మైత్రి కుదిరింది)

ఇది ఖచ్చితంగా మంజరీ ద్విపదే (ప్రాసనియతి లేదు కాబట్టి). మరి కవి ఎందుకు 'ఏకపాద వృత్తము - పాట' అని పేర్కొన్నారు? ప్రాస నియతి ఉంటే,

రెండు పాదాలు ఆ సంబంధం కలిగి ఉండి, ఒకే పద్యంగా అగుపిస్తుంది. ఎప్పుడైతే ఆ సంబంధం లేదో, ఏ పాదానికి ఆ పాదం ఒక స్వతంత్ర పాదమై 'ఏకపాద' వృత్తంగా అగుపిస్తుంది. కాబట్టి మంజరీ ద్విపదకు కవి 'ఏకపాద వృత్తం' అని నామకరణం చేశారని భావించవచ్చు. అలాగే ఈ ఛందం పాడుకోవడానికి అనుగుణంగా ఉండడం వల్ల, దీనిని 'పాట' అని కూడ కవి పేర్కొన్నారు. విమర్శకులు గురజాడ, ఇది వరకే ఉన్న ఛందస్సుకు కొత్త పేరు పెట్టడం ద్వారా, 20వ శతాబ్దిలో 'ముత్యాలసరం' అనే కొత్త ఛందస్సును సృజించాడని భావిస్తే, కందుకూరి వారి ఏకపాద వృత్తాన్ని కూడా నవ్య ఛందస్సుగా అంగీకరించక తప్పదు మరి! కాని అది సమంజసం కాదు గదా!

పంతులుగారు 'మంజరి' అన్న పేరు ఉండగా, అదే ఛందస్సుకు కొత్త పేర్లు పెట్టడాన్ని బట్టి, ఆనాటి కవులకు కొత్త ఛందస్సు సృజించిన వారుగా, లేక ప్రయోగించిన వారుగా ఖ్యాతినొందాలన్న తపన ఉండేదన్నది రూఢి అవుతుంది.

అసలు 20వ శతాబ్దిలో గురజాడ, అంతకు ముందు కందుకూరి వంటి కవులకే కాదు – కొత్త కొత్త ఛందస్సులను; సంప్రదాయ ఛందస్సులే కాకుండా, విశిష్టమైన, ప్రత్యేకమైన ఛందస్సులను ప్రయోగించాలని 19వ శతాబ్దిలో కూడా అనేక కవి పుంగవులు తపన పడ్డట్టు ఈ అధ్యయనంలో తేలింది. ఈ విషయంలో ప్రత్యేకంగా పేర్కొనదగిన కవి – 'శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యము' కావ్యకర్త కొప్పరాజు నరసింహం. గుంటూరు జిల్లా నరసరావు పేట తాలూకాలో నున్న 'కోటప్పకొండ' అనే పుణ్యక్షేత్రం పై క్రీ.శ. 1862లో వెలయించిన ఈ ఆధునిక క్షేత్ర మాహాత్మ్య కావ్యంలో కవి చూపిన ఛందోవైవిధ్యం అసాధారణం. సాధారణ వినియోగంలో గల ఛందస్సులు కాక ఈ కవి ముప్పయికి పైగా విశిష్ట ఛందస్సులను ప్రయోగించడం విశేషం. ముఖ్యంగా ద్వితీయాశ్వాసంలో ఇంద్రుడు శివుని స్తుతించు ఘట్టంలో మాలిని, సుగంధి, స్రగ్విణి, శ్రీ, నారి, కన్య, పంక్తి, శశివదన, హంసమాల, విద్యున్మాల, భుజంగ శిశురుతము, ప్రణవము, దోదకము, ఇంద్ర వంశము, మత్త మయూరము, వనమయూరము, అలసగతి, పంచచామరము, మందాక్రాంత, పద్మనాభము, తన్వి, భాస్కరవిలసితము, మంగళమహాశ్రీ తదితరములైన 27 రకాల ఛందస్సులను వరుసగా ఏక బిగిని రచించడం పాఠకులను ఆకర్షిస్తుంది. అంతకుముందు శతాబ్దుల ఆంధ్ర సాహిత్యంలో నన్నయాదులు, ఇతర కవులు వీనిలోని కొన్నింటిని అక్కడక్కడా ప్రయోగించినా, ఇన్ని రకాల విశిష్ట ఛందస్సులను ఒక చోట గుది గ్రుచ్చి రచించడం ఒక విశేషమైన నవ్యత. ఇది క్షేత్ర మాహాత్మ్య కావ్యం కావడం వల్ల, ఈ భక్తిమయ కావ్యంలో ఆ క్షేత్ర నాథుని స్తుతిని 27రకాల ఛందస్సులలో చేయడం – ఆ స్వామికి నక్షత్ర హారతిని అందించినట్లుగా కవి భావించి ఉంటాడు. ఈ గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన అజంతా ముద్రణాల యాధిపతులు, శతావధానులు శ్రీ శ్రీనివాస సోదరులు తమ ముందు మాట 'మేలి పలుకు' లో ఈ విషయాన్ని ఇలా ప్రస్తుతించారు–

"అఖిలచ్ఛందోమయుండగు పరమేశ్వరుని దేవేంద్రునిచే వివిధ చ్ఛందోమయ స్తోత్రమున స్తుతింపజేసిన కవి యుచితజ్ఞత మెచ్చదగినది."[13].

కొప్పరాజు నరసింహకవి ప్రయోగించిన మాలిని, సుగంధి, స్రగ్విణి, దోదకము, ఇంద్ర వంశము, పంచ చామరము, మందాక్రాంత తదితరాలకు అంతకు ముందు పూర్వకవుల ప్రయోగాలున్నాయి. కాని శ్రీ, నారి, కన్య, పంక్తి తదితర ఛందస్సులకు పూర్వకవుల ప్రయోగాలున్నట్టు కనిపించవు. ఈ వృత్తాల గురించి తెలుసుకోవాలంటే ఛందశ్శాస్త్రం గురించి కొంత ప్రాథమిక అవగాహన అవసరం.

నిజానికి ఛందశ్శాస్త్రం ఒక సముద్రం. "పెంపమరు సముద్రమ్ముల చందములై ఛందములు" అంటాడు అనంతామాత్యుడు.[14] అంటే శాస్త్రకారులు ఛందశ్శాస్త్రంలో కొన్ని కోట్ల రకాల ఛందస్సులను ఎప్పుడో నిర్వచించి ఉన్నారన్నమాట.

ఒక పాదంలో ఒక అక్షరం చొప్పున ఉండే పద్యాలను, ఒకటో ఛందస్సుగా పరిగణిస్తారు. ఈ ఛందానికి 'ఉక్త' అని పేరు. ఈ ఒకటో ఛందంలో – అయితే పాదానికి ఒక హ్రస్వాక్షరం (లఘువు)తో ఒక వృత్తంగానీ, లేదా పాదానికి ఒక దీర్ఘాక్షరం (గురువు)తో ఒక వృత్తంగానీ, ఏర్పడే అవకాశం ఉంటుంది. అంటే ఒకటో ఛందంలో కేవలం రెండు రకాల వృత్తాలు మాత్రమే ఏర్పడే అవకాశం ఉంటుందన్నమాట. ఇలా పాదానికి ఒక లఘువు (1)తో ఏర్పడే ఛందాన్ని 'క్షితి వృత్తం' అని, అలాగే పాదానికి ఒక గురువు (ఏ) తో ఏర్పడే ఛందాన్ని 'శ్రీ వృత్తం' అని పిలుస్తారు.

ఉదా:- శ్రీ వృత్తం

నీ

వే

నే

నై

అలాగే, పాదానికి రెండక్షరాలు చొప్పున ఉండే ఛందస్సును రెండో ఛందస్సు అంటారు. దీనికి 'అత్యుక్త' అని పేరు. ఈ అత్యుక్త ఛందంలో 4 రకాల వృత్తాలేర్పడతాయి. అవి - 1. లఘువు - లఘువు ( ı ı ) ; 2. గురువు - గురువు (ఏ ఏ) ; 3. గురువు - లఘువు (ఏ ı) ; 4. లఘువు - గురువు (ı ఏ) . అంతకన్నా వేరే రకంగా ఏర్పడే అవకాశమే లేదు. ఈ క్రమంలో పాదానికి మూడక్షరాల నియతితో సాగే ఛందాన్ని మూడో ఛందస్సు అంటారు. దీనికి లక్షణకారు లుంచిన పేరు 'మధ్య'. దీనిలో 8 రకాల వృత్తాలేర్పడే అవకాశం ఉంటుంది. అంతకన్న మించి వృత్తాలు ఆ మూడో ఛందస్సులో ఏర్పడ లేవు. ఎలాగంటే -

1) UII ; 2) UUI ; 3) UUU; 4) IUI; 5) IIU; 6) III; 7) IUU; 8) UIU

అదే వరుసలో 4వ ఛందస్సులో 16 రకాల వృత్తాలు, 5వ ఛందస్సులో 32 రకాల వృత్తాలు, 6వ ఛందస్సులో 64, 7వ ఛందస్సులో 128, ఇలా చెప్పుతూ పోతే 24వ ఛందస్సులో (అంటే పాదానికి 24 అక్షరాలుండే ఛందస్సులో) 1, 67, 77, 216 (ఒక కోటి 67 లక్షల, 77వేల, 216) వృత్తా లేర్పడతాయి. 25వ ఛందస్సులో 3, 35, 54, 432 వృత్తాలు, 26వ ఛందస్సులో 6, 71, 08, 864 వృత్తాలు ఉంటాయని శాస్త్రకారులు వివరించారు. ఇలా నాలుగు పాదాలలో హెచ్చు తగ్గులు లేకుండా సమాన సంఖ్యలో గురు లఘువులు, యతి స్థానాలుండే పద్యాలను సమవృత్తాలంటారు.

ఈ సమవృత్తాలలో ఆరక్షరాలుండే ఆరవ ఛందస్సును 'గాయత్రి' ఛందస్సు అంటారు. దీనిని విశ్వామిత్ర మహర్షి ప్రసాదించాడంటారు. దీనిలో 64 రకాల వృత్తాలుంటాయి. 8 అక్షరాలు ప్రతిపాదంలో ఉండే 8వ ఛందస్సును - 'అనుష్టుప్పు' ఛందస్సని వ్యవహరిస్తారు. వాల్మీకి ముఖతః తొలి కవిత ఈ ఛందస్సులోనే వెలువడింది. ఈ అనుష్టుప్పు ఛందస్సులో 256 రకాల వృత్తా లేర్పడతాయి. ఈ వరుసలో ఉత్పలమాల - 20వ ఛందస్సులో (దీని పేరు 'కృతి') ఉద్భవించే 10, 48, 576 వృత్తాలలో ఒకటి. 'చంపకమాల' అనే వృత్తం 'ప్రకృతి' అనబడే 21వ ఛందస్సుకు చెందిన 20, 97, 152 వృత్తాలలో ఒకటి. ఇలా ఏకాక్షర ఛందస్సు నుండి మొదలుకొని, 26 అక్షరాల ఛందస్సు వరకే 13 కోట్లకు పైగా సమ వృత్తాలు ఉద్భవిస్తాయి. ఇంకా 26 అక్షరాల కంటె అధికంగా అక్షరాలు గల పాదాలతో ఏర్పడే పద్యాలను ఉద్ధుర వృత్తాలంటారు. 'లయగ్రాహి', 'లయ విభాతి', 'లయహారి', 'త్రిభంగి' వంటి వృత్తాలు ఈ తరగతికి చెందినవే. ఇవిగాక జాతులు, ఉపజాతులలో కందం, 'సీసం', 'గీత' పద్యాలతో బాటు 'అక్కరలు', 'ద్విపదలు', 'త్రిపదలు', 'చతుష్పదలు', 'షట్పదలు', 'రగడలు' సరేసరి! ఇలా చెప్పుకొంటూ పోతే ఇదంతా ఒక గణిత శాస్త్రంలా కనిపిస్తుంది. కంప్యూటర్ విద్యలో బైనరీ సిస్టంలాగే, గురువంటే రెండు మాత్రలు, లఘువంటే ఒక మాత్ర అన్నది కూడా గణితమే.[15]

ఇదే విషయాన్ని ఇటీవల గడియారం శేషఫణిశర్మ కవి తన కృతి 'కల్యాణ రాఘవము' పీఠికలో చక్కగా వివరించారు. ఆయనంటారు - 'పింగళుడు వేదములను పరమ ప్రమాణముగ సంభావించుచు, గణితశాస్త్రము నాధారముగ గైకొని ఛందశ్శాస్త్ర నిర్మాణ మొనర్చియున్నాడు"[16] దీనిని సశాస్త్రీయంగా ఆయన ఇలా నిరూపించారు -

"గణిత శాస్త్రమున 'n' విజాతీయ వస్తువుల సమితి నుండి ప్రతి వస్తువును ఒక్కొక్క పర్యాయము గ్రహించుచు 'r' వస్తువుల నెన్నుకొనినచో ఏర్పడు ప్రతి అమరిక (Arrangement) ను ప్రస్తారము (Permutation) అంటారు. ఆ ప్రస్తారముల మొత్తాన్ని $^np_r$ అన్న సంకేతంతో సూచిస్తారు. గణితశాస్త్రానుసారం-

$$^np_r = \frac{(\text{factorial } n)}{[\text{ factorial } (n-r)]}$$

$$= \frac{n\ (n-1)\ (n-2)\ .....\ x\ 2x1}{(n-r)\ (n-r-1)\ (n-r-2)\ ----\ x2x1}$$

ఇక్కడ (factorial n) అంటే n సహజ సంఖ్యల లబ్ధము. అలాగే [factorial (n-r)] అంటే (n-r) సహజ సంఖ్యల లబ్ధము. ఈ ప్రస్తార సూత్ర మూలముగా మరియొక ఉప సిద్ధాంతము నిష్పన్న మగును. ప్రతి వస్తువును ఒక పర్యాయము గాక ఎన్ని మార్లైనను గ్రహించుచు జీ వస్తువుల నెన్నుకొన్న నేర్పడు ప్రస్తారముల సంఖ్య = $n^r$ (n to the power of r)"[17].

ఛందశ్శాస్త్రంలో గురువు (U), లఘువు (I) అనే రెండే రెండు విజాతీయాక్షరాల సమితియే ఉంటుంది కావున, 'r' అక్షర సంఖ్య గల ఛందస్సులో $2^r$ (2 టుది పవర్ ఆఫ్ r) సంఖ్యతో వృత్తాలేర్పడతాయి. అనగా

ఒకటవ ఛందస్సులో $2^1$ = 2=2 రకాల వృత్తాలేర్పడతాయి

రెండవ ఛందస్సులో $2^2$ = 2×2 =4 రకాల వృత్తా లేర్పడుతాయి

మూడవ ఛందస్సులో $2^3$ = 2×2×2=8 రకాల వృత్తాలేర్పడుతాయి.

ఇలా వరుసగా చూస్తూ పోతే –

26వ ఛందస్సులో $2^{26}$ = 6, 71, 08, 864 రకాల వృత్తాలేర్పడుతాయి. ఇలా గణిత బద్ధంగా, నియమ బద్ధంగా సాగే ప్రతి ఛందస్సులో ఎన్ని రకాల వృత్తా లేర్పడే అవకాశముందో అన్ని రకాల ఛందస్సులను వృత్తాలను లక్షణకారులు ఇది వరకే తెలిపి ఉన్నారు. ఇవి కాక, ఇంకా జాతులు, ఉప జాతులలో అనేక మాత్రా బద్ధ ఛందస్సులను నిర్వచించి ఉన్నారు. దీని వలన, ఎవరైనా కొత్త వృత్తాలను లేక ఛందస్సులను సృష్టించామనుకొన్నా, ఆ వృత్తం అది వరకే ఉండి ఉండే అవకాశం ఉంది. కాకపోతే అన్ని కోట్ల ఛందస్సులను పూర్తిగా తెలుసుకోవడం కష్టం కాబట్టి, ఎవరైన అరుదుగా కనిపించే ఛందస్సును ప్రయోగిస్తే, అది కొత్త ఛందస్సుగా పాఠకులు భావించే అవకాశం ఉంది. గురజాడ విషయంలో కూడా ఇదే జరిగింది. ఆయన ముత్యాల సరాన్ని కొత్తగా సృష్టించానను కొన్నారు. రేవణూరి వేంకటార్యుని 'తురంగ వృత్తం' పరికించని వారంతా అది నిజంగా కొత్త ఛందస్సే అనుకొన్నారు. కాని ఛందశ్శాస్త్రాన్ని లోతుగా మథించినవారికి ఇందులోని మర్మాలు తెలుస్తాయి.

కాని కొప్పరాజు నరసింహం అలా కాకుండా, నిజాయితీగా ఛందశ్శాస్త్రాన్ని లోతుగా అధ్యయనం చేసి, ఎవరూ ప్రయోగించని ఛందస్సులను ప్రయోగించి నవ్యతను చూపారు. ఎవరూ ప్రయోగించని ఛందస్సులను ప్రయోగించినా వాటిని తాను సృష్టించానని చెప్పుకోలేదు. పాత ఛందస్సులకు కొత్త పేర్లు పెట్టే ప్రయత్నం చేయలేదు. పాదానికి కనీసం అయిదారు అక్షరాలు కూడా లేకుండా, భావగర్భితమైన పద్యమెలా వ్రాయగలమని, పూర్వ కవులు స్పృశించడానికి కూడా సాహసించని ఛందస్సులను ప్రయోగించడం కొప్పరాజు నరసింహ కవి ఘనత. ముఖ్యంగా 'శ్రీ వృత్తం' గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. పాదానికి ఒకే ఒక దీర్ఘాక్షరం ఉండే ఈ వృత్తాన్ని కవి ఎలా రూపొందించాడో చూడండి.

"శ్రీ

క్రో

టీ

శా !" [18]

సుప్రసిద్ధ పరిశోధకులు, చారిత్రకులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి ఈ కావ్యాన్ని గురించి వ్రాస్తూ, "ఛందో వైవిధ్యము కలదు. అందు శ్రీ అను ఏకాక్షర పద్యము అపూర్వ విశేషము"[19] అని ప్రస్తుతించారు.

ఇదే విధంగా తెలంగాణంలో రంగరాజు కేశవరావు అనే కవి రచించిన 'ఇంద్రద్యుమ్నీయము' (క్రీ.శ. 1870వ దశకంలో విరచితం) లో అనేకమైన విశిష్ట ఛందస్సుల ప్రయోగాలున్నాయి. అలాగే, అప్పటికి వాడుకలో లేని ఛందో విశేషాలు, వృత్తాలు సందర్భానుసారం వాడి పండితులను మెప్పించిన మరోకవి గోపీనాథం వేంకట కవి. క్రీ.శ. 1887లో ఈయన రచించిన 'రామాయణము', 'శిశుపాల వధ' కావ్యాలు, ఈయన విద్వత్తును విశదపరుస్తాయి.

19వ శతాబ్ది చివరి దశకంలో ఇదే స్ఫూర్తితో విస్తారమైన ఛందో వైవిధ్యాన్ని, నవ్యతను ప్రదర్శించిన మహా కవి బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మ. 'ఆంధ్ర భాషా సంజీవని' పత్రికా సంపాదకులుగా, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తెలుగు పండితులుగా ప్రసిద్ధులైన ఈ పండిత కవి తమ 'బిల్వేశ్వరీయము' కావ్యంలో అనేకమైన విశిష్ట ఛందస్సులతో బాటు 'బంగారము', 'వెండి' వంటి ఎప్పుడూ కనీ, వినీ, ఎరుగని నవ్య ఛందస్సులను ప్రయోగించి నవ్యతకు పట్టం కట్టారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఇదే విషయాన్ని ఉటంకిస్తూ – "బిల్వేశ్వరీయము, కుమార నృసింహము వంటి జటిల కావ్యములు రచించిన వీరు సీసము మొదలైన పద్యములకు ఉజ్జీగా వెండి, బంగారము మొదలైన పేర్లతో క్రొత్త వృత్తములను సృష్టించుట చరిత్రలో సరిక్రొత్త ప్రయోగము"[20] అని పేర్కొన్నారు.

ఈ కవి 1893లో వెలువరించిన బిల్వేశ్వరీయ ప్రబంధంలో ఇంతకు ముందు వివరించిన 'శ్రీ' వృత్తాన్ని కూడా పలుమార్లు ప్రయోగించారు. కొప్పరాజు నరసింహకవి లాగే ఈ కవి కూడా ఈ పద్యాన్ని సంబోధనకే వినియోగించారు.

ఉదాహరణకు -

శ్రీ
బి
ల్వే
శా! [21]

అట్లాగే -

క
ల్యా
ణే
శా! [22]

ఈ ఏక దీర్ఘాక్షర ఛందస్సును తొలుత ప్రయోగించిన కొప్పరాజు నరసింహ కవి కన్న కొక్కొండ వేంకటరత్నం కవి ఇంకా ఒక అడుగు ముందుకు వేసి ఏక లఘ్వక్షర ఛందస్సును కూడా తొలిసారిగా ప్రయోగించి నవ్యతకే నవ్య భాష్యం చెప్పారు. 'క్షితి' వృత్తమనే ఈ పద్యాన్ని చూడండి.

శి
వు
డ
ను [23]

మరొక ఉదాహరణ -

అ
న
వి
ని [24]

కొక్కొండ వెంకటరత్నం పంతులు రెండవ ఛందస్సు (అత్యుక్త) లోని 'జిన' వృత్తాన్ని కూడా తొలిసారి ప్రయోగించారు. అది ఇలా ఉంది.

అను
చును
మును
కొని [25]

ఇది రెండక్షరాల పాదాలతో కూడుకొన్న ఛందస్సు కాబట్టి ఇందులో ప్రాస నియమం కూడా పాటించబడింది. అయితే ఇలా కనీసం మూడు, నాలుగు అక్షరాలైనా లేని పాదాల పద్యాలను పూర్వ కవులు స్పృశించడానికి కూడా సాహసించని దశలో ఇలాంటి పద్యాలను రచించడం నిజంగా ఒక సాహసమే. కొక్కొండ కవి ఇవే గాక ఈ కావ్యంలో ఇంకా భూనుత వృత్తము, చంద్రవదన, చంద్రమౌళి, ప్రభాతము, సరసిజ, పంక్తి, శశివదన, కుసుమ విచిత్రము, కవి కంఠ భూషణము, లక్ష్మి, శత పత్రము, వసంత తిలకము, భూతిలకము, మత్త కీరము, కుసుమిత లతా వేల్లిత, వన మంజరి, భ్రమర విలసితము, ఫలసదనము, లలిత పదము, మదన విలసితము, అలసగతి, చంద్రశ్రీ, సుముఖి, చంద్రిక, లలిత, స్వాగతము, రుక్మవతి, కమల విలసితము, బ్రహ్మ, క్రౌంచపదము, పద్మనాభము, నారాయణ, మాకందము, వాణి, గౌరి, విద్యున్మాల, శివ, అమృత వాహినీ, రమాకందము, మహాకందము, రుచిరము, గర్భ తనుమధ్య, తనుమధ్య, ప్రియకాంత, తోటకము, మహాస్రగ్ధర, ఇంద్రవజ్రము, ఉపేంద్ర వజ్రము, అభినవ తామరసము, భుజంగ ప్రయాతము, పంచ చామరము, శిఖరిణి, తోదకము, లయగ్రాహి, సుగంధి, కవిరాజ విరాజితము, మాలిని, ఉత్సాహము, దమరుకము, వన మయూరము, స్రగ్ధర, తాండవ వృత్తము, మంజు భాషిణి, సతి, కమలాకర వృత్తము, శంకర, పరమేశ, పథ్యా కందము, విపులా కందము, ముఖ చపలాకందము, సహజ కందము, అర్ధ సమవృత్తము, స్రగ్విణి, తుల్య, కల్యాణ వృత్తము, ప్రమితాక్షర, కాంతి, మానిని, సాయంవృత్తము, ద్రుత విలంబితము, ప్రహరణ కలితము, అశ్వగతి, కరి బృంహిత, రథోద్ధత, నిశా వృత్తము, దోదకము, ప్రభాకలితము, మణి భూషణము, పృథ్వి, బిల్వవృత్తము, మౌక్తిక మాల,

సభావృత్తము, ప్రహర్షిణి, నలిని, శోభనమహాశ్రీ, సుభగ, డిండిమ, జాగ్రద్వృత్తము, జాగ్రజ్జాతి, మందాక్రాంత, ప్రభువృత్తము, ప్రియంవద, గాయక వృత్తము, సువర్ణ పద్య రత్నమాలిక, లఘు రత్నావళి, గురు రత్నావళి, మహా గురు రత్నావళి, సుకాంతి, గణనాథ వృత్తము, సంజ్ఞా వృత్తము, భాస్కర విలసితము, సలిల వృత్తము, ఏకావళి, జ్ఞాన వృత్తము, రత్నావళి, శివశంకర వృత్తము, దేవ వృత్తము, దేవ జాతి, మనోహర వృత్తము, మనోహర జాతి, మంజరి, మణిమంజరి, సన్నుత వృత్తము, మంగళమణి, ఉత్సాహ జాతి, ప్రకృతి జాతి, పురుష జాతి, ప్రకృతి వృత్తము, పురుష వృత్తము, శ్రీమతీ వృత్తము, మహా మంగళ మణి జాతి, తన్వీ వృత్తము, మణి మాల, నవ నందిని, మణి దీప్తి, వామదేవ వృత్తము, యశస్వి, పుష్పితాగ్ర, శంభునటన, తారక వృత్తము వంటి సుమారు 140 రకాల విశిష్ట వృత్తాలను విస్తృతంగా వినియోగించి, ఛందోవైవిధ్యంలో బిల్వేశ్వరీయ ప్రబంధాన్ని నభూతో నభవిష్యతిగా తీర్చిదిద్దారు.

ఇందులో కొన్ని ఛందస్సులను పూర్వకవులు ప్రయోగించినా అవి స్వల్పమే. వీటిలో చాలా ఛందస్సులను కొక్కొండ వెంకట రత్న శర్మ కవి దిగ్గజం మొట్ట మొదటి సారిగా ప్రయోగించి నవ్యతకు పట్టం కట్టారు. కవి వీటిలో చాలా ఛందస్సులకు లక్ష్య, లక్షణ సమన్విత పద్యాలను రచించి, పాద సూచికలలో అందించారు. ఉదాహరణకు 'మంగళమణి' వృత్త లక్షణాన్ని అదే ఛందస్సులో కొక్కొండ వారు రచించి ఇలా పాద సూచికలో పొందు పరిచారు.

*మంగళ మణి :*

*మంగళ మణి జాతియవును – మాత్ర లిరువదే !*
*నంగుగ బదు మూడవదే యతి యవుదుదగా !*
*మంగళ మణి వృత్తమవు సమ గణముగ – మహా*
*మంగళ మణి రుద్ర ద్వయ మాత్రల నహహా ! [26]*

ఇలా కవి తెలుగు సాహిత్యంలో తానే తొలిసారిగా ప్రయోగించిన అనేక ఛందస్సులకు అందించిన లక్ష్య, లక్షణ సమన్విత పద్యాల నన్నింటినీ పేర్కొంటూ పోతే పరిశోధన అవధులు దాటుతుందన్న భయంతో విరమిస్తున్నాను.



ఇవే కాకుండా అనేక గర్భిత పద్యాలను, బంధ పద్యాలను ఈ కావ్యంలో కొక్కొండ వారు అందించారు. వాటిలో ముఖ్యంగా పేర్కొన దగింది 'తురీయ పాదోద్ధార రథ బంధము'. కవి తేటగీతి ఛందస్సులో రచించిన ఈ పద్యాన్ని రథబంధంగా చిత్ర రూపంలో కూడా చూపారు. అది ఇలా ఉంది.

*తేట గీతి:* శ్రీశ నృశరీర సింహాస్య కేశ వాహ
రీ శతానంద వంద్య మహేశ సేవ్య
సేవనమ్మే మొనర్తుము శ్రీలు గోరి
యీ మెదలు శ్రీ నృసింహ మమ్మేలు మేలు [27]

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | శ్రీ | | | | |
| | | | శ | నృ | శ | | | |
| | | రీ | ర | సిం | హా | స్య | | |
| | కే | శ | వా | హ | రీ | శ | తా | |
| నం | ద | వం | ద్య | మ | హే | శ | సే | వ్య |
| | సే | వ | న | మ్మే | మొ | న | ర్తు | |
| | | ము | శ్రీ | లు | గో | రి | | |
| | | | యీ | మే | ద | | | |
| | | | | లు | | | | |

4వ పాదంలోని 'శ్రీ నృసింహ మమ్మేలు మేలు' అన్న భాగం రథ బంధం మధ్యలో నిలువుగా రావడం విశేషం.

అంతే కాకుండా –

కం॥ "నిను నేనన నను నేనన
నిను నవినను, నను నవినను, నేనా నేనా
ననమానునను ని నానే
నెననన నననాను నాన నేనూ ననెనా?" [28]

వంటి 'న' అనే ఒకే ఒక అక్షరంతో అల్లబడిన 'ఏకాక్షరి' పద్యం, అలాగే రెండే రెండు అక్షరాలతో రూపొందే ద్వ్యక్షరి, ఆ విధంగానే త్ర్యక్షరి, చతురక్షరి, పంచాక్షరి, పద్యాలను కూడా కవి ఈ కావ్యంలో అందించారు. ఇంకా, ప్రాసాక్షరాలుగా రెండు, మూడు, నాలుగు అక్షరాలను ప్రయోగించి ద్విప్రాస, త్రిప్రాస, చతుష్ప్రాస పద్యాలను కూడా రచించారు.

అలాగే, గేయ ఛందస్సులో కల్యాణ గీతము, నలుగుపాట, ఆనందగీతము, శోభన గీతము, మహా శోభన గీతం, లాలి పాట, పూల బంతులాటపాట, మంగళగీతము వంటి గీతాలను కూడా రచించి, పద్య కావ్యంలో గేయ ఛందస్సులకు ప్రప్రథమంగా స్థానం కల్పించారు. ఇవే కాకుండా బంగారము, వెండి, ఆట బోటి, తేటి, తేటి బోటి వంటి వినూత్న ఛందస్సులను సృజించి ప్రయోగించారు. ఇది నిజంగా నవ్యాతి నవ్యమైన విషయం. ఆ ఛందస్సులకు లక్ష్య లక్షణ సమన్విత పద్యాలను కూడా రచించి, భావిలో ఆ ఛందస్సులను ప్రయోగించాలనుకొనే కవులకు మార్గదర్శకత్వం చేశారు. ఆయా ఛందస్సుల వివరాలిలా ఉన్నాయి.

*బంగారము :* *ఇంద్ర గణంబు లారిన గణంబులు రెండు*
*నిందు గణంబొకండిందునుండు - నీక్షింపుడీ!*
*నాల్గు పాదములిట్లు నల్వొంద తేటియొ*
*తేటి బోటియొ కూడ వాటముగను - బాటిలెడున్!*
*బంగారమనగను పద్యంబు హృద్యంబు*
*సీసమేల సువర్ణ సిద్ధి గలుగ - శ్రీ మించగా !*
*ప్రణవ గణావళి పరగుట ప్రతిపాద*
*మందిది ప్రణవ విఖ్యాతి గాంచు - నారయుడీ !*

*షడ్గణాళి పాద సరణ నొప్పుటను బ్రాసాదమౌగా*
*సకల సౌమనస్య సారంబు గ్రహియింప జాలు లీలన్*
*గాంచ తేటి బోటి గానయ్యె నిది వెలిగారమన్నన్*
*గదిసి చాల గ్రాలగా జేయు నౌర బంగారమున్ శ్రీ !* [29]

*తేటి :* *సూర్యు దాదినె యుండెడు సురపతులన జొప్పడగా*
*ఇద్ద రటు పిమ్మటన్ రవు లిద్దరుందు రద్దిరయ్య*
*తేట గీతియె యబ్జాప్తి దేటి యగును వాటముగా*
*జేరి సీసము జేయు బంగారముగను సారముగా* [30]

*తేటి బోటి:* *ఆట వెలది బేసి యదుగుల యట్లేని, యైన నాల్గు*
*పాదములు మరి, సరి పాదములట్లేని పై యతితో*
*నబ్జయుక్తి షడ్గణాంఘ్రి యగుటను షడంఘ్రితాప్తిన్*
*తేటిబోటినాగ తేజరిల్లెడు నిది తేటి వలెన్* [31]

*ఆట బోటి :* *ఇనులు మువ్వు రిద్ద రింద్రులుందురటంచు, నిందుడు నిం*
*దొనరు యతి ముఖుడయి యొంటి మూట నొందుసరిన్*
*హంస పంచకంబు యగుడునా పయినట్లె యౌటనిదే*
*యాట బోటినాగ నాటవెలది - పాటిలెడిన్* [32]

*వెండి :* *వరుస గూడ నాల్గు బంగారు పాదముల్ పైనెసంగ*
*నలర తేట గీతి, యాట వెలది యదగు వెండి!*
*సీస పాదములును జెలగ నాల్గాపయి జేరిన న*
*య్యాట బోటి, తేటి, తేటిబోటియగును వెండి!* [33]

పై ఛందస్సులను కవి ఈ కావ్యంలో పలుమార్లు ప్రయోగించారు.

మొత్తానికి ఆంధ్ర సాహిత్యంలో నాటికీ, నేటికీ, ఏనాటికీ, వందలాది విశిష్ట ఛందస్సులకు లక్ష్యాలుగా నిలిచే పద్యాలతో కూర్చబడిన ఏకైక గ్రంథంగా కొక్కొండ వారి బిల్వేశ్వరీయ ప్రబంధం నిలుస్తుంది. ఈ విశిష్ట ఛందస్సులలో చాలా మట్టుకు మాత్రా గణాలతో, గేయ గతులతో సాగే పద్యాలుండడం గమనార్హం. ఉదాహరణకు పంతులుగారు రచించిన ఈ 'తాండవ వృత్తం' పద్యాలు చూడండి.

అక్షరాత్మకాంక రూప హర్షదోం నమశ్శివాయ
ఉక్షరాట్ప్రతాంగ దేశికోత్తమోం నమశ్శివాయ
మక్షికాయి తామృతాశ మాక్షికోం నమశ్శివాయ
దక్షవామ పార్శ్వ భూత తత్పదోం నమశ్శివాయ

లక్ష సాంఖ్య లక్షణోప లక్షితోం నమశ్శివాయ
వీక్షితాఖిలాఖిలాశ్రితేష్టదోం నమశ్శివాయ
భక్షితోగ్ర కాలకూట భద్రదోం నమశ్శివాయ
శైక్ష నూత సన్మునీంద్ర సంచయో నమశ్శివాయ [34]

ఈ స్తుతి పద్యాలు త్రిపుట తాళంలో హాయిగా పాడుకోడానికి అనుగుణంగా ఉన్నాయి. అంతే కాకుండా కవి ఈ కావ్యంలో కొన్ని గీతాలను కూడా పొందు పరచారని పైన పేర్కొన్నాను. దీనిని బట్టి కవి అక్షర గణ ఛందస్సు నుండి మాత్రా గణ ఛందస్సు వైపు మళ్ళేందుకు ఉత్సాహం చూపారని, ఆ విధంగా ఛందస్సులో కాస్త స్వేచ్ఛను, నవ్యతను కోరుకున్నారని అవగతమవుతుంది. ఇలా 19వ శతాబ్దిలో రేవణూరి వేంకటార్యుడు, వీరేశలింగం పంతులు, కొక్కొండ వెంకటరత్నం పంతులు రచనల్లో అంకురించిన ఈ స్వేచ్ఛా ప్రియత్వమే మరింత విస్తృతమై 20వ శతాబ్దిలో గేయ కవిత్వానికి, మరియు వచన కవిత్వానికి బాటలు వేశాయంటే అతిశయోక్తి కాదు.

ఇలాంటి స్వేచ్ఛా ప్రియత్వాన్ని, నవ్యతను 19వ శతాబ్దిలోనే మరింత ఎక్కువగా ప్రదర్శించిన కవులు మరికొందరున్నారు. వారిలో మండ కామేశ్వర కవి, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి కవి ప్రముఖంగా పేర్కొనదగినవారు.

ప్రసిద్ధ హిందీ కవి గోస్వామి తులసీదాసు రచించిన రామాయణ మహా కావ్యం 'రామ చరిత మానస'ను ఈ ఇరువురు కవులు తెలుగులోకి అనువదించారు. అనువాదం మన పూర్వ కవులలా తెలుగు, సంస్కృత ఛందస్సులలో చేసి ఉంటే ఇది కోకొల్లలుగా ఉన్న తెలుగు రామాయణాలలో ఒకటిగా మిగిలిపోయేది. కాని ఈ కవుల నవ్యతా దృష్టి, సృజనాత్మక శక్తి దీనిని ఒక విశిష్టమైన నవ్యకావ్యంగా తీర్చి దిద్దేందుకు దోహదమయ్యాయి. తెలుగులో రామచరితమానస కావ్యాన్ని (మొత్తం ఏడు కాండలు) ఈ కవులు తులసీ దాస మహా కవి వాడిన 'దోహా – చౌపాయి' ఛందస్సులోనే అనువాదం చేయడం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తుంది.

సుప్రసిద్ధ హిందీ భాషా విద్వాంసులు, అనువాదకులు కీ.శే. ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్ ఈ అనువాద కావ్యాన్ని ఎంతో శ్రమకోర్చి, సాధించి, పరిష్కరించి, ఇందులోని సుందర కాండమును మాత్రం తమ సంపాదకత్వంలో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ద్వారా ముద్రింపజేయడానికి కృషి చేసి కృతకృత్యులయ్యారు. మిగితా కాండములకు కూడా ముద్రణ భాగ్యం కల్పించాలన్న తన ఆకాంక్ష నెరవేరకుండానే ఆయన పరమపదించడం శోచనీయం.

ఆంధ్ర తులసీ రామాయణము (సుందర కాండము) గ్రంథానికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ, ఆ గ్రంథ సంపాదకులు 'నిర్మల్' గారు ఇలా వివరించారు–

'సంపూర్ణ రామచరిత మానసాన్ని (ఏడు కాండలను) తులసీదాసు వాడిన దోహా – చౌపాయి పద్ధతిలోనే అనువాదం చేసిన ఘనత శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, మండ కామయ శాస్త్రి గార్లదే. వీరిద్దరూ కలసి చేసిన అనువాదాన్ని గురించి ప్రప్రథమంగా శ్రీ తిరుమల రామచంద్ర గారు 'పరిశోధన' (జూన్ – జూలై 1956) పత్రికలో 'నివేదిత' అనే మారు (కలం) పేరుతో ఒక వ్యాసంలో వ్రాశారు. నేను వరంగల్లులో ఉండగా డా. కేతవరపు రామకోటి శాస్త్రి గారి వద్ద ఆ వ్యాసాన్ని చూడడం సంభవించింది. దానిలో మానసానువాద వ్రాత ప్రతి ఓరియింటల్ మ్యానుస్క్రిప్ట్స్ లైబ్రరి, మద్రాసులో ఉన్నట్టుగా వారు తెలిపారు. ఇంకో ప్రతి విజయనగరం మహారాజా గారి లైబ్రరీలో ఉన్నట్లుగా వారు తెలిపారు. నేను ఆ విషయం పూజ్యులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారితో చెప్పగానే, వారు. ఆం. ప్ర. సాహిత్య అకాడమి ద్వారా శ్రీ పి.వి.జి. రాజు గారికి ఉత్తరం వ్రాశారు. శ్రీ రాజు గారు వెంటనే ఆ వ్రాత ప్రతిని పంపించారు. ఆ వ్రాత ప్రతి చాలా శిథిలావస్థలో ఉండడంతో శ్రీ దేవులపల్లి రామానుజారావుగారు దాని శుద్ధ ప్రతి వ్రాసే బాధ్యత నాకున్నూ, శ్రీ ఎస్. వి. శివరామశర్మగారికి అప్పగించారు. మద్రాసులో ఉన్న వ్రాత ప్రతులన్నీ తిరుపతిలో ఉన్న ప్రాచ్య లిఖిత భాండాగారానికి తరలించబడగా శ్రీ శివరామశర్మగారు తిరుపతిలో 15 రోజులు ఉండి తాము వ్రాసిన శుద్ధ ప్రతిని, అక్కడి వ్రాత ప్రతితో సరిపోల్చి చూసి వచ్చారు. కారణాంతరాల వల్ల మానసాంధ్రానువాదం ముద్రణ భాగ్యానికి నోచుకోలేకపోయింది. పూజ్యులు శ్రీ దేవులపల్లి రామానుజారావు గారిని నేను పదే పదే అభ్యర్థించడంతో చారిత్రక ప్రాధాన్యం గల ఈ అనువాదంలో 'సుందరకాండ' ప్రచురించడానికి వారు అంగీకరించారు. తత్ఫలితంగా, సహృదయులైన తెలుగు పాఠకులకు ఈ అనువాదాన్ని గురించి తెలియజేయాలన్న నా అభిలాష నెరవేరింది." [35]

ఆ విధంగా ఆ మహా కావ్యంలోని ఏడు కాండాల్లో కేవలం సుందర కాండం మాత్రమే ముద్రణ భాగ్యానికి నోచుకొంది. మిగతా భాగాలు నిర్మల్‌గారు పరమపదించే వరకు కూడా ముద్రణ పొందలేదు. అయితే నిర్మల్‌గారు తమ జీవిత పర్యంతం ఆ ప్రయత్నంలోనే ఉన్నారు. దురదృష్టమేమంటే దేవులపల్లి రామానుజారావుగారు పరమపదించాక ఆ మిగితా భాగాల వ్రాత ప్రతులు ఏమయ్యాయో తెలియలేదు. ఈ విషయం నిర్మల్‌గారు తమ చివరి రోజుల్లో స్వయంగా చెప్పారు. ఆ వివరాలిలా ఉన్నాయి–

నేను కార్గిల్ యుద్ధంపై రచించిన నా దీర్ఘ కవిత 'విజయ విక్రాంతి' హిందీ అనువాదానికి ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్‌గారితో పీఠిక వ్రాయించుకోడానికి, ఆయన జీవన సంధ్యలో కలవడం జరిగింది. అప్పటికే ఆయన గుండె జబ్బుతో బాధపడుతున్నారు. అయినా ఆ సమయంలో ఆయన ఎంతో దీక్షతో 'రామచరిత మానస్' తెలుగు అనువాదాన్ని పరిష్కరిస్తున్నారు. అంతకు ముందే 'సుందర కాండం' గ్రంథాన్ని చూసినవాణ్ణి కాబట్టి, "అవి శిష్టు కృష్ణమూర్తి, మండ కామయ్య శాస్త్రిల ఆంధ్ర తులసీ రామాయణం మిగతా భాగాలా?" అని అడిగాను. దానికి ఆయన కాదని, ఆ వ్రాత ప్రతి ఎక్కడ ఉందో తెలియలేదని, దాని ఇంకో ప్రతి కొరకు తిరుపతిలోని ప్రాచ్య లిఖిత భాండాగారంలో కూడా ప్రయత్నించానని, అది కూడా అక్కడ లభ్యం కాలేదని చెప్పారు. ప్రస్తుతం తాను చూస్తున్నది ఆయాచితుల హనుమచ్ఛాస్త్రి అనే మరొక కవి విరచిత అనువాదమని ఆ కవి శిష్టు కృష్ణమూర్తి, కామయ్య శాస్త్రిల తరువాతి కాలంవాడై, 19వ శతాబ్ది చివరి భాగంలో ఉండి ఉంటాడని చెప్పారు. ఆశ్చర్యమేమంటే ఆ కవి కూడా శిష్టు కృష్ణమూర్తి, మండ కామయ్య శాస్త్రిలలాగే దోహా – చౌపాయి ఛందస్సులలోనే రచించారు. నిర్మల్‌గారు ఆ వ్రాతప్రతిని పరిష్కరించి, గోరక్‌పూర్‌లోని గీతా ప్రెస్ వారికి ముద్రణార్థం అప్పగించారు. అయితే నిర్మల్‌గారు పరమపదించాక, అది కూడా ముద్రణకు నోచుకున్నట్లు లేదు. ఇటీవల వారి అమ్మాయి శ్రీమతి బి. వాణి గారిని కలిసి వ్రాత ప్రతి కొరకు అడిగినప్పుడు ఆమె ఎంతో సహృదయతతో వెదికి, అయోధ్యకాండం వ్రాత ప్రతిని సాధించి నాకు పరిశీలనార్థం అందజేసారు.[36]



చెప్పొచ్చేదేంటంటే శిష్టుకృష్ణమూర్తి, మండ కామయ్యశాస్త్రిల స్ఫూర్తితో అయాచితం హనుమచ్ఛాస్త్రి కవి హిందీ ఛందస్సులలో అనువాదం చేసి ఉంటారు. ఈ కవి తనను తాను శ్రీ తులసీ రామాయణం – ఛందోనువక్తగా పేర్కొన్నాడు. ఆ విధంగా ఈ ఛందోనవ్యతను సాధించిన కవుల జాబితాలో శ్రీ అయాచితం హనుమచ్ఛాస్త్రిని కూడా చేర్చవచ్చు.

మరో విషయం – శిష్టు కృష్ణమూర్తి, మండ కామయ్యశాస్త్రిల కర్తృత్వంలో కూడా కొంత అయోమయం నెలకొంది. ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్‌గారి సంపాదకత్వంలో వెలువడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ 'ఆంధ్ర తులసీ రామాయణం' (సుందరకాండం) కవరు పేజీపై "తులసీదాసు రామచరిత మానస్ తెనుగు సేత శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి" అని ఒక్క పేరే ఉంది. కాని లోపలి పేజీల్లో నిర్మల్‌గారి వ్యాఖ్య ఇలా ఉంది.

"H.H. Maharaja of Vijayanagaram వారి లైబ్రరీలో లభించిన వ్రాతప్రతిలో కొన్ని కాండాల చివరలో – 'ఇది వ్రాసినది ముక్కామల రుక్మేశ్వరశాస్త్రి' అని ఉన్నది.[37] కవరు పేజీ మీద 'రామ చరిత మానస సరోవరము' అని ఉన్నది.

ఈ వ్రాత ప్రతిలో అయోధ్య కాండం (పూర్తిగాను), అరణ్యకాండంలో మారీచ వధ వరకు మాత్రమే శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు రచించారు. బాల కాండం, అరణ్య కాండ శేష భాగం. సుందరకాండం మండ కామయ్య గారు రచించారు. కిష్కింధాకాండాంతంలో మండ నరహరికృతమని ఉన్నది. యుద్ధకాండాంతంలోనూ, ఉత్తర కాండాంతంలోనూ అనువాదకుడి పేరే లేదు."[38]

పై విషయం గ్రహిస్తే ఒక సందేహం తలెత్తక మానదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ముద్రించింది సుందరకాండ ఐతే కవరు పేజీ మీద దాని కర్త మండ కామయ్య శాస్త్రి పేరు ముద్రించక కేవలం శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి పేరే ముద్రించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అలాగే కిష్కింధకాండ కర్త మండ నరహరి అని ఉంటే, నిర్మల్ గారు మండ నరహరి, మండ కామయ్యశాస్త్రి ఒక్కరేనని తేల్చారు. చాలా మంది పండితులు దీనితో విభేదించలేదు. కాని నరహరి, కామయ్యశాస్త్రి ఒక్కరు కానక్కర లేదు. శిష్టు కృష్ణమూర్తితో కర్తృత్వాన్ని పంచుకొన్నట్లే, తన బంధువో,

సోదరుడో, తనయుడో అయిన మండ నరహరికి మండ కామయ్యశాస్త్రి ఒక కాండం రచన బాధ్యత అప్పగించి ఉండవచ్చు కదా! ఆంధ్ర మహాభారతాన్ని కవిత్రయం అనువదించినట్లు, కృష్ణమూర్తి శాస్త్రి, కామయ్య శాస్త్రి, నరహరి కవి అనే కవిత్రయం ఈ తులసీ రామాయణాన్ని అనువదించి ఉండవచ్చు కదా! ఏమైనా దీనికి తగిన ఆధారాలు లేవు. నిర్మల్‌గారు గ్రంథంలో తన పరిచయ వాక్యాల్లో ఇలా అన్నారు.

"శ్రీ మండనరహరి లేక కామయ్యశాస్త్రి గారిని గురించి వివరాలు ఏమీ తెలియవు. 'మండ' వంశీకులు విజయనగరంలోనూ, ఆ చుట్టు పక్కల గ్రామాల్లోనూ ఎక్కువగా ఉన్నారు. మండ వంశీయులు విజయనగర సంస్థానంలో ఆస్థాన కవులుగా ఉండేవారట."[39]

మాత్రాబద్ధంగా సాగే హిందీ ఛందస్సులను తెలుగులో ప్రవేశపెట్టి 19వ శతాబ్దిలోనే గణనీయమైన ఛందో నవ్యతను సాధించిన ఈ కవులు ఎవరెవరైనా, ఎంతమందైనా, మొత్తానికి వీరు సాధించిన నవ్యత ఎలా ఉందో పరిశీలిద్దాం.

ముందుగా తులసీదాసు మూలంలో అనుసరించిన ఛందస్సు పద్ధతులను పరిశీలిద్దాం. ఈ పద్ధతిని హిందీ సాహిత్యంలో 'దోహా – చౌపాయి' పద్ధతి అంటారు. ఈ పద్ధతిలో 5 చౌపాయిలు (ఈ సంఖ్యా నియమంపై పెద్ద పట్టింపు ఉండదు – కవి సడలించుకోవచ్చు) రచించిన పిదప ఒకటి (లేదా రెండు) దోహాల చొప్పున రచించడం జరుగుతుంది. తులసీదాసు అక్కడక్కడా దోహా బదులు 'సోరఠా' అనే ఛందస్సును వాడాడు. అలాగే కావ్యంలో అక్కడక్కడా 'ఛంద్' అనే పేరుతో వర్ణవృత్తాలు వాడాడు. అనువాద కవులు కూడా 'దోహా – చౌపాయి' పద్ధతిని పాటించి, అక్కడక్కడా 'సోరఠా', 'ఛంద్' అనే ఛందస్సులను కూడా ప్రయోగించారు.

**చౌపాయి :** – ఇది నాలుగు పాదాల రచన. ఒక్కొక్క పాదంలో 16 మాత్రలుంటాయి (అప్పుడప్పుడు 15 లేక 17 ఉండవచ్చు. మూలంలో కూడ ఈ సడలింపులున్నాయి). రెండు రెండు పాదాలకు అంత్యప్రాసలుంటాయి. పాదాంత విరతిని పాటించాలి.



**తులసీదాసు రచన :**– అయోధ్య కాండం – 134 భాగంలో 2వ చౌపాయి.

అంత్య ప్రాసలు
బరషిసుమన కహదేవ సమాజూ (16 మాత్రలు)
నాథ సనాథ భయేహమ ఆజూ (16 మాత్రలు)

అంత్య ప్రాసలు
కరవినతీ దుఖదుసహ సునాయే (16 మాత్రలు)
హర్షిత నిజనిజ సదన సిథాయే[40] (16 మాత్రలు)

**దోహా :**– ఇది కూడా నాలుగు పాదాలతో ఉంటుంది. బేసి సంఖ్యా పాదాలలో (అనగా ఒకటి, మూడు పాదాలలో) 13 మాత్రలుంటాయి. (కొన్ని సందర్భాలలో 14 లేక 12 మాత్రలు వేయవచ్చు) సరి సంఖ్యా పాదాలలో (అనగా 2 మరియు 4వ పాదాలలో) 11 మాత్రలుంటాయి (కొన్ని సార్లు 12 లేక 10 మాత్రలు కూడా ఉండవచ్చు). సరి సంఖ్యా పాదాలకు అంత్యప్రాసలుండాలి. బేసి సంఖ్యా పాదాలను 'జగణం'తో ప్రారంభించకూడదు. అన్ని పాదాలలో పాదాంత విరతి ఉండాలి.

**తులసీదాసు రచన** :– (సుందరకాండము – 3వ దోహా)

అంత్యప్రాసలు
పురరఖవారె దేఖ బహూ (13 మాత్రలు)
కపిమన కీన్హ బిచార్ (11 మాత్రలు)
అతిలఘు రూపధరౌంనిసి (13 మాత్రలు)
నగర కశౌం పయిసార్ [41] (11 మాత్రలు

**సోరఠా :**– 'దోహా వుల్టా సోరఠా' అని నియమం. అంటే బేసి సంఖ్యా చరణాలలో 11 మాత్రలు, సరి సంఖ్యా చరణాలలో 13 మాత్రలు. అయితే సరి సంఖ్యా పాదాలకే అంత్యప్రాసలు పాటించాలి. కవి అక్కడక్కడా బేసి సంఖ్యా పాదాలకు కూడా అంత్యప్రాసలు వేశాడు. పాదాంత విరతి ఉండాలి.

**తులసీదాసు రచన :** (అయోధ్య కాండంలో 226వ సోరఠా)

అంత్య ప్రాసలు
సునత సుమంగళ బైన్ (10 మాత్రలు)
మన ప్రమోద తన పులక భర్ (13 మాత్రలు)

అంత్యప్రాసలు
సరద సరోరూహనైన్ (11 మాత్రలు)
తులసేభరే సనేహజల్ [42] (13 మాత్రలు)

**ఛంద్ :** ఇందులో నాలుగు పాదాలుంటాయి. ప్రతి పాదంలో కాస్త అటూ ఇటూగా 28 మాత్రలుంటాయి. మొదటి రెండు పాదాలకు అలాగే మూడు, నాలుగు పాదాలకు అంత్యప్రాసలుంటాయి. పాదాంత విరతి పాటించాలి.

తులసీదాసు రచన : (సుందరకాండం 3వ భాగంలో 1వ ఛంద్)

అంత్యప్రాసలు
కనక కోట బిచిత్ర మణికృత సుందరాయతనా ఘనా (26 మాత్రలు)
చవు హట్ట హట్ట సుబట్ట భీధీం చారూ పురబహు బిధి బనా (29 మాత్రలు)

అంత్యప్రాసలు
గజ బాజి ఖచ్చర నికర పదచర రథ బరూధన్హి కోగనై (28 మాత్రలు)
బహు రూప నిసిచర జూథ అతిబలసేన బరనత నహి బనై [43] (28 మాత్రలు)

ఇప్పుడు ఇవే పద్యాలకు అవే ఛందస్సులలో మన తెలుగు కవుల అనువాదాలను పరిశీలిద్దాం.

**తెలుగు చౌపాయి :** అయాచితుల హనుమచ్ఛాస్త్రి రచన – 'శ్రీ తులసీ రామ చరిత మానస'లో అయోధ్యాకాండంలో 134వ చౌపాయి – దోహా భాగంలో రెండవ చౌపాయి :-

అంత్యప్రాసలు
పూలు కురిసి నుడివె దేవ బృందము (16 మాత్రలు)
నాథ! సనాథులను నేడందరము (16 మాత్రలు)

అంత్యప్రాసలు
ప్రణతి సేసి, వగపు పెల్లు వినిచిరి (16 మాత్రలు)
ముదమున నిజావాసములకు జనిరి [44] (16 మాత్రలు)

**తెలుగు దోహా :** మండ కామయ్య శాస్త్రి రచన – ఆంధ్ర తులసీరామాయణం. సుందరకాండంలో 27వ పద్యం.

అంత్యప్రాసలు
పుర రక్షకులను జూచి మరు (14 మాత్రలు)
త్పుత్రుడట విచారించె (11 మాత్రలు)
శరీర మతి సూక్ష్మము జేసి (13 మాత్రలు)
పుర మందు ప్రవేశించె [45] (11 మాత్రలు)

**తెలుగు సోరఠా :** అయాచితుల హనుమచ్ఛాస్త్రి రచన (అయోధ్య కాండంలో 226వ పద్యం).

అంత్య ప్రాసలు
విని మంగళ వచస్సుల (11 మాత్రలు)
మెయిగ గురు ముదితము హృదయము (13 మాత్రలు)

అంత్యప్రాసలు
శరదంబుజ సమాక్షుల (11 మాత్రలు)
తులసీ ! నిండె స్నేహ జలము[46] (13 మాత్రలు)

తెలుగు ఛంద్ : మండ కామయ్య రచన సుందరకాండంలో 24వ పద్యం.

అంత్య ప్రాసలు
కనె నతడు కనక మణీ విచిత్ర నికాయ్యముల నలుదిక్కులన్ (28 మాత్రలు)
ఘనరాజ పథముల నాపణంబుల గజ తురంగమ పంక్తులన్ (28 మాత్రలు)

అంత్య ప్రాసలు
దనరారు రథముల పాదచారుల దనుజ సైన్యము నెన్నగా (28 మాత్రలు)
గన వశమె వాపీకూపములు నుద్యానములు నలరారగా[47] (28 మాత్రలు)

ఈ విధంగా మూల భావాలను ప్రప్రథమంగా యథాతథమైన హిందీ ఛందస్సులలో అనువదించి అలవోకగా మంచి ధారతో రక్తి కట్టించారు మన తెలుగు కవులు. ఇక్కడ ఒక విషయం గమనించాలి. పాదాంత విరతి మన తెలుగు ఛందస్సులకు లేదు కాబట్టి, తెలుగులో ఈ హిందీ ఛందస్సులను ప్రయోగించేప్పుడు ఆ నియమాన్ని ఈ కవులు తప్పనిసరిగా పాటించలేదు. కొన్నిసార్లు ఒక పాదంలో నుండి ఇంకోపాదంలోకి చొచ్చుకు వెళ్ళేట్టుగా పదాలను ప్రయోగించారు. అలాగే హిందీ ఛందస్సులలో ఉన్న అంత్యానుప్రాసలను పాటిస్తూనే, తెలుగులో సహజమైన ప్రాసనియమాన్ని మండ కామయ్యశాస్త్రిగారు పాటించారు. ఆ విధంగా హిందీ ఛందస్సులను తెలుగులో ప్రయోగించేప్పుడు శాస్త్రిగారు ఇంకా అదనంగా నియమాలను జోడించుకొని రచించారన్నమాట. ఏమైనా మన వృత్త పద్యాల కన్న జాతుల కన్న ఎంతో స్వేచ్ఛతో కేవలం మాత్రాబద్ధంగా సాగే ఈ ఛందస్సులను గురజాడ ముత్యాలసరం కన్న ఎంతో ముందు 19వ శతాబ్దిలోనే ప్రవేశపెట్టి, 20వ శతాబ్దిలో విస్తృతంగా వచ్చిన గేయ కవిత్వానికి స్ఫూర్తి నిచ్చిన కవులు మండ కామయ్య శాస్త్రి, శిష్టు కృష్ణమూర్తి మరియు అయాచితం హనుమచ్ఛాస్త్రి.

ఆ విధంగా 20వ శతాబ్ది నవ్యకవిత్వ యుగంలో మాత్రాగణాలతో వివిధ గతులలో గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, దాశరథి, ఆరుద్ర, సినారె ప్రభృతులు వెలార్చిన గేయ ఛందస్సులకు బీజం 19వ శతాబ్దిలోనే పడిందని అంగీకరించక తప్పదు.

**పాద సూచికలు :**

1. గురజాడ అప్పారావు, గురజాడ రచనలు (పరిష్కర్త : సెట్టి ఈశ్వరరావు) పుట. 3, పద్యం -1
2. రేవణూరి వేంకటార్యుడు, శ్రీపాద రేణు ప్రభావము - 3వ ఆశ్వాసం. 45వ పద్యం.
3. గురజాడ అప్పారావు : గురజాడ రచనలు (పరిష్కర్త : సెట్టి ఈశ్వరరావు) పుట. 68, పద్యం 1
4. రేవణూరి వేంకటార్యుడు : శకుంతలా పరిణయం - అవతారిక
5. తెలుగు అకాడమి : తెలుగు సాహిత్య కోశము (ప్రాచీన సాహిత్యము) పుట. 928
6. తెలుగు అకాడమి : తెలుగు సాహిత్య కోశము (ప్రాచీన సాహిత్యము) పుట. 423
7. రేవణూరి వేంకటార్యుడు, శ్రీపాదరేణు ప్రభావము-1వ అధ్యాయం 52వ పద్యం
8. వీరేశలింగం పంతులు, ఆంధ్ర కవుల చరిత్రము - పుట. 226
9. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి : తెలుగు సాహిత్య చరిత్ర (పంచమ భాగము) - పుట. 285
10. ఆచార్య సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు-పుట.155
11. కందుకూరి వీరేశలింగం : సత్యాద్రౌపది సంవాదము - ప్రారంభ పాదాలు
12. నండూరి రామకృష్ణమాచార్య : కావ్యాలోకం - పుట. 182
13. శ్రీనివాస సోదరులు : శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యములో ముందు మాట-'మేలి పలుకు'-పుట.17
14. అనంతామాత్యుడు : ఛందోదర్పణము - పుట. 68
15. పరిశోధకుని ప్రచురిత వ్యాసం : ఆచార్య వి.యల్.యస్.భీమశంకరం సప్తతి అభినందన సంచిక-పుట.104
16. గడియారం శేషఫణి శర్మ : కల్యాణ రాఘవము - ఉపక్రమణిక పుట.
17. గడియారం శేషఫణి శర్మ : కల్యాణ రాఘవము - ఉపక్రమణిక పుట...
18. కొప్పరాజు నరసింహం : శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యము - 2వ ఆశ్వాసం - 139వ పద్యం
19. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి: తెలుగు సాహిత్య చరిత్ర (పంచమ భాగం) - పుట. 353

20. ఆచార్య సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు, ప్రయోగములు –పుట. 134

21. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 246

22. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 265

23. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 39

24. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 148

25. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 44

26. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 301

27. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 23

28. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 107

29. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 5

30. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 40

31. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 46

32. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 42

33. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 52

34. కొక్కొండ వెంకటరత్న శర్మ : బిల్వేశ్వరీయము – పుట. 97

35. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ : ఆంధ్ర తులసీ రామాయణము (సుందరకాండము) పుటలు. VIII & IX

36. శ్రీమతి బి. వాణి గారు (హైదరాబాదులోని 'సరోజినీ నాయుడు వనితా మహా విద్యాలయ'లో సంస్కృతోపన్యాసకులు.)

37. ఇతడు వ్రాయసకాడై ఉండాలి.

38. ఆం. ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ : ఆంధ్ర తులసీరామాయణము (సుందరకాండము) పుట. X

39. ఆం. ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ : ఆంధ్ర తులసీరామాయణము (సుందరకాండము) పుట. X

40. గోస్వామి తులసీదాసు : రామచరిత మానస్ (మూల గ్రంథం) అయోధ్య కాండం – 134వ భాగంలో 2వ చౌపాయి.

41. గోస్వామి తులసీదాసు : రామచరిత మానస్ (మూల గ్రంథం) సుందర కాండము – 3వ దోహా

42. గోస్వామి తులసీదాసు : రామచరిత మానస్ (మూల గ్రంథం) అయోధ్య కాండంలో 226వ సోరఠా

43. గోస్వామి తులసీదాసు : రామచరిత మానస్ (మూల గ్రంథం) సుందర కాండము – 3వ భాగంలో 1వ ఛంద్

44. శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి అనువాదంలో అయోధ్యాకాండం – వ్రాతప్రతిలో 134వ చౌపాయి దోహా భాగంలో 2వ చౌపాయి.

45. మండ కామశాస్త్రి అనువాదం – ఆంధ్ర తులసీరామాయణం సుందరకాండంలో 27వ పద్యం.

46. అయాచితుల హనుమచ్ఛాస్త్రి అనువాదంలో అయోధ్య కాండం – వ్రాత ప్రతిలో 226వ పద్యం.

47. మండ కామయ్యశాస్త్రి అనువాదం – ఆంధ్ర తులసీ రామాయణం (సుందరకాండం)లో 24వ పద్యం.



7

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో భాషాపరమైన నవ్యత



**"భా**ష యనగా శబ్దరూపమై భాషించుటకు సాధనమైనది"[1] అన్నారు సుప్రసిద్ధ నైఘంటుకులు బహుజనపల్లి సీతారామాచార్యులు. "సమాజంలో ఒకరి భావాలు మరొకరికి తెలియటానికి వీలుగా ఏర్పడిన ధ్వని సంకేతాల నియత నిర్మాణం - భాష!"[2] అంటారు పోరంకి దక్షిణామూర్తి. దీన్నే మరో రకంగా "భాషలు ప్రపంచ సృష్టికి వెంబడిన నానావిధజన సమాజ సంకేతితములై యేర్పడినవి. అవి తొలుదొల్త కేవలము దోష యుక్తములై, యల్పములై వ్యవహార మాత్రోపయుక్తములై యుండి, యవల క్రమక్రమంబున వృద్ధి బొంది, ఋషి ప్రభృతులచే పరిష్కృతంబులై కావ్య రచనలకును నుపయుక్తములయినట్లు తెలియబడుచున్నది. మొదట నేదేనియు సామాన్య రూపముగా నేర్పడి, మీద మీద నది యుక్త విశేషముచే జక్కబడుచు వచ్చును"[3] అని విపులంగా వివరించారు బహుజనపల్లివారు.

దీన్ని బట్టి భాష రెండు విధాలుగా ఉంటుందని తెలుస్తూంది. ఒకటి గ్రాంథిక భాష లేక కావ్య భాష. రెండవది వ్యవహార భాష. వీటిలో వ్యవహార భాష ముందు పుట్టి పండితుల పరిణత పరిష్కరణం వల్ల గ్రాంథిక భాష ఏర్పడుతుందన్నది సుస్పష్టం. అందుకే గ్రంథస్థ యోగ్యమైన భాష గ్రాంథిక భాషయని గౌరవిస్తూ, వ్యవహారంలో ఉన్న భాష అల్పమైనదన్న భావన మన ప్రాచీన పండితులకు ఉండేది. కానీ, 20వ శతాబ్ది ప్రారంభంలో తెలుగు భాషా క్షేత్రంలో వ్యవహార భాషోద్యమం తలెత్తి పండితులను రెండు వర్గాలుగా చీల్చింది. గ్రాంథిక భాషావాదులకు, వ్యవహార భాషావాదులకు మధ్య పెద్ద యుద్ధమే జరిగింది. అయితే అంతకుముందే 19వ శతాబ్దిలోనే చాలా మంది కవులు వ్యవహార భాషా శబ్దాలను, అన్యదేశ్యాలను తమ



కావ్యాలలో ప్రయోగించి భాషాపరమైన నవ్యతను సాధించారు. సందర్భానుసారం వ్యవహార భాషా శైలిని, వృత్తి ఉద్యోగాల పరిభాషను ప్రయోగించి, వాటికి కావ్య గౌరవాన్ని కల్పించి తెలుగు కావ్య భాషకు నూతనత్వాన్ని సంతరించారు కొందరు 19వ శతాబ్ది కవులు. 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలోని ఆ భాషా పరమైన నవ్యతను ఈ అధ్యాయంలో సోదాహరణంగా పరిశీలిద్దాం.

అసలు తెలుగు భాషలో అన్యదేశ్యాలు, ముఖ్యంగా పారశీక, ఉర్దూ శబ్దాలు ప్రాచీన కాలం నుండే అడపాదడపా వచ్చి చేరుతూనే ఉన్నాయి.

*"అదె ఘృత తండుల ప్రకర మల్లవె చీరలు భూషణాది సం*
*పదలవె రాజు రాక కులుపా యొనరించిన యట్లు మీరెడిన్"*[4]

అన్న పద్యంలో పింగళి సూరన 'ఉలుపా' (ఉల్ఫా - పారశీకంలో బహుమానం) అన్న శబ్దాన్ని ప్రయోగించాడు.

*"ఖుసి మీరన్ సురధాణి నిండు కొలువై కూర్చున్నచో"*[5] అన్న పద్యంలో శ్రీనాథుడు 'ఖుసి' (ఖుషీ - ఉరుదూలో సంతోషం) అన్న శబ్దాన్ని ప్రయోగించాడు.

*"శ్రీవల్లభు గతి చేరని పదవులు,*
*దావతులు - కపట ధర్మములు"*[6]

అని తొలివాగ్గేయకారుడు అన్నమయ్య ఒక కీర్తనలో 'దావతులు' (దావత్ - ఉర్దూలో విందు) అన్న శబ్దాన్ని ప్రయోగించాడు.

*"తిరుమలకును బోవ తురక దాసరి గాడు"*[7] అంటూ 'తురక' (పారశీకంలో మహమ్మదీయుడు) అన్న శబ్దాన్ని ప్రయోగించాడు వేమన.

అయితే ఇలా ఒకటి, అర శబ్దాలను అక్కడక్కడా ప్రయోగించడం పెద్ద విశేషమేమీ కాదు. 19వ శతాబ్దిలో కొందరు కవులు తెలుగు, ఉరుదూ భాషలను కలగలిపి ఒక మిశ్రభాషగా వాడుతూ మణి ప్రవాళ శైలిలో పద్యాలు రచించి నవ్యతను చూపారు. ఈ మణి ప్రవాళ శైలికి పాల్కురికి సోమనాథుడు ప్రారంభకుడయితే, 'ఆముక్త మాల్యద'లో శ్రీకృష్ణదేవరాయలు -

"ఆ నిష్ఠానిధి గేహ సీమ నదురే యాలించిన స్రోమేయు నెం
తే నాగేంద్ర శయాను పుణ్య కథలుం దివ్య ప్రబంధాను సం
ధాన ధ్యానము, 'నాస్తి శాక బహుతా, నా స్తుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదన సౌష్టవం చ కృపయా భోక్తవ్య' మన్మాటలున్"[8]

అన్న పద్యంలో సంస్కృతాంధ్రాలను మణి ప్రవాళరీతిలో ప్రయోగించడం సాహితీ వేత్తలకు విదితమే. అయితే 19వ శతాబ్దిలో మొట్ట మొదటిసారిగా ఉరుదూ, తెలుగు భాషలను మణి ప్రవాళ శైలిలో ప్రయోగించిన ఘనత శ్రీమత్తిరుమల వేదాంతము శ్రీనివాస దీక్షితయ్యరు, బెండా పెంటయ కవి, శిష్టు కృష్ణమూర్తి, దిట్టకవి నారాయణ కవి మొదలైన వారికి దక్కుతుంది.

క్రీ.శ. 1860లో శ్రీమత్తిరుమల వేదాంతము శ్రీనివాస దీక్షితయ్యరు రచించిన 'రంగ శతకము'లోని రెండు పద్యాలను మచ్చుకు పరిశీలిద్దాం.

*"సైరే శ్రీరంగ జమీం
దారు బరాబర్ నవాబు తాఖతువర్ పా
చ్ఛారే బహదుర్ ఖాబు స
వారు సలామనిరి తురక వారలు రంగా!"*

*"తీరు కమాన్దస్తా తర
వారు జమాయించి కట్టి బలమా తరహా
దారీ తాంగన్ మీదన్
స్వారి వెడల నిన్ను గంటి సామీ రంగా!"*[9]

కవి కంద పద్యాలలో ఉర్దూ, తెలుగు భాషలను మిశ్రభాషగా ప్రయోగించిన తీరు నిజంగా ప్రశంసనీయం. ముఖ్యంగా రెండవ పద్యంలో 'జమాకే బాంద్‌కే' అన్న అర్థాన్ని ఇచ్చే విధంగా – 'జమాయించి కట్టి' అని తెలుగు చేసిన విధానం ఎంతో ముచ్చట గొలుపుతుంది. ఇప్పటికీ ఈ పలుకుబడి తెలంగాణంలో విస్తృతంగా వినిపిస్తూ ఉంటుంది.



19వ శతాబ్ది ఉత్తరార్ధంలో రాజమండ్రి పట్టణంలో తాలూకా పోలీసు స్టేషన్‌లో రైటరుగా పని చేసిన బెండా పెంటయ్య కవి ఆత్మ సంబుద్ధిగా 108 పద్యాలతో 'పెంట శతకము' రచించాడు. అందులోని ఒక పద్యం –

*"దిల్సే జానో తేరా
అల్లాయన నెచటనుండు – కల్లరి భువిలో
కల్లుడిగిన తానిల్చిన
బాలుడు బ్రహ్మానుభవుడు – బస్‌కరొ పెంటా!"*

కవి ఈ పద్యంలో ప్రాస నియమాన్ని తన కిష్టమైన రీతిలో వెసులుబాటుగా సడలించుకొన్నా, ఈయనకు ఉర్దూ భాషలో మంచి ప్రావీణ్యమున్నట్టు తెలుస్తుంది. తూర్పు గోదావరి జిల్లా రాయవరంలో పుట్టి, రాజమండ్రిలో నివసించిన ఈ కవికి ఇంతటి ఉర్దూ ప్రావీణ్యం ఉద్యోగ ధర్మం వల్లే అబ్బి ఉంటుంది. దీనిని బట్టి, 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో బ్రిటిష్ పాలన ఆంధ్ర ప్రాంతంలో సుస్థిరమైనా, ఇంకా క్రింది స్థాయి ఉద్యోగులలో అంతకుముందు నిజాము పాలన ప్రభావం మిగిలి ఉందని రూఢి అవుతుంది. పద్యంలో ప్రథమ పాదంలో 'దిల్సే జానో తేరా', ఇంకా చివరి పాదంలో 'బస్‌కరొ' అన్న ఉర్దూ వాక్యాలను పొందుపరిచిన తీరును మెచ్చుకోవలసిందే!

పందొమ్మిదో శతాబ్ది పండిత కవులలో ప్రసిద్ధులైన శిష్టు కృష్ణమూర్తి (ఆంధ్ర తులసీ రామాయణ కర్తలలో ఒకరు) కాకర్ల పూడి జమీందారుపై ఒక ఉత్పల మాలికను రచించి అందులో పుష్కలంగా పారశీక పదాలను గుప్పించారు. అంతే కాదు ఆ పదాలతో అద్భుతమైన అనుప్రాసను కల్పించి, మనోహరమైన నవ్యతను సాధించాడు. అన్య దేశ్యాల ప్రయోగమే వింతగా భావించే రోజులలో ఆ పదాలతో అనుప్రాస సౌందర్యాన్ని సృజించడం బహుధా ప్రశంసాపాత్రం.

*"వీరు తెనుంగు సాము లరబీత రబీయతు నొప్పు గొప్ప స
ర్కారు వలే జమీలు దరఖాస్తుగ నేలిన రాజమాన్య హం
వీరులు ధక్కణేలు తజవీజు కులహీకులన్న యేటి మం
జూరు జొహారు యాఖిద మషూరు ఖరారు మదారు బారు బ*

ర్దారు మితార్గురాల పరదారుల తౌరు కడాని తేరులం
బారు మితారు నౌబతు సుమారు పుకారును మీరు కుడ్తినీ
దారు పఠాణి బారు దళదారు సవారు షికారులందు బి
ల్యారు సతాస వారు పిలగోల తుపాకుల ఫైరులందు లే
ఖ్యారుగ బెక్కుమారులు తయారుగ వీరి హుజూరులందు వె
య్యారులు పెద్ద పేరుల జొహారులు చూచి హమీరు లెంచి ద

ర్బారు పసందు మీర వహవా యని మెచ్చు నవాబు ఖాను షం
షేరు బహాదరుల్ పెర వజీరుల నూరుల మారకెన్న తా
ర్మారుగ మోది గీములు తమామ వదల్చి ముఖాములెల్ల ఫీ
ర్ఫారొనరించి మిక్కిలి మరాతబు లందరి చేరుమాలు త
ల్వారుల జేరు దారు దళవాయుల చాయల మీరు చార్కుకై
జారు కరారు బాకు నెలజాళు తళుక్కున బందు బస్తుగా
పోరు భుజోరు కాకరల పూడి వజీరులదేయనన్....''[10]

ఈ మాలికలో 'ర' కార అనుప్రాసం ధారాపాతంగా సాగి పరుగులెత్తిస్తుంది. కవి ఒక చోట 'తుపాకుల ఫైరు' అని ఆంగ్ల శబ్దాన్ని కూడా ప్రయోగించడం గమనార్హం.

వీటిన్నిటి కంటె ముందే 19వ శతాబ్ది ప్రథమ చరణంలోనే, అంటే క్రీ.శ. 1800 ప్రాంతంలోనే దిట్టకవి నారాయణకవి, బొబ్బిలి సంస్థానాధిపతి రంగారావుకు, ఫ్రెంచి దొర బుస్సీకి మధ్య జరిగిన యుద్ధాన్ని 'రంగరాయ కదనరంగ చరిత్రము' అన్న కావ్యాన్ని రచించాడు. దీనికి 'రంగరాయ చరిత్రము' అన్న నామాంతరం కూడా ఉంది. ఇందులో కవి సందర్భానుసారం పాత్రోచితంగా, ఉర్దూ భాషను తెలుగు భాషతో రంగరించి పద్య నిర్మాణం చేసారు.

*''హల్లా సేయుదు – బొబ్బిలి*
*కిల్లా తజ్జయము నీకు గిల్లొల్పుదు నే*
*కల్లాడ జుమ్మి – యిదినా*
*యల్లా చరణంబు లాన ! యధిపవతంసా!''*



ఈ పద్యాన్ని గురించి కవిత్వవేది కల్లూరి వేంకట నారాయణ రావు ప్రశంసా పూర్వకంగా ఇలా వ్యాఖ్యానించారు –

''హల్లా సేయుట, అల్లా చరణంబులాన అను జాతీయము లీ పద్యమునకు ఎంతయు సొగసును గూర్చినవి. మిశ్రమ భాషాశైలి సందర్భశుద్ధి కలది యగుచో రస పుష్టికి దోడ్పడుచుండును. నుడికారములు భావమును పటిష్టముగ వ్యక్తీకరించుటకు దోహద మొసగును. పాత్రోచిత భాషను ప్రయోగించి కవి ఈ కావ్య శైలికి వన్నె చిన్నెలు కూర్చెను.''[11]

ఇలాంటిదే మరొక పద్యాన్ని చూద్దాం –

*''హైదరు జంగు సాహెబు రయమ్మున నిట్లనియెన్*
*నాదరమొప్ప బైకమునకైన విచారము లేటి కమ్మదీ*
*నా దరగా మొలాజిమతు నామది రంజిలు దద్రిరంస నే*
*కాదన రా దవశ్యము శ్రీ కాకుళ మానగ వత్తు మిత్తరిన్!''*

ఇందులో మదీనా యాత్రా సంకల్పాన్ని కవి, 'మదీనా దరగా మొలాజిమతు'గా వివరించారు.

నారాయణ కవి ఈ కావ్యంలో ఉరుదూ, పారశీక శబ్దాలే కాకుండా అనేకమైన ఫ్రెంచి శబ్దాలను వికృతం చేసి, తెలుగులో ప్రయోగించారు. ఈ పద్యాన్ని గమనించండి –

*''సమరోజ్జృంభిత శౌర్యధుర్యలగు సార్జంతుల్, మయూరుల్, కుముం*
*దములన్ వీరులు, సోలుదాదులు, సుబేదారుల్ మొదల్గల్గు సై*
*న్యము లాత్మీయులు గొల్వ నుద్ధతుల ముల్కాఖ్యా మహా ఖ్యాతి మ*
*త్సముదగ్ర ప్రతి భావి భాసియగు మూసా బూసి యుల్లాసియై!''* [12]

ఈ పద్యంలో ఫ్రెంచి శబ్దాల వికృతులను గమనిద్దాం –

**సార్జంతులు :–** ఇది ఆంగ్లంలో 'సార్జెంట్' అన్న పదాన్ని ఫ్రెంచి ఉచ్చారణను అనుసరించి చేసిన ప్రయోగం.

**మయూరులు :–** ఆంగ్లంలో 'మేజర్' అన్న శబ్దాన్ని ఫ్రెంచి వారు 'మయోర్' అని ఉచ్చరిస్తారు. ఆ ఉచ్చారణను అనుసరించి కవి తెలుగులో 'మయూరులు' అని ప్రయోగించారు.

**కుముందములు :–** ఫ్రెంచి భాషలో 'కమాండెంట్' ను ఇలా పలుకుతారు. కవి తెలుగులో అందుకే అలాగే ప్రయోగించారు.

**సోలుదాదులు:–** ఆంగ్లంలోని 'సోల్జర్' అన్న శబ్దాన్ని ఫ్రెంచి భాషలో 'సోల్డాట్' అంటారు. దానినే 'సోలుదాదు' అని ప్రయోగించారు కవి.

**మూసా:–** ఇది 'మోన్సూర్' అన్న ఫ్రెంచి పదానికి వికృతి. ఆంగ్లంలో 'మిష్టర్' లాగే ఇది ఫ్రెంచి భాషలో పురుష నామాలకు ముందు ప్రయోగిస్తారు. కవి అందుకే బుస్సీ దొరను 'మూసా బూస్సీ' అని ప్రయోగించారు.

ఇలా 19వ శతాబ్ది ఉషోదయ కాలంలోనే దిట్టకవి నారాయణకవి పాశ్చాత్య భాషా శబ్దాలను తెలుగు పద్యాలలో ప్రయోగించి నవ్యతను సాధించారు.

ఆ తరువాత ఒకటి రెండు దశాబ్దాల పిదప, అంటే క్రీ. శ. 1810–1820 ప్రాంతంలో చత్రాతి లక్ష్మీ నరసు అనే కవి – విజయ నగర సంస్థానానికి, ఈస్టిండియా కంపెనీ వారికి జరిగిన పద్మనాభ యుద్ధాన్ని 'విజయ రామ యశోభూషణము' పేర కావ్యంగా మలచారు. కవి దీనిలో 'కుంఫిణి' (కంపెని), 'సోలు దాదులు' (సోల్జర్లు); 'అప్పరులు' (ఆఫీసర్లు); 'కుముందాను' (కమాండెంట్); 'కెప్తాను' (క్యాప్టెన్), 'కర్నేలు' (కల్నల్); 'మేస్తరు కల్కటేరి' (మిష్టర్ కలెక్టర్); 'ఇంగిలీజు' (ఇంగ్లీష్); 'పిస్తోలు' (పిస్టల్); 'కంసలేరి' (కౌన్సిల్); 'రశీదు' (రిసీట్); వంటి ఎన్నో ఆంగ్ల శబ్దాలను ప్రయోగించారు.

వరుసలో నిల్చోవడాన్ని మనం వ్యవహారంలో ఆంగ్లభాషా ప్రభావంతో 'లైన్'లో నిల్చోవడం అంటాం. లక్ష్మీనరసుకవి ఈ పదాన్ని అలాగే 'లయను' అని ప్రయోగించారీ పద్యంలో –

> *"త్వర పడకు డనుచు ధరణీ*
> *శ్వరు డానతి యిచ్చునంత జాతి పటాలం*
> *బరుదెంచి నిలిచె తంబుర*
> *మొరయింపుచు 'లయను' దీర్చి ముంగల నంతన్"*[13]

తుపాకీని ప్రేల్చడాన్ని 'ఫైరింగ్' అంటాం. కవి ఆ పదాన్ని ఆంగ్లంలో యథాతథంగా అలాగే ప్రయోగించారీ కావ్యంలో –

> *"కాంచి మరి యూరుకుండుట కాని మాట –*
> *గుండు మోమీనుగా వచ్చె కుంపిణీలు*
> *తొలి 'ఫయరు' వారు జేసిన గెలువ యంచు*
> *నూహ సేయుచు జాగ్రత్త నున్న యంత –"*[14]

ఇక్కడ 'ఫయరు' అన్న ఆంగ్ల శబ్దాన్ని యథాతథంగా ప్రయోగించడం ఎంతో సముచితంగా ఉంది. దానికి తెలుగు అనువాదంగా 'నిప్పు', 'అగ్ని' లేక 'ప్రేలుడు' అంటూ తెలుగు పదం ప్రయోగించి ఉంటే తుపాకి 'ఫైరింగ్' అన్న అర్థం స్ఫురించదు కదా! అందుకే తరువాతి కవులు కూడా ఇదే స్ఫూర్తితో తమ కావ్యాలలో ఈ శబ్దాన్ని ఇలాగే యథాతథంగా ఆంగ్లంలోనే ప్రయోగించారు.

19వ శతాబ్దిలో ఇలా కేవలం ఆంగ్ల శబ్దాలను, ఆంగ్ల పద బంధాలను పద్యాలలో ఒకటి రెండు చొప్పున ప్రయోగించడమే కాకుండా, తెలుగు భాషతో కలిపి మిశ్రభాషగా రూపొందించి భాషాపరమైన నవ్యతను సాధించిన కవులు కూడా ఉన్నారు. వారిలో ప్రముఖంగా చెప్పుకోవలసిన కవి 'చెన్న పురీ విలాసము' కర్త – మతుకుమల్లి నృసింహ శాస్త్రి కవి. క్రీ.శ. 1860లో రచించిన ఈ యాత్రాకావ్యంలో కవి సందర్భాన్ని బట్టి చాలా ఆంగ్ల పదాలను పద్యాలలో ప్రయోగించారు. తెలుగు సాహిత్యంలో ఇంత విరివిగా ఆంగ్ల పదాలను ప్రయోగించిన తొలి కవి ఈయనే అని చెప్పవచ్చు. అంతే కాదు – నృసింహకవి ఈ కావ్యంలో కొన్ని ప్రకరణాలకు కూడా ఆంగ్లంలోనే పేర్లు పెట్టి, ఈ కావ్యాన్ని ఆ నాటికి ఒక నవ్యాతినవ్య కావ్యంగా తీర్చిదిద్దారు. 'ఫోటోగ్రాఫీ ప్రకరణము', 'ఇలక్ట్రో గేల్వానిక్మిషన్ ప్రకరణము' మొదలయినవి అందుకు ఉదాహరణలు. 'చెన్నపురీ విలాసము' కావ్యంలోని భాషా పరమైన నవ్యతకు ఉదాహరణగా ఒక పద్యం –

"పురికిం దక్షిణ పశ్చిమంబుల వనా భోగంబులం జూడ గౌ
ర్నరులుం, గర్నలు, సెక్రిటేరులు, కమాండర్లిక జడ్జీ ల్కల
క్టరులుం, బాదరులుం, గమాష్టరులు, మేష్టర్లింజినీర్లాదిగా
దొరలుండందగు బంగళాలు చెలువొందు న్నూరు వేలుందగన్"[15]

19వ శతాబ్ది మధ్యకాలంలోనే గవర్నరులను, కల్నల్‌లను, సెక్రటరీలను, కమాండర్లను, జడ్జీలను, కలెక్టరులను, కమీషనర్లను, మాస్టర్లను, ఇంజనీర్లను ఒక తెలుగు పద్యంలో ఇమిడ్చి భాషాపరమైన నవ్యతను చాటారు మతుకమల్లి సుకవి. క్రీ.శ. 1860 నాటి ఆంగ్ల నాగరకత మూర్తీభవించిన చెన్నై నగరాన్ని వర్ణిస్తూ, సుప్రీంకోర్టు, ఆఫీసు వంటి ఆంగ్ల శబ్దాలను ఆయన యథాతథంగా ప్రయోగించారు. అంతే కాదు – సముద్రపు రేవులో Customs ని ఉట్టంకిస్తూ – 'సీ కష్టము' అని ఆంగ్లంలోనే పేర్కొన్నారు. ఈ పద్యాన్ని చూడండి –

"పెను పొందున్నగరంబు తూర్పునను, సూప్రీమ్ కోర్టు నా జిన్నికో
ర్టును సీ కష్టమునా గమిస్సరియునా రూపింప నాఫీసులీ
జన లోకంబున సర్వధర్మములు సంస్థాపింప నేతెంచి ని
ల్పిన పొకారియమాంబునాథ ధన రాళ్ళీలా సభావైఖరిన్"[16]

నగర వర్ణన లేక పుర వర్ణన అన్నది ప్రబంధాలలో ఒక అంశం. అలాంటిది, 19వ శతాబ్ది మధ్యకాలంలోనే ఆధునిక నగర వర్ణనను ప్రధాన కావ్యవస్తువుగా ఎంచుకొని ప్రబంధ నిర్మాణం చేయడమే కాకుండా, అందుకు తగినట్లుగా ఆంగ్ల భాషా శబ్దాలను ప్రయోగించి, భాషా పరమైన నవ్యతను సాధించిన మతుకు మల్లి నృసింహకవి ఎంతో అభినందనీయులు.

ఇంకా, గోపీనాథము వేంకటకవి (బ్రహ్మానంద శతకము); దాసు శ్రీరాములు కవి (చక్కట్ల దండ) మొదలైన ఎందరో 19వ శతాబ్ది కవులు తమ కావ్యాలలో సందర్భానుసారం అన్యదేశ్యాలను ప్రయోగించి నవ్యతను చూపారు. గ్రంథ విస్తరణ భీతితో వాటినన్నిటినీ వివరించడం లేదు.

ఇలా 19వ శతాబ్దిలో అన్యదేశ్యాలను తెలుగు భాషతో రంగరించి ప్రయోగించి నవ్యతను చూపిన కవులు కొందరయితే, వ్యవహార భాషాశైలికి కావ్య గౌరవాన్ని



కల్పించి, పాత్రోచితంగా ఆ భాషను ప్రయోగించి నవ్యతను చాటిన కవులు కొందరున్నారు.

సుప్రసిద్ధ కవయిత్రి తరిగొండ వేంకమాంబ రచించిన ప్రసిద్ధ కావ్యం 'వేంకటాచల మాహాత్మ్యము'లో కవయిత్రి మొట్ట మొదటిసారిగా ఈ నవ్య మార్గాన్ని త్రొక్కారు. ఈ కవయిత్రి క్రీ. శ. 1840లో జీవించి ఉన్నట్లు బ్రౌను మహాశయుడు పేర్కొన్నారు.17 డా. ముదిగంటి సుజాతారెడ్డి ఈమె గురించి వివరిస్తూ – ఈమె బాల వితంతువని, ఆనాటి ఆచారాన్ని అనుసరించి గుండు గీయించుకోమంటే, మళ్ళీ వెంట్రుకలు మొలవవని పూచీ ఇస్తే గీయించుకొంటానని తిరుగుబాటు చేసిన మహిళగా అభివర్ణించారు.[18]

'వేంకటాచల మాహాత్మ్యము'లో శ్రీనివాస కల్యాణానికి ముందు శ్రీనివాసుడు కురవంజిగా (ఎరుకల సానిగా) వచ్చి ఆకాశరాజు కుమార్తె పద్మావతికి 'ఎరుక' చెప్పిన సన్నివేశంలో, ఎరుకల సాని పద్మావతి తల్లితో మాటాడే భాషగా, కవయిత్రి సహజమైన వ్యావహారిక భాషను వచనంలో ప్రయోగించి నవ్యతను చూపారు. ఈ చంపూ కావ్యంలోని ఆ వచనాన్ని పరిశీలిద్దాం.

"అవ్వోయవ్వ ! నీ తలంచిన తలంపు మేలౌతాదంట. దేవుళ్ళు పలుకుతుండారు. తలంచిన తలంపేమంటివా? విను – ఆడ బిడ్డ కడుగుతుండావే, అవ్వోయవ్వ! ఆ యాడ బిడ్డ కొక సింత కలిగుండాది. ఆ సింత యేమంటివా? నిన్నటి దినము నీ బిడ్డ సవారేగినది. ఆడ తురగారూఢుండైన నల్లనయ్యను జూచి మోహించి యుండాది. వాడు నీ బిడ్డను బెండ్లాడ వలెనని యుండాడె. వాని నీ బిడ్డ పెండ్లాడ నెంచి యుండాదె. కాబట్టి నీ పుత్రికను ఆ సామి కిచ్చి పెండ్లి చేసి కన్నులార సూడుము తల్లీ! సుకంగా నుంటాది. లేకుంటె కష్టాలు రాబోతుండాదె యమ్మ!"[19]

ఈ వచనాన్ని చదువుతుంటే పఠితకు కళ్ళముందు ఎరుకల సాని ప్రత్యక్షమై సోదె చెబుతున్నట్లు అనుభూతి కలుగక మానదు. 19వ శతాబ్ది పూర్వార్ధంలోనే ఒక పద్య కావ్యంలో పాత్రోచితమైన వ్యావహారిక భాషను ప్రవేశపెట్టి, నవ్యతను సాధించిన వేంకమాంబ ప్రతిభ ప్రశంసనీయం. ఆ తరువాత 70,80 సంవత్సరాల

పిదప తెలుగు సాహితీ క్షేత్రంలో వ్యవహార భాషోద్యమం తల ఎత్తిందన్న విషయం ఇక్కడ గమనార్హం.

ఈ కావ్యంలో కవయిత్రి భాషాపరంగా మరొక సరిక్రొత్త ప్రయోగం కూడా చేశారు. సాధారణంగా ఎవరైనా అప్పు తీసుకొంటున్నప్పుడు ఆ రుణం ఇచ్చేవారికి పత్రం వ్రాసి ఇవ్వడం కద్దు. ఇలాంటి రుణ పత్రాల్లో ఒక ప్రత్యేకమైన పరిభాషను వినియోగించడం ఇప్పటికీ జన వ్యవహారంలో ఉంది. సాధారణంగా ఎవరు అప్పు తీసుకొన్నా అదే పద్ధతి (Format) ని ప్రయోగించడం మనం చూస్తుంటాం. దీనినే మనం 'ప్రామిసరీ నోటు' అంటున్నాం. అది ఇలా ఉంటుంది –

**ప్రామీసరీ నోటు :-**

............. తేదీన .................అను నేను............................గారి నుండి................................... నిమిత్తము రూ.లు ...................... అక్షరాల రూ.లు .................................అప్పుగా తీసుకొంటిని. ఇందుకొరకు ప్రతినెల రూ.లు ................................ వడ్డీ చెల్లించగలను. అసలు పైకాన్ని....................... సంవత్సరాలలోపు ముట్టజెప్పగలను. ఇది నా ఇష్ట ప్రకారము స్వదస్తూరీతో వ్రాసి ఇచ్చిన పత్రము.

సాక్షులు :- 1.

2.

XXXX

(సంతకము)

కవయిత్రి ఒక పద్యకావ్యంలో ఈ రకమైన పరిభాషతో కూడిన వడ్డీ పత్రాన్ని (ప్రామిసరీ నోటును) పొందుపరచడం కించిత్తు ఆశ్చర్యాన్ని, ఎనలేని రసానందాన్ని కలిగిస్తుంది. శ్రీనివాసుడు తన వివాహపు ఖర్చుల నిమిత్తం కుబేరునివద్ద అప్పుతీసుకొంటూ వ్రాసి ఇచ్చిన ఆ వడ్డీ పత్రాన్ని రెండు పద్యాలలో చక్కగా పొందు పరచారు తరిగొండ వేంకమాంబ.



*"శ్రీకరలీల స్వస్తిశ్రీ జయాభ్యుద*
*యాష్టాదశ ద్వాపరాంత మందు*
*గల కలినాది వేంకట నాయకుడు ధన –*
*పతి కొసంగిన వడ్డి పత్రమెట్ల*
*యనిన నా వైవాహమునకు నీచే నప్పు*
*గొనిన టెంకీలును గోటి సంఖ్య*
*లలిని జతుర్దశ లక్షలందుకు వడ్డి*
*ప్రతి వత్సరంబును బరగనిత్తు*

*కలి యుగాంతమునందున గాను వీస*
*ముంచ కొగిదీర్చి వేయుదు; మొనసి దీని*
*కజుదు, శంభుడు మరియు హిమాంశు డినుదు*
*సాక్షులు – నిజంబు వృక్షరాజంబు సాక్షి !*

*ఇట్లు నా యిష్టమున వ్రాసి ఇచ్చినట్టి*
*స్వకర లిఖితంబటంచును వనజ భవుడు*
*చదివి వినిపించి పార్వతీశ్వరుని చేత*
*నిచ్చి చూడుమటంచును మెచ్చుజెప్పి...."*[20]

అద్భుతమైన రీతిలో ఛందోబద్ధంగా ఇమిడిన ఈ వడ్డీపత్రం 19వ శతాబ్దినాటి వడ్డీ పత్రాలకు (ప్రామిసరీనోట్లకు) ఒక నమూనాగా భావించ వచ్చు. స్త్రీ విద్య అంతగా లేని రోజులలో రసరమ్యమైన కావ్యరచన చేయడమే కాకుండా ఇలా భాషా పరమైన నవ్యతను ప్రదర్శించిన కవయిత్రి తరిగొండ వేంకమాంబ తెలుగు జాతి గర్వించదగ్గ విదుషీమణి అని నిస్సందేహంగా పేర్కొనవచ్చు.

19వ శతాబ్ది పూర్వార్ధంలోనే వద్దిపర్తి కోనమరాజు అనే కవి విశాఖపట్నం జిల్లా 'సర్వసిద్ధి' అనే గ్రామానికి కరణంగా ఉండేవారు. ఈ కవి, పోలవరం సముద్ర తీరంలో జమాబంది లెక్కలు తయారు చేసేందుకు నియోగింపబడిన కరణాల సమస్యలను పద్య రూపంలో ఒక ఉత్తరంగా రచించి, కమిటీకి అందజేస్తే, ఆ కమిటీవారు ఈ కరణాల బాధను అర్థం చేసుకొని, కొన్నాళ్ళ పాటు సెలవు మంజూరు

చేశారట. ఆ పద్య కవితకు 'కమిటీ ఉత్తరం'గా ప్రఖ్యాతి లభించింది. ఆ 'కమిటీ ఉత్తరం'లో కోనమరాజు కవి వృత్తిపరమైన ఉర్దూ పారిభాషిక పదాలను మేళవించిన వ్యావహారిక భాషను ప్రయోగించడం విశేషం. 'మహాలక్ష్మీ పరిణయము', 'జానకీరామ శతకము' వంటి ప్రౌఢ ప్రబంధ రీతి రచనలను సైతం చేసిన ఈ కవి అందుకు భిన్నంగా, సీసపద్యమాలికగా రచించిన ఈ 'కమిటీ ఉత్తరం'లో ఇలా భాషా పరమైన నవ్యతను ప్రదర్శించారు. క్రీ.శ. 1834లో మృతిచెందిన ఈ కవికి గల (19వ శతాబ్ది తొలి నాళ్ళలోనే రూపుదిద్దుకొన్న) నవ్యదృష్టిని ఇది ప్రస్ఫుటం చేస్తుంది.

*"బారాస్న నౌబతు ఫసలీని యాదస్తు*
*మసగణీ వుప్పలం పక్కినాడ*
*ఫిబరిరువయి తేది భిన్నవో రోజ్సురికి*
*కరణాల భోగట్ట కరుణ వినుడి*
*'యేమయా తాతగారూ ! మీకు క్షేమమా?'*
*'మామయ్య గారూ! నమస్కృతంబు!'*
*'పదివేలు! పదివేలు! భావగా రోహోహో!*
*యిప్పుడయా మీరు?'–'యిప్పుడేవే!'*

– – – – – – – – – – – – – – – – – – – –

– – – – – – – – – – – – – – – – – – – –

*'మీ బసెక్కడనయ్య?' – 'మాబసేటావల!*
*వసతి కాకర కాయ పాటమయ్య!'*
*జిల్లెడాకుల మేత, చీకటి చెయ్యూత –*
*పాలుడప్పి యజీర్తి పాలు సేత !*
*నొక నూత స్నానంబు, నొక నూత పానంబు*
*నొక చోట భోజనం బొంటి పూట*
*కాని కాని యిట్టి కబురుల కేమొచ్చె –*

*ముంద దారికి నీవు మొదలు జెప్పు !*
*మీ మధురా లెన్ని? మీ యెద భూమెంత/*
*మీ వూరు బీడెంత? మెట్టు యెంత?*
*పల్లపు భూమెంత? పదునాలు గేళ్ళకు*
*పంటెంత? ఖర్చెంత? ప్రజలు యెంత?*
*నాగళ్ళు నాఖర్దు నాడె తడవు లెంత?*
*చెల్లెంత? బాకెంత? శిస్తు యెంత?*

– – – – – – – – – – – – – – – – – – – –

– – – – – – – – – – – – – – – – – – – –

*మూడు ముద్దత్తులు మూటికి యేకట్ట?*
*దిసుక కుళుద్దాది దినుసు మెట్టు*
*ఝూడాదరో బస్తు సనధిల రాబడి*
*పంట మిరాశీల వంట రుసుము*
*చాకర్ల పంటయు సకలము రాబడి*
*గాముగా నా వసూల్ కట్టుబళ్ళు*

– – – – – – – – – – – – – – – – – – – –

– – – – – – – – – – – – – – – – – – – –

*పూర్వపు మాన్యముల్ తరువాత మాన్యముల్*
*కొన్న భూములు ప్రతిగొన్న యట్టి*
*ఫేరస్తు కల్గిన ఫారమాఖీఖతు*
*యిష్టేమెంటు కాగితము లిచ్చివార*
*కరువులో గడివి లెక్కలు బోయె – మా వద్ద*
*కరువులో లెఖ్ఖలు గానరావు*
*నాలుగేళ్ళవి జూడ నా దగ్గరను లేవు*
*కడగి ఐదేళ్ళ కాకరము లేదు*

*పదునాలుగేళ్ళకు వదపరచుచున్నారు*
*యింకా పదేళ్ళకు యిస్తు నేను*

*ఘూము ప్రొద్దెక్కెను శాలికుడా! కచే*
*రీకి వస్తున్నావ? లేక మాను*
*తున్నావొ జెప్పుము – తుప్పు జుల్మానాకు*
*కాసుకు గతి లేదు – కాపు లివరు –*
*ఇదిగొ వస్తినటంచు, అదిగొ వస్తినటంచు*
*చంక లెఖ్ఖ గదించి, సరవి నేగి*
*ఈ పంచ గూర్చుండ, నా పంచ గూర్చుండ*
*నంత లోపల రవి అస్తమింప*
*బిరబిర లేచి ముందర సాగు వారల*
*గూడి డేరా చేరి కొంత సేపు*
*తాటి యాకులు విప్పి తారుమారులు చేశి*
*దీపాల ముందర తిరగ వేశి*

*ఆరు యేడ్నెల్లు వీరు చీకాకు పడిరి*
*గాన వారల రక్షించి కరుణ జేసి*
*శెలవు వేగం బొసంగవె సార సాక్ష!*
*వినుత గౌరీశ వుపమాక వేంకటేశ!"* [21]

కవి ఇందులో అన్యదేశ్యాలతో బాటు, 'భావగారు', 'యిస్తునేను', 'వస్తున్నావ?', 'ఏ మొచ్చె', – ఇదిగొ వస్తి' వంటి వ్యావహారిక భాషా శబ్దాలను ప్రయోగించడం గమనార్హం. వద్దిపర్తి కవి ఈ పద్యాన్ని ఆశువుగా చెప్పి ఉంటాడు. అక్కడక్కడ ఛందో భంగాలున్నాయి. ఈ కవి 'జమాబంది దండకం' కూడా రచించినట్లు కొందరు పేర్కొంటున్నారు. అది అలభ్యం. అది నిజంగానే వేరే రచనో లేక – జమాబంది లెక్కల గురించి వ్రాసిన పై కవితనే వ్రాత ప్రతిలో పాదం విరుపులు లేకుండా చూసి, కొందరు దండకంగా భ్రమించారో?– తెలియదు. ఒక వేళ అది వేరే రచన అయినా కవి ఇలాంటి భాషనే ప్రయోగించి ఉంటారు.

19వ శతాబ్దిలో ఇలా వ్యావహారిక భాషకు కావ్య గౌరవాన్ని సంతరించిన మరొక కవి దాసు శ్రీరాములు. ఏలూరులో ఫస్టుగ్రేడు ప్లీడరుగా పని చేసిన ఈ కవి రచించిన "తెలుగునాడు" కావ్యం – ప్రథమ భాగం మాత్రమే వెలువడింది. ఆపైన కవి అస్తమించడం వల్ల ఆ కావ్యం అసంపూర్ణంగా మిగిలింది. అయితే, "ఆంధ్ర వీధిలో బ్రాహ్మణ ప్రశంస" అనే ఈ మొదటి భాగమే ఒక స్వతంత్ర కావ్య స్థాయిలో నిలిచి, నవ్య కిరణాలను ప్రసరించింది. కవి ఈ కావ్యంలో వ్యవహార భాషతో పాటు అక్కడక్కడ, ఒక ప్రాంతంలోని బ్రాహ్మణులు మాట్లాడే మాండలిక భాషను కూడా ప్రయోగించారు. ఒక పద్య కావ్యంలో ఇలా మాండలిక వ్యావహారిక భాషను ప్రయోగించడం నవ్యతకే పరాకాష్ఠగా భావించవచ్చు. 19వ శతాబ్దిలోనే కవి ఈ నవ్యతను సాధించి నవ్యతకే నవ్య భాష్యాన్ని పలికారని చెప్పవచ్చు. క్రీ.శ. 1892లో రచింప బడిన ఈ 'తెలుగు నాడు' కావ్యంలో దాసు శ్రీరాములు కవి చూపిన భాషా పరమైన నవ్యతను పరిశీలిద్దాం.

స్మార్త బ్రాహ్మణ స్త్రీలు మొట్ట మొదటిసారి రైలు బండిని చూసి మాట్లాడుకొనే సంభాషణను కవి ఎంతో హృద్యంగా, స్వాభావికంగా, సహజంగా చిత్రించారు.

*"అచ్చమ్మా! యిది యేమిటే? రెయిలటే? ఆసీ యిదేనా?" "సరే!*
*బుచ్చమ్మా! వినలేదటే? గడియలో బోవచ్చునే కాశికిన్!"*
*"అచ్చో! దేహము గ్రుద్దుకోదటే?" – "అయో! ఆ సౌఖ్యమేమందునే?"*
*యిచ్చా రాజ్యమటంద్రు ట్రైను గని యెంతే వింత విప్రాంగనల్* [22]

మరో పద్యంలో "ఈ యిసుకోలు (స్కూలు) బళ్ళకడ నింగిలిపీసులు పీసుపాసుగా గూయగ జొచ్చి ----" అంటూ, ఆనాటి కుర్రకారును స్మార్త వితంతువు ఈసడించుకొన్నట్లు వర్ణించారు శ్రీరాములు కవి.

వైదిక వృద్ధ బ్రాహ్మణుడు ఒకచేత అక్షమాలను త్రిప్పుతూ చేసే భగవన్నామ స్మరణను, మరోవైపు శిష్యునిపై ప్రయోగించే బండబూతు తిట్టును కలగలిపి మాట్లాడే భాషను ఒక పద్యంలో ఇమిడ్చిన తీరు పరమాద్భుతం.

*"విడువకురా! ఉతోత ఇషవే నమరా! అది దుడ్డురా – ముడాః*
*కొడక !" యటన్న మాటవిని కొంకి – "ఉతోత ఇసే నమం"చు శి*
*ష్యుడు దనవెంట రా, వడకుచుం గుడిచే నొక యక్షమాల చొ*
*ప్పడ, నొక చేత దండమిడి బాటను వైదిక వృద్ధు డేగెడిన్!"* [23]

వృద్ధ వైదిక బ్రాహ్మణుని ఉచ్చారణ – పళ్ళూడడం వల్లో, లేక పై బడ్డ వయస్సువల్లో అపభ్రంశం అయినట్టుంది – అందుకే

'ముండా కొడక' అన్న దూషణ – "ముదాః కొడక' అయింది – అలాగే ఆ వృద్ధ వైదికుని ఉచ్చారణలో "హృశీకేశాయ నమః"నో లేక మరొకటో – "ఉతోత ఇషవే నమ" గా మారింది. ఆ వృద్ధుని ఉచ్చారణను యథాతథంగా ప్రయోగించి కవి తన వ్యంగ్య రచనా వైభవాన్ని చాటుకొన్నారు. దానికి కొంటె శిష్యుడు అలాగే "ఉతోత ఇసే నమ" అంటూ వెంటనడిచినట్లుగా వ్రాసి, కవి చక్కని హాస్యాన్ని కూడా పండించారు. ఒక పద్య కావ్యంలో ఇలాంటి ప్రయోగాలు చేయడం ఆ కాలంలో ఎంత నవ్యత!

ఉత్తరాంధ్ర ప్రాంతంలో వైదిక బ్రాహ్మణులు ఆ రోజుల్లో 'ట' కారాన్ని 'ష' కారంగా పలికే వారట. ఆ ప్రత్యేక మాండలిక భాషను కవి పద్యాల్లో ప్రయోగించారు.

ఒక నియోగి బాలికను వైదిక బాలునికిచ్చి పెళ్ళి చేస్తే, ఆ నియోగి బాలిక "ఇట్టు నట్టు" అనగా, ఆ బాలిక అత్త – "అషు నిష్షు " అనుమని అభ్యాసం చేయించిందట. దాంతో ఆ కోడలు – 'పీషష', 'పెష్షష' అంటూ మాట్లాడడం మొదలు పెట్టిందట. అంతే కాదు – "పెట్టు పెట్టుమను మాటలె పల్కనటంద్రు గట్టిగన్" అనడానికి బదులు "పెష్షు పెష్షు మను మాషలె పల్కెనషంద్రు గష్షిగన్" అన్నట్లుగా కవి చమత్కరించారు. ఆ పద్య చాలనాన్ని చూద్దాం –

*"వసుధ నియోగి బాలికను వైదిక బాలున కిచ్చి చేయగా*
*బస నది యిట్టు నట్టనిన, బా గషు నిష్షనుమంచు నత్త య*
*బ్బెస మొనరింప నొక్కతరి, పీషష పెష్షష మామగారికిన్*
*మసలక పెష్షు పెష్షు మను మాషలె పల్కెనషంద్రు గష్షిగన్"*[24]

మరొక పద్యంలో మరింత విస్తృతంగా వైదిక బ్రాహ్మణ స్త్రీలు మాట్లాడుకొనే నిత్యవ్యావహారిక మాండలిక భాషను ఎలా పొందుపరిచారో గమనించండి.

"ఆస్సే – చూస్సివషే? వొషే – చెవుడషే? – అష్లాగషే! యేమిషే?
విస్సావఝ్ఝుల వారి బుర్రినష యా విస్సాయ కిస్సారుషే?
విస్సండెంతటి వాడె? యేళ్ళు పదిషే? వెయ్యేళ్ళ కీడే షుమా!
ఓస్సే – బుర్రికి యీడషే? వొయిషుకే ముంచుందిలే! మంచి వొ
ర్చెస్సే!" యందురు శ్రోత్రియోత్తమ పద స్త్రీ లాంధ్ర దేశంబునన్![25]

శార్దూల విక్రీడిత ఛందంలో ఇలాంటి భాషతో నాలుగు పాదాలు నడపడమే కత్తి మీది సాములాంటిది. కాని కవి ఐదు పాదాలు నడపడం విశేషం.

ఒక చోట కవి – "వైదికు పిల్లి వ్రత్తి మేవ్ మ్రేవనునంద్రు" అంటూ చమత్కరించారు. అయితే కవి ఈ చమత్కారాలను హేళన భావంతో చేయలేదని గమనించాలి. ఆయన ఈ మాండలిక భాషను గురించి వ్రాస్తూ –

"పావనమైన వైదికుల భాష గొరంతలు పట్టి తెల్పుటబ్బా? వినరాదుగా ! జెరకు వంకరబోయిన యంత మాత్రనే పోవునే తీపి?" అని సమర్థించారు.

మాధ్వులు (మధ్వ మతస్థులు) కన్నడ భాష కలగలిసిన తెలుగుతో ఏర్పడిన మిశ్రభాషను మాట్లాడుతారని ఈ పద్యంలో వివరించిన తీరు శ్లాఘనీయం.

*"మాతు గళిల్లె నమ్మ గురు రాయర మహా*
*మధ్వరాయ స్తోత్ర మాడు బేకు*
*మంత్రగళ్ హేళి నామగళు స్మరిసి హను*
*మద్దేవ రార్చన మాడు బేకు*
*మహిమ దత్త్రైలోక్యమాత శ్రీతులసి క*
*నోడి ప్రదక్షిణ మాడుబేకు*
*అతి భక్తి శ్రీ భాగవత కేళి నందకు*
*మార నమస్కార మాడు బేకు*

*మహిత పుణ్య నదీ తీర్థ మాడు బేకు*
*దూని తాంగార పుండ్రగల్ మాడు బేకు*
*బేకు బేకు సదా బేకు బేకు బేకు*
*అనుచు మాధ్వులు భాషింతు రనుదినంబు"*[26]

ఒకప్పుడు నవాబుల పాలనలో ఉండి, కన్నడ ప్రాంతం సరిహద్దుల్లో ఉన్న తెలుగు జిల్లాలలోని మాధ్వుల భాషలో కొంత ఉర్దూ కూడా కలిసి ఉండడాన్ని తెలియ జేస్తారు దాసు శ్రీరాములు కవి ఒక పద్యంలో –

"హుకుం అంపించినావా? మదార్ ఖానున్ చిత్తము వాని బంపిన పనుల్ కావచ్చు – సందేహమా? సానా బోగముదా? మహా ప్రభు ఖులాసాకేమి? యే ముండయో?" అంటూ ఉర్దూ తెలుగు మిశ్ర భాషతో సాగుతుంది ఆ పద్యం.

ఆంధ్ర దేశంలోని వైష్ణవులను వర్ణిస్తూ, వారి నిత్య వ్యవహారంలో ఉపయోగించే పదజాలాన్ని ప్రయోగించారు కవి, ఒక పద్యంలో –

*"చీటికి మాటికి 'శ్రీమతే రామాను*
*జాయ నమో' యంచు జదువు సొగసు*
*నిరుపమ భక్తి చే ' బెరుమాళ్ళమ ఫిరాట్టు*
*దిరువడిఘల్' గొల్చి యెరగు సొగసు*
*సారె సారెకు 'దిరువారాధనంబుల,*
*దిరువాయి మొడి' నోట దెలుపు సొగసు*
*జ్ఞానుల గని 'యడియే నడియేను – దా*
*సోహ' మ్మనుచు బల్కునట్టి సొగసు*

*పరగ 'బన్నిద్ద రాళ్వార్ల' బరమ భక్తి*
*మించి 'తిరు మంత్ర' మొనర 'సాయించు సొగసు*
*బొగడుచో వేయి నోళ్ళకు మిగులు గొంత*
*వైష్ణవ బ్రాహ్మణులదె దైవ ప్రపత్తి!"* [27]

వైష్ణవ పరిభాషలో 'తిరు' అన్న పదంతో ఏర్పడ్డ పదబంధాలన్నింటినీ గుది గ్రుచ్చి రూపొందించిన మరో పద్యం కడు రమణీయం.

"తిరుమణి, తిరుచూర్ణ, తిరుణాళ్ళు, తిరు మంత్ర,
తిరుమాళిగయు, దిరుక్కరియ మధులు,
తిరు వీధి, తిరుగలు, తిరునామములు, తిరు
వారాధనము, తిరువాయి మొడియు,
తిరువధ్యయనమును, తిరుమంగ యాళ్వారు,
తిరువేళికయు, మరి తిరువడిఘళు,
తిరుపతి, తిరుమల, తిరు వీసములు, తిరు
పుణ్ణేరములు, తిరుప్పావు మరియు

తిరువలిక్కేణి, తిరువటూర్తిరువనంద
పురమును, తిరువళ్ళూరును, తిరు తులసియు
తిరు తిరు తిరు త్తిరు త్తిరు తిరు తిరు తిరు
దిరుగు వైష్ణవ పరిభాష – తెరవు మరుగు!" [28]

'తిరు తిరు తిరు' అని తిరుగుతుంది వైష్ణవ పరిభాష – అనడం కవి చమత్కార చాతుర్యానికి తార్కాణం.

అంతే కాకుండా దాసు శ్రీరాములు కవి, బూరల శబ్దాలను, ఢంకాల మ్రోతలను, గిలక కఱ్ఱల రావాలను, శిష్యుల గురుస్తుతుల గోలను వర్ణించేందుకు ఒక సరిక్రొత్త భాషను సృష్టించి ప్రయోగించారు ఒక పద్యంలో –

*"భుం భుం భురూం భురూం భుంభుమ్మటంచును*
*బూర గొమ్ముల వారు ముందు నడువ*
*ఢండండ డండడం ఢండమ్మటంచును*
*ఢంకాల వారొక వంక నడువ*
*ఖణ్ణీళ్ళిణీళ్ళిణీల్ ఖిణ్ణీలటంచును*
*గిలక కఱ్ఱల వారు కెలన నడువ*
*గుళు గుళుగ్గుళుగుళుగ్గుళు గుళ్ళటంచును*
*గురు సంస్తుతుల వార లొరసి నడువ*

*రంజితములైన ముత్యాల పింజరీల*
*పైడి యద్దల బంగారు పల్లకీల*
*చెలగి తిరువీధి వేంచేపు జేసికొనుచు*
*వచ్చు జియ్యల వారు శ్రీవైష్ణవులను'* [29]

వైష్ణవ వంటకాలకు సంబంధించిన పరిభాషను ప్రయోగిస్తూ కవి రచించిన పద్యం చదువుతుంటే చవులూరిస్తుంది సుమా!

"బారుంబూరుగ నారగింతురు వడప్పణ్నేరముల్, పూర్ణ ప
ణ్నేరంబు, ల్పుళిహూర, తైరువడ పణ్నేరంబు, దధ్యోదనం,
బారు గర్య, మధుల్కొళంబు, పురి తొహ్యో, తైరు, మోరున్మహెూ
దార స్వైర విహార వైభవు లుదాత్త ప్రాభవుల్ వైష్ణవుల్!" [30]

ఇలా 'ఆంధ్ర వీధిలో బ్రాహ్మణ ప్రశంస' అన్న ఉప శీర్షికతో రచించబడిన 'తెలుగు నాడు' కావ్యంలో వివిధ శాఖల బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలకు సంబంధించిన పరిభాషలతో బాటు, వారి మాండలిక వ్యావహారిక భాషలను కూడా ప్రయోగించి, దాసు శ్రీరాములు మహా కవి అబ్బుర పరిచే నవ్యతను గుప్పించారు. ఆ విధంగా 19వ శతాబ్దిలోని ఇతర కవుల కావ్యాలలోని భాషాపరమైన నవ్యత అంతా ఒక ఎత్తయితే కేవలం దాసు శ్రీరాములు కవి రచించిన 'తెలుగు నాడు' కావ్యం ఒక్కటే ఒక ఎత్తు అని చెప్పవచ్చు.

ఆ ప్రకారంగా 20వ శతాబ్ది ప్రారంభంలో అంకురించిన వ్యవహార భాషోద్యమం కన్న ఎంతో ముందే, 19వ శతాబ్దిలోని కవులు కావ్యాలలో జన వ్యవహారంలో ఉన్న వ్యావహారిక, మాండలిక భాషలను, అన్య దేశ్యాలతో కూడిన మిశ్ర భాషలను, వృత్తి, కుల, మత వ్యాపార, ఆచార వ్యవహారాల సంబంధమైన పరిభాషలను ప్రయోగించి, అమూల్యమైన భాషాపరమైన నవ్యతను చూపారని ఘంటాపథంగా చెప్పవచ్చు. బహుశః కావ్యాలలో 19వ శతాబ్ది కవులు ఇలా వ్యావహారిక భాషను నిరభ్యంతరకరంగా, నిర్దోషంగా, సమర్థంగా ప్రయోగించి చూపడం వల్లే, 20వ శతాబ్ది ఆరంభంలో వ్యవహార భాషోద్యమ కారులకు, ఆ స్ఫూర్తి కలిగించి ఉండవచ్చని నా భావన.



**పాద సూచికలు** :

1. *బహుజనపల్లి సీతారామాచార్యులు : శబ్దరత్నాకరము – 'భాషా ప్రశంస' అను ముందు మాట*
2. *పోరంకి దక్షిణామూర్తి: గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమాలు – వ్యాసం – 'మహతి' – 'యువ భారతి' ప్రచురణ*
3. *బహుజనపల్లి సీతారామాచార్యులు : శబ్దరత్నాకరము – 'భాషా ప్రశంస' అను ముందు మాట*
4. *పింగళి సూరనామాత్యుడు : కళాపూర్ణోదయము – 6వ ఆశ్వాసం – 133వ పద్యం.*
5. *శ్రీనాథుడు : హర విలాసము – ప్రథమాశ్వాసం – 22వ పద్యం*
6. *"ఏ పురాణముల ఎంత వెదకినా --" అన్నమాచార్య కీర్తన – అంతిమ చరణం.*
7. *వేమన : వేమన శతకంలోని పద్యం.*
8. *శ్రీకృష్ణ దేవరాయలు : ఆముక్త మాల్యద – ప్రథమాశ్వాసం – 84వ పద్యం.*
9. *కల్లూరి వేంకట నారాయణ రావు: తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము – పుట 57*
10. *కల్లూరి వేంకట నారాయణ రావు: తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము – పుట 67*
11. *కల్లూరి వేంకట నారాయణ రావు: తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము – పుట 62*
12. *దిట్టకవి నారాయణ కవి : రంగరాయ కదనరంగ చరిత్రము – ప్రథమాశ్వాసం – 147వ పద్యం.*
13. *చత్రాతి లక్ష్మీనరసు కవి : విజయరామ యశో భూషణము (పద్మనాభ యుద్ధము) – ప్రథమాశ్వాసం – 206వ పద్యం*
14. *చత్రాతి లక్ష్మీనరసు కవి : విజయరామ యశో భూషణము (పద్మనాభ యుద్ధము) – ప్రథమాశ్వాసం – 207వ పద్యం*
15. *మతుకుమల్లి నృసింహశాస్త్రి కవి : చెన్నపురీ విలాసము – పుట 14*

16. మతుకుమల్లి నృసింహశాస్త్రి కవి : చెన్నపురీ విలాసము – పుట 22
17. వీరేశలింగం పంతులు : ఆంధ్ర కవుల చరిత్రము – పుట 303
18. డా. ముదిగంటి సుజాతా రెడ్డి : తెలుగు సాహిత్య చరిత్ర – పుట 304
19. తరిగొండ వేంకమాంబ : వేంకటాచల మహాత్మ్యము – పంచమాశ్వాసం – 31వ వచనం.
20. తరిగొండ వేంకమాంబ : వేంకటాచల మహాత్మ్యము – పంచమాశ్వాసం – 160 మరియు 161వ పద్యాలు
21. వద్దిపర్తి కోనమరాజు : 'కమిటీ ఉత్తరం' ('శ్రీమహాలక్ష్మీ పరిణయం' – 1997 – శ్రీనిఖిలా ప్రచురణలు – విశాఖపట్నం – పుటలు 3,4)
22. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్ర వీధిలో బ్రాహ్మణ ప్రశంస) (1929 ప్రచురణ) – పుట 15
23. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్ర వీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 6
24. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్ర వీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 10
25. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్ర వీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 9
26. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్రవీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 18
27. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్రవీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 24
28. దాసు శ్రీరాములు కవి – తెలుగు నాడు (ఆంధ్రవీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 24
29. దాసు శ్రీరాములు కవి – తెలుగు నాడు (ఆంధ్రవీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 25
30. దాసు శ్రీరాములు కవి – తెలుగునాడు (ఆంధ్రవీధిలో బ్రాహ్మణప్రశంస) (1929 ప్రచురణ) – పుట 28





**8**

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో ప్రక్రియాపరమైన నవ్యత



"ప్రక్రియా బాహుళ్యము నవ్య కవితకు ప్రత్యేక లక్షణము" అన్నారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.[1]

20వ శతాబ్ది నవ్య సాహిత్యంలో విరాజిల్లిన ప్రక్రియలలో ప్రముఖంగా పేర్కొనదగిన వాటిలో ఇవి ముఖ్యమైనవి.

1. రూపపరంగా – నాటకం, ఖండ కావ్యం, గేయ కావ్యం, వచన కవిత, కథానిక, నవల, వ్యాసం మొదలయినవి.
2. వస్తుపరంగా – హాస్య వ్యంగ్య కావ్యాలు, స్మృతి కావ్యం, యాత్రా చరిత్ర, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర మొదలయినవి.

వీటిలో ఒక్క 'వచనకవితా ప్రక్రియ' తప్ప మిగితా అన్ని కూడా 19వ శతాబ్దిలోనే అంకురించాయన్నది గమనార్హం. ముఖ్యంగా కవిత్వానికి సంబంధించినంత వరకు 'పద్య నాటకం', 'ఖండ కావ్యం', 'గేయ కావ్యం', వంటి ప్రక్రియలు మొట్ట మొదటిసారిగా 19వ శతాబ్దిలోనే వెలువడ్డాయి. కందుకూరి వీరేశలింగం పంతులు రచించిన 'అభాగ్యోపాఖ్యానం' అన్న తొలి వ్యంగ్య కావ్యం కూడా 19వ శతాబ్దిలోనే వెలువడింది. తొలి తరం స్మృతి కావ్యాలు కూడా అదే శతాబ్దిలో రూపుదిద్దుకున్నాయి. 20వ శతాబ్దిలో గద్య రూపంలో విస్తృతంగా వెలువడ్డ యాత్రాచరిత్రలు, జీవిత చరిత్రలు, స్వీయ చరిత్రల వంటి ప్రక్రియలకు 19వ శతాబ్దిలో పద్య రూపంలో బీజాలు పడ్డాయన్నది గమనించదగ్గ విషయం. ఈ ప్రక్రియలన్నీ 19వ శతాబ్దిలోనే అంకురించడానికి పాశ్చాత్య సాహిత్య ప్రభావం –

ముఖ్యంగా ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎంతైనా ఉందని అంగీకరించక తప్పదు. 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో అవతరించిన ఈ నూతన ప్రక్రియా విశేషాలను గురించి ఇప్పుడు సవిస్తరంగా పరిశీలిద్దాం.

**పద్య నాటకం :**

"కావ్యేషు నాటకం రమ్యం" అన్నారు ఆలంకారికులు. సంస్కృత వాఙ్మయంలో నాటక ప్రక్రియ బహుళ ప్రసిద్ధం. నన్నయ భట్టారకుని ఆంధ్ర మహా భారత సభాపర్వంలో ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టంలో కొంత నాటకీయ శైలి గోచరమౌతుందని మన పండితులు భావిస్తుంటారు. తిక్కన తాను రచించిన పదునైదు పర్వాలలో సందర్భానుసారంగా నాటకీయ శైలిని ప్రవేశపెట్టి రక్తి కట్టించిన విషయం రసిక వర్యులందరికీ విదితమే. 15వ శతాబ్దిలో కందుకూరి రుద్రకవి 'సుగ్రీవ విజయం' పేరిట దేశిరూపకమైన 'యక్షగాన' ప్రక్రియను ప్రారంభించాడు. 17వ శతాబ్దిలో ఎలకూచి బాలసరస్వతి 'రంగ కౌముది' పేరిట ఒక నాటకాన్ని రచించినట్లు తెలుస్తున్నది. అది ఇప్పుడు అనుపలబ్ధం. అంతకు మించి వివరాలు ఏవీ తెలియడం లేదు. అది నాటక ప్రక్రియా రూపంలో ఉందా – అన్నది కూడా అనుమానమే. బహుశః అది యక్షగాన ప్రక్రియ పద్ధతిలోనే ఉండి ఉండాలి. ఎందుకంటే ఆ తరువాత 17వ శతాబ్దిలో గాని, 18వ శతాబ్దిలోగాని ఒక్క నాటకం కూడా వెలువడ లేదు. కాబట్టి 19వ శతాబ్దికి పూర్వం ఒక ప్రక్రియగా తెలుగులో నాటకం లేదనే చెప్పుకోవాలి.

19వ శతాబ్దిలో కోరాడ రామచంద్ర శాస్త్రి రచించిన 'మంజరీ మధుకరీయం' తో తెలుగులో నాటక ప్రక్రియ ప్రారంభమైందని చెప్పవచ్చు. క్రీ.శ. 1860లో సంస్కృత పద్ధతిలో రచించబడిన ఈ నాటకం తెలుగులో వెలువడిన తొలి నాటకం.[2] ఇందులో అక్కడక్కడ పద్యాలను పొదిగినా, ఇది ప్రధానంగా వచన సంభాషణల నాటకమే. అందువల్ల దీనిని కవిత్వంలో భాగంగా పరిగణించలేము. ఈ పరిశోధన పరిధి కేవలం కవిత్వం వరకే పరిమితం కాబట్టి దాని ప్రస్తావన ఇక్కడ అప్రస్తుతం.

అయితే పూర్తి పద్యాలలో రూపొందించబడిన తొలి పద్య నాటకాన్ని రచించిన కవి వావిలాల వాసుదేవశాస్త్రి. క్రీ.శ. 1874లో ఈయన రచించిన 'సీజరు చరిత్రము', ఇంగ్లీషులో షేక్స్పియరు మహాకవి రచించిన 'జూలియస్ సీజరు' నాటకానికి తెలుగు అనువాదం. షేక్స్పియరు ఆంగ్ల నాటకాలలోని పోయెటిక్ వర్స్ తెలుగు కవులకు పద్య నాటకాలను వ్రాయాలన్న ప్రేరణ ఇచ్చి ఉంటుందని చెప్పుకోవాలి.

"ఇంగ్లీషు ద్వారా పాశ్చాత్య దేశములలోని సాహితీ ప్రక్రియలతో మన దేశపు పండితులకు పరిచయము కలిగినది. ఆ పరిచయముతో వారు తమ దేశీయులకు ఆ ప్రక్రియలను అదే రూపమున అందించవలెనను ఉత్సాహముతో రచనా వ్యాసంగమును సాగించిరి. తత్ఫలితముగా తెలుగులో సంపూర్ణ పద్య నాటకాలు అవతరించుటకు అవకాశము కల్గినది. వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'సీజరు చరిత్రము' (షేక్స్పియరు 'జూలియస్ సీజరు' కు అనువాదము) మొట్ట మొదటి పద్య నాటకము" అని వివరించారు ప్రముఖ కవి, విమర్శకులు డా. తిరుమల శ్రీనివాసాచార్య[3]

క్రీ.శ. 1876లో ప్రథమ ముద్రణ పొందిన ఈ పద్య నాటకం గురించి తెలుగు అకాడమి వారు ప్రచురించిన తెలుగు సాహిత్య కోశం (ఆధునిక సాహిత్యం) ద్వారా ఈ క్రింది వివరాలు తెలుస్తున్నాయి.

"తెలుగులోకి అనూదితమైన ఇంగ్లీషు నాటకాలలో ఇదే మొదటిది. తెలుగులో తొలి విషాదాంత నాటకం కూడా ఇదే. జూలియస్ సీజర్ (క్రీ.పూ. 100–44) గొప్ప రాజకీయ వేత్త, మంచి వక్త. చరిత్రలో ప్రసిద్ధి కెక్కిన మహావీరుడు. ఇతడు రోమను సేనాపతిగా రోమును (క్రీ.పూ. 49–44) ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తూ ఉండగా హత్య చేశారు. ఆయన చరిత్రను తెలిపే రచన ఇది. అనువాదం సరళంగా ఉంది. మూలంలోని అంకాలు రంగాలు యథాతథంగా ఉంచారు. పాత్రల పేర్లు మార్చలేదు. మూలంలోని పద్యాలకు చేరువగా ఉండే విధంగా రచనలో తేటగీతి వాడారు. కొన్ని హిందీ సంప్రదాయాలను కథానుగుణంగా ప్రవేశపెట్టారు. రచనలో వాడుక భాషా పదాలు, అన్య భాషా పదాలు కూడా వాడారు. వచనం వాడలేదు. ఈ అనువాదం రెండు నెలల్లో పూర్తి చేసినట్లు తెలుస్తున్నది. పీఠిక ఇంగ్లీషులో కూడా ఉంది."[4]

సంస్కృత భాషా సాహిత్యంలోని కావ్యాలను మాత్రమే అనువదించడం ఎరిగిన ఆంధ్ర కవుల మధ్య, ఒక ఆంగ్ల సాహిత్య గ్రంథాన్ని, అందునా ఒక నాటకాన్ని అదే ప్రక్రియగా తెలుగులోనికి అనువదించాలన్న తలంపు కలగడం ఆనాడు నిజంగా ఒక సాహసమే అని చెప్పాలి. ఇందుకు దోహదమయిన కారణాన్ని కవి తన గ్రంథ పీఠికలో ఇలా వివరించారు – "ఆదిని తొలి తెలుంగు బొత్తంబుల వలె దీని నానా విధ వృత్తములతో ప్రబంధాకృతిని రచియింపం దలంపు గలిగె. కాని యిప్పటి వారికి నాటక రీతియందే యభిరుచి యెక్కువ యని కొందరు నా స్నేహితులు సలహాలు ఇచ్చిన కతన దొంటి యభిప్రాయము మాయించి, నాటక వైఖరిని మొదటి నుండి తుది వరకుం దేట గీతినే వ్రాయుట తగునని యెంచి యాతీరున వ్రాసినాడ."[5] ఆ విధంగా నవ్య మార్గంలో వెలువడ్డ ఈ తొలి తెలుగు పద్య నాటకంలో పాత్రల పేర్లను మార్చకుండా యథాతథంగా ఉంచడం వల్ల కవి చరిత్ర పట్ల తన నిజాయితీని చాటుకొన్నారని భావించాలి. ఇక కథానుగుణంగా తెలుగు సంప్రదాయాలను, నుడికారాలను ప్రయోగించడం శాస్త్రిగారి సంప్రదాయదృష్టిగా కన్న, ఒక ఆంగ్ల కథలో వాటిని మేళవించడం ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయాలను రంగరించిన ఒక నవ్య మార్గంగా అంగీకరించాలి.

ఇక ఈ నాటక రచనా పద్ధతిని పరిశీలిద్దాం – ఆంగ్ల నాటకంలోని పాత్రల పేర్లు యథాతథంగా ఉంచిన కవి సంబోధనలలో తెలుగుతనాన్ని ప్రవేశపెట్టడం ఒక నవ్యత. ఆంగ్లంలో షేక్స్పియర్ మహాకవి.

"Marcus Brutus:

I Kiss thy hand, but not in flattery, ceaser" [6] అని తృతీయాంకం ప్రథమ రంగంలో బ్రూటస్‌తో అనిపించిన సంభాషణను వాసుదేవశాస్త్రి తెలుగులో అనువదిస్తూ,

"బ్రూట – సీజరా! పెట్టుమిా నీదు చేతి ముద్దు

కాని, యిద్ది ముఖప్రీతి గాదు సుమ్మి!"[7] అని వ్రాసారు. ఇలా సీజర్‌ను 'సీజరా!' అని, కాసియస్‌ని 'కాస్యసా!' అని, జూలియస్‌ని 'జూలియసుడ!' అని, బ్రూటస్‌ను 'బ్రూటసుండ!' అని తెలుగు విభక్తులతో సంబోధనగా పిలిచినట్లు వ్రాయడం కవి చమత్కృతికి నిదర్శనం. "Great ceaser!" అన్న సంబోధనను "సీజరేంద్ర" అని, "O mighty ceaser!" అన్న సంబోధనను "సర్వ శక్తిమత్ సీజరేంద్ర!" అని కవి చేసిన అనువాదం పాఠకులను ఆకర్షిస్తుంది. అయితే ఒక చోట ఆంగ్ల కవి "No, my brutus అని బ్రూటస్ భార్య అన్నట్లుగా వ్రాసిన సంభాషణకు – "కాదు, మామక బ్రూటసా!" అని వ్రాయడం కాస్త ఎబ్బెట్టుగా తోస్తుంది.

అయితే క్రొత్తదనాన్ని ప్రవేశ పెడుతున్నప్పుడు, అందులోని మంచిచెడ్డలు, ఉచితానుచితాలు ఆ ప్రవేశ పెట్టే వ్యక్తి కన్న, ఆ తరువాత చర్చించే విమర్శకులకే సులభంగా అవగతమవుతాయన్న విషయం మరవకూడదు. ఆ విధంగా శాస్త్రిగారు అభినందనీయులేగాని మరొకటి కాదు. వాసుదేవశాస్త్రి తమ అనువాదంలో సముచితంగా తెలుగు తనాన్ని ప్రవేశపెట్టిన సన్నివేశాలు చాలానే ఉన్నాయి.

"Pray to Gods" అని మూలంలో ఉంటే – "తేర్చికొందయ్య ముక్కోటి దేవతలను" అని అనువదించారు.

"Your ear is good" ఉంటే – "పాము చెవులు గదా నీవి" అని తెలుగు చేసారు

"Look at the calender" అని ఉన్న చోట – "పంచాంగ మరసి చెప్పుమిా!" అని ఆంధ్రీకరించారు.

"Farewel both" అన్న దానికి "శుభమస్తు మనకు" అని, "Good morrow! Brutus!" అన్న దానికి "ప్రొద్దునే నీకు శుభమస్తు, బ్రూటసుండ!" అని అనువాదాన్ని అందించారు.

"Wilt thou lift up Olympus?" అన్న వాక్యాన్ని, "మేరువుం బయికెత్తగా గోరుకొందె?" అని అనువదించడం, కవి చాతుర్యానికి తార్కాణం.

"Fortune is merry" అన్న దానిని "అల యదృష్టము మూడు పూవులనె, యారు కాయలను గాయనున్నది." అంటూ తెలుగు నుడికారంతో పరిమళింపజేసారు అనువాద కవి. మరొక చోట – "That's as much to say, they are fools that marry? - You'll bear me a bang for that, I fear" అన్న దానిని, "వివాహమైన

యంద రరయమి గలరని యనుట కాదె? పలువురం దీనిచే దూఱ బలికె దీవు – కడకు నీ పెండ్లి యౌను, జాగ్రత్త సుమ్మి!" అంటూ వ్యంగ్య వైభవాన్ని పండిస్తారాయన.

ఇలా తెలుగు నుడికారాలను సంభాషణానుగుణంగా ప్రయోగించడమే కాకుండా, కవి అక్కడక్కడా హైందవ పురాణ ప్రసక్తిని కూడ సమయోచితంగా ప్రయోగించారు. ఉదాహరణకు –

"First Citizen:

We'll burn the house of Brutus"[8] అన్న సంభాషణను – "బ్రూటసుని యిల్లు పరశురాముని కిడుదము"[9] అని ఆంధ్రీకరించి, అగ్నికి ఆహుతినీయడాన్ని 'పరశురామప్రీతి'గా వ్యవహరించడాన్ని గుర్తుచేసారు కవి.

తెలుగు సాహిత్య జగత్తులో 'సీజరు చరిత్ర'ను తొలి పద్య నాటకంగా రచించి, నూతన ప్రక్రియను ప్రారంభించడమే కాకుండా, ఇలా ఆ రచనలో కూడా ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతి, సంప్రదాయాలను రంగరించి నవ్యతకు పట్టం కట్టిన వావిలాల వాసుదేవశాస్త్రి అభినందనీయులు, చిరస్మరణీయులు.

అయితే ఈయన ఘనత ఇంతటితోనే ఆగిపోలేదు. తొలి తెలుగు స్వతంత్ర సాంఘిక నాటకాన్ని కూడా ఈయనే రచించారు. క్రీ.శ. 1880లో ముద్రితమైన ఆ నాటకం పేరు – 'నందక రాజ్యము'. కవి ఈ నాటకాన్ని కూడా 'సీజరు చరిత్రము' లాగే ఆసాంతం తేట గీతి ఛందస్సులోనే రచించారు. అయితే ఈ విషయంలో ఆ రోజుల్లో కొంత భిన్నాభిప్రాయాలు వ్యక్తమయినట్లు తెలుస్తున్నది. 'వివేక వర్ధని' గ్రంథంలో 'సీజరు చరిత్రము' గ్రంథంపై వెలువడిన సమీక్షలో (క్రీ.శ. 1876) ఇలా ఉంది –

"గ్రంథకర్తగారును మరికొన్ని ఇంగ్లీషు నాటకములందెనిగించి, లోకోపకార పారీణులగుదురని యెన్నుచున్నాము. ఈ సారి వ్రాయునపుడైన బుస్తకము కడవరకు నొకే పద్యము వలె వ్రాయక నాటకమున కనుకూలముగా వేరు వేరు పద్యముల నుపయోగింతురని గ్రంథ కర్త గారిని కోరుచున్నాము."[10]



అయితే కవి తన 'నందక రాజ్యము' నాటక పీఠికలో దీనికి సమాధానమిస్తూ – "ఒక్క తేటగీతిలోనే వ్రాయుట వల్ల జదువు వారికి విసుగు పుట్టునని కొందరన్నారని విన్నాను గాని, నాకు మాత్రము సహజమగు వాక్ప్రవాహమునకు దీనిలో నున్నంత సమమార్గము తక్కిన వానిలో లేదని స్పష్టముగా దెలిసియున్నది."[11] ఇదే అభిప్రాయాన్ని ఆయన ఆటవెలది పద్య రూపంలో కూడా చెప్పారు.

*"తేటగీతమందె దీనిని వ్రాయంగ*
*మంచి దంచు తోచె మదిని నాకు*
*సాయమిండి నాకు సదయత బుధులార!*
*వావిలాల వాసుదేవశాస్త్రి."*

'నందక రాజ్యము' అనే పేరును బట్టి ఇది చారిత్రక నాటకంగా అనిపిస్తుంది. కాని నంద వంశ రాజుల కథకు దీనికీ ఏ సంబంధం లేదు. దీనిలోని కథ సమకాలీన సంఘంలోని ఒక సమస్య. అందుకే ఇది తెలుగులో తొట్ట తొలి సాంఘిక నాటకం (క్రీ.శ. 1880) గా గుర్తించబడింది. తరువాతి కాలంలో ఇది కన్యాశుల్కం (క్రీ.శ. 1897), వర విక్రయం (క్రీ.శ. 1923) వంటి సామాజిక ప్రయోజనం గల సాంఘిక నాటకాలు వెలయడానికి ఆదర్శంగా నిలిచిందని చెప్పుకోవాలి.

ఈ నాటకాన్ని కవి అప్పట్లో కృష్ణా మండలంలో నియోగి, వైదిక బ్రాహ్మణుల మధ్య చెలరేగిన కక్షలను దృష్టిలో ఉంచుకొని, వారికి ఐకమత్యాన్ని ప్రబోధించే సదుద్దేశ్యంతో రచించినట్లు తెలుస్తున్నది. ఇదే విషయాన్ని కవి ఈ నాటక గ్రంథం పీఠికలో ఇలా వివరించారు–

"ఇది నేను వ్రాయుటకు గల్గిన ముఖ్యోద్దేశము మన వారిలో, అందులో బ్రాహ్మణులలో బహుతరముగా గాన్పించుచున్నట్టి యైకమత్యమును సర్వవిధంబుల స్వీకరించి, దాని వల్ల మన మెల్ల మేలువడయ గోరవలయునని యెరింగించుటె గాని మరియొకటి కాదని స్పష్టముగా జెప్పుచున్నాడను. ఈ సంగతినే పొడి మాటలతో తెలియజేయక కథ యొకటి కల్పించి, యందులో బరస్పరవైరములు పెంచిన వారు శిక్షింపబడినట్లు కూర్చుట మంచిదని యెంచి, యిట్టి నా యభిప్రాయంబునె మన వారెల్లరు గైకొందురని తలంచి నాటక ధోరణిని వ్రాసితిని."[12]

ఇది నందకుడనే జమీందారు పాలనలో జరిగిన కథ కాబట్టి కవి దీనికి 'నందక రాజ్యము' అని నామకరణం చేశారు. రాజోద్యోగులైన నియోగులు బాధించడం వలన వైదికులు పడుతున్న అవస్థల వర్ణనలతో ప్రారంభమయ్యే ఈ నాటకంలో, రాజపురోహితుడైన శారదానందుని సహాయ సహకారాల వలన, వారు రాజుకు తమ స్థితిగతులను తెలియజేసుకొంటారు. వైదికుల ప్రతినిధిగా రామదీక్షితులనే పాత్రద్వారా కవి చెప్పించిన పలుకులిలా ఉన్నాయి.

"*భూపు సంపత్తికిని వారె మూల బలము*
*కావునసె వైదికులకు భూకాంతులు మును*
*పెక్కులుగ జీవనములు కల్పించినారు.*
*బహుదినంబులు పో, గుటుంబములు పెరిగి*
*పరకొ, పాతికొ చిక్క మా వారు సగము*
*తగ్గి జీవించుచుండిరి దాన దాన.*
*కాని యేలొ, యిటీవల హాని వచ్చె*"[13]

దానికి రాజోద్యోగుల పక్షాన దివాన్ (మంత్రి) – శరభోజిరావు పంతులు నక్క వినయాల పలుకులను చూడండి.

"*ఇప్పుడీ దీక్షితులు విప్పి చెప్పినట్లు*
*వైదికుల పైని మాకున్న వైరమేమి?*
*మేము వారును నొక్కటై మెలగ గన్న*
*నైకమత్య ఫలంబుల ననుభవింప*
*గాను, మా సరివా రెందు గానరారు.*
*అయిన నా వేడ్క మాకిందు నబ్బదయ్యె;*
*స్వామి కార్య నిర్వహణము జగడమునకు*
*మూలమయ్యెను, నిజముగా భూపవర్య!*"[14]

అయితే రాజు నిజం తెలుసుకొని సుబ్బారావనే, లౌక్యంగా మెలిగి, అటు వైదికులకు, ఇటు నియోగులకు సామరస్యం సమకూర్చే వ్యక్తిని మంత్రిగా నియమించడంతో కథ సుఖాంతమవుతుంది.



5 అంకాలు, 26 రంగాలతో ఉన్న ఈ నాటకంలో పాత్రల ద్వారా సందర్భాన్ని బట్టి, స్త్రీ విద్యను గురించి; ప్రాచీనాంధ్ర కవుల గురించి; అవధానాల గురించి; పాత, కొత్త నాటక ప్రదర్శనల గురించి ప్రస్తావించడం కవి ఆధునిక దృష్టిని తెలియజేస్తుంది. కవి ఈ నాటక రచనలో ప్రాచీన రూపక సంప్రదాయాలను ఉల్లంఘించడం విశేషం. భాష గ్రాంథికంలో కాకుండా సరళంగా ఉంటూ మధ్యమధ్యలో గ్రామ్య పద ప్రయోగాలు చేయడం నవ్యత.

"పూర్వపు గ్రామ్య వ్యవహారములిందు సుందరతరముగా నభివర్ణితములు. పద ప్రయోగమున నంత ప్రౌఢిమ పొడసూపదుగాని, స్వాభావికత పెద్దగా నున్నది" అని మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ఈ నాటకానికి కితాబునిచ్చారు.[15]

అయితే ఈ నాటకం ప్రదర్శన యోగ్యం కాదని ఒక విమర్శ ఉన్నది. ఏమైనా ఇది పద్య నాటకాల్లోనే కాకుండా, తెలుగు సాహిత్యంలోనే తొలి స్వతంత్ర సాంఘిక నాటకమన్నది నిర్వివాదాంశం.

ప్రదర్శన యోగ్యంగా లేని 'మంజరీ మధుకరీయము', 'నందక రాజ్యము' ఆయా ప్రక్రియలలో తొలి గ్రంథాలుగా పేర్కొంటే, ప్రదర్శన యోగ్యమై కూడ నాటికగా పేర్కొనబడని కావ్యం ఒకటున్నది. అది వీరేశలింగం పంతులు రచించిన 'సరస్వతీ నారద విలాపము', దీని రచనా కాలం క్రీ.శ. 1895. దీనిలోని వస్తువు గురించి, అందులోని అభ్యుదయాత్మక నవ్యత గురించి ఇంతకు ముందు అధ్యాయంలో చర్చించడం జరిగింది. అయితే నిర్వచనంగా పూర్తిగా పద్యాల రూపంలో ఉన్న ఈ కావ్యాన్ని ప్రదర్శన యోగ్యంగా నాటక రూపంలో మలచడం కందుకూరి వారు ప్రక్రియా పరంగా చూపిన నవ్యత. ఇందులో బహుళ అంకాలు, రంగాలు అంటూ లేకుండా, ఒకే ఘట్టంగా సాగడం వల్ల వీరేశలింగం పంతులు దీనిని బహుశః నాటకం అని, లేక నాటిక అని ఉండకపోవచ్చు. విమర్శకులు కూడా దీనిని కావ్యంగానే పేర్కొంటూ ఉన్నారు. కాని దీని రూప లక్షణాలను పరిశీలిస్తే ఇది ఏకాంకిక అని నిర్ద్వంద్వంగా పేర్కొనవచ్చు. అందుకు సాక్ష్యంగా అందులోని కొన్ని భాగాలను పరిశీలిద్దాం.

"రంగము – దండ కారణ్యము

(వీణలు దాల్చి దుఃఖించుచు సరస్వతీ నారదులు వేరువేరుగా ప్రవేశించుచున్నారు)

సర – (నిట్టూర్పు విడిచి తనలో)

క : ఈ పాపుల కతమున నా
రూపెల్లను మారిపోయె; గ్రూరాత్ములకున్
జేపడితి; మోసపోయితి;
నే పగిదిం బ్రతుకు గందునిక నే నకటా?

క : దాయలలంకార మిషన్
గాయం బాపాదమస్తకంబును బొడవన్
గాయ పడి మామకాంగ ని
కాయమునొచ్చుడును దేలు కరచిన భంగిన్ (అని
విలపించుచున్నది)

నార – (తనలో)

క : కట కట ! సంగీతంబున
కెటువంటి యవస్థ పట్టె నీ దేశములో
పటుతర మోదం బెవరికి
ఘటియింపదు నేడు నాదు గానంబుర్విన్.
------------------------------
------------------------------[16]

పై భాగంలో 'రంగము – దండ కారణ్యము' అని పేర్కొనడం వల్ల, నాటికా ప్రదర్శనలో రంగస్థలంపై 'దండ కారణ్యము' సెట్టింగ్ వేయవలెనని' కవి తెలియజేస్తున్నారు.



కావ్యాలలో లాగే పద్యం ఛందస్సును సూచించే అక్షరాన్ని పద్యానికి ముందు ఇచ్చినా, 'సరస్వతి నిట్టూర్చెన్', 'నారదుడిట్లనియె', 'అనవిని నారదుండు' వంటి వాక్యాలు పద్యాలలో లేకుండా, ఆయా పాత్రల ఆయా చర్యలను వచనంలో బ్రాకెట్లలో చూపడం నాటక లక్షణమే. అలాగే ఆయా పాత్రలు పలికే మాటలను నేరుగా పద్యాలలో ఇమిడ్చి, ముందు 'సర – ' (అనగా సరస్వతి) అని, 'నార – ' (అనగా నారదుడు) అని సూచించడం కూడా నాటక లక్షణమే. ఈ రచన ముగింపు భాగాన్ని కూడా పరిశీలిద్దాం.

"నార –

------------------------

------------------------

------------------------

గీ. పాట యెల్లను వెలయాంధ్ర పాలు జేసి
జనని ! తల మున్క దుఃఖాబ్ధి మునిగియున్న
తల్లి వాంఛ దీర్చుట పుత్ర ధర్మ మగుట
వీపునను మోచికొని పోదు వేగరమ్ము

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)"[17]

ఈ భాగంలో తుదకు 'తెర వ్రాలును' వంటి సూచనలు లేకున్నా, 'ఇద్దరు నిష్క్రమించుచున్నారు' వంటి సూచన బ్రాకెట్లో ఇవ్వడం కూడా నాటక లక్షణమే.

అలా ఇది ఒకే అంకంగా సాగిన ప్రదర్శన యోగ్యమైన సంపూర్ణ పద్య రూపకం. అందుకే దీనిని ఏకాంకిక పద్య నాటిక అనడంలో ఎవరికి ఏ అభ్యంతరం ఉండబోదు. బహుళాంకాలు, రంగాలు గల 'సీజరు చరిత్రము' (క్రీ.శ. 1874) తెలుగులో మొట్ట మొదటి పద్య నాటకమయితే, 'సరస్వతీ నారద విలాపము' (క్రీ.శ. 1895) తెలుగులో మొట్ట మొదటి ఏకాంకికగా అంగీకరించక తప్పదు.

## ఖండ కావ్యం :

"ఖండ కావ్యం భవేత్కావ్య వస్యైక దేశాను సారిచ" అన్నాడు. ప్రాచీన ఆలంకారికుడు విశ్వనాథుడు. అందుకు ఉదాహరణగా "యథా మేఘ దూతాది:" అని చెప్పాడు.

దీనిని వివరిస్తూ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి – "మహా కావ్యములలో ఏక దేశములైన రసవత్ సంఘటనలను గాని, నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయాదుల లోనేదైన ఒకటిగాని తీసికొని రసభావ బంధురములైన రమణీయ రచనలు చేయవచ్చు. అట్టి వానికే ఖండ కావ్యములని పేరు" అని వ్యాఖ్యానించారు.[18] విప్రలంభ శృంగారాన్ని తీసికొని రచింపబడిన కాళిదాస కృత "మేఘ సందేశమ్" ఖండ కావ్యాలలో పేరెన్నిక గన్నదిగా చెప్పవచ్చు.

ఈ వివరణ ప్రాచీన పద్ధతికి సరిపోయింది. కాని ఆధునిక జీవనంలో కవికి అనేక కొత్త విషయాలు కవితా వస్తువులుగా రూపొందాయి. అందుకే ఈ వివరణను కొంచెం ఆధునీకరించి విస్తృతిని పెంచిన వివరణ నిచ్చారు విశ్వనాథ సత్యనారాయణగారు. "మహా కావ్యముల నుండి రసవద్ఘట్టములు గాని, ఒక ఏక విషయమును గురించి వ్రాసిన కొన్ని పద్యములుగాని, విడిగా తీసినచో అవి ఖండ కావ్యములనబడును" అని అంటారాయన[19].

దీనికంటె మరింత స్పష్టమైన వివరణనిచ్చారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

"ఖండ కావ్యమనగా చిన్న కథ, కొన్ని పాత్రలు, పరిమిత పద్యములుండి ఆశ్వాస విభక్తము కాని రచన కావచ్చును"[20]. తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా నవ్య కవిత్వంలో ప్రథమ గణ్యమైన ప్రక్రియగా రూపొందిన ఖండ కావ్య ఆవిర్భావానికి దోహదమైన పరిస్థితులను గూర్చి ఆయన ఇంకా ఇలా వివరించారు–

"పాశ్చాత్య విజ్ఞాన ఫలితముగా సమాజములో కల్గిన మార్పు; కవులనాదరించి గండపెండేరములు తొడుగు 'కవితా ప్రావీణ్య ఫణీశులగు ప్రభువులు లేని లోటు ఈ ప్రక్రియకు దారి తీసినది. ఆంగ్ల నాగరికతా సంపర్కమువలన దేశీయుల జీవన విధానములో వెనుక ఎన్నడు లేని వేడి పుట్టినది. ప్రజలు త్వరజీవనమున కలవాటు పడిరి. వారికి మహాకావ్యములను పఠించు ఓపిక, తీరిక కొరవడినవి. స్వల్ప కాలములో అనల్పానందమును గూర్చు కవిత్వము కావలసి వచ్చినది. పత్రికలకు ప్రబంధములను ప్రచురించు అవకాశము లేకపోయినది. కవిత్వము కవులకు 'జాంబూనదాంబరాగ్రహారముల'ను సమకూర్చు కాలము కాకుండ పోయినది. తీరిక కాలములో ఆత్మానందము కొరకు మిత్రుల మెప్పుకొరకు కవిత్వము వ్రాసికొనుటయే కాని, తిక్కన్న వలె 'మహా కవిత్వ దీక్షావిధి' పొందవలసిన అవసరము లేక పోయినది. ఈ పరిస్థితులిట్లుండగా ఆంగ్ల సారస్వతములోని రసగుళికలైన ఖండ కావ్యములతో తెలుగువారికి పరిచయమేర్పడినది. తెలుగు వారు వానిని చదివి ముగ్ధులై వాని ప్రభావముతో ఖండ కావ్య రచనకు పూనుకొనిరి. కాబట్టి ఖండ కావ్య సృష్టికి ప్రధాన హేతువు ఇంగ్లీషు కవిత్వమే"[21].

ఇలా ఆంగ్ల సాహిత్యంలోని సానెట్ లక్షణాల ప్రభావంతో తొట్టతొలుత ఖండ కావ్యములను రచించిన కవి ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ. క్రీ.శ. 1892లో ఈయన వెలువరించిన "ఆంధ్ర పద్యావళి" ఖండ కావ్య సంకలనంలో సంఘ సంస్కరణాశయంతో వ్రాసిన ఖండ కావ్యాలతో బాటు దాదాభాయి నౌరోజి వంటి స్వాతంత్ర్య యోధులను గూర్చి వ్రాసిన పద్యాలున్నాయి. రవివర్మ చిత్రాలగురించి వ్రాసిన ఖండ కృతి ఉంది. ఈ వివరాలన్నింటిని ఇంతకుముందు అధ్యాయం (19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో సంప్రదాయ వ్యతిరేకత, అభ్యుదయాత్మక నవ్యత)లో తెలియజేయడమైనది.

కేవలం ఖండ కావ్యాలను రచించడమే కాకుండా పలు ఖండ కావ్యాలను కలిపి ఒక ఖండ కావ్య సంపుటిని ముద్రించే సంప్రదాయానికి కూడా సాంఖ్యాయన శర్మగారే ఆద్యులు. 19వ శతాబ్ది చివరి దశాబ్దంలో వెలువడిన వీరి "ఆంధ్ర పద్యావళి" స్ఫూర్తితో 20వ శతాబ్ది నవ్య కవిత్వ యుగంలో అనేకమైన ఖండ కావ్య సంపుటులు వెలువడ్డాయన్న సత్యాన్ని అంగీకరించక తప్పదు.

## గేయకావ్యం :

సంకీర్తనాచార్యుడు అన్నమయ్య తొలి తెలుగు గేయ కవిగా ప్రసిద్ధుడు. ఇతని తరువాత రామదాసు (కంచర్ల గోపన్న), క్షేత్రయ్య, ఆ పైన 19వ శతాబ్దిలో త్యాగరాజు వంటి చాలా మంది వాగ్గేయకారులు గేయ కవితా పుష్టికి కృషి చేసిన వారే. వీరి

రచనలు, పదాలు, కీర్తనలు, కృతులుగా వెలువడి ప్రసిద్ధినొందాయి. ఇవిగాక ఆ రోజులలో జానపద, పౌరాణిక గేయాలు జన వ్యవహారంలో ప్రచారంలో ఉన్నాయి. అయితే గేయ కవితను కావ్య రచనకు వినియోగించిన ఘనత మాత్రం మండ కామశాస్త్రి, శిష్టు కృష్ణమూర్తి గార్లదే. గేయ ఛందస్సులతో సాగిన వీరి 'ఆంధ్ర తులసీ రామాయణము' (1879) అనే అనువాద కావ్యం ఆంధ్ర సాహిత్యంలో మొట్ట మొదటి గేయ కావ్యం. '19వ శతాబ్దం తెలుగు కవిత్వంలో ఛందస్సు పరమైన నవ్యత' అన్న అధ్యాయంలో ఈ విషయాన్ని సవిస్తరంగా, సోదాహరణంగా వివరించడం జరిగింది.

"ఆంధ్ర తులసీ రామాయణము" గేయ ఛందస్సులతో సాగిన తొట్ట తొలి సంపూర్ణ గేయ కావ్యమైతే, ఒక ప్రబంధంలో వివిధ పద్య ఛందస్సులతో బాటు కీర్తనలను, పాటలను ప్రవేశపెట్టి మొట్ట మొదటిసారిగా వాటికి కావ్య గౌరవాన్ని సంతరించిన కవి – 'బిల్వేశ్వరీయము' (1893) ప్రబంధ కర్త కొక్కొండ వేంకట రత్నశర్మ పంతులు. ఈ ప్రబంధంలో బిల్వాంబ, బిల్వేశుల కల్యాణ సందర్భంలో అనేక సంప్రదాయ గీతాలను రచించి పొందు పరిచారు.

"గౌరి కల్యాణ వైభవమే! గౌరి కల్యాణ వైభవమే!" అనే పల్లవితో ప్రారంభమయ్యే 'కల్యాణ గీతము'–

*"హిమవంతు కూతురై – యింపు సొంపొందె !*
*హిమకరమౌళిని – హితమొంద బొందె !*
*వలరేని పగవాని – వానికి జెలిగ*
*నలరించె బెండ్లియై – యయ్యె నెచ్చెలిగ!"*[22]

వంటి చరణాలతో సాగి ఆకట్టుకొంటుంది. ప్రాసలు, యతులతో బాటు ఈ చరణాలలో అంత్య ప్రాసలను కూడ కవి పాటించడం గమనార్హం. ఇదే వరుసలో ఈ ప్రబంధంలో పెళ్ళి ముచ్చట్లకు సంబంధించిన 'నలుగు పాట', 'ఆనంద గీతము', 'శోభనగీతము', 'మహా శోభనగీతము', 'లాలి పాట (లేక) తొట్ల పాట', 'పూలబంతులాట పాట', 'మంగళగీతము' లను రచించి, ఆ ఘట్టాన్ని చదువుతున్నంతసేపు ఒక పెళ్ళి సందడిని కళ్ళకు కట్టేలా చేశాడు కవి పుంగవుడు.



"ఆనంద మానంద మాయెను – మన
సీనమ్మ పెండ్లి కూతురాయెను – మన
సీనయ్య పెండ్లి కొడుకాయెను –
సీనమ్మ బిల్వాంబ – సీనయ్య బిల్వేశుడు *!!"*[23]

అని సాగే 'ఆనంద గీతము', మరియు –

"శోభనమే శోభనమే! శ్రీ బిల్వేశులకు శోభనమే!
ఈ పెండ్లి కూతునకు, నీ పెండ్లి కొడుకునకు
జూపు జూపులనంగ శోభనమే శోభనమే!"[24]

అని సాగే 'మహా శోభన గీతము' – ఇంకా

*"లాలి శ్రీతను మధ్య – లాలి మాయమ్మ!*
*లాలి శ్రీ బిల్వేశ – లాలి మాయయ్య!"*[25]

అని సాగే లాలి పాటల స్థానంలో ఏ పద్యాలు వ్రాసినా ఆ ఘట్టంలోని సహజ రామణీయకత అబ్బదు కదా! ఇలా ఒక పద్య కావ్యంలో సందర్భానుసారం గేయ కవిత్వాన్ని సమ్మిశ్రితం చేసి 19వ శతాబ్దిలోనే ప్రక్రియా పరమైన నవ్యతను చూపారు కొక్కొండ వేంకట రత్నం పంతులుగారు.

'బిల్వేశ్వరీయము'లో అత్యధిక భాగం పద్యాలు కాగా సందర్భానుసారం అక్కడక్కడా గేయాలున్నాయి. అయితే సుప్రసిద్ధ వాగ్గేయకారుడు త్యాగరాజు రచించిన 'ప్రహ్లాద భక్తి విజయము' మరియు 'నౌకా చరిత్రము' లో అత్యధిక భాగం కీర్తనలుండి అక్కడక్కడా కందము, సీసము, ద్విపద వంటి ఛందస్సులలో పద్యాలున్నాయి. త్యాగరాజు జన్మించింది 1767లో. ఆయన ఈ పరిణత కావ్యాలను కనీసం 35 సంవత్సరాల వయస్సులో రచించాడనుకొన్నా, ఈ గ్రంథాలు 19వ శతాబ్ది తొలి చరణంలో వెలువడి ఉండాలి. త్యాగయ్య వీటిని సంగీత రూపకాలన్నాడు. కొందరు వీటిని నృత్య నాటికలన్నారు. ఒక రకంగా ఇవి ఆ రోజుల్లో నూతన ప్రక్రియలనే భావించాలి. అయితే అక్కడక్కడా పద్యాలు, ఒకటి రెండు దరువులు, అత్యధికంగా కీర్తనలతో సాగిన ఈ సంగీత రూపకాలు రచనా పరంగా 'యక్షగానం' ప్రక్రియను పోలి ఉంటాయి. ప్రదర్శన పరంగా 'యక్షగానం' ప్రక్రియకు, త్యాగరాజు

ఆవిష్కరించిన 'సంగీత రూపకం' లేదా 'నృత్య నాటిక' ప్రక్రియకు గల భేదసామ్యాలను వివేచిస్తూ సంగీత, నృత్య రంగ నిపుణులు తులనాత్మక అధ్యయనం చేయవలసి ఉన్నది (ఈ పరిశోధన విస్తృతి కవిత్వ రచనా పద్ధతి వరకే పరిమితం కాబట్టి, ఈ విషయంలో ఇంకా వివరాలలోకి వెళ్ళలేకపోతున్నాను).

వాగ్గేయకారుల రచనలన్నీ గేయ కవితలే అయినా అన్నమయ్య రచనలను 'పద కవిత' లంటారు. రామదాసు రచనలను కీర్తనలంటారు. త్యాగరాజు రచనలను కృతులంటారు. ఆ రకంగా 'సంగీత రూపకం' తోబాటు, 19వ శతాబ్దిలో 'కృతి' అన్నది గేయ కవిత్వంలో త్యాగరాజస్వామి ఆవిష్కరించిన ప్రత్యేక ప్రక్రియ అని చెప్పాలి. ఈ ప్రక్రియ విశిష్టతను, కీర్తనతో ఈ ప్రక్రియకు గల భేదాన్ని ప్రఖ్యాత సంగీత విద్వాంసులు డా. మంగళంపల్లి బాల మురళీకృష్ణగారు ఇలా వివరించారు–

"శ్రీ, త్యాగబ్రహ్మము పూర్వులు రచించిన కీర్తనలు గాక 'కృతి' రచన యొనర్చి, లక్ష్య లక్షణ సమన్వయముతో విశిష్ట సంగీత సంప్రదాయమునకు స్వయం స్రష్టయై 'త్యాగబ్రహ్మ' యను తన పేరును సార్థక మొనర్చుకొన్నారు. కీర్తన యందు, పల్లవి తరువాత చరణములన్నియు ఒకే తీరుగా నుండుట కలదు. కృతియందట్లు గాక అను పల్లవి వేరుగా నుండి, చరణమైన పిదప, 'చరణానుపల్లవి' యనునది కూడా నుండును. అనగా పల్లవి తర్వాత నున్న అనుపల్లవి వలెనే చరణానుపల్లవియు ఉండి కృతికి రాగ భావ విస్తృతిచే రమ్యతను చేకూర్చును"[26]

ఇందుకు ఉదాహరణగా ఒక త్యాగరాయ కృతిని పరిశీలిద్దాం.

పల్లవి : గంధము పుయ్యరుగా – పన్నీరు
గంధము పుయ్యరుగా – ॥గంధము॥

అనుపల్లవి : అందమైన యదునందనుపై
కుంద రదన లిరువొందగ – పరిమళ ॥గంధము॥

1వ చరణము : తిలకము దిద్దరుగా – కస్తూరి
తిలకము దిద్దరుగా –

చరణానుపల్లవి: కలకలమను ముఖ కళ గని సొక్కుచు
పలుకుల నమృతము లొలికెడి స్వామికి ॥గంధము॥

2వ చరణము : చేలము గట్టరుగా – బంగరు
చేలము గట్టరుగా –

చరణానుపల్లవి: మాలిమితో గోపాల బాలులతో
నాలమేపిన విశాల నయనునికి – ॥గంధము॥

3వ చరణము: హారతు లెత్తరుగా – ముత్యాల
హారతు లెత్తరుగా –

చరణానుపల్లవి : నారీ మణులకు వారము యౌవన
మవారిగ నొసగెడు వారిజాక్షునికి – ॥గంధము॥

4వ చరణము : పూజలు సేయరుగా – మనసార
పూజలు సేయరుగా –

చరణానుపల్లవి : జాజులు మరి, విరజాజులు, దవనము
రాజిత త్యాగరాజనుతునికి – ॥గంధము॥ [27]

19వ శతాబ్దిలో త్యాగరాయ కృతులతో గేయకవిత శిఖరాయమాన ప్రాభవాన్ని సంతరించుకొన్న మాట నిర్వివాదాంశం.

కృతులుగాని, కీర్తనలు గాని హిందూ మతంలో దేవుళ్ళను కీర్తించేందుకు వినియోగిస్తున్న తరుణంలో అనగా 19వ శతాబ్ది పూర్వార్థంలోనే మొట్ట మొదటిసారిగా అన్యమతానికి చెందిన దేవుని కీర్తించేందుకు కీర్తనలను రచించిన కవి పురుషోత్తమ చౌధరి. 'ఆంధ్ర క్రైస్తవ కవి సార్వభౌముడు' బిరుదాంచితుడైన పురుషోత్తమ చౌధరి – త్యాగరాజు రచించిన 'ప్రహ్లాద భక్తివిజయము' సరణిలో 'రక్షణ చరిత్ర' (The History of Salvation); 'నిస్తార రత్నాకరము' (The Jewel mine of Salvation) అన్న సంగీత రూపకాలను క్రీ.శ. 1846లో రచించాడు. ఇవి తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటి క్రైస్తవ సంగీత రూపకాలుగా చెప్పవచ్చు. అంతే కాకుండా ఈయన 'సత్య భజన' పేరిట ఒక భజన గీతాల సంకలనాన్ని క్రీ.శ. 1874లో రచించాడు.

ఈ భజన గీతాల గ్రంథంలో కవి ప్రతి కీర్తనకు ముందు తెలుగు వర్ణమాలలో ఒక్కొక్క అక్షరాన్ని అక్షర క్రమంలో ప్రారంభాక్షరంగా ఉపయోగిస్తూ ఒక కంద పద్యాన్ని రచించారు. ఇలా 'అ' నుండి 'క్ష' వరకు అక్షరాలను వినియోగిస్తూ ఒక్కొక్క కంద పద్యం, దాని క్రింద ఒక కీర్తన చొప్పున రచించి కవి ఒక నవ్య మార్గాన్ని తొక్కాడు. దీనిని కవి ఒక ప్రత్యేకమైన ప్రక్రియగా పేర్కొనక పోయినా, ఈ కావ్య వైశిష్ట్యాన్ని కావ్యారంభంలో 'అక్షర మాలికా కందాలంకార' భజన గీతాల సంకలనంగా పేర్కొన్నారు.

తెలుగు సాహిత్యంలో విభక్తులను ఉదాహరిస్తూ స్తుతి రూపంలో ఉండే 'ఉదాహరణము' అనే లఘు కృతిని, ఒక విశిష్ట సాహితీ ప్రక్రియగా అంగీకరించినప్పుడు పురుషోత్తమ చౌధరి సృజించిన ఈ నవ్య మార్గ రచనను ఒక నూత్న ప్రక్రియగా అంగీకరించక తప్పదు. ఈ ప్రక్రియకు కవి పేర్కొన్నట్లుగా 'అక్షర మాలిక' అని నామకరణం చేయడం సముచితమని నా సూచన.

ఈ గ్రంథం వివరాలలోనికి వెళితే, మొదట 'అ' కారంతో ప్రారంభించిన పద్యం –

*"అవనియు నాకాశంబును*
*రవి శశితారా గణములు – రాత్రి దివసముల్*
*ఎవని మహాత్మావచనో*
*ధ్రువమయ్యెను నాత్రియేక దైవము గొలతున్"*

ఈ పద్యం క్రింద –

*"దైవంబు గొలుతున్ – నా తండ్రి*
*యెహూవాను దలతున్"* అన్న కీర్తనను పొందుపరిచాడు కవి.

ఆ తరువాత 'ఆ' కారంతో

*"ఆదము వలనను వచ్చెను*
*హా దుర్గతి పుడమి నరుల – కది పోగొట్టన్*
*మోదమున నవతరించితి*
*వో దేవ! త వాంఘ్రి దాస్య మొసగవె మాకున్"*

అన్న పద్యాన్ని రచించారు. దాని క్రింద 'ఆనంద భైరవి' రాగంలో

*"తవాంఘ్రి దాస్యము నొసంగవే*
*భక్త వత్సలా! మమ్ము గావవే"*

అన్న కీర్తనను రచించాడు కవి.

అలాగే 'ఇ' కారంతో

*"ఇమ్మానుయేలు నరరూ*
*పమ్మున యవతారమూని, పాపాత్ముల రా*
*రమ్మని బిలచుచు వారియ*
*ఘమ్ములు హరియించి బ్రోచు – కరణా నిధియై!"*

అన్న పద్యం – దాని క్రింద

*"కరుణానిధియై క్రీస్తుడు వచ్చె ధరణికి నరుడై –*
*నరజాతి దురవస్థ దరిశించి, తత్పాప*
*పరిహారము కొరకై యర్పణ సేయ దేహము*

॥కరుణానిధి॥"

అన్న కీర్తన ఉన్నాయి.

ఇలా అన్ని అక్షరాలతో వరుగా సాగిపోతుంది. ఈ గేయ కావ్యం[28]. ఇవిగాక కవి ఇంకా ఎన్నో క్రైస్తవ మత కావ్యాలను రచించాడు. ఆ ఇతర రచనల గురించి సవిస్తరంగా మరొక అధ్యాయంలో చర్చిస్తాను.

మొత్తానికి తెలుగు సాహిత్యంలో క్రైస్తవ మత వ్యాప్తికై నడుం కట్టిన మొట్ట మొదటి వాగ్గేయకారుడు పురుషోత్తమ చౌధరి అన్నది అక్షర సత్యం.

ఇదిలా ఉంటే దేవుళ్ళను స్తుతించేందుకు వినియోగించే కీర్తనను 19వ శతాబ్దిలోనే ఒక కవి హాస్య వ్యంగ్య స్ఫోరకంగా ఒక గుడ్డి గుర్రాన్ని వర్ణిస్తూ రచించి గేయ కవిత్వంలో వస్తు పరంగా అత్యాధునికతను ప్రదర్శించారు. రాయభట్టు వీర రాఘవ రాజ కవి రచించిన ఈ కీర్తన ఇలా ఉంది–

## గ్రుడ్డి గుర్రము మీద కీర్తన

*గ్రుడ్డి గుర్రాన్నీయడు వడ్డాణపు శాలుగప్పి*
*ఒక దిడ్డిన స్వారైతె అడ్డా?*
*గుణ శోభనాద్రి రాజ నృపాలా!*
*కమ్మవారి హయము కమ్మగ భోంచేసి*
*దమ్ములోదులు వెనుక డాచె కాని*
*ముందు చూడ కాస్త రొమ్మైన లేదురా!*
*నమ్మ జాలదు శోభనాద్రి నృపాలా!*
*అది గ్రుడ్డిది – ఇది నడ్డిది*
*పద్దెనిమిది పరగణాల ప్రభువిచ్చినదా?*
*అదె యందురు పుడమిని నదరాగదు*
*చూడగ రణ విద్ధరి శోభనాద్రి నృపాలా!*
*గుర్రాన్నీవలె దొరా !*
*కరాళించేది, మంచి కాహల దిరిగేది*
*మిర్రయిన ఎత్తు గలదిగ*
*కుర్రది గాకుండ మంచి కోడెది గాగ!* [29]

ఇదిలా ఉండగా ఉర్దూ సాహిత్యంలో బహుళ ప్రచారంలో ఉన్న 'గజల్' ప్రక్రియ 19వ శతాబ్ది ఉత్తరార్ధంలోనే తెలుగు సాహిత్యంలో ప్రవేశించిందన్న విషయం కూడా తెలుస్తున్నది. తెలుగు అకాడమి వారు ప్రచురించిన 'తెలుగు సాహిత్య కోశము'లో ఈ విషయం ఉటంకించబడింది. "గజల్, డోరా, తౌహరా మొదలైన ఫార్సీ మట్లు 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో తెలుగు దేశంలో ధార్వాడ నాటక సమాజం వారి నాటకాలకు ప్రచారం వచ్చిన కాలంలో తెలుగు సారస్వతంలో ప్రవేశించాయి"[30] అని అందులో పేర్కొనబడింది. అయితే 20వ శతాబ్దిలో డా. దాశరథి, ఆచార్య సి. నారాయణ రెడ్డి తదితరులు రచించిన గజళ్ళకు, వీటికి ప్రక్రియాపరంగా ఏమైనా భేదముందేమో వివేచించవలసి ఉంది.

ఏదేమైనా 19వ శతాబ్దిలో గేయ కవిత్వం ఇలా వినూత్నమైన మార్పులు చెంది కొత్త కొత్త పుంతలు తొక్కి, 20వ శతాబ్దిలో బహుళ ప్రసిద్ధినొందిన లలిత గేయ రూపకల్పనకు దారి తీసిందని చెప్పవచ్చు.



పద్య కావ్యం, ఖండ కావ్యం, గేయ కావ్యం వంటి రూపపరమైన ప్రక్రియలతో బాటు 19వ శతాబ్దిలో వస్తుపరమైన నవ్య ప్రక్రియలు కూడా తొలిసారిగా రూపుదిద్దుకొన్నాయి. వాటిలో ప్రధానంగా వ్యంగ్య కావ్యం, స్మృతి కావ్యం, యాత్రా చరిత్ర, జీవిత చరిత్ర, స్వీయ చరిత్రలను పేర్కొనవచ్చు.

**వ్యంగ్య కావ్యం :** తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటి వ్యంగ్య కావ్యం కందుకూరి వీరేశలింగం పంతులు రచించిన 'అభాగ్యోపాఖ్యానం'. క్రీ.శ. 1876లో ఈ తొట్ట తొలి వ్యంగ్య కావ్యం ఆవిర్భవించింది. ఈ ప్రబంధ రచన లక్ష్యాన్ని తమ స్వీయ చరిత్రలో వివరిస్తూ పంతులుగారు– "శృంగార ప్రబంధములు చేయు మేలు కంటె కీడెక్కువగా నుండు నన్న భావమునకు వచ్చిన వాడనగుట చేత ప్రబంధ ప్రణీతృ పంథాను పరిహసింపవలెనన్న యుద్దేశ్యముతో నభాగ్యోపాఖ్యానమును చేసితిని" అని వ్రాసుకొన్నారు.

హితకారకం కాని సామాజికాంశాన్ని గాని లేక సాహిత్యాంశాన్ని గాని పరిహాసం చేస్తూ నవ్వు పుట్టించే విధంగా చేసే రచనను 'వ్యంగ్య రచన' అని చెప్పవచ్చు. దీనిని ఆంగ్లంలో 'సెటైర్' అని అంటారు. దీనికి 'పేరడీ' అనగా 'వికట కవిత్వా'నికి కొంత భేదముంది. ఇదివరకే వచ్చిన ఒక రచనను అపహాస్యం చేస్తూ, మూలంలోని వస్తువుకు భిన్నమైన ఒక రకంగా చెప్పాలంటే అల్పమైన వస్తువుతో నవ్వు పుట్టించే విధంగా చేసే రచన 'పేరడీ' అనబడుతుంది. రెండింటిలోనూ నవ్వు పుట్టించడం సాధారణమైనా, పేరడీకి అంతకు మించి ప్రత్యేకమైన ఆశయం ఉండనవసరం లేదు. కాని వ్యంగ్య రచనకు ఆ రచనలోని వ్యంగ్య వైభవం ద్వారా, అహితమైన సామాజికాంశం గురించి గాని లేక సాహిత్యాంశం గురించి గాని కను విప్పు కలిగించే ఉదాత్త ఆశయం ఉంటుంది.

కొందరు ఈ భేదాన్ని గమనించకుండా 18వ శతాబ్దిలో కూచిమంచి జగ్గకవి రచించిన 'చంద్ర రేఖావిలాపము'ను మొదటి వ్యంగ్య కావ్యంగా పేర్కొంటున్నారు. అది తిట్టు (అధిక్షేప) కావ్యం అవుతుందే కాని వ్యంగ్య ప్రబంధం కాజాలదు.

పూసపాటి విజయరామరాజు బావమరిది చింతలపాటి నీలాద్రిరాజు సత్కారం చేస్తానని చెప్పి జగ్గకవిని ఒక కావ్యం వ్రాయుమని కోరాడట. జగ్గకవి

‘చంద్రరేఖావిలాస’ మనే ప్రబంధాన్ని రచించి ఇచ్చాడట. అయితే నీలాద్రిరాజు అన్న మాట నిలబెట్టుకోకుండా, తిరస్కరిస్తే కవి కోపించి, అతనిని దూషిస్తూ ‘చంద్ర రేఖా విలాసము’ నకు వ్యతిరేకంగా ‘చంద్ర రేఖా విలాపము’ అనే బూతు కావ్యాన్ని రచించాడని ప్రచారంలో ఉంది. డా. వెలుదండ నిత్యానందరావు భావించినట్లుగా, ఇది – “మొట్ట మొదటి పద్యం మొదలుకొని చిట్ట చివరి పద్యం వరకు బహుశా మనకు దొరకని చంద్రరేఖా విలాసానికి ప్రతి పద్య వికృతీకరణం కావచ్చు.”[31] ఆ విధంగా ఈ దూషణ కావ్యాన్ని ‘వికట ప్రబంధం’గా (పేరడీ)గా అంగీకరించడంలో ఎటువంటి ఆక్షేపణ ఉండదు. కాని దీనిని వ్యంగ్య ప్రబంధంగా పేర్కొనజాలం.

ఇలాంటి రచనలు 19వ శతాబ్దిలో కూడా కొన్ని కనిపించక పోవు. 19వ శతాబ్ది ప్రారంభంలో పిండిప్రోలు లక్ష్మణ కవి రచించిన ‘లంకా విజయము’ అందులో ఒకటి. దీనికి ‘రావణ దమ్మీయము’ అని నామాంతరముంది. ధర్మారాయుడనే వెలమ కులస్థుడు కవి గారి లంక నేలను కొంత ఆక్రమిస్తే, అతనిని రావణునితో, క్షేత్రాపహరణను రామాయణ కథతో పోల్చి, కవి ద్వ్యర్థి కావ్యంగా దీనిని రచించాడు. మచ్చునకు అందులోని రెండు పద్యాలను పరిశీలిద్దాం.

*ఏడు పందు ముల్లోకంబు లెరుగ లంక*
*నేల కొల పర క్షేత్రాప్తి మేలు గాదు –*
*పేర్మి నా భూమిజాత సంప్రీతి తోడ*
*వీడు – మదియె సౌఖ్యము లిచ్చు – వేయు నేల?*

*జ్యేష్ఠుడా లక్ష్మణాగ్రజ క్షేత్ర మీవు*
*వదలకుండిన మోసంబు వచ్చునింక –*
*జంద నిర్భీక వనాచారి పిండిప్రోలి*
*కవికుల వరుతో రిపుత ముఖ్యముగ వలదు!* [32]

ఒక వంక స్వీయ బాధ – మరొక వంక రామాయణ గాథ – వ్యక్తమయేలా కవి రచించిన ఈ పద్యాలు పండితుల ప్రశంసల నందుకొన్నాయి. కవి తన గురించి తాను చెప్పుకొంటూ భీమకవి, శ్రీనాథులు కూడా తనలా తిట్టలేరని వివరించాడు. ఆ విధంగా ఈయన తిట్టుకవిగా బహుళ ప్రసిద్ధుడు. అందుకే ‘రావణ దమ్మీయము’ తిట్టు కావ్యంగా రాణించింది.



అలాంటిదే మరొక కావ్యం – ‘ఖల కర్ణ విషాయనం’ దీని రచయిత – పన్నాల సీతారామబ్రహ్మయ్యశాస్త్రి. ఈయన కందుకూరి వీరేశలింగం గారికి సాహిత్య విద్యా గురువులు. సంకుసాల నృసింహ కవి రచించిన ‘కవి కర్ణ రసాయనం’ కావ్యనామానికి ప్రతిగా ఈయన తన కావ్యానికి ‘ఖల కర్ణ విషాయనం’ అని నామకరణం చేశారు. క్రీ.శ. 1820–1900 మధ్య జీవించిన ఈ కవి ‘కూచిమంచి గోపాలకృష్ణమ్మ’ అనే జమీందారుపై కోపించి, అధిక్షేపిస్తూ చేసిన రచన ఇది.

అయితే ఇవన్నీ ఆయా కవులు, వారి కోపాగ్నికి గురైన వ్యక్తులను నిందిస్తూ చేసిన వ్యక్తిగత దూషణ కావ్యాలే అవుతాయి. కాని వీరేశలింగం పంతులు రచించిన ‘అభాగ్యోపాఖ్యానం’ అలాంటిది కాదు సాహిత్యంలో పతనావస్థకు చేరుతున్న ప్రబంధశైలిని నిరసిస్తూ, కవులకు కనువిప్పు కలిగించేలా, వ్యంగ్య వైభవంతో ఒక సామాజిక (సాహిత్య) ప్రయోజనాన్ని ఆశించి చేసిన రచన, ఇదే విషయాన్ని డా. వెలుదండ నిత్యానందరావు ఇలా వివరించారు–

“కూచమంచి జగ్గకవికి ‘చంద్రరేఖా విలాప’ రచనతో వ్యక్తిగత ఆక్రోశాన్ని, తనకు లభించలేదన్న కసిని తీర్చుకోవడమే ప్రధానాశయం – కందుకూరిది ధర్మాగ్రహం – వ్యక్తిగత ప్రయోజనాన్ని ఆశించింది కాదు. సాహిత్యం వైవిధ్య రహితమై, గతానుగతికమైపోతోందన్న ఆవేదన ఆయనది. అందుకే విమర్శిస్తూ వ్యాసం రాయకుండా – జవసత్త్వాలు కోల్పోయిన ప్రబంధ లక్షణాలను అభాగ్యో పాఖ్యానం (1876) ద్వారా అతిశయింప జేసి మరింత అవహేళన చేశాడు. ఒకప్పుడు ఎంతో ఉన్నతంగా వెలిగిన ప్రబంధ ప్రక్రియ కాల ప్రవాహంలో ఎంతగా దిగజారిపోయిందో, ఎటువంటి జీవ చైతన్యం చూపలేని దశకు చేరుకుందో కందుకూరి అమిత శక్తిమంతంగా నిరూపించాడు. ఈ రచన కేవలం ఆవేశం వల్ల రచించింది కాక సాహిత్య ప్రగతి కోసం చేసింది. అందుకే జగ్గకవిలోని బండ బూతులు, వ్యక్తి నిందలు అభాగ్యోపాఖ్యానంలో కనిపించవు. సభ్యత మీరని పలుకుబళ్ళతో పఠితృలోకానికి ఆనందాన్ని కలిగిస్తుంది ఇది. కాల గమనాన్ని గుర్తించి, తమను హెచ్చరిస్తున్న రచనగా కందుకూరి అభాగ్యోపాఖ్యానాన్ని చదువరులు ఆదరిస్తారు.” [33]

ఇక 'అభాగ్యోపాఖ్యానం'లోని వ్యంగ్యవైభవ మెలాంటిదో పరిశీలిద్దాం. అసలు ఆ ప్రబంధ నాయకుని పేరే 'అభాగ్యుడు'గా ఉంచి కందుకూరి వారు ఈ ప్రబంధంలో వ్యంగ్యానికి నాంది పలికారు.

ప్రబంధంలో ఆదిలో సాధారణంగా పురవర్ణన ఉంటుంది. కథాగమనానికి ఆలవాలమైన నగరాన్ని అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నట్లుగా అది స్వర్గానికి ప్రతి రూపంగా వర్ణించడం కవులకు పరిపాటి. అందుకు వ్యతిరేకంగా గొడ్డుపోయి, జలం లేని పాడుకొలను దగ్గర దండకారణ్యం మధ్యలో ఉన్న పాపులసదనంగా పురాన్ని వర్ణించారు కవి.

*'వింధ్య ధాత్రీధర ప్రాంత వంధ్య భూమి*
*జలము లేనట్టి యొక పాడు కొలను దరిని*
*దండ కారణ్య మధ్యంబు దనర జేయు*
*పాప సదనము వ్యాఘ్రాఖ్యా పట్టణంబు"*

అంతే కాదు. అక్కడి ప్రజల కుటిలత్వ స్థాయికి ఓడిపోయి పాములన్నీ పాతాళానికి వెళ్ళిపోయాయని చమత్కరిస్తారు కవి మరో పద్యంలో

*"అన్నగరంబున గరమ*
*భ్యున్నతి వహియించు కుజన పుంగవ కొటి*
*ల్యోన్నతి కోడుట గాదే*
*పన్నగ కులమెల్ల జేరె పాతాళంబున్"*

ప్రబంధాల్లో ఆ తరువాతి ఆ నగరంలోని చాతుర్వర్ణ్య వ్యవస్థను వర్ణిస్తుంటారు. సాధారణంగా అయితే అక్కడి బ్రాహ్మణులు బృహస్పతితో సమానులని, వైశ్యులు లాభాపేక్ష లేకుండా న్యాయ సమ్మతంగా వ్యాపారం చేసుకొనే ఉదారులనీ, క్షత్రియులు వీరాధివీరులని, శూద్రులు సమాజాభ్యున్నతికై పాటుపడే కష్టజీవులని కవులు గోరంతలు కొండంతలు చేసి వర్ణించడం చూస్తుంటాం. కాని కవి ఈ వ్యంగ్య ప్రబంధంలో – "సారాయి పీపాల కొలది ద్రావి యొడలు తెలియక వీధుల బడెడివారు'' బ్రాహ్మణులనీ; "పిరికితనంబునం బురిని పేరు వహించిన రాజపుంగవుల్" అని క్షత్రియులనీ; "బియ్యమున వడ్ల బెడ్డలు పెక్కు గలిపి తప్పుతూనిక తూచుచు దక్కువగను'' కోమట్లు సొమ్ము కూర్చుకొంటారనీ; "జూదముల దొంగతనముల శూరులగుచు శోభగాంతురు పురిలోన శూద్రజనులు" అనీ వర్ణించి అపహాస్యం చేస్తారు. ఇక కథానాయకుడైన 'అభాగ్య'నామ రాక్షసాధిపుని వర్ణన మరింత హాస్యస్ఫోరకం.

*"వాని దుష్కీర్తితో వాసి చెందగ బూని*
*కుందుచు చీకట్లు గుహలనడగె*
*వానిమై బిగితోడ వాదులాడగ బూని*
*ఖడ్గ మృగంబులు కాన డాగె*
*వాని చాపలముతో బ్రతి బొందగా బూని*
*వానర జాలంబు వనము దూరె*
*వాని మాంద్యముతో సమానంబు రాబూని*
*దున్నలు బురదలో దొర్లదొడగె.*

*వాని క్రౌర్యంబుతో దినుసూన బూని*
*జడిసి వ్యాఘ్రంబు లడవిలో సంచరించె*
*వాని కంఠస్వరంబుతో వాదు పూని*
*పొరలె గార్ధభ బృందంబు బూదిలోన"*

అటువంటి రాక్షసరాజు ఒకరోజు వేటకు ప్రయాణమౌతాడు.

*"ముద్ది యెండి యున్న మొద్దు గుఱ్రము మీద*
*కదలకుండ నెక్కి కాళ్ళు నేల*
*దగుల గూరుచుండి తక్కిన వారలు*
*వెనుక జేరి తోల వెడలె నతడు"*

ఇక ఆపైన కవి అనేక హాస్య సన్నివేశాలను కల్పించారు. ఉదాహరణగా ఈ చంపూ ప్రబంధంలోని హాస్యరసపూరితమైన ఈ వచనాన్ని గమనించండి.

"ఇట్లు భట శ్వానంబులు బెదరి చెదరిన రాక్షసాధ్యక్షుండు రూక్ష వీక్షణుండయి కుర్కుర, మర్కట, మార్జాల, శశకాద్యనేక క్షుద్ర మృగ కులంబుల బొలియించి

మృగయా వినోదంబు సలుపుచుండ నొక్కచో నొక తరుక్షువు వీక్షించి తురంగంబు భయాకులాంత రంగంబయి యికిలించుచు నపరాహ్ణ సమయంబున సరోవర సమీపంబున బురద నేల నతనిం గూలవైచి చనిన యనంతరంబ, యింతకుమున్న విట్చరంబుచే దరుమంబడి యచ్చట డాగి యున్న భృత్యుండొకరుండు చనుదెంచి లేవనెత్తిన...."

ఆ పైన "శునక రోదనంబు గతి, సూకర నాదము భంగి, గార్దభ స్వనము విధంబులనన్ బ్రబల సైరిభ రావము పోల్కి దవ్వులన్" వినబడగా ఒక భృత్యుని పిలిచి వివరాలు కనుక్కొని రమ్మని పంపుతాడు. వాడు ఆ స్వరము ఒక రాక్షస కన్యదని కనుగొని, తన స్వామితో ఆమె కురూపాన్ని వర్ణిస్తూ

*"కొమ్మ గాదది మేటి పెద్దమ్మగాని*
*బాల గాదది యముచేతి కోలగాని*
*కన్నె గాదది బలిసిన దున్న గాని*
*నారి గాదది జనులకు మారి గాని –*

*అట్టి కన్నియయును నీవు ననగి పెనగి*
*కనరు లేనట్టి మమతల గలసిరేని*
*యెందు నీత చెట్టు పయి కోరింద తీగె*
*యల్లుకొను రీతిగాదె యో యమరవైరి!"*

అని ప్రోత్సహించడం ఒక వైచిత్రి. అప్పుడు చెలునితో పాడుబడ్డ గుడి వద్ద ఉన్న ఆమె చెంతకు వెళ్ళి, ఆమె చేయిని వెనుక నుండి వెళ్ళి పట్టుకోగానే, అతని ముందరి పండ్లు రాలేట్టుగా ఎడమకాలితో ఆమె తన్ని గర్భగుడిలో దాగుకొంటుంది. ఆ తరువాత ఆమె దూతిక యొకదాని సహాయంతో అభాగ్యుడు ఆమెను సుముఖం చేసుకొని, గుడి లోపల రమిస్తుంటాడు. ఆ సమయంలో సుఖాంతమవుతుందనుకొన్న ఈ హాస్య ప్రబంధంలో ఆమె భర్త పాత్రధారి ప్రవేశించి గుడి తలుపులు బద్దలు కొట్టి, లోన ఉన్న ఆ ఇరువురికి దేహశుద్ధి చేయడం ప్రబంధంలోని వ్యంగ్యానికి పరాకాష్ఠగా నిలుస్తుంది.



"ఒదిగి వడకుచున్న యుష్ట్రయాననను, రాక్ష
సాధమునిని జూచి యలుక తోడ
వీసె గుద్దులొకట వేనవేల్ కురిపించి
కొప్పు జుట్టు బట్టి గుంజి యాడ్చి

వెలుపలికి దీసికొని వచ్చి వీపు మీద
ముఖము మీదను, మెడ మీద ముక్కు మీద
మణుగు గుద్దుల వానలు మచ్చు చూపి
పిండి పెట్టి రభాగ్యుని నిండుగాను."[34]

ఇలా ఆసాంతం నవ్వులతో ముంచెత్తుతూ, ఒకే మూసలో నిర్వీర్యమైన పద్ధతిలో వస్తున్న ఆనాటి క్షీణ ప్రబంధాల శైలిని వెటకారం చేసి, తద్వారా కవులు తమ పద్ధతి మార్చుకోవాలని చెప్పకయే చెప్పారు వీరేశలింగం పంతులు.

ఆ విధంగా 19వ శతాబ్దిలో వెలువడిన 'అభాగ్యోపాఖ్యానం' మొట్ట మొదటి వ్యంగ్య కావ్యమై వెలసింది. కందుకూరి వారు ఆ ప్రకారంగా తెలుగు సాహిత్యంలో ఎన్నో ప్రక్రియలతో బాటు వ్యంగ్య కావ్య ప్రక్రియను కూడా ప్రవేశ పెట్టిన ఆద్యులుగా నిలిచారు.

## స్మృతి కావ్యం :

ఇది కూడా ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగు సాహిత్యంలో ప్రవేశించిన ప్రక్రియ. ఆంగ్లంలో ఈ ప్రక్రియను 'ఎలిజీ' అంటారు. ఆత్మీయమైన వ్యక్తి గతించినపుడు, కలిగే వియోగ వేదనను కవితాత్మకంగా ప్రకటించే ప్రక్రియ ఇది. వడ్డాది సుబ్బారాయుడు కవి (వసురాయ కవి) రచించిన 'సతీ స్మృతి' (క్రీ.శ. 1896) తెలుగు సాహిత్యంలో తొలి స్వతంత్ర స్మృతి కావ్యంగా పేర్కొనవచ్చు.

అంతకుముందు వావిలాల వాసుదేవశాస్త్రి 'పిత్రారాధన' (క్రీ.శ. 1877); 'మాతృ స్వరూప స్మృతి' (క్రీ.శ. 1879) వంటి రచనలు చేశారు. వాసుదేవ శాస్త్రి గారి తండ్రి క్రీ.శ. 1897లో పరమపదించారు. శాస్త్రిగారు 1877లో 'పిత్రారాధన' వెలువరించే నాటికి ఆయన తండ్రి జీవించి ఉండడం వలన, అది ప్రశంసా పద్యాల

కృతి అవుతుందే కాని, స్మృతి కావ్యం కాజాలదు. అలాగే శాస్త్రిగారు రచించిన 'మాతృ స్వరూప స్మృతి' తమ మాతృమూర్తిపై రచించిన కావ్యం కాదు. దీనికి 'మాతృ పటము' అన్న నామాంతరం కూడా ఉంది. ఇది ఆంగ్లంలో విలియమ్ కౌపర్ అన్న కవి రచించిన 'ఆన్ రిసీట్ ఆఫ్ మై మదర్స్ పిక్చర్' అన్న పద్య ఖండికకు తెలుగు సేత. కాబట్టి 'మాతృ పటము' స్మృతి కావ్యం అని గట్టిగా చెప్పలేము. అయితే, గియితే అది కౌపర్ రచించిన ఆంగ్ల స్మృతి కావ్యానికి తెలుగు అనువాదం కావచ్చు. ప్రస్తుతానికి ఆ కృతి అలభ్యం కాబట్టి వివరాలు తెలియవు.

కాని వడ్డాది సుబ్బారాయుడు కవి 'సతీస్మృతి' అలా కాదు. ఆయన పత్నీ వియోగం పొందినప్పుడు వేదనతో వ్రాసుకొన్న స్మృతి పద్య సమాహారం ఆ కావ్యం. ఆయన తరువాతి కాలంలో 'సుత స్మృతి' అనే మరో స్మృతి కృతిని కూడా రచించారు.

సుబ్బారాయుడు కవి వ్యక్తిగత జీవితాన్ని గురించి టేకుమళ్ళ కామేశ్వరరావు ఇలా వివరించారు–

"ఆయన కుటుంబ జీవితం దుఃఖ భాజనమయింది పాపం! అనేకసార్లు భార్యావియోగం సంభవించింది. అయిదు కంటే ఎక్కువ వివాహాలు జరిగినట్లుంది. మనస్సు చివరకు రాయే అయిపోయిందేమో పాపం! దానికి తోడు మొదట పుట్టిన కొడుకు పెండ్లయి మరణించేడు పాపం! ఆ వియోగ బాధను పద్యాలలో తెలుపుకొన్నారు"[35]

కాబట్టి తెలుగు సాహిత్యంలో తొలి సారిగా స్మృతి కావ్యాలను రచించిన కవిగా వడ్డాది సుబ్బారాయుడును నిర్ధారించవచ్చు. ఆయన తన భార్యలు పరమపదించినపుడు, ఆ దుర్ఘటన సందర్భాలలో వియోగ బాధను అనుభవించి, ఆవేదనానుభూతులను పద్యాలుగా రచించి, తరువాత వాటినన్నిటినీ కూర్చి 19వ శతాబ్ది చివరి దశకంలో స్మృతి కావ్యంగా వెలువరించారు.

'సతీస్మృతి' కావ్యం మొత్తం నాలుగు భాగాలుగా ఉంది. మొదటి భాగంలో కవి 'సుబ్బలక్ష్మి' అనే తన పెద్ద భార్య మరణించినప్పుడు రచించిన పద్యాలున్నాయి. రెండవ భాగంలో 'విజయలక్ష్మి' అనే భార్య పరమపదించినప్పుడు వ్రాసిన పద్యాలున్నాయి. ఈ భాగంలో ముందు కొన్ని పద్యాలు ఆమె ప్రాణాపాయ స్థితిలో



ఉన్నప్పుడు 'క్షేమారోగ్యము లిచ్చి మద్విజయ లక్ష్మిం బ్రోవు సర్వేశ్వరా!" అన్న మకుటంతో రచించిన పద్యాలతో ప్రారంభించి, తరువాత ఆమె మరణించాక 'క్షేమారోగ్యము లీక మద్విజయలక్ష్మింగొంటి సర్వేశ్వరా!" అన్న మకుటంతో గల పద్యంతో ముగించారు. మూడవ భాగానికి ఆయన 'ప్రేయసీ రత్న తారావళి' అని నామకరణం చేశారు. ఈ భాగంలో ఆయన మూడవ భార్య 'రత్నాంబ' మరణించినప్పుడు రచించిన పద్యాలను పొందుపరిచారు.

ఈ పద్యాలలో ఆయన 'ప్రేయసీ రత్నమా!' అన్న మకుటాన్ని ప్రయోగించారు. ఇక నాలుగవ భాగం ఆయన నాలుగవ భార్య 'అన్నపూర్ణ' చనిపోయినప్పుడు రచించినది. కవి ఈ భాగాన్ని ముందుగా తాను రచించిన, 'భామినీ విలాసము' అనే జగన్నాథ పండితరాయల కృతి కి అనువాద గ్రంథమైన 'కరుణ విలాసము' అనే భాగానికి అనుబంధంగా ముద్రించారు. దీనికి కారణం ఆ రెంటిలో గల విషయసారూప్యమే. 'భామినీ విలాసము' మూలంలో జగన్నాథ పండిత రాయలు కరుణ విలాసం భాగంలో తన ధర్మపత్ని మరణానికి చింతిస్తూ వ్రాసిన శ్లోకాలున్నాయి. దాని అనువాద గ్రంథంలో అనుబంధంగా చేర్చిన ఈ 'సతీస్మృతి' (నాలుగవభాగం) లో మళ్ళీ నాలుగు భాగాలున్నాయి. 'ప్రథమ విలాపము', 'ద్వితీయ విలాపము', 'తృతీయ విలాపము', 'తురీయ విలాపము' అని వీటికి పేర్లు పెట్టారు కవి. వీటన్నింటిలో కూడా 'అన్నపూర్ణా సతీ' అన్న మకుటాన్ని పాటించారు కవి. నాలుగవ భార్య స్మృతితో రచించిన ఈ నాలుగవ భాగమే ఒక ప్రత్యేక స్మృతి కావ్యంగా నిలబడగలదు. అయితే తరువాత వసురాయ కవి తన ప్రథమ, ద్వితీయ, తృతీయ కళత్రాల స్మృతి పద్యాలతో ఈ నాలుగవ భాగాన్ని చేర్చి 'సతీ స్మృతి' కావ్యంగా రూపుదిద్దారు. ఈ కావ్యంలోని పద్యాలను గాఢమైన భావాలతో నింపి దీనిని కవి ఒక చక్కని స్మృతి కావ్యంగా రూపు దిద్దారు.

*"చంద్ర కళ యస్తమింప నక్షత్ర సమితి*
*కతన గగనంబు రూపింత గానబడెడు –*
*దేవి ! నీ వస్తమింప నే దిక్కులేమి*
*దివ్వె మలిగిన గతి నిల్లు తిమిరమయ్యె!"*

"నాకు సతివయి, కను సన్నలలనె యిష్ట
మెరిగి చరియింప, నేమి గౌరంత లేని
దాన వనుకొనుచుండ, బ్రధానమైన
యాయువే నీకు గొదవయ్యెనా? మృగాక్షి"[36]

వంటి పద్యాలు అందుకు ఉదాహరణలు. తన పత్ని నాటిన తీయ మామిడి మొక్కకు కన్నీరే గాని స్వచ్ఛమైన నీరెలా పోయను? – అంటూ వాపోతూ కవి రచించిన ఈ పద్యం హృదయ విదారకం –

"ఘనమని పుట్టినిల్లు కలగంపుడి పోలవరంబు నుండి టెం
కను గొని వచ్చి నాటితివిగా తియమామిడి మొక్క; నేనెటు
ల్పొనరుతు మాతృహీన శిశు పోషణ మక్కట! దీని కింక వె
చ్చని కను నీరె గాక, సఖి! స్వాదు తరాచ్ఛ పయస్సు వచ్చునే?"[37]

మరొక కరుణ రసాత్మకమైన పద్యాన్ని చూడండి –

"తొండ చూలాలొండు దువ్వి లోతుగ నేల
దావ కాళ్ళను నిల్చు తలము వాడు
బలె బంగటించి యా పల్లాన నెన్నేని
గుప్ప వోసిన యట్లు గ్రుడ్లు వెట్టి,
కడుపు దోర్వేలాడ గడు సొమ్మసిలి కాన్పు
బడలిక నిముస మక్కడన యుండ –
దాని యాయువు సెల్లె గానోపు, నాడట్లు
వాయసుండొకడట్టె వచ్చి దాని

ముక్కునను జిక్క బట్టి కొంపోవ, జూచి
కంట దడి వెట్టి తీ వంత కంటె శోచ్య
ముగను నిన్ను నేడెత్తుక పోయె మిత్తి;
యాసలన్నియు నడుగంటె – హా! లతాంగి!"[38]



కవి తన మూడవ భార్య రత్నాంబ గురించి వ్రాసిన ఒక పద్యంలో ఆమె సాహిత్యాభినివేశం స్పష్టమవుతుంది.

"కవిత జెప్పెడు వేళ గడు దాపున వసించి
యెలమితో వ్రాయు వారెవ్వరిపుడు?
పాఠాంతరంబుగా బద్యద్వయి రచింప
హెచ్చు దగ్గెంచు వారెవ్వరిపుడు?
లలిత మంగళ హారతుల జేయ, వరుసలం
దిచ్చి కోరెడు వార లెవ్వ రిపుడు?
కఠినంబులైన వాక్యముల కర్థము నన్ను
నవ్వుచు నడుగు వారెవ్వరిపుడు?

ద్విపదగా నే నొనర్చు సావిత్రి చరిత
మెపటి దపు డప్పగించు వారెవ్వరిపుడు?
ప్రేయసీ రత్నమా! యొంటరిగ నొనర్చి
నాక పురికేగి, మరల రానైతి విపుడు!" [39]

నాలుగవ భార్య 'అన్నపూర్ణ' మరణించినపుడు ఆయన ఆవేదనను గమనించండి –

"తాళిం గట్టితి హేమలంబిని సముత్కంఠన్ మెడన్; శార్వరిం
బాళిం గట్టితి గోక కొంగునను హేమంబుల్, ప్లవాబ్దంబునన్
శైల ప్రాయ కఠోర చిత్తత బటచ్చున్నాస్య గావించి యి
ల్లాలిం బాడెను బెట్టి కట్టెదనె నిన్? హా! యన్నపూర్ణా సతీ!"[40]

నిరంతరం సారస్వతారాధనలో గడిపే మహాకవి వడ్డాది సుబ్బారాయుడు. కవికి నాలుగు మార్లు భార్యావియోగం సంభవించడం దుర్భరం. నిజంగా పగవానికి కూడా కలగగూడని కష్టం. ఆయన నాలుగవ భార్య చనిపోయినప్పుడు – "నీవు రేపవలు కవితాలతాంగితో జతగూడి సుఖ, కీర్తులను పొందగా చూచి సహించలేక నీ భార్యలు నిన్నెడబాసిరి" అని ఆయన మిత్రుడొకడు ఈ క్రింది పద్యంలో చమత్కారానికి వ్రాసినా, అది సత్యమేనేమో అనిపించకమానదు.

*"వర కవితాలతాంగి ననవద్యమతిన్ గవగూడి, రేవగల్*
*చిరతర సౌఖ్య కీర్తులను జెందుచు దమ్మొక రీతి జూడ, నీ*
*సురుచిర గాత్ర లందరది చూచి సహింపగ లేక గాదె దు*
*ర్ధర తర చింత తోడ నెడబాసిరి మిమ్ముల నిట్లు మిత్రమా!*[41]

తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగంలో వెలువడిన అనేక స్మృతి కావ్యాలకు ఆద్యమై నిలిచిన 'సతీ స్మృతి' కావ్యం, వాసిలో గూడ అగ్రగణ్యమై నిలిచిందని చెప్పక తప్పదు.

## జీవిత చరిత్ర, స్వీయ చరిత్రలు :

19వ శతాబ్దికి పూర్వం తెలుగు సాహిత్యంలో 'కేయూరబాహు చరిత్రము', 'సారంగధర చరిత్రము', 'మైరావణ చరిత్ర', 'మల్హణ చరిత్ర', 'తోభ్య చరిత్రము' వంటి కావ్యాలు ఉన్నా, అవి కావ్య కథాంశాన్ని బట్టి నాయక పాత్రకు చెందిన చరిత్ర భాగాన్ని కొంత వరకు కల్పనలతో రచించినవే తప్ప చారిత్రక దృక్పథంతో వ్రాసిన సమగ్ర చరిత్రలు కావు. 19వ శతాబ్దిలో మొట్ట మొదటి సారిగా ఇలాంటి ప్రయత్నం చేసిన కవి – కర్నూలు నరహరి రాజామణి శెట్టి. ఈయన తన తండ్రి గారైన 'నరహరి గోపాల కృష్ణమ చెట్టి' జీవిత చరిత్రను ఒక శతక కావ్యంలో పొందుపరిచారు. గోపాలకృష్ణమ చెట్టి సుప్రసిద్ధ రచయిత. ఈయన 'శ్రీరంగరాజు చరిత్ర' అనే నవలను రచించాడు. తెలుగు సాహిత్యంలో ఇదే మొట్టమొదటి నవలగా (1872) చాలా మంది పండితులు భావిస్తున్నారు. అయితే కందుకూరి వీరేశలింగం పంతులు రచించిన 'రాజశేఖర చరిత్ర' (1878) ఆ తరువాత రచింపబడినా, కథా సంవిధానంలో, శైలిలో మెరుగైనది కాబట్టి, దానిని తొలి నవలగా మరికొందరు పండితులు అభిప్రాయపడుతున్నారు. కర్నూలు జిల్లా డిప్యూటీ కలెక్టరుగా పని చేసిన గోపాలకృష్ణమ చెట్టి చరిత్రను స్వయంగా ఆయన కుమారుడే రచించడం వల్ల ఇది చారిత్రక వాస్తవాలతో సమగ్రంగా రూపొంది, ఆధునిక పద్ధతిలో రచింపబడిన తొలి జీవిత చరిత్రగా గుర్తింపబడింది. అంతే కాకుండా ఇది శతక రూపంలో వెలువడ్డ తొలి జీవిత చరిత్ర అని పండితుల అభిప్రాయం.

*"సకల భూపాల రింఛోళ చక్రవర్తి*
*క్షీర సత్కీర్తి గోపాల కృష్ణమూర్తి"*



అన్నమకుటంతో వ్రాయబడ్డ ఈ 'గోపాల కృష్ణమూర్తి శతకం'లో కవి నరహరి రాజా మణిశెట్టి, ఆనాటి ప్రభుత్వోద్యోగుల ఔద్యోగిక పరిస్థితులు, వారితో ప్రజలకున్న సంబంధాలు, ప్రజలకు వారి పట్ల గల అభిప్రాయాలు, కర్నూలు మండల విశేషాలు మొదలైన అనేక విషయాలను సందర్భానుగుణంగా చాలా ఆసక్తికరంగా చిత్రించారు. క్రీ.శ. 1889లో రచింపబడిన ఈ జీవిత చరిత్ర ఆ తరువాత వచ్చిన అనేక పద్య, గద్య జీవిత చరిత్రలకు మార్గదర్శకంగా నిలిచింది. విజయనగరం ఆనంద గజపతిరాజు ఆస్థానంలో ఉన్న ఈ విద్వత్కవి క్రీ.శ. 1896లో ఆనంద గజపతి తండ్రి గారైన విజయరామ గజపతి మహారాజు జీవిత చరిత్రను 'విజయ రామ గజపతీంద్ర చరిత్రము'గా పద్యాలలోనే రచించడం జరిగింది. ఆ విధంగా తొలితరం జీవిత చరిత్రలను 19వ శతాబ్దిలో రచించిన ఘనత కర్నూలు నరహరి రాజామణి శెట్టికి దక్కింది.

'జీవిత చరిత్ర' ప్రక్రియతో పాటు 'స్వీయ చరిత్ర' ప్రక్రియ కూడా తొలిసారిగా 19వ శతాబ్దిలోనే రూపు దిద్దుకొంది. 19వ శతాబ్దిలో విద్వత్కవిగా, బహుగ్రంథకర్తగా ప్రసిద్ధి చెందిన మండపాక పార్వతీశ్వరశాస్త్రి కవి తన స్వీయ చరిత్రను 'ఆత్మ సపర్యాచర్య' (1884) పేరిట పద్య రూపంలో రచించారు. ఇదే తొలి స్వీయ చరిత్రగా పండితులు అభిప్రాయ పడుతున్నారు. 20వ శతాబ్ది ఆరంభంలో చెళ్ళ పిళ్ళ వేంకటశాస్త్రి రచించిన 'జాతక చర్య', ఆ తరువాత జాషువా రచించిన 'నాకథ' వంటి పద్య రూపంలో ఉన్న స్వీయ చరిత్రలకు మండపాక వారి స్వీయ చరిత్ర మార్గదర్శకంగా నిలిచిందని చెప్పవచ్చు. ముఖ్యంగా చెళ్ళపిళ్ళ వారు తన స్వీయ చరిత్రకు 'జాతక చర్య' అని నామకరణం చేసి, మకుటం ఉంచడంలో కూడా మండపాక పార్వతీశ్వర కవిని అనుసరించారని పేర్కొనవచ్చు. ఆ విధంగా తెలుగు సాహిత్యంలో తొలి 'స్వీయ చరిత్ర'ను రచించిన కవిగా మండపాక పార్వతీశ్వర కవి మన్ననల నందుకొన్నారు. కవి గారి స్వీయ చరిత్ర 'ఆత్మ సపర్యా చర్య'లోని ఒక పద్యాన్ని మచ్చుకి ఉదాహరిస్తున్నాను. కవి 1865లో వావిలి వలస వచ్చి జమీందారగు ఇనుగంటి సీతారామస్వామి దర్శనానికి వెళ్ళినప్పుడు 'వసు చరిత్ర'లోని ఒక పద్యాన్నిచ్చి సంస్కృతంలోకి అనువదించుమని కోరిన సందర్భాన్ని వివరించే పద్యమిది.

"సుత నిరామయతకై సూర్యనారాయణ
స్వామిని గని హర్షవల్లి నుండి
వావిలి వలసకు వచ్చి యిన్గంటి సీ
తా రామ విభుగాంచి తత్ప్రతిజ్ఞ
నణచి యా 'తన్వంగి' యనెడు వసు చరిత్ర
లోని పద్యమునకు శ్లోకరచన
ప్రతిన నిన్నూట యేబది యారు పద్యముల్
గలుగు షోడశ విధ కంద రచన

తత్కవుల కన్న నెక్కుడు ధార గల్గి
వింత యగునట్టి యాశు కవిత్వ రచన
నాకు గల్గించి చెలగించినాడ వౌర
హరి హరేశ్వర దేవ! మహానుభావ!"[42]

మండపాక వారు ఈ స్వీయ చరిత్ర కావ్యంలో 'హరిహరేశ్వర దేవ! మహానుభావ!' అన్న మకుటాన్ని పాటించడం విశేషం. అందుకే, 'ఆత్మ సపర్యాచర్య' లేక 'ఆత్మ చర్య' అన్న పేర్లతో పిలువబడిన ఈ స్వీయ చరిత్రకు 'హరి హరేశ్వర శతకము' అన్న నామాంతరం కూడా ఉంది. 19వ శతాబ్దిలో ఆశుకవిగా, శతాధిక గ్రంథకర్తగా ప్రసిద్ధుడైన మండపాక పార్వతీశ్వర కవి (1833–1897) తెలుగు సాహిత్యంలో ప్రప్రథమ స్వీయ చరిత్ర కారునిగా గుర్తింపు నొందారు. ఆపైన కందుకూరి వారు వచనంలో తొలి స్వీయ చరిత్రను వెలయించేందుకు స్ఫూర్తిగా నిలిచారు.

### యాత్రాచరిత్ర :

19వ శతాబ్దిలో ప్రారంభమైన మరొక మహత్తరమైన ప్రక్రియ 'యాత్రాచరిత్ర'. ఆంగ్ల సాహిత్యంలో ఉన్న 'ట్రావల్ – లోర్' అన్న దానికి సాదృశ్యమైన ప్రక్రియ ఇది. అన్ని ప్రక్రియల లాగే ఈ ప్రక్రియ కూడా 19వ శతాబ్దిలో ముందుగా పద్యరూపంలో రూపుదిద్దుకొంది. 'చెన్నపురీ విలాసము' పేరిట క్రీ.శ. 1860లో ప్రబంధాన్ని రచించి ఈ ప్రక్రియకు శ్రీకారం చుట్టిన కవి మతుకుమల్లి నృసింహశాస్త్రి. తోట వల్లూరు జమీందారైన రాజా బొమ్మదేవర నాగన్న నాయనితో కలిసి ఈ కావ్య కర్త ఆనాటి చెన్న పట్టణాన్ని దర్శించినపుడు చూసిన వింతలు విశేషాలన్నిటినీ ఈ యాత్రా చరిత్ర కావ్యంలో కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి రక్తి కట్టించారు. క్రీ.శ. 1863లోనే ఈ ప్రబంధం ప్రథమ ముద్రణ జరిగింది. ఆ పైన తెలుగు సాహిత్యంలో వెలువడ్డ అనేకమైన గద్యాత్మక, పద్యాత్మక యాత్రాచరిత్రలకు ఇది ఆద్యమై మన్నన లందుకొంది అని చెప్పవచ్చు.

'చెన్నపురీ విలాసము' కావ్యాన్ని కవి మొత్తం ఆరు పద్ధతులుగా విభజించారు. స్వరూప పద్ధతి, పూర్వ పద్ధతి, దక్షిణ పద్ధతి, పశ్చిమ పద్ధతి, ఉత్తర పద్ధతి, అంతరాళ పద్ధతి అనే ఈ ఆరు పద్ధతులలో అంతర్భాగాలుగా వీధీ ప్రకరణము, సౌధ ప్రకరణము, పౌర ప్రకరణము, వీర భట ప్రకరణము, ఉపవన ప్రకరణము, సముద్ర ప్రకరణము, నౌకా ప్రకరణము, సేతు ప్రకరణము, సభా ప్రకరణము, పుస్తక సౌధ ప్రకరణము, తంత్రీ వార్తా ప్రకరణము, ధూమ శకట ప్రకరణము, ముద్రాక్షర శాలా ప్రకరణము, ఫోటోగ్రాఫీ ప్రకరణము, ఇలెక్ట్రో గేల్వానిక్మిషన్ ప్రకరణము, టంకశాలా ప్రకరణము, వేశ్యా ప్రకరణము, వాణిజ్యశాలా ప్రకరణము మొదలైన 64 ప్రకరణాలున్నాయి. ఈ ప్రకరణాలన్నీ చదివితే క్రీ.శ. 1860 నాటి చెన్నై నగరంలోని స్థితి గతులు మనకు చక్కగా అవగతమవుతాయి.

మహిమ ప్రకరణములో, ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని అన్ని జిల్లాలను పేర్కొంటూ, ఆ జిల్లాలన్నిటికీ రాజధానిగా వెలసిన చెన్నపురి ప్రాభవాన్ని వర్ణించిన తీరు ప్రశంసనీయం.

"కుంభకోణము, కల్లికోట, కర్నోలు, బ
ళ్ళారి, చిత్తూరు, సేలంబు, కడప,
కబడాల, బందరు, కనరా, మధుర, తిర్న
వల్లియు, తిరిచెనా పల్లి మరియు
కోయముత్తురు, మంజకుప్పంబు, నాగ, చెం
గల్పట్టు, నెల్లూ రనల్ప పటిమ
వరలు గుంటూరు, బందరును, రాజమహేంద్ర
వరము నాగ, విశాఖ పట్టణంబు

నగగ శ్రీకాకుళము, గంజ మనగ బరగు
నిరువదియు రెండు జిల్లాల కిరవు మీరు
రాజ కార్యంబులకు నెల్ల రాజధాని
యా పుర ప్రాభవము భువి నసదృశంబు" [43]

వీర భట ప్రకరణములో, పోలీసుల కవాతులలో తుపాకుల 'చకచ్చక' కదలికలను, ఫైరింగులో 'ఫెళత్ఫెళ' ధ్వనులను వర్ణిస్తూ, రచించిన పద్యాన్ని గమనించండి.

"పటిమ బురోపకంఠతట వాటికల న్వడి బార్లుదీరియు
ద్భట సుభటచ్ఛటాపటల ధాటులు రేపును మాపు బాహు సం
ఘటితములౌ తుపాకుల చకచ్చక లొప్ప గవాతు సేయ ని
ష్కుట కుటజ ప్రతిధ్వనిగ ఘూర్ణిలు ఫైర్ల ఫెళత్ఫెళ ధ్వనుల్"[44]

నౌకా ప్రకరణములో పొగ ఓడలను ఇలా వర్ణించారు కవి.

"సంఘములై పొగ యోడలు
జంఘాలత బరచు నెపుడు జలనిధి వీచీ
సంఘాత విహృతి లీలా
లంఘన కృత్తిమి తిమింగిలంబుల పగిదిన్" [45]

లైబ్రరీని వర్ణిస్తూ పుస్తక సౌధ ప్రకరణములో –

"ఆ పుస్తక కోశము భువి
భూప స్తవనీయ లీల బొలుపగు కాలే
జీ పేర ; నందు లేని మ
హా పుస్తక మభ్ర పుష్పమై తనరారున్"[46]

అని పద్యం చెప్పారు.

ధూమశకట ప్రకరణములో రైలుబండిని వర్ణించిన విధానం ఎంతో రమణీయంగా ఉంది.

"ఘన ఘటా కఠిన ఘుర్ఘుర ఘోర నిర్ఘాత
నిర్ఘోష ఘోషముల్ నింగి ముట్ట –
తతముఖోత్తంభి తోద్దామ ధూమస్తంభ
రంధ్ర నిర్యద్ధూమ రాజి గ్రాల –
క్రమ పరిక్రమ దవక్ర క్రాంత దిక్చక్ర
చక్ర చంక్రమణముల్ చౌకళింప –
ద్రుత జితానిల తార్క్ష్య దుర్నిరీక్ష్యా చింత్య
చిత్రాతి వేగ మచ్చెరువు సేయ –

ధూమ శకట పరంపరతూర్ణ వేగ
దుర్నివారంబులై పర్వు నిర్నిరోధ
వార్షికాంబుద మాలికావళుల మాడ్కి
నుభయ సంధ్యల నగరికి నుత్తరమున

అమరులు మున్ను దివ్య మహిమాతిశయంబున గన్న దేవ యా
నములు దివిన్మనోరయమునం జను గామ చరంబులంచు విం
టిమి – యిపుడింగిలీషులు పటిష్ఠత జేసిన రైలు బండ్లు నే
గు మహీ మనోజవంబును జిగుర్కొనగా బురి నద్భుతంబుగాన్"[47]

దేవతలు మనోవేగంతో చేసే కామ చరాలను గురించి విన్నాం గాని ఇప్పుడు ఇంగ్లీషు వాళ్ళు మనోజవంతో ప్రయాణించే రైలుబండ్లను తయారు చేశారని కవి తన ఆశ్చర్యాన్ని ప్రకటించారు.

'ఫోటోగ్రాఫీ ప్రకరణము' అన్న మరో ప్రకరణంలో కూడా ఇలాంటి భావాన్నే ప్రకటించారు కవి.

"ఛాయాగ్రాహణి యాంజనేయుని తనుచ్ఛాయ న్వడిన్నిల్పి తా
డాయం దీసె ననంగ వింటి మది చూడ న్యంత్ర పేటిన్ ఘన
ప్రాయాదర్శములందు నీడల బొటోగ్రాఫీ క్రియన్నిల్పగా
జేయం జాలిరి యింగిలీషులు పురిం జిత్రాతిచిత్రంబుగన్"[48]

'ఇలక్ట్రో గేల్వానిక్మిషన్ ప్రకరణము'లో మతుకుమల్లి నరసింహకవి 'ఎలక్ట్రిక్ షాక్'ను గురించి వర్ణించి చెప్పిన పద్యాలు మహాద్భుతం.

*"కాయము లోని ప్రాణము పెకల్చు మహాలయ కాల కాల కా*
*లాయ సకాల పాశమున కచ్చుపు నెచ్చెలి సర్వ దేహ భృ*
*త్కాయ నికాయమందు గల ధాతులు పీల్చెడి మారి జిహ్వకుం*
*బాయని తోడు నీడయగు భారపు తంత్రిని ముట్టశక్యమే?*

*కందురీగెల యొక కోటి గరచినట్లు -*
*కూడి వెయి మంద్ర గబ్బలు కుట్టినట్లు -*
*దాక మ్రోచేతికిని దెబ్బ దాకినట్లు -*
*తల్లడిలు ప్రాణములు తంత్రి దాకినంత !"* [49]

19వ శతాబ్ది మధ్యస్థ భాగంలో రచించబడిన ఈ యాత్రాకావ్యంలో కవి ఆనాటికి అత్యాధునిక విషయాలను అత్యద్భుతంగా పద్యాలలో వర్ణించి నవ్యతకే నవ్య భాష్యం చెప్పారు. కావ్యంలో చాలా చోట్ల సందర్భానుసారం ఆంగ్ల శబ్దాలను ప్రయోగించి క్రీ.శ. 1860లోనే భాషాపరమైన నవ్యతను కూడా చూపారు మతుకుమల్లి నరసింహశాస్త్రి కవి.

ఇలా కవిత్వానికి సంబంధించినంతవరకు ఇన్ని రకాల ప్రక్రియలతో బాటు వచన రచనలలో కథానిక, నవల, సాంఘిక వచన నాటకం. విమర్శ, వ్యాసం, కవుల చరిత్ర వంటి అనేక ప్రక్రియలు కూడా 19వ శతాబ్దిలోనే ప్రారంభించబడ్డాయి. అయితే అవి ఈ పరిశోధన పరిధిలోకి రావు గాబట్టి వివరాల్లోకి వెళ్ళడం లేదు గాని, 20వ శతాబ్దిలో ప్రక్రియా బాహుళ్యంతో విస్తరిల్లిన నవ్య కవిత్వంలోని అనేక ప్రక్రియలకు పునాదులు 19వ శతాబ్దిలోనే పడ్డాయన్నది నిర్వివాదాంశమని నొక్కి వక్కాణిస్తున్నాను.



**పాద సూచికలు :**


1. ఆచార్య సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు - పుట. 177
2. తెలుగు అకాడమి తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) - పుట. 620
3. డా. తిరుమల శ్రీనివాసాచార్య : తెలుగులో గేయ నాటికలు - పుట. 88
4. తెలుగు అకాడమి : తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) - పుట. 1197
5. వావిలాల వాసుదేవశాస్త్రి పీఠిక : సీజరు చరిత్రము (మొదటి కూర్పు) - (1876)
6. The Complete works of william shakespeare - Page 594
7. వావిలాల వాసుదేవశాస్త్రి : సీజరు చరిత్రము - పుట. 61
8. The complete works of william shakespeare - Page 599
9. వావిలాల వాసుదేవశాస్త్రి : సీజరు చరిత్రము - పుట. 88
10. 'వివేక వర్ధని' పత్రిక - జూలై 1876 సంచిక
11. వావిలాల వాసుదేవశాస్త్రి : నందక రాజ్యము (నాటకం) - పీఠిక
12. వావిలాల వాసుదేవశాస్త్రి : నందక రాజ్యము (నాటకం) - పీఠిక
13. వావిలాల వాసుదేవశాస్త్రి : నందక రాజ్యము
14. వావిలాల వాసుదేవశాస్త్రి : నందక రాజ్యము
15. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి : ఆంధ్ర రచయితలు - పుట : 96
16. కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు - సంపాదకులు : అక్కిరాజు రమాపతి రావు - పుట. 1

17. కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు – సంపాదకులు : అక్కిరాజు రమాపతి రావు – పుట.5
18. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'మేఘ సందేశము మహా కావ్యమట' వ్యాసం – 'భారతి' 1939 నవంబరు సంచిక
19. విశ్వనాథ సత్యనారాయణ రత్నాపణ సమీక్ష : ఆంధ్ర వార పత్రిక – 1938 జనవరి సంచిక
20. డా. సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు–పుట.167
21. డా. సి. నారాయణరెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు–పుట.165
22. కొక్కొండ వేంకట రత్నం పంతులు – బిల్వేశ్వరీయ ప్రబంధము – పుట : 60
23. కొక్కొండ వేంకట రత్నం పంతులు – బిల్వేశ్వరీయ ప్రబంధము – పుట : 61
24. కొక్కొండ వేంకట రత్నం పంతులు – బిల్వేశ్వరీయ ప్రబంధము – పుట : 62
25. కొక్కొండ వేంకట రత్నం పంతులు – బిల్వేశ్వరీయ ప్రబంధము – పుట : 62
26. కల్లూరి వీరభద్రశాస్త్రి : త్యాగరాజ కీర్తనలు – డా. మంగళంపల్లి బాల మురళీకృష్ణగారి పీఠిక
27. త్యాగరాజు : నౌకా చరిత్రము – 19వ కృతి
28. పురుషోత్తమ చౌధరి రచనలు (సంపుటి 1) – పుటలు : 210, 211.
29. రాయభట్ట వీర రాఘవ రాజకవి రచనలు – పుట. 26
30. తెలుగు సాహిత్య కోశము (ప్రాచీన సాహిత్యము) – తెలుగు అకాడమి ప్రచురణ – పుట. 280
31. డా. వెలుదండ నిత్యానందరావు – తెలుగు సాహిత్యంలో పేరడీ – పుట : 53
32. పిండిప్రోలు లక్ష్మణ కవి : లంకా విజయము (రావణ దమ్మీయము)
33. డా. వెలుదండ నిత్యానందరావు – తెలుగు సాహిత్యంలో పేరడీ – పుట : 67
34. కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు (అభాగ్యోపాఖ్యానం) తెలుగు విశ్వ విద్యాలయ ప్రచురణ – పుటలు 6 నుండి 26
35. టేకుమళ్ళ కామేశ్వరరావు : నా వాఙ్మయ మిత్రులు – పుట. 7
36. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి – పుట.5
37. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి – పుట.7
38. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి – పుట.10
39. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి – పుట.23
40. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి – పుట.28
41. వద్దాది సుబ్బారాయుడు – సతీ స్మృతి : సత్తిరాజు సీతారామయ్యగారి అవతారిక – పుట :4
42. మండపాక పార్వతీశ్వర కవి : ఆత్మ సపర్యాచర్య
43. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 11
44. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 13
45. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 21
46. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 35
47. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 43
48. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 53
49. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము : పుట. 54



9

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో పాశ్చాత్య ప్రభావ నవ్యత



క్రీ.శ. 1000 నుండి మహమ్మదీయుల పాలన భారత దేశంలో వ్యాప్తి అయిన కాలంలో భారతీయ సమాజంలో వచ్చిన మార్పుల కంటె, క్రీ.శ. 18, 19వ శతాబ్దులలో పాశ్చాత్య దేశాల పాలన ప్రారంభమయ్యాక వచ్చిన మార్పులు ప్రత్యేకమైనవి, గణనీయమైనవి. ముఖ్యంగా 19వ శతాబ్దిలో బ్రిటిష్ పాలన సుస్థిరమయ్యాక, మిగతా భారత ప్రాంతాలలాగే, ఆంధ్ర దేశంలో కూడా పెనుమార్పులు సంభవించాయి. ఆధునిక విద్య సాంకేతిక ప్రగతి, పత్రికల ద్వారా విస్తృతమయిన విశ్వ సమాచార పరిజ్ఞానం, మూఢాచారాలపై సదవగాహన, పునర్నిర్వచించబడిన మానవీయ సంబంధాలతో కూడుకొన్న ఈ మార్పులు ఆంధ్రదేశంలోని సామాజిక పరిస్థితులను పూర్తిగా మార్చి వేసాయి. ఈ విషయాలన్నీ '19వ శతాబ్దిలో సాంఘిక, రాజకీయ పరిస్థితులు' అన్న అధ్యాయంలో వివృతమైనాయి. ఆ పరిస్థితులు మన తెలుగు కవిత్వంపై ఎలాంటి ప్రభావం చూపాయో, 19వ శతాబ్ది తెలుగు కవిత్వం పాశ్చాత్య ప్రభావ నవ్యతను ఎలా సంతరించుకొందో ఈ అధ్యాయంలో చర్చిద్దాం. ఈ నవ్యత ప్రధానంగా మూడు కోణాలలో ప్రసరించిందని చెప్పవచ్చు.

1. పాశ్చాత్య సాహిత్య, సాంస్కృతిక ప్రభావం
2. పాశ్చాత్య రాజకీయ ప్రభావం
3. పాశ్చాత్య మత ప్రభావం

ఈ మూడు ప్రధానమైన ప్రభావాలు 19వ శతాబ్ది తెలుగు కవిత్వంపై ఎలా పని చేసాయో, ఒక్కొక్క దానిని గూర్చి వివరంగా ఇప్పుడు పరిశీలిద్దాం.



### 1. పాశ్చాత్య సాహిత్య, సాంస్కృతిక ప్రభావం:

క్రీ.శ. 1857లో భారతదేశంలో విశ్వ విద్యాలయాల స్థాపన జరిగాక, భారత దేశంలోని అన్ని ప్రధాన ప్రాంతాలలాగే ఆంధ్ర దేశంలో కూడా ఆధునిక విద్యాభ్యాసం విస్తృతమై తెలుగు వారికి పాశ్చాత్య గ్రంథాలతో పరిచయం ఏర్పడింది. ముఖ్యంగా తెలుగు కవులు, మేధావులు చాలా మంది ఆంగ్ల సాహిత్య గ్రంథాలను, ఆంగ్లేయుల సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను అధ్యయనం చేయడం ప్రారంభించారు. ఆంగ్ల సాహిత్యంలోని క్లుప్తత, విషయ గాఢత, నవ్య ప్రక్రియలు, ఆధునిక సామాజిక పరిశీలన వంటి అంశాలు, ఆధునిక విద్యార్హతలు కలిగిన తెలుగు కవులను విశేషంగా ఆకర్షించాయి. వాటితో స్ఫూర్తినొందిన ఆనాటి తెలుగు కవులు నవ్య మార్గంలో రచనలు చేయడానికి ఉపక్రమించారు. ముఖ్యంగా ఆంగ్లేయుల సాహిత్యాన్ని, సంస్కృతిని తెలుగు పాఠకులకు పరిచయం చేయడానికి, ముందుగా వారు ఆంగ్ల కావ్యాల అనువాదంపై దృష్టి నిలిపారు. అంతవరకు తెలుగు కవులు అనువాదమంటే ప్రధానంగా సంస్కృతం నుండో లేక ఇతర దేశీయ భాషలనుండో చేసేవారు. కాని, 19వ శతాబ్దిలోనే మొదటిసారిగా తెలుగు కవులు ఒక విదేశీ భాష నుండి అనువాద ప్రక్రియకు పూనుకొన్నారన్నది గమనార్హం.

క్రీ.శ. 1874లో వావిలాల వాసుదేవశాస్త్రి వెలువరించిన 'సీజరు చరిత్రము' అన్న తొలి అనువాద నాటకం, ఆయనే క్రీ.శ. 1879లో రచించిన 'మాతృ స్వరూప స్మృతి' అన్న తొలి అనువాద స్మృతి కవిత, క్రీ.శ. 1884లో మండపాక పార్వతీశ్వర శాస్త్రి రచించిన 'ఆత్మ చర్య' అన్న తొలి స్వీయ చరిత్ర, క్రీ.శ. 1892లో ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మ 'ఆంధ్ర పద్యావళి' పేరిట విరచించిన తొట్ట తొలి ఖండ కావ్యాలు వంటి రచనలన్నీ ఆంగ్ల సాహిత్య ప్రభావంతో రూపొందినవే. వీటి గురించి 'ప్రక్రియా పరమైన నవ్యత' అన్న అధ్యాయంలో వివరించాను. కాబట్టి చర్విత చర్వణంగా మళ్ళీ స్పృశించవలసిన పని లేదు.

19వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఆధునిక విద్యావంతులైన తెలుగు కవులను 'షేక్స్పియరు', 'టెన్నిసను', 'గోల్డుస్మితు', 'షెరిడను', 'కౌపరు' వంటి ఆంగ్ల కవులు ఎంతో ప్రభావితం చేసారు. కందుకూరి వీరేశలింగం పంతులు, వావిలాల వాసుదేవశాస్త్రి, గోపిశెట్టి రామచంద్రరావు వంటి చాలా మంది కవులు పై ఆంగ్ల

కవుల రచనలను తెలుగులోకి అనువదించారు. ఈ ఆంగ్ల సాహిత్య గ్రంథాల ఆంధ్రీకరణంలో కూడా అగ్రతాంబూలం కందుకూరి వీరేశలింగం పంతులు గారికే దక్కింది. వావిలాల వాసుదేవశాస్త్రి 'షేక్స్పియరు' రచించిన 'జూలియస్ సీజరు' నాటకాన్ని 'సీజరు చరిత్రము' పేరిట క్రీ.శ. 1874లోనే రచించినా, క్రీ.శ. 1876లో గాని ముద్రాపణ జరుపలేదు. కందుకూరి వారు క్రీ.శ. 1875లోనే షేక్స్పియరు విరచిత ఆంగ్ల నాటకం 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'ను అదే పేరుతో ద్విపద ఛందస్సులో పద్యనాటకంగా రచించ బూనుకొని, కొంత భాగాన్ని తమ 'వివేక వర్ధని' పత్రికలో ప్రచురించారు కూడా. అయితే వాసుదేవ శాస్త్రి రచించిన 'సీజరు చరిత్రము' పూర్తిగా తేటగీతిలో ఒకే ఛందంలో ఉండడం విమర్శలకు దారి తీయడం వల్ల, తాను కూడా ద్విపదలో ఒకే ఛందంలో రచన చేస్తుండడం ఆయనకు రుచించలేదు. అందుకే దానిని మధ్యలోనే వదలి వేసారు. ఇదే నాటకాన్ని ఆయన తరువాత (క్రీ.శ. 1880లో) 'చమత్కార రత్నావళి' పేర ఒక గద్య నాటకంగా రూపొందించడం ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది.

పంతులుగారు ఇలాగే 1880లోనే షేక్స్పియరు కవి రచించిన 'మర్చంట్ ఆఫ్ వినీస్' నాటకాన్ని కూడా 'వినీసు వర్తక చరిత్రము' పేర రెండంకాల వరకు ద్విపదలో రచించి పూర్తి చేయకుండా వదలిపెట్టారు. అదే సమయంలో మరో కవి గురజాడ శ్రీరామమూర్తి ఇదే నాటకాన్ని 'వెనీసు వణిజ నాటకము' పేర గద్య, పద్యాత్మకంగా రచించారు. ఆ తరువాత వీరేశలింగం పంతులు ఆంగ్ల నాటకాలను గద్యంలోనే అనువదిస్తే నయమని నిర్ణయించుకొన్నారని తెలుస్తోంది.

అయితే ఆయన తనకు బాగా నచ్చిన రెండు ఆంగ్ల పద్య కావ్యాలను మాత్రం తెలుగు పద్య కావ్యాలుగానే అనువదించారు. మొదటిది – 'జాన్ గిల్పిన్', రెండవది – 'పథిక విలాసము'.

విలియం కౌపరు కవి ఆంగ్లంలో రచించిన "The diverting history of John Gilpin' అన్న హాస్య కావ్యాన్ని కందుకూరి వారు 'జాన్ గిల్పిన్' పేర పూర్తిగా తేటగీతులలో రచించారు. కౌపరు రచన ఆంగ్లంలో Ballod form లో అంటే గేయాత్మక పద్ధతిలో ఉండడం వలన, వీరేశలింగం ఆ పద్ధతికి దగ్గరగా ఉండే తేటగీతి ఛందస్సును స్వీకరించి ఉంటారు. కొంత వరకు వావిలాల వాసుదేవ శాస్త్రి ప్రభావం కూడా పని చేసి ఉండవచ్చు.



వీరేశలింగం పంతులు తమ స్వీయ చరిత్రలో "రాజశేఖర చరిత్రమునకు ముందు కౌపరనెడి యింగ్లీషు కవీశ్వరుడు రచించిన జాన్ గిల్పినను పుస్తకమును తెలుగులో పద్యములతో చేసితిని"[1] అని తెలియజెప్పారు. రాజశేఖర చరిత్ర రచన క్రీ.శ. 1878 నుండి జరిగింది. అంతకు ముందు (అంటే, 1878కి ముందే) 'జాన్ గిల్పిన్' పద్య కావ్యాన్ని ఆయన రచించారని స్పష్టమవుతోంది. ఈ విషయాన్నే ఉటంకిస్తూ డా. అక్కిరాజు రమాపతిరావు " ఆంగ్ల కావ్యముల ననుసరించి తెలుగు కావ్యములుగా వెలసిన వానిలో పంతులుగారు రచించిన నీ జాన్ గిల్పిన్ మొట్ట మొదటిది. అనగా నాంగ్ల కావ్యములను తెలుగున ననుసరించి పద్య కావ్యములుగా ననువదించిన వారిలో పంతులుగారే ప్రథములని యేర్పడుచున్నది."[2] అని తెలియజేసారు. ఆవిధంగా పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో, 19వ శతాబ్దిలో తెలుగు సాహిత్యానికి కందుకూరి వారి 'జాన్ గిల్పిన్' కావ్యం ఒక విశిష్టమైన నవ్యతను ప్రసాదించింది.

ఈ హాస్యకృతి ఇతివృత్తం ఇలా ఉంది – జాన్ గిల్పిన్ తన భార్య కోరిక మేరకు వేరే గ్రామంలో వివాహ వార్షికోత్సవం జరుపుకోడానికి అంగీకరిస్తాడు. జాన్ తప్ప మిగతా కుటుంబమంతా బండిలో బయలు దేరుతుంది. జాన్ మాత్రం తన స్నేహితుని వద్ద అరువు తెచ్చుకొన్న గుర్రంపై ప్రయాణం అవుతాడు. వార్షికోత్సవంలో త్రాగేందుకు రెండు సారాయి బుడ్లను కూడా తీసుకొని వెళుతాడు. అయితే ఆ గుర్రం అతివేగంగా పరిగెత్తడం ప్రారంభించి, చూసే వాళ్ళకు జాన్, గుర్రపు స్వారీ పందెంలో పాల్గొంటున్నాడన్న భ్రమను కలుగజేస్తుంది. తన గమ్య స్థానంలో, అప్పటికే చేరుకొన్న భార్య, ఇతర కుటుంబ సభ్యులు చూస్తుండగానే, గుర్రం ఆగకుండా ఇంకా పరుగులు తీస్తూనే ఉంటుంది. ఆ గ్రామాన్ని దాటి, ఆ గుర్రం వెళ్ళి తన యజమాని ఇంటి ముందు ఆగుతుంది. జరిగిన దానికి జాన్ గిల్పిన్ మింగలేక కక్కలేక, తిరిగి అదిలించి వెనుకకు తిప్పగానే, మళ్ళీ అదే వేగంతో పరిగెత్తుతూ, అందరూ చూస్తుండగానే మళ్ళీ గమ్యస్థానాన్ని దాటి ముందుకు సాగిపోతుంది. పరిస్థితిని అర్థం చేసుకొన్న జాన్ భార్య, ఒక కుర్రవాణ్ణి, తన భర్తకు సాయం చేయుమని బండిలో పంపుతుంది. ఆ కుర్రవాడు జాన్ ఎక్కిన గుర్రం వెనుక వెంటాడుతుంటే చూసే జనులు జాన్‌ను దొంగగా భావిస్తారు. మరో ఆరుగురు

ఆశ్వికులు "దొంగ దొంగా!" అంటూ అరుస్తూ గిల్పిన్‌ను పట్టుకోడానికి వెంటబడుతారు. మధ్యలో వేగానికి సారాయి బుడ్లు పగిలి, సారా అంతా దారిలో కాలువ కట్టుతుంది. గుర్రం ఎవరికీ అందకుండా పరిగెత్తి, చివరికి జాన్ గిల్పిన్ బయలు దేరిన స్థలంలోనే వచ్చి ఆగుతుంది. ఇదీ కథ.

కందుకూరి వారు హాస్యప్రియులు. ఆయన రచించిన 'సరస్వతీ నారద విలాపము', 'అభాగ్యోపాఖ్యానము'లలో ఆయన పండించిన హాస్య వ్యంగ్య వైభవాలను గురించి ఇంతకు ముందు అధ్యాయాలలో చర్చించడం జరిగింది. సహజంగానే కౌపరు రచించిన కావ్యంలోని హాస్యం ఆయనను ఆకర్షించి ఉంటుంది. ఆ హాస్యాన్ని, ఆంగ్లేయుల సంస్కృతిని కూడా తెలియపరిచే లాగా తెలుగు ప్రజలకు అందించాలని ఆయన ఆశించారు. వేగంగా పరిగెత్తుతున్న గుర్రంపై నున్న జాన్ పరిస్థితిని కందుకూరి వారు వర్ణించిన తీరు చూడండి –

*"పగ్గమును, గళ్ళెమును గల్గి పనికి రాక*
*యల్ల దాటులె వడి బరుగయ్యె గాన*
*తిన్నగా గూరుచుండ లేకున్న వాడు*
*గాన, దానిపై నడ్డము గాగ వంగి*
*రెండు చేతులతో నేక రీతిగాను*
*బలము కొలదిని జూలును బట్టుకొనియె –*
*తొల్లి యెన్నడు నా రీతి దురగ మద్ది*
*యూది పట్టుకో బడ్డది కాదు గాన*
*దనదు వీపుపై నెద్ది యెక్కెనొ యటంచు*
*జడిసి మరి మరి యద్భుత పడుచునుండె*
*దూరముగ బోయె గిల్పిను, దూరముగను*
*బోయె జుట్టును, టోపియు బోడి తలగ;*
*నతడు బయలుదేరెడి యప్పు డాత్మ యందు*
*నింత పని సంభవించు నం చెరుగడయ్యె!*
*గాలి వీవంగ జొచ్చెను, గదల దొడగె*
*నంగియును బెద్ద ధ్వజ పట మట్లు మిగుల;*
*కొక్కెములును, గుండీలును గూడ నూడి*
*తుదకు బైనుండి యంగియు దొలగిపోయె !*
*-----------------------------------------*
*-----------------------------------------*
*కుక్కలరచెను, వీధిలో గుర్రవాండ్రు*
*పెద్ద కేకలు వైచిరి, పెద్ద వారు*
*తమ గవాక్షములను జేరి తగిన యట్టు*
*లయ్యో నంచును గట్టిగా నరచి రకట!"* [3]

అయితే, పంతులుగారు ఈ కృతిలో ఆంగ్ల సమాజాన్ని, సంస్కృతిని, వ్యక్తులు, ప్రదేశాల పేర్లను యథాతథంగా ఉంచి, అనువదించడం వల్ల తెలుగు పాఠకులకు కొన్ని సందర్భాలలో కొత్తగా, వింతగా, కొన్ని కొన్ని చోట్ల కొంత ఎబ్బెట్టుగా కూడా తోస్తుంది. ఈ క్రింది పద్యాన్ని చూడండి.

*"మనదు పెండిలి నడచిన దినము రేపు;*
*రెండు గుర్రాల బూన్చిన బండినెక్కి*
*వేగ 'నెడ్మాంటను' న నుండు 'బెల్లు'నకును*
*నందరము గూడి పోవుద మందు కొరకు"* [4]

ఇందులో "మనదు పెండిలి నడచిన దినము రేపు" అనడం మన తెలుగు నుడికారంలా లేక, ఎబ్బెట్టుగా ఉంది. 'మన వివాహ వార్షిక పర్వదినము రేపు" అని దాని అర్థం. అలాగే 'ఎడ్మాంటను', 'బెల్లు' అన్న పదాలను మార్పు చేయకుండా అలాగే వాడారు. ఇంకా, పాశ్చాత్య సంస్కృతిలో ఉన్న 'ముద్దు పెట్టుకోడం', 'విగ్గు ధరించడం' వంటి విషయాలను యథాతథంగా అనువదించారాయన. 'విగ్గు'ను 'కృతక శిఖ', 'కల్ల జుట్టు', 'మాయ జుట్టు' అంటూ పేర్కొనడం ఆ సంస్కృతి తెలియని వారికి అయోమయం కలిగిస్తుంది. అయితే కందుకూరి వారు ఉద్దేశ్య పూర్వకంగా ఆంగ్ల సాహిత్యంతోబాటు, ఆంగ్లేయుల సమాజాన్ని గురించి, వారి సంస్కృతిని గురించి కూడా తెలుగు ప్రజలకు తెలియ జెప్పాలని ఇలా అనువదించారని భావించవలసి ఉంటుంది. కాబట్టి ఇదంతా ఆంగ్లేయ సాహిత్య ప్రభావ నవ్యతతో బాటు, సాంస్కృతిక ప్రభావ నవ్యతగా కూడా అంగీకరించక తప్పదు.

ఈ విషయంలో తాను చేసిన ప్రయత్నాన్ని గురించి వీరేశలింగం పంతులు తన మరో కావ్యం 'పథిక విలాసము'లో స్పష్టంగా చెప్పారు. అంతే కాదు – ఒక భాషలోని కావ్యాన్ని మరో భాషలోనికి అనువదించడం చాలా కష్టమైన పని అని కూడా ఆయన పేర్కొన్నారు.

*"హూణ కవుల పోక లొక యింత తెలుపంగ*
*దెలుగు వారి కొరకు దేటగాను*
*'గోల్డు స్మిత్తు' ను కవి కూర్చిన యట్టి యీ*
*'పథిక చరిత' మేను వ్రాసినాడ!*

*ఒక భాషలోని సరసత*
*నొక భాషకు దెచ్చుటెంతయును దుస్సాధ్యం*
*బకటా! నా కది శక్యమె?*
*సకల కవులు నా యశక్తి క్షమియింపదగున్!"*[5]

'పథిక విలాసము' ఆలివర్ గోల్డ్ స్మిత్ అన్న ఆంగ్ల కవి రచించిన 'ది ట్రావెలర్' అన్న ఆంగ్ల కావ్యానికి పంతులుగారి తెలుగు అనువాదం. ఈ కావ్యంలో కవి 'జాన్ గిల్పిన్' కావ్యంలోలా ఒకే ఛందస్సును కాక ఛందో వైవిధ్యాన్ని ప్రదర్శించారు. ఈ కావ్యాన్ని ఆయన క్రీ.శ. 1892లో రచించారు. గోల్డ్‌స్మిత్ తన లోక సంచారానుభవాలను, అనుభూతులను, లోక రీతులను మూలంలో చక్కగా వర్ణించారు. వీరేశలింగం పంతులు పర్వతాలు, నదులు, దేశాల పేర్లను తెలుగులో యథాతథంగా ప్రయోగించారు. ఉదాహరణకు –

*"అదె కుడి వైపున దవ్వుల*
*ముద మొదవగ 'నాల్ప్సు' మిన్ను ముట్టిన చోటన్*
*బొదలెడు 'నిటలీ' దేశం*
*బదిర! వసంతంబు బోలె నతిశయ శోభన్!"*[6]

ఇక్కడ 'ఆల్ప్సు' – యూరపు ఖండం మధ్య నున్న పర్వతాలు; 'ఇటలీ' – యూరపులో ఒక ప్రసిద్ధ దేశం.

ఈ కావ్యంలో చక్కని ప్రకృతి వర్ణనలు, లోక రీతులను తెలియజెప్పే పద్యాలు కూడా ఉన్నాయి.

*"కలకలను నవ్వ నీ భూమి కాంత మీద*
*వింత వలపులు కలయంగ విసరు కొరకు*
*నబ్ధి బొడము గంధవహ విహంగములు*
*చల్లనగు తమ రెక్కల జాచునెపుడు!"*

*"ఘన లోభాత్మకు డొంటిగా దన ధనాగారంబు దర్శించి, యో*
*లిని గూర్చుండి ధనంబు బల్మరును దా లెక్కించి, లెక్కించి, యా*
*ధనముల్ కుప్పలు కుప్పలై కడు బ్రమోదం బియ్య, నుప్పొంగు; ద*
*ద్ధన రాశుల్ మరి చాలవంచు బిదపన్ దా బుచ్చు నిట్టూర్పులన్!"*[7]

19వ శతాబ్దిలో ఇలా తెలుగు సాహిత్యంలో విదేశీ ప్రదేశాల గురించి, పద్ధతుల గురించి తెలియజెప్పడం నవ్యతే కదా! ఆ విధంగా వీరేశలింగం గారిచ్చిన స్ఫూర్తితో చాలా మంది కవులు ఆంగ్ల సాహిత్యం నుండి అపురూపమైన కావ్యాలను తెలుగులో పద్య కావ్యాలుగా రచించి, తెలుగు ప్రజలకందించి, వారి మనోవికాస పరిధిని విశ్వస్థాయికి పెంచారు.

క్రీ.శ. 1894లో శిష్టు జగన్నాథశాస్త్రి కవి 'చిల్లా బంది అను భ్రాతృ సౌహృదము' అనే కావ్యాన్ని, ఆంగ్ల భాషలో 'బైరన్' కవి రచించిన 'ప్రిజనర్ ఆఫ్ చిల్లాన్' అన్న కావ్యానికి అనువాదంగా అందించారు. ఇది ఏకాశ్వాస కావ్యం. 126 పద్యాలతో రూపొందిన ఈ అనువాద కావ్యంలో కవి మూలంలో పేర్లను యథాతథంగా ఉంచారు. అందువల్ల ఈ కవి కూడా కందుకూరి వారి వలె ఆంగ్ల సాహిత్యంతో బాటు ఆ దేశస్థుల సంస్కృతిని కూడా తెలుగు వారికి పరిచయం చేయాలని భావించారని చెప్పవచ్చు. ఈ అనువాదం భావ ప్రధానంగా సాగిందని 'తెలుగు సాహిత్య కోశము'లో పేర్కొనబడింది[8].

ఆంగ్ల కావ్యాలను యథాతథంగా కాక మన సమాజానికి అనుగుణంగా మార్చి అనుసృజన చేసిన కవులు కూడా 19వ శతాబ్దిలో లేకపోలేదు. క్రీ.శ. 1888లో

రాజా పానుగంటి పార్థసారథి రాయణి కవి తన చిన్నారి పొన్నారి చిరుత కూకటి వయసులోనే ఆలివర్ గోల్డ్ స్మిత్ రచించిన ఆంగ్ల కృతి 'వికార్ ఆఫ్ ది వేక్‌ఫీల్డ్' లోని 'ది హెర్మిట్' అన్న భాగాన్ని స్వీకరించి, 'సత్యాకృష్ణ సమాగమము' అన్న ద్విపద కావ్యంగా మలచారు. ఈ కవి పాత్రల పేర్లను, సన్నివేశాలను తెలుగు సమాజానికి అనుగుణంగా మార్పు చేయడం గమనార్హం. అలతి అలతి పలుకులతో నూట నలభై ఆరు పంక్తులలో సాగిన లఘు కృతి అది. ఇదే కవి క్రీ.శ. 1892లో రచించిన మరొక ఆంగ్లానువాద కావ్యం 'కమలా కల్యాణము'. ఇది షేక్స్పియరు మహాకవి విరచిత 'ట్వెల్ఫ్త్ నైట్' నాటకానికి స్వేచ్ఛానువాదం. ఈ అనువాద కృతిని గూర్చి డా. తూమాటి దొణప్ప ఇలా వివరించారు –

"మూలకర్త యభిప్రాయము చెడకుండ, తెలుగు నుడికారమునకును, తెలుగు వాతావరణమునకును దూరము గాకుండ ననువాదము సాగినది. ఇది ప్రతిపద భాషాంతరీకరణము కాదు. ఇది రాజా గారి చిన్న నాటి రచన. బాల్యోత్సాహము ప్రాబల్యము వలన నానా విధ వృత్తముల నిందు బొందు పరచిరి. బాల్యము వలన పాద పూరణ పదములు కొన్ని ప్రవేశించినవని రచయితయే స్వయముగా నంగీకరించిరి. 1892లో పట్ట పరీక్షకు జదువుచు సంధానించిన కృతియిది."[9]

ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనికోద్యమం చేత ప్రభావితుడై ప్రకృతి చిత్రణం ప్రధానంగా రచనలు సాగించిన గోపిశెట్టి రామచంద్రరావు నాయుడు 19వ శతాబ్ది అంత్య కాలంలో 'సుమతి' అనే కావ్యాన్ని వెలయించారు. ఇది లార్డ్ టెన్నిసన్ అనే ఆంగ్ల కవి రచించిన 'డోరా' అన్న కావ్యానికి అనువాదం అనటం కన్న అనుసరణ అనవచ్చు. కవి 'డోరా' అన్న పేరును 'సుమతి'గా మార్చారు. కథనంలో కూడా తెలుగుదనం జొప్పించారు. 138 పద్యాలున్న ఈ కావ్యం అచ్చతెలుగులో రచించబడింది. ఒక ఆంగ్ల కృతిని అచ్చ తెనుగులోకి అనువదించడం ఇదే ప్రథమమేమో! ఈ 'సుమతి' కృతికి, మద్రాసు క్రైస్తవ కళాశాలకు అనుబంధంగా, సమర్థి రంగయ్య శెట్టి పోషణలో సాహిత్య కృషి చేస్తున్న 'ఆంధ్ర భాషాభిరంజనీ సంఘం' వారు కావ్య రచనలో ద్వితీయ బహుమతిని అందజేసారు. ప్రథమ బహుమతిని కట్టమంచి రామలింగారెడ్డి కృతి – 'ముసలమ్మ మరణం' గెలుచుకొంది. వేదం వేంకటరాయశాస్త్రి ఈ పోటీకి న్యాయ నిర్ణేతలలో ఒకరు. గోపిశెట్టి రామచంద్రరావు ఎఫ్.ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడు రచించిన ఈ 'సుమతి' కావ్యాన్ని, రెండు సంవత్సరాల తరువాత అదే ఎఫ్.ఏ. కోర్సుకు పాఠ్యాంశంగా నిర్ణయించబడడం ఆ కావ్య వైశిష్ట్యాన్ని తెలియజేస్తుంది. టెన్నిసన్ కవి రచించిన ఈ 'డోరా' కావ్యాన్నే తరువాతి కాలంలో (క్రీ.శ. 1910) రాయప్రోలు సుబ్బారావు 'అనుమతి' పేరిట తెలుగు చేయడం కూడా గమనార్హం.

19వ శతాబ్ది ముగింపు దశలో జయంతి భావనారాయణ కవి మూడు షేక్స్పియరు నాటకాలను తెలుగు పద్య కావ్యాలుగా రచించారు. క్రీ.శ. 1899లో 'ది వింటర్స్ టేల్' అన్న నాటకాన్ని అనుసరించి 'సుమిత్ర చరిత్ర' అన్న పద్యకావ్యాన్ని రచించారు. అదే సంవత్సరం 'పెరికిల్స్' అన్న నాటకాన్ని 'శ్రీరఘుదేవ రాజీయము' అన్న పద్య కావ్యంగా ఆంధ్రీకరించారు. క్రీ.శ. 1900లో 'సింబలైన్' అన్న మరో నాటకాన్ని 'కళావతి పరిణయము' అన్న పద్య కావ్యంగా మలచారు. గోపిశెట్టి రామచంద్ర రావు నాయుడు లాగే ఈ కవి కూడా ఈ కావ్యాన్ని అచ్చ తెనుగు భాషలో రూపొందించారు. మూడు కావ్యాలలోనూ జయంతి భావ నారాయణకవి, షేక్స్పియరు పెట్టిన పేర్లను అన్నింటిని తెలుగుదనానికి అనుగుణంగా మార్చేసారు. ఉదాహరణకు 'కళావతీ పరిణయము'లో చేసిన మార్పులను చూద్దాం.

కవి 'బ్రిటన్' దేశాన్ని 'ఘూర్జరదేశం'గా మార్చారు. రాజు 'సింబలైన్' పేరును 'రాజవాహనుడు'గా మార్చారు. రాజకుమార్తె 'ఇమోజెన్' పేరును 'కళావతి' గా మార్చడమే కాకుండా కావ్య మకుటాన్ని కూడా ఆమె పేరనే 'కళావతి పరిణయము'గా ఉంచారు. 'ఇటలీ' దేశం బదులు 'మాళవ దేశం' అని పేర్కొన్నారు. ఆ దేశ సేనాని 'లూసియస్' పేరును 'దృఢ సేనుడు'గా మార్చి వేసారు. కళావతి (ఇమోజెన్) వరించిన భర్త పాత్ర నామధేయాన్ని షేక్స్పియర్ 'పోస్థుమస్'గా ఉంచితే, భావనారాయణ కవి దానిని 'విజయసారుడు'గా మలచారు. అంతే కాకుండా నాటక రూపంలో ఉన్న మూల కథను గ్రహించి, దానిని అనుసరించి, సరికొత్త కథా కావ్యంగా రూపుదిద్దారు. మన తెలుగు ప్రబంధ శైలిలో సందర్భాన్ని బట్టి ప్రకృతి వర్ణనలను జోడించారు. అచ్చ తెనుగు బాసలో చేసిన ఈ అందమైన ఆమని వర్ణనను చూడండి –

"పండిన యాకు లూడ్చి, పరువంపు జిగుళ్ళను దాల్చి చెట్లు క
న్పండు వొనర్చె; గానయను పైదలి యామని రేని రాకనున్
నిండు తమిం జెలంగి కడు నేర్పుగ బ్రాదొడవుల్ విదుర్చుచున్
మెండుగ గెంపురాన గల మేనును దా గయిసేసెనోయనన్

బట్టులై పులుకాసి పిట్టలగ్గింప గో
యిల కూత బూర కొమ్ములుగ మొరయ
విరిసిన మోదుగు విరుల దివ్వెలు గ్రాల
గమ్మ పుప్పొడి దుమ్ము గ్రమ్ము కొనగ
జిగురు టాకులు లాలుజెండాల చాలుగ
నెల్ల తుమ్మెద దిమ్ము వెల్లువలుగ
మొగిలి పూరేకులు ముల్కుల గుమిగాగ
వలి గాలి యులువు బేరులుగ వరల

దనకు దగ్గర చుట్టమై తనరు నలరు
విలు దొరను గూడి సంపెగ విరుల తేరి
నెక్కి తెరువర్ల నేచగ నెద దలంచి
దాడి వేం చేసె నామని రేడు హోళి"[10]

ప్రసిద్ధి చెందిన ఆంగ్ల సాహిత్య గ్రంథాన్ని ఇలా మన వారికి మన పద్ధతిలో అందజేయడం కూడా నవ్యతే కదా! చిగురుటాకులను 'లాలు జెండాలు' (ఎర్ర జెండాలు) గా పేర్కొనడం ఆ రోజుల్లో (రష్యను విప్లవానికి ఎంతో ముందు సుమా!) ఎంత నవ్యోపమానం! ఎంత నవ్య ప్రయోగం!!

కేవలం వర్ణన కొరకు జయంతి వారు 'లాలు జెండాలు' అన్న పదబంధాన్ని ప్రయోగిస్తే, మరో కవి ఆ భావజాలాన్నే తెలుగు సాహిత్యానికి పరిచయం చేసారు. 19వ శతాబ్ది కడపటి సంవత్సరమైన క్రీ.శ. 1900లోనే గొట్టుముక్కల రమాకాంతాచార్యులు, 'గ్రే' అనే ఆంగ్లేయ కవి విరచిత కృతిని 'కరుణారసతరంగిణి' పేర తెలుగు చేసారు. ఆంగ్ల భాషాధ్యయనం చేసిన ఫలంగా ఈ కావ్య రచన చేయ గలుగుతున్నానని రమాకాంతాచార్యులు ఈ కావ్యారంభంలో పేర్కొన్నారు.



"తండ్రి! నా నేర్పు హూణ విద్యకు ఫలంబు
గాగ, దద్భాష 'గ్రే' యను కవి వరుండు
భవ్య గతి రచించిన మహా కావ్య మేను
దవిలి తెనిగించుచున్నాడ ! నవధరింపు!"[11]

ఈ కావ్యంలో కవి కాయ కష్టం చేసుకొనే కర్షకులు, పేదలపై తన అనురాగాన్ని, సంపన్నుల పట్ల తిరస్కార భావాన్ని ప్రకటించి వామ పక్షీయ భావజాల ఛాయలను ఆనాడే తెలుగు సాహిత్యంలో ప్రవేశ పెట్టారు.

"కొడవట నెన్ని సస్యములు కోసిరి వారు గడంగి పల్మరున్
గడపిరి నాగెటిం బ్రబల కాశ్యపి బ్రద్దలు గానొ యూరమే
కడ దులకింప దోలి రరకల్ మడి చాయల నిబ్బరంపుగ్రే
ట్లడరిన నమ్రతన్ శిరము లక్కట వంచె నరణ్య భూజముల్

వారి యమాయిక సుఖములు
వారల లాభకర కార్య వైఖరి మరియున్
వారి నిగూఢ చరితలా!
శారమణి! తృణీకరింప జనునే నీకున్?
సంగ్రహంబయి సారళ్య సహితమైన
పేదవారి చరిత్రము ల్వినగ దగునె
సార సంపన్నిధులు తిరస్కార భావ
సూచకంబగు దరహాస రుచి తోడ!"[12]

ఈ విధంగా 19వ శతాబ్దిలో తెలుగు కవులు పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో అనువాదాలు, అనుసరణలు, అనుసృజనలు చేసి, వారి సాహిత్యాన్ని, సంస్కృతిని, నవ్య భావజాలాన్ని మనకు పరిచయం చేసే ప్రయత్నంగా తెలుగు సాహిత్యాన్ని కొత్త పుంతలు తొక్కించారు.

## 2. పాశ్చాత్య రాజకీయ ప్రభావం :

క్రీ.శ. 1857లో ప్రప్రథమ భారత స్వాతంత్ర్య సమరం తలెత్తిన తర్వాత 1858లో మహారాణి విక్టోరియా భారత దేశంలో నేరుగా పరిపాలనాధికారాన్ని

స్వీకరించింది. అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం ప్రజలతో సత్సంబంధాలు నెలకొల్పుకోడం కోసం విశ్వవిద్యాలయాల స్థాపన, రైల్వే వ్యవస్థ, తంతి – తపాల వ్యవస్థలను నెలకొల్పి, విద్యా సాంకేతిక ప్రగతి ఫలాలను భారతీయుల కందించింది. భారతీయ మూఢాచారాలను ఖండిస్తూ చట్టాలను రూపొందించింది. పకడ్బంధీ న్యాయ వ్యవస్థ, పోలీసు వ్యవస్థలను ఏర్పాటు చేసింది. ఆంగ్ల విద్యనభ్యసించిన భారతీయులకు ఉద్యోగాల నిచ్చింది. సంఘంలో పలుకుబడి గల వ్యక్తులకు 'దివాన్ బహద్దుర్', 'రావు బహద్దుర్' వంటి బిరుదులను ఇచ్చి సత్కరించింది. దీంతో సహజంగానే ప్రజలకు దేశీయుల పాలన కంటె బ్రిటిష్ పాలనే నయమనిపించసాగింది. సంఘ సంస్కర్తలు కూడా మెరుగైన పాలన కళ్ళముందు కనిపిస్తుంటే, కాస్త దాస్యం అన్న మాటను పక్కన బెట్టి, బ్రిటిష్ సర్కారుకు మద్దతు పలకడం ప్రారంభించారు. ఆంగ్ల విద్య నభ్యసించిన మేధావులు, కవులు బ్రిటిష్ అధికారులతో సత్సంబంధాలను నెరుపుతూ వచ్చారు.

అలా బ్రిటిష్ రాజకీయ వ్యవస్థ ప్రభావం తెలుగు సాహిత్యంలో ప్రతిఫలించడం ప్రారంభమయింది. అందుకే 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో విక్టోరియా మహారాణిని ప్రస్తుతిస్తూ తెలుగు కవులు పద్యాలను రచించారు. ముఖ్యంగా మహారాణి బ్రిటిష్ సింహాసనం అధిష్ఠించి 50 సంవత్సరాలు పూర్తి చేసుకొన్న సందర్భంగా ప్రభుత్వం 'జూబిలీ ఉత్సవాలు' జరిపినప్పుడు, చాలా మంది కవులు ఆమెపై స్తుతి పద్యాలను వెలయించారు. కొందరయితే ఏకంగా ఆమె జీవిత చరిత్రనే కావ్యాలుగా సృజించారు. కొందరు తమతో స్నేహంగా ఉన్న బ్రిటిష్ అధికారులను స్తుతిస్తూ పద్యాలను రచించారు. కొందరు బ్రిటిష్ పాలనలోని అభివృద్ధికి చిహ్నాలైన రైలు బండిని, తంతి – తపాల వ్యవస్థను ప్రశంసిస్తూ కవిత్వం చెప్పారు. ఆ వివరాల నన్నిటినీ ఆంగ్లేయ రాజకీయ పరిపాలనా ప్రభావ నవ్యతగా ఇపుడు పరిశీలిద్దాం –

మతుకుమల్లి నృసింహ కవి 'చెన్నపురీ విలాసము' (క్రీ.శ. 1863)లో, భారత దేశంలో తంతి వ్యవస్థను ప్రవేశ పెట్టిన ఇంగ్లీషు వారి పాలనపై ఎలా సంతృప్తిని వ్యక్తం చేసారో చూడండి –

*"ఇంగిలీషులు పూన్చు నహీన యంత్ర*
*మహిమచే సర్వజనుల కిమ్మహి సుదూర*
*బంధు సందేశ సపది లాభంబు కలిగె –*
*ప్రభు సమాదంబరము ప్రజార్థంబు గాదె!"* [13]

వడ్డాది సుబ్బరాయకవి రైలు బండిని చూచి ఆనందాతిశయాలతో ఇలా వర్ణించారు –

*"ధూమ శకట వేగ మేమని వర్ణింతు –*
*భూమి గంట దీవ్రబడుచు బోవునట్టి*
*వేవిగాని సాటి రావు దానికి వడి;*
*దాని వంటి దొకటె దాని నీడ!"* [14]

ఎంత చక్కని వర్ణన ! వ.సు. రాయకవి విక్టోరియా మహారాణి జూబిలీ ఉత్సవాల (క్రీ.శ. 1887)లో వ్రాసిన పద్యాలు మధురాతి మధురాలు. ఈనాడవి మనకు దాస్య భావనకు ప్రతీకలుగా కనిపించవచ్చు. కాని ఆనాటి రసజ్ఞులకు అవి వసుధైక కుటుంబ భావనల మాలికలు.

*"శ్రీమన్మహా సేతు శీతాద్రి మధ్యస్థ*
*రత్న గర్భైక సామ్రాజ్యురాల!*
*సాంభోనిధి ద్వీప సర్వావనీ వ్యాప*
*కాంగ్లేయ రాజ్యోత్త మాంగురాల!*
*దుర్వార సర్వారి గర్వాంధకార ప్ర*
*దీపాయ మాన ప్రతాపురాల!*
*పుత్రికా పౌత్రికా పుత్ర పౌత్రాది కా*
*త్మీయ సంతాన సంప్రీతురాల!*

*దుష్ట సంశిక్షణాశ్రాంత శిష్ట రక్ష*
*ణైక చరితార్థ జన్మ ధన్యాత్మురాల!*
*ప్రాజ్ఞ విక్టోరియా మహారాజ్ఞి! నీవె*
*ధరణి బాలింపు మాచంద్రతారకంబు!"*

'ధవళేశ్వరం' ఆనకట్ట ఫలాలను, ఇతర పాలనా పరమైన ప్రగతి ఫలాలను అనుభవిస్తున్న కవి ఆత్మానందాన్ని గమనించండి –

*"నోరెండినను మంచి నీరింత కనరాని*
*మరుభూమి గౌతమీ భరితమయ్యె;*
*బరికింపగా గడ్డి పరకైన మొలకెత్తు*
*టరుదైన పట్టి, లుర్వరలె యయ్యె;*
*జోడంబళులు గాచి జుర్రువారికి, రాజ*
*నాల యన్నము భోజనాల కయ్యె;*
*గాశికేగిన వారు కాటికేగిన వారి*
*పగిదంట పరిహాస పాత్రమయ్యె;*

*బులియు, మేకయు నేకమై జలముగ్రోలు*
*నహహా! నీ పాలనమున ధర్మాత్మురాల!*
*ప్రాజ్ఞ విక్టోరియా మహారాజ్ఞి! నీవె*
*ధరణి బాలింపు మాచంద్ర తారకంబు!*

*అంధుడైనను దారి నడుగ నక్కర లేక*
*యేగ నౌ గాశి, రామేశ్వరంబు;*
*పంగుడైనను గొంచె పాటి వెచ్చంబుతో*
*రావచ్చు, ద్వీపాంతరములు సూచి;*
*బలహీనుడును, న్యాయ పక్షంబు వాడైన*
*బోరి గెల్వగ వచ్చు భూమి పతుల;*
*గడ జాతి వాడైన, గడియించుకొన్నచో*
*నంజకెక్కగ వచ్చు నందలంబు;*

*నహహా! యీ రథ్య, లీ ధూమ యానములును*
*న్యాయ సభ, లిట్టి స్వేచ్ఛ, లేనాడు గలవు?*
*ప్రాజ్ఞ విక్టోరియా మహారాజ్ఞి! నీవె*
*ధరణి బాలింపు మాచంద్ర తారకంబు!"*[15]



ఈ పద్యాలలో కవి ఆకాంక్షను మనం అంగీకరించలేము గాని, ఆయన చెప్పిన వాస్తవాలను మాత్రం అంగీకరించక తప్పదు. సుబ్బరాయ కవి రాజమండ్రిలోని కాలేజి ప్రిన్సిపాల్ ఐ.పి. మెట్కాఫ్ దొర స్వదేశానికి వెళుతున్నప్పుడు (క్రీ.శ. 1887) వ్రాసిన పద్యాలలో ఒకటి మచ్చుకి పేర్కొంటున్నాను.

*జన్మ మధ్యమునందు జదువు రాదనుకొన్న*
*జడులు శాస్త్ర బ్రహ్మచారులైరి;*
*హీనులై బిచ్చంబు నెత్తంగ వలయు వా*
*రురు వేతనంపు టుద్యోగులైరి;*
*నూనూగు మీసాలు రాని కుర్రలు, మహా*
*జన సభాపూజ భాజనములైరి;*
*మాట నేర్పెరుగని మోట మొద్దులు, యుక్తి*
*యుక్త ప్రసంగ సంశక్తులైరి;*

*క్రూరులై సాధు జనులను గోడు పరచు*
*మంకు వారలు బహు బుద్ధిమంతులైరి;*
*యౌర! 'మెట్కాఫు' కరుణాళు డరుగు దెంచి*
*నేర్పి విద్యను, గాలేజి నిలుపబట్టి!"*[16]

ఈ పద్యాలన్నీ తరువాతి కాలంలో సుబ్బరాయకవి ప్రసిద్ధ కావ్యం 'వసురాయ చాటు ప్రబంధం'లో చేర్చబడ్డాయి.

కందుకూరి వీరేశలింగం పంతులు క్రీ.శ. 1883లో గవర్నర్ జనరల్ రిప్పన్ దొర మద్రాసు నగరానికి విచ్చేసినప్పుడు 'శ్రీ రిపన్‌ప్రభు స్వాగతము' పేర కొన్ని పద్యాలను, ఒక పాటను రచించి తమ 'సతీహితబోధిని' పత్రికలో ప్రచురించారు. విక్టోరియా రాణి జూబిలీ ఉత్సవాలలో నవరత్నాలను రచించారు. పంతులుగారు బ్రిటిష్ ప్రభుత్వం నుండి 'రావు బహద్దూర్' బిరుదాన్ని స్వీకరించారు.

క్రీ.శ. 1875లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ భారతదేశాన్ని సందర్శించినపుడు, ఆ సందర్భనాన్ని, వర్ణించే భారతీయ రచనలకు 'లండన్ క్రౌన్ పర్ఫ్యూమరీ కంపెనీ' అనే ఒక వ్యాపార సంస్థ పోటీ నిర్వహించింది. ఆ పోటీకి కొక్కొండ వేంకటరత్నం

పంతులు 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు తారావళి' పేర 27 పద్యాలను రచించి పంపారు. ఆ పద్యాలు ఆంగ్లంలోకి అనువదించబడి బహుమతిని గెలుచుకొన్నాయి. బహుశః ఒక తెలుగు కవిత ఖండాంతర ఖ్యాతిని పొందడం, అంతర్జాతీయ పురస్కారాన్ని గెల్చుకోడం – ఇదే ప్రథమ మేమో! పంతులుగారు ఈ పురస్కారాన్ని చాలా గౌరవప్రదంగా భావించేవారు. దాదాపు 18 సంవత్సరాల తరువాత (క్రీ.శ. 1893లో) ప్రచురించబడిన తమ 'బిల్వేశ్వరీయము' ప్రబంధ గ్రంథం ముఖపత్రంపై పంతులుగారు ఆంగ్లంలో తమ పేరు క్రింద 'Author of the prize - poem "Prince of Wales Taravali", accepted by the London crown perfumery company' అని ప్రత్యేకంగా వేయించుకొన్నారు.[17] ఈ పురస్కారం లభించిన సందర్భంలో కొక్కొండవారిని, వారి అభిమానులు 'మహా మహోపాధ్యాయ' బిరుదంతో సత్కరించారు. 19వ శతాబ్దిలోనే తెలుగు కవితకు అంతర్జాతీయ పురస్కారాన్ని సాధించి పెట్టిన బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మ పంతులు నిజంగానే అభినందనీయులు.

ఇదే విధంగా బొమ్మకంటి నృసింహశాస్త్రులు 'తారావళి' అన్న శీర్షికతో విక్టోరియా రాణిపై స్తుతి పద్యాలను రచించారు. పరవస్తు వేంకట రంగాచార్యులు 'ఆంగ్లాధిరాజ్య స్వాగతము' అన్న లఘు కావ్యాన్ని రచించారు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి క్రీ.శ. 1898లో 'విక్టోరియా విలాసము' పేరిట విక్టోరియా మహారాణి చరిత్రను కావ్యంగా మలచారు. అయితే ఇది అంతగా ప్రఖ్యాతి వహించలేదు. ఇదే వస్తువుతో లక్కవరం జమీందారు మంత్రిప్రెగడ భుజంగ రావు ఒక ప్రబంధాన్ని రచించారు. ఈ కృతి పేరు 'వసంత కుసుమము'. పేరుకి తగ్గట్టుగా ఈ కృతి నిజంగా వసంత కుసుమమే! ఈ కావ్యం రెండవ కూర్పు క్రీ.శ. 1907లో వచ్చింది. మొదటి కూర్పు ఏడెనిమిది సంవత్సరాల ముందు వచ్చిందనుకొన్నా, ఇది కూడా కాశీభట్టవారి కావ్యం వచ్చిన కాలంలోనే వెలువడి ఉండాలి. రెండవ కూర్పులో రాణి మరణం వరకు అన్ని విషయాలు కలిపి గ్రంథ విస్తరణ చేసారు. ఇందులో రాణికి సంబంధించిన అనేక ఛాయా చిత్రాలను కూడా పొందు పరిచారు. చాలా ప్రసిద్ధి వహించిన ఈ కావ్యంలో, మహారాణి పరిపాలనా దీక్షాదక్షతలను వివరించే ఈ ముక్తపదగ్రస్తాలంకార భూషితమైన పద్యాన్ని చూడండి –

*"ఆ దేవి మేల్కాంచి యర్ధ రాత్రంబున*
*రాచ కర్జముల సారంబునెంచు –*
*నెంచి ప్రెగ్గడలచే నిదమిత్థ మనిపించి*
*యది యాచరించుట కాజ్ఞసేయు –*
*జేసిన యాత్మీయ శాసనం బన్యథా*
*భావ మందక యుండ బారజూచు –*
*జూచి యించుక భేద సూచన గల్గిన*
*గ్రమ్మర యొడ్డోలగమున దెచ్చు –*

*దెచ్చి గుణ దోషముల నెల్ల దీర్పు సేసి*
*కడగి యవ్యాహత క్రియ నడపు చుండు –*
*నౌర ! యింతటి చాతుర్య మభ్యసింప*
*నెవ్వరికి గల్గునని జను లెంచుచుండ !"*[18]

ఇలా ఆంగ్లేయుల పాలనా వ్యవహారాలకు సంబంధించి, 19వ శతాబ్దిలో సగటు భారతీయుల అనుభూతులను ప్రతిబింబిస్తూ తెలుగు సాహిత్యంలో వెలువడిన ఈ కవిత్వంలోని నవ్యతను పాశ్చాత్య రాజకీయ ప్రభావ నవ్యతగా పేర్కొనవచ్చు.

### 3. పాశ్చాత్య మత ప్రభావం :

ఆంధ్రదేశంలో క్రైస్తవమత ప్రచారం 17వ శతాబ్ది తొలి రోజుల్లో ప్రారంభమయింది. క్రీ.శ. 1606లో పోర్చుగీస్ 'జెసూట్' – 'రాబర్ట్ డా నోబిలి' అనే వ్యక్తి 'మధుర' కేంద్రంగా తెలుగులో క్రైస్తవ మత ప్రచారం ప్రారంభించి, 'తత్త్వ బోధస్వామి' గా పేరు పొందారు. ఇతనిని ఆదర్శంగా తీసుకొని క్రీ.శ. 1689లో కొంత మంది ఫ్రెంచి 'జెసూట్లు' పుదుచ్చేరి చేరుకొని కర్ణాటక మిషన్‌ను స్థాపించారు. ఈ మిషన్ జెసూట్లు తరువాతి కాలంలో దక్షిణ భారత దేశమంతా వ్యాపించారు. ఈ జెసూట్ల నుండి 'బ్యాప్టిజం' స్వీకరించిన తెలుగు విద్యావంతులకు ఫ్రెంచి పాలనలో ఉన్నత పదవులు లభించాయి. ఫ్రెంచి ప్రభుత్వం కాస్త ఆలస్యంగానైనా, బ్రాహ్మణ కవులను చేరదీసి, వాళ్ళ చేత తెలుగులో క్రైస్తవ కావ్యాలను వ్రాయించారు. అలా తెలుగులో తొలి క్రైస్తవ కావ్యాన్ని రచించిన కవి పింగళి ఎల్లనార్యుడు. వీర శైవుడైన

ఈ కవి పరిశుద్ధ గ్రంథం – పాత నిబంధనలో 14వ అధ్యాయంలో ఉన్న 'టోబియో' చరిత్రను తోభ్య చరిత్రగా రచించారు. ఫ్రెంచి జెసూట్ల ద్వారా బ్యాప్టిజం పుచ్చుకొన్న తుమ్మావారి వంశంలోని అనంత రెడ్డి రాయప్ప అనే జమీందారు కోరిక మేరకు కవి ఈ రచనను చేసినట్టు తెలుస్తోంది.19 కవి ఈ గ్రంథానికి 'సర్వేశ్వర మాహాత్మ్యము' అని నామకరణం చేసారు. ఎల్లనార్య కవి 17వ శతాబ్దికి చెందినవాడని వీరేశలింగం పంతులు విశదీకరించారు.[20] ఆ తరువాత 18వ శతాబ్ది అంత్యకాలంలో మంగళగిరి ఆనందయ కవి క్రీస్తు చరిత్రను 'వేదాంత రసాయనము' పేర కావ్యంగా మలచారు. ఈ రెండు కృతులే 19వ శతాబ్దికి పూర్వం క్రైస్తవ కావ్యాలుగా వెలసినట్లు ఆధారాలున్నాయి. అయితే ఈ ఇరువురు కవులు క్రైస్తవ మతాన్ని అవలంబించినట్లుగా ఆధారాలు లేవు. పైగా, ఇరువురూ శివారాధకులుగా తమ కావ్యాలలో చెప్పుకొన్నారు. రచనలు కూడా ప్రాచీన తెలుగు ప్రబంధ సరణిలోనే సాగాయి. కాని, 19వ శతాబ్దిలో క్రైస్తవ మతాన్ని స్వీకరించి, మనసా వాచా కర్మణా క్రైస్తవ మత ప్రచారార్థం కావ్య రచనలు చేసిన తొలి తెలుగు క్రైస్తవ కవి 'పురుషోత్తమ చౌధరి' (క్రీ.శ. 1803–1890). క్రీ.శ. 1833లో బ్యాప్టిజం స్వీకరించిన ఈ కవి అనేక పద్య కృతులను, కీర్తనలను రచించి, 'ఆంధ్ర క్రైస్తవ కవి సార్వభౌముడు'గా ఖ్యాతి నొందారు. ఈ కవి రచించిన గేయ కృతులను, కీర్తనలను గురించి '19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో ప్రక్రియా పరమైన నవ్యత' అన్న అధ్యాయంలో వివరించడం జరిగింది. ఈ అధ్యాయంలో చౌధరి కవి రచించిన పద్య కృతులను గురించి పరిశీలిద్దాం –

పురుషోత్తమ చౌధరి పద్య కృతులు ఐదు లభిస్తున్నాయి. వాటిలో రెండు శతకాలు – ఒకటి 'యేసు నాయక శతకము', రెండవది 'యేసు క్రీస్తు ప్రభు శతకము', ఇక, 'పంచ చామర పన్నములు' పంచ చామర ఛందస్సులో మకుట సహితంగా సాగిన అర్ధ శతి. 'పంచ రత్నములు' ఐదు సీస పద్యాల సంకలనం. 'క్రైస్తవ నీతి ప్రకాశము' మరియు 'సత్య వేద సార సంగ్రహము' అనేవి పద్యకావ్యాలు. వీటిలో క్రీ.శ. 1845లో వెలువడిన 'యేసు నాయక శతకము' తెలుగు శతక వాఙ్మయంలో మొట్ట మొదటి క్రైస్తవ శతకం.

*"తప్పులు లేని వారొకరు ధాత్రిని లేరని దేవ వాక్యముం*
*జెప్పుట నిక్కమట్టి నర జీవుల లోపల నాకు మించ బల్*
*తప్పులు సేయు వాడొకడు ధారుణి నారయ లేడు – నేడు నా*
*తప్పుల బాపి నీ కరుణ దప్పక బ్రోవవె యేసు నాయకా ! "*

వంటి కమనీయ ధారతో సాగే క్రైస్తవ మత ప్రబోధక వృత్తాలెన్నో ఈ శతక కావ్యంలో ఉన్నాయి. ముఖ్యంగా క్రీస్తు జీవితంలోని కరుణా రసాత్మకమైన ఘట్టాలను కవి వర్ణించిన తీరు హృదయాన్ని కలచివేసి, భక్తి భావాన్ని పెంపొందించే విధంగా ఉంది.

*"పల్లవ తుల్య పాద, కర పంకజ మధ్యములందు రక్తమున్*
*చిల్లున జిమ్మ, మేకులు దుసిల్లగ సిల్వను గొట్టి పక్కలో*
*బల్లెము గ్రుచ్చు వారియెడ వైరము లేక కృపారసంబు శో*
*భిల్లె గదా భవద్ధృదయ వీధిని పెల్లుగ యేసునాయకా!"[21]*

అలాగే 'యేసు క్రీస్తు ప్రభు శతకము'లో కూడ కమనీయమైన భావాలతో అనేక పద్యాలు రూపు దిద్దుకొన్నాయి. మచ్చుకు ఒక పద్యాన్ని చూడండి –

*"నా కన్నం గడు పాప కర్ముడొకడైనన్ లేదు భూమండలిన్*
*నీ కన్నం బ్రియ రక్షకుండెచట నన్వేషించినన్ లేడికన్ –*
*నాకు న్నీకును జోడు గూడె గద! నన్నుం బ్రోవు మిట్లైన ము*
*ల్లోకంబుల్ నిను మెచ్చు – నీ బిరుదు నిల్చున్ – యేసు క్రీస్తు*
*ప్రభో!"[22]*

నూటికి పైగా విలువైన నీతి పద్యాలతో రూపొందిన కావ్యం – 'క్రైస్తవ నీతి ప్రకాశము' (క్రీ.శ. 1851).

*"జగతి యందు కులాలుండు సాన మీద*
*మంటి చే కుండ లొనరించు మాడ్కి, సర్వ*
*నరుల నొక రక్తమున పరాత్పరుండు చేసె*
*గాన ఘన నీచు లిల లేరు క్రైస్తవునకు"[23]*

వంటి పద్యాలు ఈ కావ్యంలో సర్వ మానవ సమానత్వాన్ని చాటి, మానవ జాతికి మార్గదర్శనం చేస్తాయి.

పురుషోత్తమ కవి క్రీ.శ. 1847లో రచించిన 'పంచ చామర పన్నములు', 'పంచ రత్నములు' యేసు క్రీస్తుపై అచంచలమైన భక్తితో అల్లిన స్తుతి పద్యాలు.

"వెల లేని పంచ చామర
ములు మరియును పంచ రత్నములు ప్రభువు కృపన్
ఇల చౌధరి పురుషోత్తము
వలన రచితమయ్యె సాదు వర్గంబలరన్"[24]

అని కవి స్వయంగా చెప్పుకొన్నారు.

19వ శతాబ్ది మధ్య కాలంలోనే పరిపక్వమైన క్రైస్తవ భక్తి కావ్యాలను రచించిన పురుషోత్తమ చౌధరికి 'ఆంధ్రక్రైస్తవ కవిసార్వభౌముడు' సార్థక బిరుదం అన్నది నిర్వివాదాంశం. పురుషోత్తమ చౌధరి కవి గురించి 19వ శతాబ్దికే చెందిన కవి, లక్కవరం జమీందారు రాజా మంత్రిప్రెగడ భుజంగ రావు అభిప్రాయం ఇక్కడ ఉటంకించదగింది.

*"I read almost all the works of Rev. Purushottama Chowdhuri. He is a true christian of the Highest order. The very fact that almost all the different denominational churches of the Andhra Desa adopted many of his devotional songs in their worship, is a clear proof of his great merit and non- sectarian christian spirit. In Telugu he proved himself a poet of the classical order. His verses are lucid and run like a natural flow of an ebbing river. He is able to express his thoughts very clearly and no where can we find him blinking to find a suitable word or phrase to experess his inner thoughts. He has done a great service to the christian community and to the Telugu public at large and I am sure, his name will last in the country as long as the Andhras exist. It is the duty of every Andhra to join hands in commemorating his name to perpetuity."*[25]

ఇలా 19వ శతాబ్దిలో పాశ్చాత్య సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ, మత ప్రభావ నవ్యతలు తెలుగు సాహిత్యంలో పరిఢవిల్లాయి.



**పాద సూచికలు :**


1. కందుకూరి వీరేశలింగం : స్వీయ చరిత్రము (రెండవ భాగము) – పుట 152
2. డా. అక్కిరాజు రమాపతిరావు : వీరేశలింగం పంతులు – సమగ్ర పరిశీలన – పుట 51
3. కందుకూరి వీరేశలింగం : జాన్ గిల్పిన్ – పుట 4
4. కందుకూరి వీరేశలింగం : జాన్ గిల్పిన్ – పుట 1
5. కందుకూరి వీరేశలింగం : పథిక విలాసము – కావ్యాంతంలోని పద్యాలు
6. కందుకూరి వీరేశలింగం : పథిక విలాసము – పుట 8
7. కందుకూరి వీరేశలింగం : పథిక విలాసము – పుట 9 & 5
8. తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) – పుట 328
9. డా. తూమాటి దొణప్ప : ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము – పుట 223
10. జయంతి **భావనారాయణ :** కళావతి పరిణయము (ప్రథమాశ్వాసం) పద్యాలు : 97, 98
11. గొట్టుముక్కల రమాకాంతాచార్యులు : కరణారస తరంగిణి – 2వ పద్యం
12. గొట్టుముక్కల రమాకాంతాచార్యులు : కరణారస తరంగిణి – పద్యాలు 8,9 & 10
13. మతుకుమల్లి నృసింహశాస్త్రి : చెన్నపురీ విలాసము (పంచమాశ్వాసం) 8వ పద్యం (పుట. 42)
14. వడ్డాది సుబ్బరాయకవి : వసురాయ చాటు ప్రబంధం – ప్రకీర్ణ ప్రకరణము – 195వ పద్యం(పుట.221)
15. వడ్డాది సుబ్బారాయకవి : శ్రీ విక్టోరియా జూబిలీ నవరత్నములు – పద్యాలు : 1, 3 & 4

16. వడ్డాది సుబ్బారాయకవి : వసురాయ చాటు ప్రబంధం – పుట. 21

17. కొక్కొండ వేంకటరత్నశర్మ : బిల్వేశ్వరీయము – ముఖ పత్రం

18. మంత్రి ప్రెగడ భుజంగరావు : వసంత కుసుమము – పుట. 93

19. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం (పదవ సంపుటం) – పుట. 296

20. కందుకూరి వీరేశలింగం : ఆంధ్ర కవుల చరిత్రము – పుట. 481

21. పురుషోత్తమ చౌధరి : యేసు నాయక శతకము – పద్యాలు : 15, 59

22. పురుషోత్తమ చౌధరి : యేసు క్రీస్తు ప్రభుశతకము – 21వ పద్యం

23. పురుషోత్తమ చౌధరి : క్రైస్తవ నీతి ప్రకాశము – 75వ పద్యం

24. పురుషోత్తమ చౌధరి : పంచ రత్నములు – చివరి పద్యాల నుండి

25. పురుషోత్తమ చౌధరి ద్విశత జయంతి ఉత్సవ ప్రచురణ (సంపుటి 1) – అభిప్రాయాల నుండి.





# 10

# 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో వస్తు నవ్యత



**19వ** శతాబ్ది తెలుగు కవిత్వంలో రూపొందిన వివిధ రకాల నవ్యతలను – ముఖ్యంగా, సంప్రదాయ వ్యతిరేక నవ్యత; అభ్యుదయాత్మక నవ్యత; ఛందోనవ్యత; ప్రక్రియా పరమైన నవ్యత; భాషాపరమైన నవ్యత; పాశ్చాత్య సాహితీ, సాంస్కృతిక, మత, రాజకీయ ప్రభావ నవ్యతలను ఇంతకు ముందు అధ్యాయాలలో సవిస్తరంగా చర్చించడం జరిగింది. అయితే ఇవన్నీ ఒక ఎత్తు – 19వ శతాబ్దిలోని తెలుగు కవిత్వంలో రూపొందిన వస్తు నవ్యత ఒక ఎత్తు. ఎందుకంటే ఏ కావ్యానికైనా వస్తువు ప్రాణం వంటిది. ఇంతకు ముందు వివరించిన నవ్యతలు ఆనాటి దేశ, కాల, సామాజిక, రాజకీయ ప్రభావాలతో ఏర్పడినవయితే, వస్తు నవ్యత మాత్రం కవి సృజన శక్తికి సంబంధించింది.

19వ శతాబ్ది తెలుగు కవిత్వంలోని వస్తు నవ్యత ప్రధానంగా నాలుగు రకాలుగా విస్తరిల్లిందని చెప్పవచ్చు. అవి –

1. అల్ప వస్తువులకు కావ్య గౌరవం కల్పించడం.
2. సమకాలీన సంఘటనలను కావ్య వస్తువులుగా స్వీకరించడం.
3. సోషియో ఫాంటసీ కథా వస్తువులను రూపొందించడం.
4. విచిత్ర కల్పనలతో కావ్య వస్తువులను తీర్చిదిద్దడం.

ఈ అంశాలను ఒక్కొక్క దాని గురించి ఇప్పుడు సవిస్తరంగా చర్చిద్దాం.

## 1. అల్ప వస్తువులకు కావ్య గౌరవం :

20వ శతాబ్ది నవ్య కవిత్వంలో ఆధునికులు ఒక ముఖ్యమైన అంశంగా పేర్కొనే విషయం – అల్ప వస్తువులను కూడా హీనంగా చూడకుండా, వాటిని కూడా కవితామయం చేస్తూ కావ్యాలను నిర్మించడం. దీనికి ప్రాతిపదికగా మహాకవి శ్రీశ్రీ 1934లో రచించిన 'ఋక్కులు' అన్న కవితను పేర్కొన్నడం మనకు విదితమే.

కుక్కపిల్లా,
అగ్గి పుల్లా,
సబ్బు బిళ్ళా –

హీనంగా చూడకు దేన్నీ !
కవితా మయమే నోయ్ అన్నీ!

రొట్టె ముక్కా,
అరటి తొక్కా,
బల్లి చెక్కా –

నీ వేపే చూస్తూ ఉంటాయ్!
తమ లోతు కనుక్కోమంటాయ్!

తలుపు గొళ్ళెం,
హారతి పళ్ళెం,
గుర్రపు కళ్ళెం –

కాదేదీ కవిత కనర్హం !
ఔనౌను శిల్ప మనర్ఘం !!

ఈ కవిత వెలువడక ముందు కవితా వస్తువులుగా పౌరాణిక కథలు లేక ఉదాత్తమైన కల్పిత కథలతో పురాణ పురుషులు లేక ఉదాత్త పురుషులను నాయికా నాయకులుగా కావ్య నిర్మాణం జరుగుతుండేదని, నవ్యయుగకర్త అయిన శ్రీశ్రీ ఈ నవ్య దృష్టిని ఆధునిక కాలంలో ప్రసరింప జేశాక, ఈ పరిస్థితిలో మార్పు వచ్చిందని విమర్శకులు భావిస్తున్నారు. ఆ క్రమంలోనే జాషువా కవి, 'సాలీడు', 'గిజిగాడు', కరుణశ్రీ రచించిన 'పుష్పవిలాపం', 'పాకీ పిల్ల' మొదలయిన కవితలు ఆధునిక కాలంలో వెలువడ్డాయని పండితులు విశ్లేషిస్తున్నారు. అయితే శ్రీశ్రీ ఈ భావనను వెలువరించటానికి 50, 60 సంవత్సరాలకు ముందే ఇలా అల్ప వస్తువులను కావ్య వస్తువులుగా ఎంచుకొని కావ్య నిర్మాణం చేసిన కవులున్నారు. 19వ శతాబ్దిలోనే ఇలా అల్ప వస్తువులకు కావ్య గౌరవాన్ని కల్పించి అపురూపమైన వస్తు నవ్యతను ప్రదర్శించిన ఈ కవులు నిజంగా అభినందనీయులు, ఆదర్శ ప్రాయులని అంగీకరించక తప్పదు.

మొట్టమొదట ఇలాంటి కార్యాన్ని సాధించిన కవి పన్నాల సీతారామ బ్రహ్మ శాస్త్రి. ఈయనను ఆనాటి యుగ కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారు సాహితీ గురువుగా భావించేవారు. క్రీ.శ. 1820–1900 మధ్య జీవించిన ఈ కవి వతంసుడు 'పూచి పుడుక' శతకము' అన్న కృతిని రచించాడు. దీనికి 'పూచి పుల్ల శతకము' అని నామాంతరం ఉంది. ఒక పూచిక పుల్ల వంటి అల్ప వస్తువును స్వీకరించి శతక కావ్యాన్ని నిర్మించడం, ఉదాత్త పాత్రలతో పురాణ, శృంగార కథావస్తువులతో ద్వ్యర్థి, త్ర్యర్థి ప్రబంధాలు జోరుగా వెలువడుతున్న 19వ శతాబ్దిలో, నిజంగా ఒక విప్లవాత్మకమైన నవ్యతగా భావించాలి.

అలాగే క్రీ.శ. 1896లో బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు అనే మరోకవి 'అట్టు కథ' అన్న పద్య కావ్యాన్ని రచించినట్టు తెలుస్తున్నది. తెలుగు వారికి ప్రీతిపాత్రమైన తినుభండారం 'అట్టు' పై ఈ కవి ఒక పద్య కావ్యం రచించడం వినూత్నమైన విషయం. ఈ రెండు గ్రంథాలకు సంబంధించిన వివరాలు తెలుగు అకాడమి ప్రచురించిన 'తెలుగు సాహిత్య కోశము' లో లభ్యమవుతున్నాయి.[2] అయితే ఈ రెండు కావ్యాలు మాత్రం ఈనాడు అనుపలబ్ధంగా ఉన్నాయి. దీనికి కారణమేమిటా? – అని ఆలోచిస్తే మనకు ఒక విషయం అవగతమౌతుంది. పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రి, బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు అనే ఈ ఇరువురు కవులు 19వ శతాబ్దిలోనే ఆధునిక చిత్తవృత్తిని ప్రదర్శిస్తూ అల్ప వస్తువులకు కావ్య గౌరవం కల్పించినా, ఆనాటి సాహితీ పాఠకులు, పండితులు "పూచి పుల్ల పై కవిత్వమేమిటి?" అంటూ, "అట్టు పై కవిత్వమా?" అంటూ హీనంగా చూచి ఉంటారు. ఆ నిరసన

భావం వల్ల ఆనాటి సాహితీ ప్రియులు ఇలాంటి తెలుగు సాహిత్యంలోని అమూల్య గ్రంథాలను కాపాడుకోవాలన్న స్పృహ లేక వాటిని పదిల పరచ లేక పోయారని భావించవలసి ఉంటుంది. అందుకే ఆ కావ్యాలు నేడు మనకు అలభ్యంగా మరుగున పడి పోయాయని చెప్పవచ్చు. అయితే కాలం ఖచ్చితంగా తెలియక పోయినా 19వ శతాబ్దిలోనే సామినేని వేంకటాద్రి అనే మరోకవి 'చీపురు పుల్ల శతకము'ను రచించారు. బహుశః ఈ కవిని పన్నాల వారి 'పూచి పుల్ల శతకము' ఈ శతక రచనకు స్ఫూర్తి నిచ్చి పురికొల్పి ఉంటుంది. 'చీపురు పుల్ల శతకము'లోని విశేషాలను డా. కె. గోపాల కృష్ణా రావు తమ 'ఆంధ్ర శతక సాహిత్య వికాసము' లో ఇలా వివరించారు –

"చీపురు పుల్ల శతకము – నీతి, హాస్యము ప్రధానముగా సామినేని వేంకటాద్రి కవి రచించిన శతకము, సామాన్య వస్తువు నితివృత్తముగ గ్రహించిన కృతిగా ప్రశస్తి వహించినది. మనము సాధారణముగా నిత్యముపయోగించు వస్తువుల ప్రాధాన్యము దానికి గల ప్రయోజనమును నాలోచించము. అవసరము వచ్చినప్పుడు దానినొక పరికరముగ నుపయోగింతుము. చీపురు పుల్ల వైభవము వర్ణనాతీత మనియు, నలుమోముల దైవము కాని, రెండు వేల నాలుకలు గల నాగేంద్రుడు కాని చీపురుపుల్ల మహిమ నభివర్ణింపలేరని కవి వచించెను. అతి సామాన్యమైన చీపురు పుల్లపై పొత్తము రచించుటేమి? అని పరిహసించి పండ్లిగిలించు వారి పెదవులను చీల్చి హెచ్చరింపుమని కవి చీపురు పుల్లను కోరెను. వామనుడు బలి నణచుటకు వచ్చినప్పుడు రాక్షసుల గురువు శుక్రాచార్యుల కన్ను పొడిచినట్లు నేటి రాక్షసులను కూడ శిక్షింపు మని కవి చీపురు పుల్ల నర్థించెను."[3]

ఇంకా ఇందులోని అనేక చమత్కారాలను ఆయన విపులీకరించారు. భాగ్యవంతులు తిలకం దిద్దుకోడానికి వెండి పుల్లలు ఉపయోగిస్తే, కొందరు ఎదురుగా ఉన్న చీపురు పుల్లనే ఉపయోగిస్తారని, ఆ విధంగా శ్రీ చూర్ణధారులకు నదుటిపై మహావిష్ణువు అంశాన్ని నిలపడం వల్ల చీపురు పుల్ల పుణ్యం పొందుతోందని కవి చమత్కరించారు. భూతవైద్యులు భూతాలను పారద్రోలేందుకు చీపురు నుపయోగిస్తారని, వారి దుశ్చర్యలను అరికట్టే బదులు వారికి తోడుగా ఉండడం తగదని, భూతవైద్యులే దయ్యాల వలె ప్రవర్తిస్తారని, వారొనర్చే వైద్యం క్రూరమని కవి చీపురు పుల్లను మందలించారు.

చీపురు పుల్లకు మానవీయ, దృక్పథంతో సానుభూతిని ప్రకటించడం మరొక వైచిత్రి. స్త్రీ పురుషులు విపరీతంగా లావెక్కుతుంటే – చీపురు పుల్ల మాత్రం చిరకాలం నుండి చిక్కిపోతున్నదని కవి చమత్కరించారు. 'చీపురు పుల్లలా సన్నబడడం' అన్న జాతీయం నుండి కవి ఈ భావాన్ని స్వీకరించి ఉంటారు. ఈ పద్యాన్ని గమనించండి –

*"హరి మధ్య నడుము రోలై*
*పరగ గనగ నర కరములు బలు రోళ్ళై బల్*
*పెరుగుచునుండిన, నీ విటు*
*చిరకాలము చిక్కియుందు చీపురు పుల్లా !"*[4]

అలాగే క్రీ.శ. 1814–1894 మధ్య జీవించిన చిరుమర్రి నరసింహ కవి పొగాకును గూర్చి 14 పాదాల చంపకమాల వృత్త మాలికను రచించి వస్తు పరమైన నవ్యతను ప్రదర్శించడం ఇక్కడ ప్రస్తావార్హం. మిర్యాలగూడ తాలూకా కంపాలపల్లి గ్రామవాస్తవ్యుడైన ఈ కవి రచించిన ఈ కృతిలోని ఒక 4 పాదాలను మచ్చుకు పేర్కొంటున్నాను.

*"ప్రొద్దున లేచి ధూమ్రదళ పుంజము కన్నుల కద్దుకోని, దా*
*ముద్దుగ చుట్ట దీర్చి, తన మోము పయిం ఘటియించి, మీసముల్*
*దిద్ది, పొగాకు వేడియును ధీజన కోటికి మోదమిచ్చి, తా*
*పెద్దల పేరు జెప్పి, పొగ బీల్చిన వాడు కృతార్థు డిమ్మహిన్"*[5]

ఇదే విధంగా 'తెలుగు నాడు' కావ్యంలో దాసు శ్రీరాములు కవి 'పొడుము'ను గురించి వ్రాసిన పద్యం కూడా 19వ శతాబ్ది తెలుగు సాహిత్యంలో వస్తు నవ్యతకు అద్దం పడుతుంది.

*"పాటి పొగాకు బై పయి మడ్డి గల బారు*
*దళసరి కొమ్మ ముక్కలు గ్రహించి*
*నడి మీనె దివిచి, చొప్పడ గణకణలాడు*
*మేలైన నిప్పుల మీద గాచి,*
*మంటి కొసను నల్చి, మంచి కర్రను నూరి,*

*తడి యొత్తి, సున్న మింత తగవైచి*
*నేర్పుతో గమ్మని నేయి కొంచెమ బోసి,*
*పొలుపైన వన్నెరా బొడుము జేసి*

*వెండి పొన్నూత గొలుసు బొబ్బిలి పసందు*
*సోగ మారెడు బుర్ర బోసుకొని, రొండి*
*నిడి, దలచినప్డు కించిత్తు పొడి గ్రహించి*
*బుర్రుమన బీల్చు బాపని ముక్కె ముక్కు!"*[6]

శ్రీరాములు కవి ఈ కావ్యంలో వివరించిన వివిధ రకాల బ్రాహ్మణ శాఖలు, వారి ఆచార వ్యవహారాలు, భాషా పద్ధతుల వివరాలు కూడా వస్తు నవ్యతే కదా! ఇంకా ఈ కావ్యంలో ఆయన తెలుగు వారు జరుపుకొనే వివిధ రకాల పండుగలను గురించి కూడా పద్యాలను రచించారు. వస్తు నవ్యతకు ప్రతీకలుగా నిలిచే ఈ పండుగ పద్యాలలో నుండి మచ్చుకు దీపావళి పండుగ పై ఆయన రచించిన పద్యాన్ని చూద్దాం –

*"చిటపట టుప్పుటప్పునెడి సీమ టపాకులు పెట్టెలెన్ని, యు*
*ద్భటముగ ఢమ్ముఢమ్మను టపాకుల వెన్ని మతాబులెన్ని, పి*
*క్కటిలెడి ఝిల్లు లెన్ని, మరి కాకర పూవతు లెన్ని, గాల్తురో*
*దిటముగ దెల్ప నా తరమె దివ్వెల పండుగ రేయి నర్భకుల్!"*[7]

ఇలా చిన్న, చిన్న అంశాలను తీసుకొని పద్య ఖండికలను రచించి, వాటినన్నిటినీ ఒక చోట గుదిగ్రుచ్చి కావ్యరూపంలో ప్రచురించిన ఇతర కవులలో 'శ్రీ సూక్తి వస్తు ప్రకాశకము', 'వసురాయ చాటుప్రబంధము' రచించిన వడ్డాది సుబ్బరాయ కవిని, 'ఆంధ్ర పద్యావళి' రచించిన ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మను కూడా పేర్కొనవచ్చు. ముఖ్యంగా 'శ్రీ సూక్తి వసుప్రకాశకము' (క్రీ.శ. 1884) లో సుబ్బారాయ కవి – వినయము, కాలము, ఉద్యోగము, విద్య, సంభాషణము, స్నేహము, పరోపకారము, భూతదయ, క్రోధము, ఆశ, ఆపత్సంపదలు, దాతృత్వము – ఇలా ఎన్నో వస్తువులపై ఖండ కావ్యాల వలె శీర్షికలుంచి పద్యాలను రచించారు. 'ఐకమత్యము' అన్న శీర్షికతో రచించిన పద్యాలలో ఒకటి మచ్చుకు పేర్కొంటున్నాను.



*"తల యొక దారి గాక ప్రమదంబున నల్గురు నేకమైనచో*
*దలచిన కార్యమేదయిన, దథ్యముగా నెరవేరు; బుట్టెడా*
*కలిగొని పోయి సిద్ధమగు కంచము నొద్దను గూరుచుండినం,*
*గుడుచుట యెట్లు వ్రేళ్ళయిదు గూడక వేరుగునేని? మిత్రుడా!"*[8]

(నాల్గవ పాదంలో ప్రాస భంగమయింది.)

దీనిని బట్టి 19వ శతాబ్దిలోనే పలువురు కవులు ఏ వస్తువూ అల్పమైనది కాదని భావించారని తెలుస్తున్నది. అసలు అల్పమైనదని కాకుండా శ్రీశ్రీ అన్నట్టు 'కాదేది కవిత కనర్హం!' అన్న భావనతో అనేక వస్తువులపై కవితలల్లిన కవులు 19వ శతాబ్దిలో చాలా మంది ఉన్నారని తెలుస్తోంది.

అలాగే సమకాలీన సమాజంపై, సంఘటనలపై కూడా 19వ శతాబ్దిలో అనేక కవులు ఎన్నో నవీన ప్రబంధాలను రచించారు.

**2. సమకాలీన సంఘటనాత్మక, సామాజిక వస్తువులు :**

క్రీ.శ. 1864 నవంబరు 1వ తేదీన బందరు పట్టణంలో మధ్యాహ్నం ప్రచండమైన గాలితో గూడిన వాన ప్రారంభమై పెను తుఫాను రేగింది. పగలే నగరమంతా కటిక చీకటి అలుముకొంది. రాత్రి పదిన్నర పదకొండు గంటల మధ్య 13 అడుగుల ఎత్తు కెరటం వేయితాళ్ళ ఎత్తున లేచి బందరు నగరం మీద పడి వీధులన్నీ తుడిచి పెట్టుకొని పోయింది. నగర జనాభాలో పదిశాతం కూడా బతికి బయట పడడం కష్టమైంది. ఆ తుఫానులో 2000 మంది జాలరులు బందరు సమీపంలో చనిపోయారు. బందరు, ఆ చుట్టు పక్కల ప్రాంతాలన్నీ కకావికలమైపోయాయి. ఆ దృశ్యాలన్నీ కళ్ళారా చూసిన రాయభట్ట వీర రాఘవ కవి అనే కవి 'గాలివాన సీస మాలిక' పేరిట ఒక కావ్యాన్ని ఏక ఛందంలో రచించారు. పూర్తిగా సీసపద్యమాలికగా రూపొందిన ఈ కావ్యానికి 'తుఫాను సీస పద్య మాలిక' అన్న నామాంతరం కూడా ఉంది. కవి బందరులోనే ఉండి చూచిన హృదయ విదారక దృశ్యాలను ఈ కావ్యంలో కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. బహుశః కవి జీవిత కాలంలో ఏర్పడ్డ ఒక ప్రకృతి వైపరీత్యాన్ని కళ్ళారా చూచి వెంటనే కావ్యంగా అల్లడం ఇదే ప్రథమమేమో! 19వ శతాబ్దిలో తొలిసారిగా తెలుగు సాహిత్యంలో

రూపుదిద్దుకొన్న వస్తు నవ్యతలలో ఈ సంఘటనాత్మక వస్తు నవ్యత ఒకటి. ఈ కవిని గూర్చి, ఈ రచనను గూర్చి 'తెలుగు సాహిత్యకోశము'లో ఇలా పేర్కొని ఉంది–

"వీర రాఘవ కవి (1820–1910) సంప్రదాయ రీతిలో సలక్షణంగా రచనలు చేసిన పండితులు. కార్వేటి నగర సంస్థానానికి చెందిన అష్టదిగ్గజాలలో ఒకరు. వేంకట పెరుమాళ్ళరాజుబహద్దరు ఆస్థానంలో గౌరవాదరాలు పొందారు. బందరులో 1–11–1864న వచ్చిన తుఫానును వర్ణిస్తూ వీరు రచించిన సీస మాలిక చారిత్రకంగాను, సాహిత్యపరంగానూ విలువైనది. ఆ సంఘటనను ప్రత్యక్షానుభవంతో వర్ణించి ప్రకటించిన రచనలలో వీరిదే మొదటి రచన"[9]

ఇక ఈ సీసమాలికలోని విశేషాలను పరిశీలిద్దాం. కావ్యారంభంలో కవి ఈ గాలివాన ప్రారంభమయిన తిథి, వారాలను, తుంపరలుగా మొదలైన వాన జలప్రళయంగా మారిన వైనాన్ని కవితాత్మకంగా వర్ణించారు.

*"రక్తాక్షి సంవత్సరంబున కార్తీక*
*శుద్ధమందున భూమి సుతదినంబు*
*విదియ నాడుదయంబు మొదలౌతుషారంబు*
*లంతంత కెక్కువై యంతకముగ*
*ప్రొద్దు గ్రుంకెడి వెన్క పొగరౌ తుషారంబు*
*గాలి వల్లనె లావు గాలి కీలి*
*ఉత్తరంబున బుట్టి మొత్తన పెళ్ళగిల్*
*కూకటి వేళ్ళతో కూలె తరులు –*
*అచలంబు లల్లాడె – అవని తల్లడమొందె*
*దక్షిణ దిక్కంత తక్షణమున*
*నాతత సేతు శీతాచల మధ్యన*
*తెలియ జెప్ప న్నారు దేశములను*
*ద్వారక తొల్లి దూర్వాసు శాపంబున*
*నమరేంద్రు శ్రీకన్య నడగినట్లు*
*బందరు పురలక్ష్మి బలువు దుర్దశ బొందె –*
*మూడె – ఉప్పెన లోన మునుగు కొరకు!"*[10]

కవి ఈ కావ్యంలో తాను కళ్ళారా వీక్షించిన దృశ్యాలను మన కళ్ళకు కట్టేట్లు వర్ణించారు.

*"గాఢాంధకారమై ఘన ఘన జ్యోతులు*
*కటికి రక్తచ్ఛాయ గడలుకొనగ*
*లసమాన తరమైన లవణ సముద్ర త*
*రంగంబు లాకాశ గంగతోడ*
*సంగమ క్రియకునై జనియెనో యనురీతి*
*వెయ్యోజనంబులు వెనుక దీసె*
*రాఘవ లంకలో లక్ష జోతులు జూచి*
*దుమికిన దొంగ ప్రొద్దున్న తరిని*
*హంసల దీవి మూలందున బయలెక్కి*
*వరదగా పరిపించె ధరణి మీద*
*వెయి తాళ్ళ యెత్తున వెడలుపు నిడు పొచు*
*దరి పల్లెటూళ్ళు ముందరగ ముంచె"*

అలా నష్టపోయిన అనేకమైన ఊళ్ళను గురించి, బందరు పట్టణంలో మునిగిన సరికెల్లి (Circle) పేట, కలకటెర్ కచ్చేరి మొదలైన వాటి గురించి విపులంగా వివరించారు. నష్టపోయిన వస్తువులను గురించి, అలాగే ప్రవాహంలో కొట్టుకపోయిన ఆభరణాలు, ఇతర వస్తువులను గురించి చాలా వివరంగా తెలియజేసారు.

*"వైశ్యకుల సరుకులు వర్తకుల సరుకులు (గణ భంగాలున్నాయి)*
*కొబ్బరి బెల్లంపు కొట్లు గిట్లు*
*నేతి సిద్దియలు, ఆవాలు వెల్లుల్లి (గణ భంగాలు, యతిభంగాలు*
*ఆకులు పొగాకుల పెండెలు – ఇలా అక్కడక్కడా ఉన్నాయి.)*
*చింత పండుప్పును జీలకర్ర మెంతులు*

మిరియాల్ లవంగాలు మోడి పిప్పలి"
"కంటెలు నానులు కంకణాల్ కడియాలు
ముక్కు పోగులును, చేర్చుక్క బొట్లు
నడుము వడ్డాణాలు నాను కోళ్ళును మరి
రాగిళ్ళు శశిపువ్వు రంగు మీర
కోటి సొమ్ములు బోయి కోట్లనే గలిసెను
(ఇక్కడ సగం పాదం ఎగిరిపోయింది)
కరవాలు, బిందెలు, కంచాలు పీటలు
రాటాలు, రథచయములు....."

ఇంకా మృత్యువు బారిన పడి కొట్టుకుపోయిన జంతువులు, పక్షులను గురించి సవిస్తరంగా వివరించారు. అలాగే ప్రవాహంలో కొట్టుకు వస్తున్న మానవ శవాలను గురించి హృదయ విదారకంగా వర్ణించారు.

*"కనక దుర్గమ్మ ముక్కరగ తీతని పూని*
*వాడ వల్లియు గాంచి వార్ధి తిరిగె*
*చిక్కని చక్కని స్త్రీ శవంబుల జూచి*
*మోర లెత్తెత్తేడ్చి మొరయు వారు*
*పట్టె మంచాలపై పతి, సతి రతి గూడి*
*వదలక కొట్టుక వచ్చువారు*
*సొమ్ము మీదాశలు నెమ్మెమ్మిడవ లేక*
*దయ్యంబులై వెంట దగులు వారు"*[11]

పైన కొన్ని పాదాలలో ఉన్న గణభంగాలు, యతిభంగాలు ఎత్తి వ్రాయు లేఖకులు చేసిన తప్పులై ఉంటాయి. ఎందుకంటే కవి ఛందోవిజ్ఞానం, భావుకత ఇతర భాగాలలో ప్రస్ఫుటంగా గోచరమౌతున్నాయి. ముఖ్యంగా 'పట్టె మంచాలపై పతి, సతి రతి గూడి వదలక కొట్టుక వచ్చువారు' వంటి దృశ్యం ఇటీవల వచ్చిన 'టైటానిక్' ఆంగ్ల చిత్రంలో చిత్రీకరించబడింది. చలన చిత్రాలే పుట్టని 19వ శతాబ్దిలోనే (క్రీ.శ. 1864 ప్రాంతంలో) కవి ఇలాంటి దృశ్యాన్ని కవిత్వం ద్వారా చిత్రించడం ఆయన దార్శనికతను, భావ శబలతను తెలియజేస్తున్నాయి. ఇలాంటి కావ్యాలు తమ దృష్టిలో పడకనే పింగళి లక్ష్మీకాంతం వంటి సాహితీ వేత్తలు 19వ శతాబ్దిని క్షీణయుగంగా పేర్కొని ఉంటారని భావించవలసి ఉంటుంది.

అలాగే గోదావరినదికి వచ్చిన వరదలపై మరొక ప్రఖ్యాత కవి ఒక చాటు ప్రబంధాన్ని వెలయించారు వడ్డాది సుబ్బరాయ కవి. క్రీ.శ. 1886 ప్రాంతంలో 'గౌతమీ మహాజల మహిమాను వర్ణనము' పేరిట రచించిన కావ్యంలో గోదావరి నదిని గూర్చి వరద ఉధృతి వలన కకావికలమైన రాజమహేంద్ర వరాన్ని గూర్చి నాలుగు వందల ముప్పయి పాదాల చంపక మాలా వృత్త మాలికలో వర్ణించారు. ఆంధ్ర మహాభారతం అవతారికలో రాజ రాజ నరేంద్రుడు నన్నయను తమ వంశీయుల చరిత్రను వ్రాయుమని అభ్యర్థించినట్లుగా ఉండడం మనకు విదితమే. ఆపైన చాలా మంది కవులు భగవంతుడు కలలో కనిపించో లేక తమను పోషిస్తున్న రాజులో, జమీందారులో ఫలానా కావ్యాన్ని రచించుమని కోరినట్టుగానో వ్రాసుకోవడం మనకు తెలుసు. కాని వడ్డాది సుబ్బరాయకవి ఈ కావ్యాన్ని హామ్నెట్ అన్న ఒక తెల్ల దొర రచించుమని కోరినట్లుగా వ్రాసుకోడం ఒక నవ్య విషయం. బహుశః ఒక విదేశీయుని కోరికపై తెలుగులో కావ్య రచన ఇదే ప్రథమమేమో! ఆపైన కూడా ఇటువంటి సందర్భాలున్నట్టు కనిపించవు.

*"పొలతియు, దాను హామ్నెటు విభుండు, సరూపములున్ సమోన్నతం*
*బులునగు నుత్త మాశ్వముల ముచ్చట నెక్కి యెదుర్పడంగ, నే*
*జెలగి సలామొనర్ప, దమ స్నేహపు వెల్లికి నుద్ది యౌచు రం*
*జిలు ఝరి జూపి, నన్ను "మునిషీ ! నదిపై నొక చిన్న కబ్బమున్*
*సలుపు మటంచు లే నగవు జంద్రిక నక్షి చకోరముల్ ప్రకా*
*శిల, దయ నానతిచ్చుటయు, జిత్తమటంచును వీడికొంటి...."*[12]

రాజమహేంద్రవరంలో సబ్‌కలెక్టర్‌గా పని చేసిన హామ్నెట్ దొర తన వద్ద కొంత కాలం తెలుగు నేర్చుకోవడం వల్ల తనను "మునిషీ"! అని పిలిచే వాడని కవి వివరణ నిచ్చారు.

సుబ్బరాయ కవి ఈ కావ్యంలో ముందు అనావృష్టి ఏర్పడినప్పుడు పరిస్థితులను వర్ణించి, తరువాత అతివృష్టి ఏర్పడ్డాక పొంగిపొర్లుతున్న గోదావరి వరద ప్రవాహంలో కొట్టుక పోయిన అనేక వస్తువులను వర్ణించి, ఆ రెండు పరిస్థితులలోని తారతమ్యాన్ని పాఠకుల కళ్ళకు కట్టారు.

*"కలిగిన వేసగిం బొగిలి గ్రామము లాహుతులయ్యె; నెయ్యెడన్*
*గొలకులు శూన్యమయ్యె; మడుగుల్ బయలయ్యెను; వంకలింకె; గ*
*య్యలు వృథయయ్యె; బావు లడుగంటెను; గుంటలు, నూతులుం, దొనల్*
*చెలమలు వట్టె; నేళ్ళిగిరె, జెర్వులు, దొర్వులు శోషిలెన్; మహా*
*ప్రళయమునందు బోలె జలభాగములన్నియు రూపు మాయగా,*
*మలమల మాడె సస్యములు; మంగల మందలి పేల గింజలుం...."*

-----------------------------------------------------

-----------------------------------------------------

*"తలుపులు, ద్వారబంధములు, ద్రావులు, బెండెలు వాసముల్, దనా*
*బులు, గిటికీలు, దూలముల్, బొంగులు, గుజ్జులు గంబముల్ మొదల్*
*గల కణజంబులుం, బెసలు, గందులు, సెగ్గలు, మిన్మ లన్ములుం..."*[13]

ఆనాటి వరద బాధితుల మనోభావాలను కూడా కవి చాలా సహజంగా చిత్రించారు.

*"..........మన పాలిటి కీ పెను భూత మేటికిం*
*బిలువని పేరటం బిటు లభించెను బో దనువారు, నేరయో*
*నిలువ యొనర్చె గొంపలకు నీళ్ళను వారు, శత్రుసేనయుం*
*బలె నిలు ముట్టడించె ఝురి, మా బ్రదుకెట్లనువారు, మిద్దె మే*
*డలు గల వారమే? యెచట దాగుదు మేమను వారు, నాలు బి*
*డ్డల మిటు పడ్డ పాటు పడటం గలిసెన్; నువు, గొర్ర, చామ, గం*
*టెలు మొదలైన పంటలు మునింగె గటా! యనువారు, జాలుమున్*
*గలకను గాళ్ళవ్రేళ్ళబడి, క్రన్నన బైరును జుట్టు ముట్టె బెన్*
*జలమున, నీచ వర్తనుల నైజమిదే యను వారు, డ్రాగనున్*
*జలములు లేకనాడు, బశు సస్య గృహాదులు ముగ్గినేడు, మే*
*మలమర నయ్యె జూడు – దతి యన్నిట గీడను వారు...."*[14]

వసురాయకవిగా ప్రసిద్ధులైన వడ్డాది సుబ్బరాయ కవే, క్రీ.శ. 1884లో "గోదావరి ధూమ నౌకా విహారము" అన్న మరొక వస్తు నవ్యత గల చాటు ప్రబంధాన్ని కూడా రచించారు. కవి ఒక ఆదివారం సెలవు దినాన – జేవలి సోమయ, మంగు వేంకటాచలం, నిడమర్తి దుర్గయ, జోగిలింగం అనే నలుగురు మిత్రులతో కలిసి గోదావరి లో పొగనావపై బొబ్బరిలంకకు 'సికారు'గా వెళ్ళిన ఉదంతాన్ని వస్తువుగా నెంచుకొని కావ్య నిర్మాణం చేయడం నిజంగా అద్భుతం. 19వ శతాబ్దిలోనే ఇలాంటి నవ్యమైన ఆలోచనతో కావ్యాన్ని నిర్మించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. తెలుగు సాహిత్యంలో ఇలాంటి కావ్యాలు చాలా అరుదు అని చెప్పక తప్పదు. కొన్నాళ్ళ క్రితం తెలుగులో 'అందాల రాముడు' అన్న చలన చిత్రం, ఇటీవల 'గోదావరి' అన్న చలన చిత్రం ఇలాంటి కథా వస్తువుతోనే రూపొందడం మనకు విదితమే.

కవి ఈ కావ్యంలో నౌకా విహారంలో కలిగిన ప్రత్యక్షానుభూతులను చక్కగా వర్ణించారు. ధూమనౌక వేగంగా ముందుకు వెళుతున్నప్పుడు ఒడ్డుపై నున్న చెట్లు, ఇళ్ళు, మేడలు వెనుకకు పరిగెత్తినట్లు కనిపించడాన్ని "ప్రళయము పుట్టినట్టులు ధరాజము, లిండ్లును, మేడలున్ మనుష్యుల వలె బర్వులెత్తె" అని వర్ణించారు. "ధూమనావ శరవేగమునం జనుచుండునప్పు డవ్వలి దరి నుండి వచ్చు పడవల్ పెనుగాలికి నెత్తి నట్టి చాపల గర మేటవా లగుచు, వంగి సలాములు సేయు భృత్యులుం బలె నెదురయ్యె" వంటి పద్యపాదాలు కవి భావనా పటిమకు అద్దం పట్టాయి. నౌకా విహారం చేస్తూ వీక్షించిన అనేక విషయాలను ప్రయాణికులు ఆ సమయంలో మాట్లాడుకున్న విషయాలను, తదితరాలను కూడ కవి చాలా విపులంగా వివరించారు.

*"..... యట పైనొక గుట్టను జూపు మేరలో*
*విలసిలు దూర్పువైపున హవేలి యొకండది జూచి, పూర్వమా*
*స్థలమున బాలెముల్ దిగుట, దద్గృహముం బడవాలు వాసమున్*

*సలుపగ గట్టిరంచు ముదుసళ్లొక కొందరు సెప్ప వించు, న*
*వ్వల ధవళాద్రి నెత్తమున స్వామి జనార్దనాలయంబు న*
*ర్మిలి గని, రాజశేఖర చరిత్రమునం గవి లింగ మచ్చపుం*
*బలుకుల దేట తెల్లముగ వ్రాసిన యంశములన్ దలంచుచున్...*”[15]

అంటూ ఆయా ప్రదేశాలను చూచినప్పుడు సాటికవి వీరేశలింగం రచించిన 'రాజశేఖర చరిత్రము'లోని అంశాలను గుర్తుతెచ్చుకొని "అచ్చపుం బలుకుల దేట తెల్లముగ" వ్రాసారని ప్రశంసించడం సుబ్బరాయ కవి సహృదయతకు నిదర్శనం. కవి ఈ కావ్యాన్ని మొత్తంగా ఆత్మాశ్రయ రీతిలో రచించడం ఆ రోజుల్లో మరొక నవ్యతగా భావించవలసి ఉంటుంది.

వినూత్నమైన వస్తువుతో 19వ శతాబ్దిలో ఒక నవ్య కావ్యంగా రూపుదిద్దుకొన్న ఈ 'గోదావరి ధూమనౌకా విహారము' రస దృష్టితో చూచినా ఒక ఉత్కృష్టమైన కావ్యమని అంగీకరించక తప్పదు.

ఇంతకు ముందు అధ్యాయంలో వివరించినట్లు, క్రీ.శ. 1860లో మతుకుమల్లి నృసింహకవి రచించిన 'చెన్నపురీ విలాసము' లో కూడా కవి తాను ప్రత్యక్షంగా చూచిన ఒక ఆధునిక మహా నగరాన్ని (చెన్న పట్నం) వర్ణిస్తూ రచించడం వస్తు నవ్యతగా భావించవచ్చు. అదే స్ఫూర్తితో ఆయన సోదరుడు మతుకుమల్లి కృష్ణశాస్త్రి రచించిన 'మచిలీ బందరు చరిత్రము' క్రీ.శ. 1879లో వెలువడింది. క్రీ.శః 1862లో కొప్పరాజు నరసింహకవి రచించిన ఆధునిక క్షేత్రమాహాత్మ్యకావ్యం 'శ్రీమత్త్రి కూటాచల మాహాత్మ్యము'లో కోటప్పకొండ జాతరను వర్ణించిన తీరు వస్తునవ్యతకు అద్దం పడుతూంది. కవి సకుటుంబంగా క్రీ.శ. 1852లో శివరాత్ర్యుత్సవానికి వెళ్ళినపుడు కళ్ళారా వీక్షించిన జాతర దృశ్యాలను పఠితలకు కళ్ళకు కట్టేలా వర్ణించారు. ముఖ్యంగా జాతర రోజు కొండపైన, కొండ క్రింద గల విపరీతమైన భక్తుల రద్దీని, ఉత్సవాలకు తరలివచ్చిన 'ప్రభల'ను వర్ణిస్తూ, అందులో తన భావుకతను కూడా కొంత జోడించి కవి రచించిన ఈ పద్యం కడు రమణీయం.

"*పై నున్న జనము లాపైన నిల్చిన యట్టి*
*ప్రభలకు గట్టు దర్పణములందు*
*క్రింది యుత్సవముల బొందుగా నీక్షించి*
*బహుళోత్సవంబు లీ పర్వతమున*
*బరగుచున్నవటంచు భ్రాంతిచే భావించి*
*యందె నిల్చిరి; గిరి క్రింది జనులు*
*క్రిందటి ప్రభల నింపొందు నద్దములందు*

*కుధరంబుపై నుండు గుడిని గాంచి*
*ఇచటి భక్తుల బ్రోవ గోటీశ్వరుండు*
*పరగ గుడితోడ గ్రిందికి వచ్చెననుచు*
*భ్రాంతి నీక్షించి యచటనే పాయకుండు*
*రద్భుతము గాదె యాచంద మరసిచూడ!*" [16]

అలాగే కట్టమంచి రామలింగారెడ్డి రచించిన 'ముసలమ్మ మరణం' కావ్యం కూడా సమకాలీన సంఘటన పై వ్రాసింది కాకపోయినా, కవి గతంలో జరిగిన ఒక యథార్థ సంఘటనను కావ్యంగా మలచడం వస్తు నవ్యతే కద! క్రీ.శ. 1899లో రచింపబడిన ఈ కావ్యాన్ని కవి, బ్రౌను దొర ప్రకటించిన 'అనంత పుర చరిత్రము' అన్న గ్రంథంలో పేర్కొన్న ఒక వాస్తవ ఘటనను ఆధారంగా చేసుకొని రచించినట్టు చెప్పుకొన్నారు. గ్రామ క్షేమం కొరకు ఆత్మ త్యాగం చేసిన ఒక గృహిణి కథను రెడ్డిగారు కరుణారసపూరంగా చిత్రించినవైనాన్ని ఇంతకు ముందు అధ్యాయంలో వివరించడం జరిగింది.

ఇలా 19వ శతాబ్దిలోనే సాధారణ వస్తువులపై, సమకాలీన సమాజంపై మరియు సంఘటనలపై నవ్య దృష్టితో కావ్యాలను రచించి వస్తు నవ్యతను ప్రదర్శించిన కవులుండడం గమనించాలి. ఇలాంటి దృష్టి కేవలం 20వ శతాబ్ది నవ్య కవిత్వ యుగంలోనే ప్రారంభమయిందని భావించడం 19వ శతాబ్ది తెలుగు సాహిత్యానికి అన్యాయం చేయడమే అవుతుంది.

### 3. సోషియో ఫాంటసీ కథా వస్తువులు :

1960వ దశకంలో 'దేవాంతకుడు' పేర ఒక తెలుగు చలన చిత్రం రూపొందింది. అందులో సమకాలీన సమాజానికి చెందిన ఒక మానవుడు సజీవంగా

స్వరూపంతో యమలోకానికి వెళ్ళి యమధర్మరాజుతో, ఇతర పురాణ పాత్రలతో వాగ్వివాదాలకు దిగుతాడు. అలాగే 1970వ దశకంలో 'దేవుడే దిగి వస్తే' అన్న చలన చిత్రంలో శ్రీకృష్ణ పరమాత్మ భూలోకానికి వచ్చి, ఒక మధ్య తరగతి కుటుంబికునికి సంసార సాగరాన్ని ఈదడంలో మార్గదర్శనం చేస్తుంటాడు. ఇలా ప్రాచీన పురాణ పాత్రలను సమకాలీన సమాజంలోని పాత్రలను కలిపి నడిపిన కథలను ఆంగ్లంలో 'సోషియో ఫాంటసీ' లని అంటారు. అసలు చలన చిత్రాలంటేనే తెలియని 19వ శతాబ్దిలోనే తెలుగు సాహిత్యంలో 'సోషియో ఫాంటసీ' కథా వస్తువులతో కావ్యాలు వెలువడ్డాయంటే అచ్చెరువొందక తప్పదు.

సుప్రసిద్ధ కవి శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833–1897) మొట్ట మొదటి సారిగా 'రాధా కృష్ణ సంవాదము' అన్న కావ్యంలో ఇలాంటి ప్రయోగం చేశారు.

వేంకటగిరి సంస్థాన పాలకుడైన సర్వజ్ఞకుమార యాచేంద్రులు తమ జ్యేష్ఠ కుమారులైన రాజగోపాల కృష్ణ యాచేంద్రులకు రాజ్యాభిషేకం చేసిన సందర్భంలో ఆ మహోత్సవాలను వర్ణించి చెప్పిన రచన ఇది. ఈ పట్టాభిషేక మహోత్సవాలు క్రీ.శ. 1879లో జరిగినట్లు ఆచార్య తూమాటి దొణప్ప పేర్కొన్నారు.[17] కాబట్టి క్రీ.శ. 1833–1897 మధ్య జీవించిన మండపాక పార్వతీశ్వర కవి ఈ కావ్యాన్ని క్రీ.శ. 1880–1885 ప్రాంతంలో (తన 50 ఏళ్ళ వయసులో) రచించి ఉంటారని భావించవచ్చు. ఈ కావ్య ప్రశంస 'తెలుగు సాహిత్యకోశము'లో ఇలా ఉంది – "పురాణ పాత్రలతో సమకాలికమైన ఇతివృత్తాన్ని చెప్పించటం దీనిలోని విశిష్టత. కావ్యమంతటా శబ్దాలంకారాలు, శ్లేష చమత్కృతులు, వక్రోక్తి నైపుణ్యం, చమత్కార సంఘటనలు, స్వాభావిక వర్ణనలు ఉన్నాయి. కవి పాండితీ ప్రకర్షలను చాటుతున్న రచన ఇది"[18]

ఇక కథా వస్తువు విశేషాల్లోకి వెళితే, రాజగోపాల కృష్ణయాచేంద్ర పట్టాభిషేక మహూత్సవాన్ని వీక్షించడానికి ఇంద్రుని కుమారుడైన జయంతుడు వచ్చి ఆ వైభవాన్ని చూచి, తనకా భాగ్యం లేదని నిర్వేదం పొందడం ఒక వైచిత్రి. ఇలా ఒక సమకాలీన సమాజంలో జరిగిన ఒక సంఘటనలో ఒక పురాణ పాత్రను ప్రవేశ పెట్టడం వల్ల దీనిని 'సోసియో ఫాంటసీ' కథగా మనం చెప్పవచ్చు. పార్వతీశ్వర కవి గూడా అందుకే దీనిని 'చిత్ర కథ' అని పేర్కొన్నారు. అంతే కాదు ఈ కావ్య నిర్మాణాన్ని 'జగదాశ్చర్య చర్య'గా ప్రస్తుతించుకొన్నారు. కథా ప్రారంభంలోని ఈ భాగాన్ని చూస్తే మనకు ఈ విషయం బోధపడుతుంది.

*"వ – అనియిట్లు సకలోపకారణం బగుచు బెన్నిధియై రాజిల్లిన శ్రీ రాజగోపాల కృష్ణ స్వామి సన్నిధిం గల్పించుకొని, కొనియాడి పోషకానుమతిం దనరి నేనొనరింప బూనిన శ్రీ రాధాకృష్ణ సంవాదంబను జగదాశ్చర్య చర్యకుం బ్రారంభం బెట్టిదనిన– "*[19]

అని ఆపైన "శ్రీరాధాకృష్ణ సంవాదాంతర్గత చిత్ర కథారంభము" అన్న శీర్షిక నుంచి కథా కథనాన్ని ప్రారంభించారు.

ఇందులోని కథా లక్ష్యం వేంకటగిరి సంస్థానాధీశులైన వెలుగోటి వంశీయుల చరిత్రను, రాజగోపాలకృష్ణ యాచేంద్రుల పట్టాభిషేకం వరకు వర్ణించి చెప్పడం. ఆ సమకాలిక ఇతివృత్తాన్ని పురాణ పాత్రలైన రాధాకృష్ణుల మధ్య సంవాదంగా చెప్పడం ఇందులో నవ్యత. దానికి భూమికగా జయంతుని ఘట్టాన్ని కమనీయంగా కల్పించారు కవి. రాజగోపాలకృష్ణ యాచేంద్రుల పట్టాభిషేకాన్ని వీక్షించిన జయంతుడు తనకా యోగం లేదని నిర్వేదం పొందినప్పుడు ఇంద్రుడు కోపించి, బృహస్పతిని పిలిపించి, అతని ఎదుట తన పుత్రుని చీవాట్లు పెడతాడు. ఇదంతా చూసి కృష్ణ పరమాత్మ నవ్వుతాడు. అకారణంగా హసించడానికి కారణమేమిటని రాధ అడుగగా, శ్రీకృష్ణుడు పైన పేర్కొన్న విధంగా వెలుగోటి వంశ చరిత్ర మొదలుకొని రాజగోపాలుని పట్టాభిషేక మహూత్సవం వరకు వివరించి చెప్పినట్లుగా కల్పన చేసారు కవి.

మండపాక పార్వతీశ్వర కవి విద్వత్కవి. కావ్యమంతా విశేషమైన చమత్కారాలతో శ్లేషాలంకారాలతో రమణీయంగా తీర్చి దిద్దారాయన. మచ్చుకు ఒక చిన్ని పద్యాన్ని గమనిద్దాం.

పట్టాభిషేక మహోత్సవానికి పిఠాపురం మహారాజు రాత్రి వేళ వచ్చిన సందర్భంలో –

"మనమునందు దదీయాగమనమునందు
ద్వి విధమై తమి దోచె - దిద్విధ జనుల
కుభయమును రాజదర్శన ప్రభవమయ్యె !
గరము స్నేహ రసోద్దీపకంబునయ్యె!" [20]

వేంకటగిరి యందు వివిధ జనులకు మనసులో ఆ పిఠాపురం మహారాజు రాకతో రెండు రకాలుగా 'తమి' కలిగింది. కవి ఈ 'తమి' శబ్దంలో శ్లేషను ప్రక్షిప్తం చేశారు. ఇక్కడ 'తమి' అంటే 'సంతోషము' అని ఒక అర్థం. 'చీకటి' అని మరో అర్థం. రాజు రాకతో సంతోషము కలిగిందని ఒక అర్థం. రాత్రి వేళ రావడం వలన చీకటి తోచిందని మరో అర్థం. అప్పుడు వారికి 'ఉభయము' అనగా రెండు విధాల 'రాజ దర్శన' మయింది. మళ్ళీ 'రాజ' శబ్దానికి అర్థాలు - ఒకటి - రాజు అంటే పిఠాపురం మహారాజు దర్శనమయిందని. రెండు - 'రాజు' అంటే చంద్రుని దర్శనమయిందని. రాత్రి వేళ కాబట్టి రెండు విధాలుగా రాజ దర్శనమయిందని చమత్కరించారు కవి. 'కరము స్నేహ రసోద్దీపకంబునయ్యె' అనడంలో కూడా రెండర్థాలు ఉన్నాయి. 'స్నేహము' అంటే మైత్రీ భావం. 'స్నేహము' అంటే చమురు. ఆ రాత్రి వేళ రాజాగమనం వలన ప్రజలలో ఆయన పట్ల మిక్కిలి స్నేహ భావం ప్రకాశించిందని ఒక అర్థం. రాత్రి వేళ రాజు రావడం వలన ప్రజలు చమురు పోసి దీపాలు వెలిగించారని ఆ వాక్యానికి మరో అర్థం. ఎంత రసాంచితమైన పద్యం!

మరో చమత్కార పద్యం చూద్దాం.

గౌడె నారాయణ గజపతి రాయ ప్రభువు వేంచేసాడని వార్తాహరుల ద్వారా తెలుసుకొని వేంకటగిరి మహారాజు ఎదురేగిన సందర్భంలో -

"అని చారులు దెలుపగ దా
విని చారు ముఖాబ్జు డతడు వేగ మెదురుగా
జని, చేరువను నృతనిం
గని జేరుచు కొనియె గరము గరము గరమునన్!" [21]

గజపతి రాయడు వచ్చాడని చారులు తెలియజేయగా అందమైన పద్మం వంటి ముఖం కల వేంకట గిరి రాజు వేగంగా ఎదురేగి దగ్గరికి చేరి, అతనిని చూచి, 'కరము కరము కరములో' చేర్చుకొన్నాడట. ఇక్కడ ఒక 'కరము' అంటే మిక్కిలి. ఇంకో 'కరము' అంటే గజపతి రాయని హస్తం. మరో 'కరము' తన స్వీయ హస్తం. వేంకట గిరి రాజు మిక్కిలి అభిమానంతో తన చేయిలోనికి అతని చేయిని గట్టిగా చేర్చుకొన్నాడు. అంటే మిక్కిలి అభిమానంతో గట్టిగా 'కరచాలనం' చేశాడన్న మాట.

కావ్యమంతటా ఇలాంటి చమత్కారాలు, శ్లేషార్థాలు కుప్పలు పోసారు మండపాక వారు. వస్తు నవ్యతే కాకుండా రస దృష్టితో చూసినా ఈ కావ్యం ఒక ఉత్తమోత్తమ కావ్యం అన్నది నిర్వివాదాంశం.

మహాకవి మండపాక పార్వతీశ్వరశాస్త్రి సమకాలీన సమాజంలోని వస్తువులో పురాణ పాత్రలను కలగలిపి కావ్య రచన చేస్తే, తూము రామచంద్రారెడ్డి అనే ఒక రాజకవి 'అలమేలు మంగా పరిణయము' పేరిట ఒక పురాణ కథను కల్పించి, దానిలో స్వయంగా తానే ఒక ప్రధాన పాత్రగా పొందుపరచుకొని కథను నడపడం మరొక రకమైన సోషియో ఫాంటసీగా భాసిల్లింది. ఈ కవి 'మహబూబునగర్' జిల్లాలో ఒకప్పుడు సంస్థానంగా ఉండిన 'మానాజిపేట'కు అధిపతి. ఈ జమిందారు తన రాజ్యంలో అంజనగిరి అన్న కొండపై ఒక వేంకటేశ్వరాలయాన్ని నిర్మించి, తన సోదరి చేత గోపురాన్ని నిర్మింపజేసారు. ఆ దేవాలయ స్థల పురాణంగా ఈ కథను కల్పించారు. ఈ కవి నిజాం సర్కారు దివాన్ చందూ లాల్‌కు సమకాలికుడు. అనగా క్రీ.శ. 1808-1857 మధ్య ఈయన జీవించి ఉండాలి. ఈ కావ్య రచన క్రీ.శ. 1830లో చేసి ఉండవచ్చని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి ఊహించారు. [22]

19వ శతాబ్ది పూర్వార్థంలోనే రచింపబడిన ఈ కావ్యం తెలంగాణం లో వచ్చిన వస్తు నవ్యత గల అరుదైన కావ్యాలలో ఒకటిగా భావించాలి. స్థూలంగా కావ్య కథా వస్తువు ఇలా ఉంది-

శంకరుడు నారదునికి చెప్పిన కథను, సూత మహాముని శౌనకాది మహామునులకు చెప్పినట్లుగా కావ్యాన్ని ప్రారంభించాడు కవి. నారదుడు వైకుంఠానికి వెళ్ళినప్పుడు అక్కడ శ్రీ మహావిష్ణువు లేకపోవడంతో, ఆయన ఎక్కడికి వెళ్ళాడో తెలియక, శివుని వద్దకు వెళ్ళి, శివ కేశవులకు భేదం లేదు కాబట్టి, విష్ణువు జాడ చెప్పమని కోరుతాడు. అప్పుడా పరమశివుడు భూలోకంలో 'తూము రామభూపాలు'డనే ఒకరాజు (కృతికర్తయే) ఉన్నాడని, అతని భక్తి విశేషాలను

గమనించిన విష్ణువు అతనికి దర్శనమీయ తలంచాడని వివరించాడు. అంతకుముందే, వైకుంఠంలో లక్ష్మీదేవి తన ప్రాణనాథుని

*"ఏ తత్కలి యుగమందున*
*భూతలమున సకల జనులు పుణ్య విహీనుల్,*
*పాతకు, లఘ యుక్తులు, నా*
*జేతను లేరీతి నిన్ను జేరెద రనఘా?"* [23]

అని ప్రశ్నిస్తుంది. దానికి విష్ణువు "పాపపు జనులన్ బాలింప దగునె?" అని అంటాడు. అప్పుడు లక్ష్మీదేవి "దీనులన్ బ్రోవక మీకు దీనజన పోషణ కీర్తి యికెట్లు నిల్చెడిన్?" అని నిష్ఠురాలాడుతుంది. ఇది వరకే రామభూపాలుని అనుగ్రహించాలని నిశ్చయించుకొన్న శ్రీహరి కావాలని లక్ష్మీదేవితో కలహించుకొని, "నన్ను బరుష వాక్యంబు లాడెదవా?" అని అలిగి వైకుంఠాన్ని విడిచి వెళుతాడు. లక్ష్మీదేవి వద్దని వేడుకొన్నా వినని హరి, భూలోకంలో అంజన గిరిపై ఒక గుహలోకి చేరుకొంటాడు. అది చూచిన కొందరు గొల్లవారు ఆ వివరాలను రాజుకు తెలియజేస్తారు. కవి ఈ ఘట్టంలో పాత్రౌచిత్య భాషను వినియోగించడం గమనార్హం.

*"బొలిబొల్లి నామాలు గలమేను గలవాడు*
*సంకు సక్రాల బుజాల వాడు*
*తెల్లని ముత్యాల డొల్లు బోగుల వాడు*
*ఎద మీద నెసగు జన్నిదము వాడు*
*జలతారు వొదిగిన తల కుల్ల గలవాడు*
*వలిపంపు తగటు దువ్వలువ వాడు*
*రతనాలు దాపిన పతకంబు గలవాడు*
*సక్కని నీలాల సాయవాడు.*

*ఎవ్వడో కాని మా బదు నవ్వుకుంట*
*కాల్ల పాకోల్లు మెట్లపై బెల్లుమనగ*
*నల్ల కాటుక కొండన మెల్లనెక్కి*
*పెద్దగై లోన జొచ్చెనీ పొద్దెరాజ!"* [24]



ఈ వివరాలు తెలుసుకొన్న తూము రామచంద్రావనీపాలుడు, శ్రీమన్నారాయణుని దర్శనం చేసుకొంటాడు.

ఈ లోపు తన చెలులతో కూడి భూలోక మందు తన ప్రాణనాథుని వెదకడానికి విచ్చేస్తుంది లక్ష్మీదేవి. ఆమె అన్వేషణను కవి కరుణ రసాత్మకంగా రచించాడు.

*"సారంగ వరదుని జూడ దెల్పుడటంచు*
*సారంగముల చెంత జేర బోవు;*
*బున్నాగ శయను డెందున్నాడు - చెపుడంచు*
*బున్నాగ గణముల పొంత కేగు;*
*బుంసింహ రూపుని పొలుపు జూపు డటంచు*
*బుంసింహముల డాసి పొగడ జనును;*
*సౌకర్య వేషుడు చనిన చొప్పెది యంచు*
*సౌకర్య నివహంబు చక్కికరుగు;*

*శంబర ద్వేషి జనకుడే సదన మందు*
*గలుగునని శంబరాహితావళిని బలుకు;*
*మేర లేనట్టి వెతలచే సారసాక్షి*
*పృథుల మృగముల నడుగును బెదరి చనగ!"* [25]

ఆ పైన కృతికర్తయైన తూము రామచంద్రభూపాలుడు ఆ దంపతులిరువురి నడుమ రాయబారం నడుపుతాడు. ఆ సమయంలో లక్ష్మీదేవి తన చేతిలోని పద్మాన్ని ఆనవాలుగా ఇవ్వగా, అది పట్టుకొని శ్రీనాథుని వద్దకు ఆ భూపతి వస్తున్నప్పుడు పిల్లగాలి ఆ పుష్ప పరిమళాలను ముందుగానే శ్రీహరి వద్దకు చేర్చడంతో ఆ హరి, రమ వచ్చిందని దిగ్గున లేచి కూర్చున్నాడట.

*"ఆ వర నాథ పుంగవుడు నబ్జము గైకొని పోవుచుండ ద*
*త్పూన మనోజ్ఞ వాసన గిశోర సమీరుడు గొంచుబోయి, యా*
*దానవ వైరి సన్నిధి నుదారత జేర్చిన యంతలో రమా*
*మానిని వచ్చె - నిక్క మనుమానము లేదిక నంచు దిగ్గునన్"* [26]

ఎంత రసార్ద్ర దృష్టి ! ఎంత రమణీయ సృష్టి!

ఆ మీదట కృతికర్త తన చాకచక్యంతో జగన్నాథుని కడకు శ్రీకాంతను తీసుకొని వచ్చి, ఆ దంపతులను కలుపుతాడు. అప్పుడు శ్రీహరి రామభూపాలుణ్ణి ఏదైనా వరం కోరుకొమ్మనగా, 'మీ ఇరువురి పరిణయం కళ్ళారా చూడాలని ఉంది' అని వేడుకొంటాడా రాజు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యుగధర్మాన్ని బట్టి తమ అర్చామూర్తులను రూపొందించుకొని వేడుక తీర్చుకొమ్మని సలహా ఇస్తాడు. అందుకోసం రామచంద్రారెడ్డి భూపతి ఆ అంజనాద్రిపై ఒక దివ్యమైన శ్రీవేంకటాశ్వరాలయం నిర్మించి, అర్చామూర్తులకు కల్యాణం జరిపించి ధన్యత చెందడమే ఈ 'అలమేలుమంగా పరిణయ' ప్రబంధ ఇతివృత్తం.

అద్భుతమైన కల్పన, అపురూపమైన రచనా సంవిధానంతో సాగిన ఈ కావ్యంలో కవి, సమకాలీన సమాజంలో తాను స్వయంగా నిర్మించిన ఆలయాన్ని గురించి, తానే ఒక ప్రధాన పాత్రగా కథను నడిపించి, 'సోషియో ఫాంటసి' పద్ధతిలో వస్తు నవ్యతను ప్రదర్శించారు. అరాచకాలతో నిండిపోయిన నిజాం రాజ్యంలో, 19వ శతాబ్ది పూర్వార్ధంలో ఒక జమీందారు శ్రీకృష్ణ దేవరాయలు వలె తానే స్వయంగా కవియై తెలుగు సాహిత్యానికి చేసిన సేవకు ఈ కావ్యం అద్దం పడుతుంది.

ఇది కాక ఇంకా విచిత్రమైన కల్పనలతో కావ్య వస్తువులను రూపు దిద్దిన కవులు కూడా 19వ శతాబ్దిలో ఉన్నారు.

## 4. విచిత్ర కల్పనలతో కావ్య వస్తువులు :

క్రీ.శ. 1912లో అమెరికా దేశానికి ప్రయాణిస్తున్న 'టైటానిక్' అనే పేరు గల ఓడ రాత్రి వేళ 'ఐస్‌బర్గ్' అనే కొండను ఢీకొని ఘోర ప్రమాదానికి గురి అయింది. చాలా మంది సముద్రంలో మునిగి ప్రాణాలు కోల్పోయారు. ప్రాణ రక్షణకై చేసిన ప్రయత్నంలో ఒకే కుటుంబంలోని సభ్యులు ఎవరికి ఎవరో తెలియకుండా వేరయిపోయారు. ఇది యథార్థ ఘటన. ఈ వాస్తవ సంఘటన జరగడానికి 24 సంవత్సరాల ముందు అనగా క్రీ.శ. 1888లో ఒక తెలుగు కవి ఇలాంటి సంఘటనను ఊహించి, ఒక కావ్య నిర్మాణం చేసాడంటే ఎవరికైనా నమ్మ శక్యం కాని విషయం. కాని ఇది సత్యం. ఆదిభట్ట నారాయణ దాసు కవి రచించిన 'బాటసారి' అన్న కావ్యం ఇలాంటి సంఘటనతోనే ప్రారంభమవుతుంది.

*"ఒక్క మహానుభావుడు మహోదధియానము చేసి ముప్పున*
*న్దక్కి తొలంగిపోవు నిజ దార, సుతార్థమునై సరోనదీ*
*పక్కణ సీమలన్వెదకి, వారలు సుస్థితి నుంట గాంచి పెం*
*పెక్కను బాటసారియయి – యిక్కథ పేర యశోవిహారియై!*
*ఎచ్చటి నుంటి – నే నిచటి కెట్టుల వచ్చితి – గన్ను లెంతయు*
*న్విచ్చిన గాన రాదిదియు – నిక్కమ యేమది పెద్ద మ్రోత? నా*
*కచ్చెరువై వినంబడు – గటా! తెలిసెన్మది దిట్ట జేతు – బై*
*వచ్చిన నీటి తాకువడి – బ్రాకుచు నెట్టన నొడ్డు చేరితిన్!*

*చిన్ని కొడుకుతోడ జెలియ యేమయ్యెనో*
*కొండ తగిలి యోడ కొట్ట బడిన*
*తెన్ను తోచకుండె – తెరపినీ దిటు మబ్బు*
*గ్రమ్మ రేయి మిగులు గాన రాదు"*[27]

టైటానిక్ ప్రయాణం మహా సముద్రంలో జరిగింది. కవి కూడా 'మహోదధి యానము' అనే పేర్కొన్నారు. టైటానిక్ పెద్ద ఓడ. కవి కూడా దానిని ఓడ అన్నారే గాని నావ లేక పడవ అనలేదు. టైటానిక్ ఓడ కొండను ఢీకొన్న ప్రమాదం జరిగింది రాత్రి వేళలో. కవి కూడా 'రేయి' అని పేర్కొన్నారు.

సంభ్రమాశ్చర్యాలకు గురి చేసే ఈ కల్పన తరువాతి కాలంలో జరుగబోయే ఒక వాస్తవ సంఘటనను ఇంత అచ్చంగా పోలి ఉండడం కవి దార్శనికతకు పరాకాష్ఠగా భావించవచ్చు. "ఈ బాటసారి కథ స్వకల్పితము గాని యింకొక భాషాకావ్యమున కనువాద మెంత మాత్రమున్గాదు"అని, "ఈ బాటసారిన్జేసి యాడుచు బాడుచు న్దెలుగు వారలకు నే వినిపింప మొదలిడినపుడు నా యీ డిరువది నాలుగేండ్లు"[28] అని, నారాయణ దాసుకవి గ్రంథ పీఠికలో చెప్పుకొన్నారు. ఆదిభట్ట వారు దీనిని ఒక తాత్త్విక కావ్యంగా తీర్చి దిద్దారు. మహోదధి సంసారమయితే పాపమనే కొండకు తగిలి పగిలిన ఓడ మాయాగర్భం లాంటిది. ఆ మాయాగర్భం నుండి బయట పడిన మానవుడు బాటసారి. ఆ బాటసారి తిరిగి అన్వేషించి విద్యా వివేకాలనే దారసుతులను పొందడమే ఈ కావ్యం చూపే పరమార్థం. అదే విషయాన్ని

తన ఆంగ్ల పీఠికలో వివరిస్తూ - "The story embodied in this book is an allegory of human life which begins in sheer ignorance and ends in perfect knowledge"[29]. అని తెలియజేసారు. 'టైటానిక్ ఓడ ప్రమాదం' వంటి సంఘటనను ముందే ఊహించి కల్పించడమే గొప్పతనమనుకొంటే, దానికి ఇంతటి తాత్త్విక దృక్పథాన్ని కల్పించడం మరీ, మరీ ప్రశంసనీయమైన ప్రతిభగా చెప్పుకోవాలి. ఇంతకు ముందు అధ్యాయంలో వివరించినట్లు, కవి కృత్యాద్యవస్థలు 'శ్రీకారం'తో కావ్యాన్ని ప్రారంభించకుండా, ఇంతటి మహోన్నతమైన కల్పనను చేసి, దానికి ఇంతటి తాత్త్వికతను జోడించిన ఈ కావ్యం ఔన్నత్యాన్ని 19వ శతాబ్దిని క్షీణయుగంగా భావించే సాహితీ వేత్తలు నవ్య దృష్టితో గమనించకపోవడం విచారకరం.

ఇంత అత్యాధునిక కల్పన కాకపోయినా, సంప్రదాయంలో కూడా సామాజిక దృష్టితో కావ్య రచన చేసిన కవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. ఈయన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తొలి ఆస్థానకవిగా నియమితులయ్యారు. ప్రఖ్యాతకవి చెళ్ళపిళ వేంకటశాస్త్రిగారికి గురువు. వినాయక చతుర్థి తెలుగు వారికి ఒక విశిష్టమైన పండుగ. ఆ రోజు సాయంత్రం చంద్రుని చూడకూడదని హిందువుల విశ్వాసం. ఒక వేళ పొరపాటున ఎవరైనా చూసినా వినాయకుని శ్రద్ధగా పూజించి, ఆ గజాననుని కథ చెప్పుకొని వింటే, ఆ పాపం పరిహారమవుతుందని తెలుగువారు భావిస్తారు. అయితే 19వ శతాబ్ది వరకు ఆ కథ ఒక నిర్దిష్ట కథా సంవిధానంతో ఉండేది కాదు. ఎవరికి తోచిన విధంగా వాళ్ళు చెప్పుకొనే వారు. అలాంటి పరిస్థితులతో, వినాయక ఉత్పత్తి, శిరఃఖండనం, పునరుజ్జీవనం, గణాధిపత్యం, ఆపైన చంద్రుని పరిహాసం, వినాయకుని శాపం, శమంతకమణి వృత్తాంతం మొదలైన అంశాలను పలు పురాణాలలో పరిశోధించి తన తండ్రిగారు బోధించగా, వాటన్నిటిని గుదిగ్రుచ్చి, కావలసిన చోట కొన్ని కొన్ని కల్పనలను చేసి, ముఖ్యంగా ఆ పర్వదినం నాడు చదువుకోడానికి అనుకూలంగా 'గజానన విజయము' పేరిట ఒక కావ్యాన్ని రచించారు కృష్ణమూర్తిశాస్త్రి.

ఈ విషయం కవి కావ్యంలో స్పష్టంగా చెప్పారు.

*"ముదమొప్పన్ గణరాట్చతుర్థి జదువం బోలించి యాలింప భ*
*ద్రదముల్ గ్రంథము లెవ్వియుం గలుగమిన్ దానెంచి నిర్మించె శ్రీ*
*పద కృష్ణుండిది - దీని భక్తి బఠియింప న్వినన్ నీలాప నిం*
*ద దొలంగున్, సిరి వచ్చు, హెచ్చు మతి విద్యాపుణ్య శీలంబులున్!'*[30]

ఈనాటికి ప్రతి తెలుగింటిలో వినాయక చవితినాడు వచన రూపంలో ఆ కథే చదువుకోడం, లేదా పెద్దల ద్వారా పిన్నలు చెప్పించుకోడం జరుగుతున్నది. ఇలా ఒక తెలుగు సంప్రదాయానికి, సంస్కృతికి సామాజిక దృష్టితో నవ్యమార్గంలో దోహదపడే విధంగా రూపొందిన ఈ కథా కావ్యం 19వ శతాబ్దిలోనే (క్రీ.శ. 1890 ప్రాంతంలో) రచింపబడడం గణుతింపదగిన నవ్య విషయం.

ఆధునిక కథ కాకపోయినా, ఇలాగే పురాణ కథలో నవ్య కల్పనలు చేసిన మరో కవి రంగరాజు కేశవరావు. క్రీ.శ. 1880 ప్రాంతంలో ఈనాటి వరంగల్ జిల్లాలో ఖిలాషాపురంలో జీవించిన ఈ కవి, 'ఇంద్రద్యుమ్నీయము' అనే కావ్యంలో భాగవతంలోని గజేంద్ర మోక్షం ఘట్టానికి ముందు చరిత్రగా అనేక నవ్యమైన కల్పనలను చేసారు. గజేంద్రుడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడని, మకరి శాపగ్రస్థుడైన గంధర్వుడని భాగవతంలో రేఖామాత్రంగా చెప్పిన వివరాల ఆధారంగా, వారిరువురి పూర్వ యుద్ధగాథని, వైరాన్ని కవి తన కల్పనాచాతుర్యంతో ఒక మహాకావ్యంగానే రూపుదిద్దారు. 19వ శతాబ్దిలో తెలంగాణ ప్రాంతంలో అనేకమైన విశిష్ట ఛందస్సులతో, నవ్య కల్పనలతో వెలువడిన అరుదైన కావ్యంగా దీనిని పేర్కొనవచ్చు.

కవిత్రయం రచించిన ఆంధ్ర మహాభారతంలోనూ, వ్యాస మహర్షి విరచిత సంస్కృత మహాభారత మూలంలోనూ లేని ఒక కల్పిత కథ 'మాయాబజార్'. మరాఠీ జానపదులాడుకొనే నాటకాల ద్వారా ఈ కమనీయ కల్పిత కథ బహుళ ప్రచారం పొందింది. అది అలా అలా ఆంధ్ర దేశంలోకి ప్రసరించి తెలుగువారికి ఎంతో ప్రీతిపాత్రమయింది. అభిమన్యునికి ఉత్తరతో బాటు, శశిరేఖ అనే బలరాముని కూతురుతో కూడ వివాహం జరిగినట్లు ఈ కథలో ఉంది. ఆ పెళ్ళి బలరామునికి ఇష్టం లేక వ్యతిరేకించినప్పుడు, శ్రీకృష్ణుని లీలా వినోదం, ఘటోత్కచుని మాయాజాలంతో కథ సుఖాంతమయినట్లు ఉండే ఆ పూర్తి హాస్య రస పూరమైన కథతో తెలుగులో 20వ శతాబ్దిలో ఒక చలన చిత్రం కూడా రూపొందింది. ఈ

చిత్రం 'న భూతో న భవిష్యతి' అన దగ్గ కళా ఖండంగా రూపుదిద్దుకోడంలో ఆ కథా కల్పనాచాతుర్యం కూడా ఎంతో దోహదపడిందన్న విషయం సర్వజన విదితమే. అలాంటి ఆ కల్పిత కథతో 19వ శతాబ్దిలోనే పలువురు కవులు కావ్యాలు రచించడం ఒక నవ్యత. క్రీ.శ. 1800 ప్రాంతంలో కాకరపర్తి కృష్ణకవి – 'శశిరేఖా పరిణయము' పేరుతో ఒక కావ్యాన్ని రచించారు. క్రీ.శ. 1842 ప్రాంతంలో మరింగంటి (ద్వితీయ) వేంకట నరసింహాచార్యులు రచించిన 'తాలాంక నందినీ పరిణయము' మరొకటి. క్రీ.శ. 1827–1898 మధ్య జీవించిన రత్నాకరం అప్పకవి రచించిన 'శశిరేఖాపరిణయము' మూడవది. ఈ మూడింటిలో మరింగంటి వారి తాలాంక నందినీ పరిణయం ప్రసిద్ధ ప్రౌఢ కావ్యం. ఇందులో శశిరేఖ పానుపు వర్ణన 19వ శతాబ్ది కాలం నాటి పట్టెమంచాన్ని పోలి ఉండడం కవి నవ్య దృష్టిని తెలియజేస్తుంది.

*"పగడాల్దిద్దిన కోళ్ళ దోమతెర జాళ్వా పట్టె మంచంబుపై*
*జిగి జల్తారు మెరుంగు చాందిని సిరుల్ జిల్కుం బుటీదారు మేల్*
*తగటుం జిల్కు టొరుంగు తక్కియల నిద్దా పాన్పునం దర్పకా*
*శుగ పాతా హత చేతయై దొరలు లేచున్ వంతలం జింతిలన్"*[31]

ఇదిలా ఉంటే, క్రీ.శ. 1800–1850 మధ్య వేల్పూరి వేంకటేశ్వర కవి రచించిన 'గోవ్యాఘ్ర సంవాదము' బహుళ ప్రసిద్ధి చెందిన ఒక జానపద కథ ఆధారంగా రూపొందిన కావ్యం. తనను మ్రింగబోయిన ఒక పులితో గోవు తన దూడకు పాలిచ్చి వచ్చేందుకు అనుమతిని కోరి వెళ్ళి, మళ్ళీ అన్న మాట ప్రకారం ఆ పులికి ఆహారం కావడానికి తిరిగి రావడం అన్న కథా వస్తువుతో రూపొందిన ఈ కృతి, తెలుగు సాహిత్యంలో జంతువులు ప్రధాన పాత్రలుగా రూపొందిన మొట్ట మొదటి పద్య కావ్యం అని చెప్పవచ్చు. ఈ కావ్యం 19వ శతాబ్ది పూర్వార్ధంలోనే వెలువడడం గమనార్హం.

అయితే ఇంతకన్నా వినూత్నమైన ఊహాపథంలో సాగిపోయారు ఇదే శతాబ్దికి చెందిన మరో తెలుగు కవి. ఈ రోజుల్లో సెక్స్ మార్పిడిని ఒక వైజ్ఞానిక విజయంగా మనం భావిస్తున్నాం. విదేశాల్లో ఈ వైజ్ఞానిక ప్రగతి ఫలంగా కొందరు స్త్రీలు పురుషులుగా, పురుషులు స్త్రీలుగా మారిపోవడం కూడా మనం చూస్తున్నాం. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే 19వ శతాబ్దిలోనే ఈ తెలుగు కవి ఇలాంటి ఊహతో కావ్య కథా వస్తువుకు రూపకల్పన చేసారు. క్రీ.శ. 1890 దశకంలో శొంఠి భద్రాద్రి రామశాస్త్రి అనే కవి 'చిత్రసీమ' పేరిట రచించిన కావ్యంలో కావ్యారంభాన్ని 'శ్రీ' కారంతో కాకుండా 'క' అనే అక్షరంతో చేసినట్లు ఇంతకు ముందు అధ్యాయంలో వివరించడం జరిగింది. అంతే కాకుండా ఈ కవి ఈ కావ్యంలో వినూత్నమైన కల్పనతో వస్తు నవ్యతను కూడా సాధించడం విశేషం.

ఈ కావ్యంలో 'చిత్రసీమ' అనే ఒక వివాహిత స్త్రీ పురుషాభరణాలు, పురుష వస్త్రాలు ధరిస్తూ ఉంటుంది. దానికి ఆమె చెలికత్తెలు

*"మగ సొమ్ములేల తొడగెదు?*
*మగువా! యీ వార్త విన్న మగనికి నీపై*
*వెగటు జనింపక మానదు!*
*నగుబాటగు జుమ్ము నీకు నలుగురిలోనన్!"*[32]

అంటూ హెచ్చరిస్తారు. సదా పురుషులతో గోష్ఠి సలుపుతున్న కుమార్తె విషయం తెలుసుకొన్న ఆమె తండ్రి సింహవాహనుడు, కూతురు తనకు అప్రతిష్ఠ తెస్తున్న దన్న కోపంతో ఆమెను తన కరవాలంతో వధిస్తాడు. నేలపై కుప్పకూలిన ఆ స్త్రీ ఆశ్చర్యంగా పురుషుడై మళ్ళీ లేస్తుంది.

*"కూలినయంతనే మగుడ గొబ్బున లేచిన దేమి చిత్రమో!*
*బాలిక రూపు బోవిడిచి, పంకజ పత్ర విశాల నేత్రు డు*
*త్తాల భుజార్గళుండు – సిత దామ విభూషిత పీన వత్స శో*
*భా లలితుండునైన మగవాడయి నిల్చెను బుప్ప వృష్టితోన్!"*[33]

ఆపైన, కొన్నాళ్ళకు చిత్రసీమ మామగారైన భూరివర్మ నుండి కోడలిని పంపుమని పిలుపు వస్తుంది.

*"ఒడక పుట్టినింట దడవుంచగ జెల్లునె చాననెందు? మా*
*కోడలి నంపు – డొక్క తియె కూతురు మీకని యిన్ని నాళ్ళు, మీ*
*వేడుక కంద యుంచితిమి – వేడుక మాకును లేదె? భర్త సొ*
*మ్మాడుది యంచు గమ్మనట కంచెనొకప్పుడు భూరి వర్మ తాన్!"*[34]

ఇక దాచేదేముందని సింహవాహనుడు జరిగిన వృత్తాంతమంతా ఒక లేఖ ద్వారా భూరివర్మకు తెలియజేస్తాడు. చిత్రసీమ చిత్రసీమునిగా మారిపోయిందన్న విషయాన్ని చదివిన భూరి వర్మ, సింహవాహనుడు తనను మోసం చేసాడని యుద్ధానికి దిగుతాడు. ఆ యుద్ధం జరుగుతున్న సమయంలో అందరు చూస్తుండగానే ఆకాశం నుండి ఒక పత్రం నేలపై వాలుతుంది. దేవ భాషలో ఉన్న అందులోని విషయాన్ని తెలుగులో చెప్పుమని అక్కడి వారంతా కోరుతారు.

*"దేశ భాషయైన దెల్ల మెల్లరకునౌ*
*నస్మదీయ దేశ మాంధ్ర మగుట !*
*దీని యర్థమెల్ల దెనుగున వివరించి*
*పలుకు మెల్లరకును దెలియు ననియె"*[35]

అంటూ సింహవాహనుడు చిత్రసీమునితో అన్నట్లుగా పద్యాన్ని రచించి, కవి ఈ సందర్భాన్ని వినియోగించుకొని తన మాతృ భాషాభిమానాన్ని చాటుకొన్నారు. పత్రంలోని విషయాన్ని చిత్రసీముడిలా వివరిస్తాడు –

*"వేకటి సింహవాహ పృథివీపతి పాణిగృహీతి మూర్కొ నెం*
*జేకొని గర్భ వాంఛబడి – చెన్నగునా సరసీ రుహంబు దా*
*నాకత మౌట దజ్జఠర మందలి బాలుడు వ్యత్యయంబునం*
*గైకొనె నాడు రూపునెటు – గాదొకొ దైవము సేయ బూనినన్"*[36]

ఇలా చిత్రవిచిత్ర కల్పనలతో రసరమ్యంగా సాగిపోతుందీ కావ్యం. ఈ కావ్యంలోని ఆశ్వాసాలను కవి 'దళా'లని పేర్కొన్నారు. అయితే కావ్యాన్ని 'ప్రథమ దళం'తో కాక, ద్వితీయ దళంతో ప్రారంభించడం – కథా సంవిధానంలో ఒక భాగమేనని కావ్యం ఆసాంతం చదివితే అవగతమవుతుంది. ఇదీ ఒక నవ్యతే కదా!

ఇలా 19వ శతాబ్దిలో చిత్రాతిచిత్రమైన కల్పనలతో, సమకాలీన సామాజికాంశాలతో, అనేకమైన నవ్య విషయాలపై ఎన్నో కావ్యాలను వెలయించి వస్తు నవ్యతను సాధించిన కవులెందరో ఉన్నారు.

ఈ అధ్యాయంలో కొన్ని చోట్ల చలన చిత్రాల ప్రసక్తి తేవడం జరిగింది. భారతదేశంలో తొలి చలన చిత్రం ఆవిర్భవించింది క్రీ.శ.1931లో. ఈ 20,21 శతాబ్దులలోని చలన చిత్రాలలో నవ్య కథా వస్తువులుగా పేర్కొనబడుతున్న అంశాలను, మన తెలుగు కవులు చలన చిత్రాలంటే ఏమిటో తెలియని 19వ శతాబ్దిలోనే ఊహించి కల్పించడం, వారి నవ్య భావనా పటిమకు పరాకాష్ఠగా వివరించే ఉద్దేశ్యంతోనే ఆ ప్రస్తావన చేయడం జరిగింది.

ఇక్కడ ఇంకొక విషయాన్ని గమనించాలి. 19వ శతాబ్దిలో వెలసిన ఎన్నెన్నో నవ్య కావ్యాలలో, మార్పును వెంటనే అంగీకరించని సమాజంలో ఏ కొందరో ఉదారులైన పోషకుల సహాయంతో ముద్రించబడిన కొన్ని కావ్యాలలో, 19వ శతాబ్దిని క్షీణయుగమన్న 20వ శతాబ్ది పండితుల దురవగాహన వలన సరైన ఆదరణ లేక మరుగున పడిపోగా, ఏ కొందరో మహనీయుల శ్రద్ధాసక్తుల వలన ఈనాడు లభ్యమవుతున్న కొన్ని కావ్యాలలోని నవ్యతను ఈ అధ్యాయంలో వివరించగలిగాను. వీటిలోనే ఇంత వస్తు నవ్యత గోచరిస్తే, ఇంకా మరుగున పడ్డ మాణిక్యాలెన్నో ! వాటి జిలుగుల వెలుగుల మెరుపులెన్నో!!

**పాదసూచికలు :**

1. శ్రీశ్రీ : మహాప్రస్థానం – 'బుక్కులు' కవిత.
2. తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) – తెలుగు అకాడమి ప్రచురణ, పుటలు. 119,1203
3. డా. కే. గోపాలకృష్ణరావు : ఆంధ్ర శతక సాహిత్య వికాసము – పుట. 516
4. డా. కే. గోపాలకృష్ణరావు : ఆంధ్ర శతక సాహిత్య వికాసము – పుట. 516
5. ప్రొఫెసర్ జి. లలిత : తెలుగులో చాటు కవిత్వము – పుట. 144
6. దాసు శ్రీరాములు : తెలుగునాడు – పుట. 46
7. దాసు శ్రీరాములు : తెలుగునాడు – పుట. 45
8. వడ్డాది సుబ్బరాయకవి : శ్రీ సూక్తి వసు ప్రకాశకము – పుట. 25
9. తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) – తెలుగు అకాడమి ప్రచురణ – పుట. 918

10. కొడాలి లక్ష్మీనారాయణ : రాయభట్టు వీరరాఘవరాజ కవి రచనలు - పుట. 67

11. కొడాలి లక్ష్మీనారాయణ : రాయభట్టు వీరరాఘవరాజకవి రచనలు - పుటలు. 68, 71,73&75

12. వడ్డాది సుబ్బారాయకవి : గౌతమీ మహాజల మహిమాను వర్ణనము - పుటలు. 1& 2

13. వడ్డాది సుబ్బారాయకవి : గౌతమీ మహాజల మహిమాను వర్ణనము - పుటలు. 2 & 6

14. వడ్డాది సుబ్బారాయకవి : గౌతమీ మహాజల మహిమాను వర్ణనము - పుట. 9

15. వడ్డాది సుబ్బారాయకవి : గోదావరి ధూమనౌకా విహారము పుటలు : 15 & 18

16. కొప్పరాజు నరసింహం : శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యము పుట. 149

17. డా. తూమాటి దొణప్ప : ఆంధ్ర సంస్థానములు సాహిత్య పోషణము - పుట. 449

18. తెలుగు సాహిత్య కోశము (ఆధునిక సాహిత్యము) : పుట 738

19. మండపాక పార్వతీశ్వరశాస్త్రి : రాధాకృష్ణ సంవాదము పుట. 77

20. మండపాక పార్వతీశ్వరశాస్త్రి : రాధాకృష్ణ సంవాదము పుట. 190

21. మండపాక పార్వతీశ్వరశాస్త్రి : రాధాకృష్ణ సంవాదము పుట. 193

22. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి : తెలుగు సాహిత్య చరిత్ర (పంచమ భాగం) - పుట. 320

23. తూము రామచంద్రారెడ్డి : అలమేలుమంగా పరిణయము పుట. 34

24. తూము రామచంద్రారెడ్డి : అలమేలుమంగా పరిణయము పుట. 63

25. తూము రామచంద్రారెడ్డి : అలమేలుమంగా పరిణయము పుట. 43

26. తూము రామచంద్రారెడ్డి : అలమేలుమంగా పరిణయము పుట. 84

27. ఆదిభట్ట నారాయణదాసు : బాటసారి - పుట. 1

28. ఆదిభట్ట నారాయణదాసు : బాటసారి - తెలుగు పీఠిక

29. ఆదిభట్ట నారాయణదాసు : బాటసారి - ఆంగ్ల పీఠిక

30. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి : గజానన విజయము - పుట. 31

31. ఆసూరి మరింగంటి వేంకట నరసింహాచార్య : తాలాంక నందినీ పరిణయము - పుట. 137

32. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్రసీమ - పుట. 2

33. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్రసీమ - పుట. 4

34. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్రసీమ - పుట. 5

35. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్రసీమ - పుట. 10

36. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి : చిత్రసీమ - పుట. 11



# 11

# ముగింపు



**13** ఫిబ్రవరి 1943నాడు తెనాలిలో జరిగిన తొలి 'ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ'లో అధ్యక్షోపన్యాసం చేస్తూ, తాపీ ధర్మారావు ఇలా అన్నారు.

"ఏ దేశంలోనయినా, ఏ కాలంలోనయినా రచయితలు చేయవలసిన పని చాలా ఉంటుంది.

1. గతించిన విషయాలను బోధించాలి – నిర్దాక్షిణ్యంగా
2. ప్రస్తుతాన్ని అర్థం చేసుకోవాలి – నిష్పక్షపాతంగా
3. భావికి కాగడా పట్టి దారి చూపాలి – నిరాటంకంగా"[1]

19వ శతాబ్ది తెలుగు కవులు ఈ మూడు పనులు చేయడంలో ఏ దేశ రచయితల కన్న, ఏ కాలం రచయితల కన్న తక్కువేం చేయలేదు. ఇంకా ఎక్కువే చేసారు. ఎందుకంటే తెలుగు దేశంలో 19వ శతాబ్దిలో ఏర్పడిన పరిస్థితులు, ఏ దేశ చరిత్రలోనైనా ఎప్పుడో ఒకప్పుడే ఏర్పడుతాయి. బ్రిటన్‌లో అవి 18వ శతాబ్దిలో ఏర్పడి ఉంటాయి. భారత దేశంలో 19వ శతాబ్దిలో ఏర్పడ్డాయి. అంతే కాని, అన్ని దేశాలలో, అన్ని కాలాలలో, గతానికి వర్తమానానికి మధ్య పెను మార్పులేం సంభవించవు. గతానికి, వర్తమానానికి మధ్య పెద్ద వ్యత్యాసం ఏమీ ఉండదు – కొద్ది కొద్ది చిన్న మార్పులు తప్ప. కానీ 19వ శతాబ్దిలో తెలుగు దేశంలో పెను మార్పులు సంభవించాయి. గతానికి, వర్తమానానికి మధ్య భూమ్యాకాశాల తేడా ఏర్పడింది. అందుకే మన తెలుగు కవులు ఆ శతాబ్దిలో గతించిన విషయాలను బోధించారు. వర్తమానాన్ని అర్థం చేసుకొన్నారు. భావికి కాగడా పట్టారు. చాలా మంది కవులు మన పురాణాలు, మన ప్రాచీన సంస్కృతి, మన సంప్రదాయాచారాలను బోధించే కావ్యాలను రచిస్తే రచించి ఉండవచ్చు.

*"పతి పరకాంతలతో సం*
*గతి జేసిన, నాదు పుణ్యగతి యిట్లనుచున్ –*
*మతి దలప వలయు; లేదా*
*బతిమాలగ వలయు – గలహ పడకు కుమారీ !*

*పెనిమిటి కన్న బతివ్రత*
*మునుపే మృతి బొందెనేని బురుషాగమనం*
*బున కెదురు చూచు; వచ్చిన*
*గనుగొని యనురాగ మెనయ గలయు గుమారీ!"* [2]

వంటి భావాలతో ఫక్కి వెంకట నరసయ్య వంటి కవి 'కుమారీ శతకా'న్ని రచించి ఉండవచ్చు. కాని గతంలో ఒప్పుగా అనిపించి, తరువాత తప్పులుగా కనిపించిన విషయాలను గురించి చైతన్యం కలిగించేలా బోధించిన కవులు కూడా 19వ శతాబ్దిలో లేకపోలేదు. ఆచంట సాంఖ్యాయనశర్మ స్త్రీల ప్రకృతి ధర్మాన్ని ఇక పురుషులు పాటించాలని వ్యంగ్యంగా పలికి, స్త్రీ పురుషుల సమానత్వాన్ని ప్రబోధించినా; కందుకూరి వీరేశలింగం పంతులు మితిమీరిన శృంగార వర్ణనలతో, చిత్ర కవిత్వాలతో దిగజారుతున్న ప్రబంధ సాహిత్యం గురించి హాస్య వ్యంగ్యాలను జోడించి కనువిప్పు కలుగజేసే రచనలు చేసినా; దాసు శ్రీరాములు కవి కన్యాశుల్కం దురాచారాన్ని నిరసిస్తూ పద్యాలు చెప్పినా; కట్టమంచి రామలింగారెడ్డి సమాజం కోసం ఒక గ్రామీణ యువతి త్యాగాన్ని ఆదర్శంగా తీసుకోవాలని తెలియజెప్పూ, మరో వైపు మూఢాచారాలకు గ్రామీణులు ఎలా బలి అవుతున్నారో వివరించినా – ఇలా ఎంతో మంది తెలుగు కవులు ఎన్నో రకాలుగా 19వ శతాబ్దిలో గతించిన విషయాలలోని దుర్నీతిని ఎత్తి చూపి నిర్దాక్షిణ్యంగా బోధించిన వారే!

అలాగే, మతుకుమల్లి నృసింహశాస్త్రి కవి మద్రాసు నగరంలోని సాంకేతిక ప్రగతిని ముఖ్యంగా రైలుబండిని, పొగ ఓడను, తంతి – తపాల వ్యవస్థను వర్ణించినా; రాయభట్ట వీర రాఘవకవి గాలివాన ఉధృతిని, దాని వలన కలిగిన నష్టాన్ని వివరించినా, సాంఖ్యాయనశర్మ దాదాభాయి నౌరోజీ వ్యక్తిత్వాన్ని, ఆశయాలను అధ్యయనం చేసినా; వావిలాల వాసుదేవశాస్త్రి, వడ్డాది సుబ్బారాయకవి ప్రభృతులు

ఆంగ్ల సాహిత్యాన్ని, ఆంగ్లేయ రాజకీయ వ్యవస్థను గురించి తెలుగు వారికి తెలియజెప్పినా – అదంతా ఆనాటి వర్తమానాన్ని నిష్పక్షపాతంగా అర్థం చేసుకోవడమే!

ఇంకా, శిష్టు కృష్ణమూర్తి గేయ ఛందస్సులను పరిచయం చేసినా; శొంఠి భద్రాద్రి రామశాస్త్రి, ఆది భట్టనారాయణ దాసులు కృత్యాద్యవస్థలను, సంప్రదాయ కావ్య ప్రారంభ పద్ధతులను విసర్జించినా; పన్నాల సీతారామబ్రహ్మ శాస్త్రి, బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు తదితరులు కావ్య వస్తువులలో అల్పం, అనల్పమని లేవని, కాదేదీ కవిత కనర్హమని చాటినా; వారణాశి అచ్యుత రామయ్య పురాణ కథ ఆలంబనగా పరమత సహనాన్ని ప్రబోధించినా, కందుకూరి వారు 'యాంటీనాచ్' ప్రబోధాన్ని అందించినా – అదంతా నిరాటంకంగా భావికి కాగడా పట్టి మార్గదర్శనం చేయడమే!

ఆచార్య సి. నారాయణ రెడ్డి ఆధునికాంధ్ర కవిత్వ లక్షణాలను ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

1. ఖండ కావ్య ప్రక్రియ
2. ఆత్మాశ్రయ రీతి
3. వస్తు నవ్యత
4. భావ నవ్యత
5. శైలీ నవ్యత
6. పద ప్రయోగం
7. దేశి కవిత
8. ప్రక్రియా బాహుళ్యం [3]

19వ శతాబ్దిలో ఈ లక్షణాలన్నిటికీ ఎలా బీజాలు పడ్డాయో ఇప్పుడు పరిశీలిద్దాం –

**ఖండ కావ్య ప్రక్రియ :–** 'రవి వర్మ చిత్రాలు', దాదాభాయి నౌరోజీ వంటి జాతీయవాది మొదలైన నవ్యాంశాలపై తొలి ఖండ కావ్యాలను ఆచంట సాంఖ్యాయన శర్మ రచించింది 19వ శతాబ్దిలోనే. 'మాతృ స్వరూప స్మృతి' పేరుతో ఆంగ్ల భాషలోని ఖండకావ్యాన్ని తొలిసారిగా తెలుగులోనికి వావిలాల వాసుదేవశాస్త్రి అనువదించింది కూడా 19వ శతాబ్దిలోనే. అలాగే వినయము, ఐకమత్యము, దాతృత్వము మొదలైన నీతి విషయాలపై తొలిసారి పద్య ఖండికలను రచించి, 'శ్రీ సూక్తి వసు ప్రకాశకము' పేర వడ్డాది సుబ్బారాయ కవి సంపుటీకరించింది కూడా 19వ శతాబ్దిలోనే.

**ఆత్మాశ్రయ రీతి:–** వడ్డాది సుబ్బారాయ కవి 'గోదావరి ధూమ నౌకా విహారము', 'గౌతమీ మహాజల మహిమానువర్ణనము' అన్న రెండు చాటు ప్రబంధాలను ఆత్మాశ్రయ రీతిలో రచించింది తొలిసారిగా 19వ శతాబ్దిలోనే సుమా!

**వస్తు నవ్యత :–** బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు, పన్నాల సీతారామబ్రహ్మ శాస్త్రి, సామినేని వేంకటాద్రి ప్రభృతులు తొలిసారిగా సర్వసాధారణమైన వస్తువులపై కావ్యాలల్లింది 19వ శతాబ్దిలోనే. మతుకుమల్లి సోదర కవులు తొలిసారిగా ఆధునిక నగరాలైన మద్రాసు నగరంపై, మచిలీ బందరుపై, ఇంకా ఆ నగరాల్లోని నవీన నాగరికత, సంస్కృతులపై నవ్యకావ్యాలను అల్లింది 19వ శతాబ్దిలోనే. మండపాక వారి 'సోఫియో ఫాంటసీ' – 'రాధాకృష్ణ సంవాదము' వెలువడింది 19వ శతాబ్దిలోనే. అపురూపమైన కల్పనలతో శొంఠి భద్రాద్రి రామశాస్త్రి 'చిత్రసీమ', ఆది భట్ట నారాయణ దాసు 'బాటసారి' కృతులు వెలువడింది 19వ శతాబ్దిలోనే. తుఫానులపై, ధూమ నౌకా ప్రయాణాలపై తొలిసారిగా కావ్యాలు వెలువడింది 19వ శతాబ్దిలోనే. తొలిసారిగా తెలుగు కవుల ఆలోచనా పరిధి భారత దేశాన్ని దాటి, అంతర్జాతీయ స్థాయిలో పెంపొంది, బ్రిటిష్ మహారాణిపై కావ్యాలు, ప్రశంసా పద్యాలు, అనేక పాశ్చాత్య గ్రంథాలకు అనువాదాలు వెలువడింది ఆ శతాబ్దిలోనే కదా!

**భావ నవ్యత :–** మతుకుమల్లి నరసింహశాస్త్రి 'ఎలక్ట్రిక్ షాక్' ను వర్ణిస్తూ, కోటి కందిరీగలు కరచినట్టు, వేయి మండ్రగబ్బలు కలసి ఒక్కసారి కుట్టినట్టు ఉంటుందని నవ్యోపమానాలతో నవ్య విషయాన్ని చెప్పడం, అంతే కాకుండా మోచేతికి దెబ్బ తాకినట్టు ఉంటుందని స్వభావోక్తిలో వివరించడం – భావ నవ్యతే కదా! తొలిసారిగా తెలుగులో స్మృతి కావ్యాన్ని వెలయించిన వడ్డాది సుబ్బారాయకవి, పరమపదించిన తన సతిని గురించి తలపోస్తూ – "ఒక నాడు ఒక తొండ మూలాలు నేల త్రవ్వి, ఆ పల్లంలో కుప్ప వోసినట్లు గ్రుడ్లు పెట్టాక, కడుపుతోలు వ్రేలాడుతుంటే,

కాన్పు బడలికతో సొమ్మసిలి పడిఉండగా, ఎక్కడి నుండో ఒక కాకి ఎగిరి వచ్చి దానిని ముక్కున కరచుకొని వెళ్ళిపోతే, చూచి కంట తడిపెట్టిన తన భార్యను, నేడు మృత్యువట్లే ఎత్తుక పోయిం"దని విలపించడం ఎంత నవ్యభావన! ఎంత హృదయ విదారకమైన వర్ణన! మరోవైపు కందుకూరి వీరేశలింగం పంతులు 'పత్నీ వ్రత బోధిని' అంటూ కడుపుబ్బ నవ్వించే పద్యాలు రచించారు. కుష్ఠు రోగం ఉన్నదైనా, గ్రుడ్డిదైనా, ముసలిదైనా, క్రమం తప్పకుండా భార్య ఎంగిలి తిన్న పురుషునికి పుణ్య లోకాలు సంప్రాప్తిస్తాయని; పురుషుడు, గాడిదలాగే అప్పుడప్పుడు భార్య చేత దండింప బడకపోతే చెడిపోతాడని; పురుషుడు ప్రతిరోజు తన భార్యకు పాదపూజ చేసి ఆ శ్రీపాద తీర్థాన్ని సేవించాలని, ఆయన వ్యంగ్యంతో కలగలపి చిప్పిల్లిన హాస్యం కూడా భావనవ్యతను మొలకలెత్తించింది.

కోటప్ప కొండ జాతరలో కొండపైన ప్రభలకు కట్టిన అద్దాలను పైనున్న భక్తులు చూసి, ఇక్కడ ఇంకా చాలా జాతరలు జరుగుతున్నాయని, కొండ క్రింద ఉన్న ప్రభలకు కట్టిన అద్దాలను క్రింద ఉన్న భక్తులు చూసి, తమను అనుగ్రహించడానికి పైనున్న దేవుడు గుడితో సహా క్రిందికి దిగాడని భావించారని వర్ణించడం కొప్పరాజు నరసింహకవి ఆధునిక భావ శబలతకు నిదర్శనమే! ఇంకా, జయంతి భావనారాయణ కవి 'లాలు జెండాలు' అని నవ్యాతి నవ్యమైన ఉపమానాన్ని ప్రయోగించడం నిరుపమానం. ఇలాంటి విషయాలెన్నో ఈ సిద్ధాంత రచనలో పలుచోట్ల ఉదాహరించడం జరిగింది. మరి ఇవన్నీ వచ్చింది 19వ శతాబ్దిలోనే కదా!

**శైలీ నవ్యత :–** తరిగొండ వేంకమాంబ ఎరుకలసాని చెప్పే సోదెను, అదే జాతి వ్యవహార భాషలో సహజంగా రచించడం; వద్దిపర్తి కోనమరాజు జమాబంది వ్యవహారాల గురించి, ఆ వృత్తి పరమైన పరిభాషలోనే వర్ణించడం; దాసు శ్రీరాములు వివిధ శాఖలకు చెందిన బ్రాహ్మణుల నిత్యవ్యవహార భాషలను, ముఖ్యంగా మధ్వుల, వైష్ణవుల మతపరమైన పరిభాషలను కావ్యంలో ప్రయోగించడం – ఇవన్నీ 19వ శతాబ్దిలో వికసించిన శైలీ పరమైన నవ్యతలో భాగమే మరి!

**పద ప్రయోగం :–** 'రంగ రాయ చరిత్రము'లో దిట్టకవి నారాయణ కవి, 'విజయరామ యశోభూషణము' లో చత్రాతి లక్ష్మీనరసు అనేక ఉరుదూ, పారశీక పదాలతో బాటు ఫ్రెంచి భాషా వికృత శబ్దాలను ప్రయోగించడం; 'చెన్నపురీ విలాసము' లో, ఇంకా ఇతర కావ్యాలలో అనేకమైన ఆంగ్ల శబ్దాలను తెలుగు కావ్యాలలో ప్రయోగించడం, ఇంకా అనేక కావ్యాలలో పలు రకాల పారిభాషిక పదబంధాలను ప్రయోగించడం 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలోని పద ప్రయోగ నవ్యత.

**దేశి కవిత :–** తొలి పద్య నాటకమైన 'సీజరు చరిత్రము' తేటగీతుల మాలికలో వెలువడటం, వీరేశలింగం పంతులుచే అనువదించబడిన 'జాన్ గిల్పిన్' ద్విపద ఛందస్సులో వెలువడటం, ఇంకా అంతకుముందే రేవణూరి వేంకటార్యుడు 'ముత్యాల సరం'కు మాతృక అయిన 'తురంగ వృత్తా'న్ని ప్రయోగించటం, శిష్టు కృష్ణమూర్తి మరియు మండ కామశాస్త్రి 'ఆంధ్ర తులసీ రామాయణము'లో నవ్య గేయ గతులలో పద్యాలను వ్రాయటం, కొక్కొండ వేంకటరత్నశర్మ 'బిల్వేశ్వరీయము'లో 'సీసం' వంటి దేశికవితల లాగే 'బంగారము', 'వెండి' వంటి కొత్త ఛందస్సులను సృజించటం, ఇంకా ఈ కావ్యంలో పెళ్ళిపాటలు, తొట్ల పాటల వంటి గీతాలను లిఖించటం – ఇదంతా ఆయా కవులు 19వ శతాబ్దిలో దేశికవితకు పెద్ద పీటవేయడమే!

**ప్రక్రియా బాహుళ్యం :–** తొలి పద్య నాటకం, తొలి ఏకాంకిక, తొలి ఖండ కావ్యం, తొలి గేయ కావ్యం, తొలి వ్యంగ్య కావ్యం, తొలి స్మృతి కావ్యం, తొలి జీవిత చరిత్ర, తొలి స్వీయ చరిత్ర, తొలి యాత్రా చరిత్ర – ఇలా ఆధునిక తెలుగు కవిత్వానికి సంబంధించిన అనేక ప్రక్రియలు తొలిసారిగా వెలువడింది 19వ శతాబ్దిలోనే ! ఈ విషయం '19వ శతాబ్ది తెలుగు కవిత్వంలో ప్రక్రియా పరమైన నవ్యత' అన్న అధ్యాయంలో సవిస్తరంగా వివరించబడింది.

ఇలా నవ్య కవిత్వ లక్షణాలుగా పండితులు భావించిన 8 అంశాలలోనూ తొలిసారి బీజాలు నాటింది, 19వ శతాబ్దిలోనే అని రూఢి అయింది. అలాంటప్పుడు ఇంకా 19వ శతాబ్దిని క్షీణయుగంగా ఎలా భావించగలం? వ్యవస్థీకృతమయిన 20వ శతాబ్ది నవ్య కవిత్వ మహా వృక్షానికి బీజావాపనం జరిగింది 19వ శతాబ్దిలోనే! ఇది సత్యం!!

ఇక, 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలోని ఈ నవ్యత ప్రభావం 20వ శతాబ్ది తెలుగు కవిత్వంపై ఎలా ప్రసరించిందో రేఖా మాత్రంగానైనా పరిశీలిద్దాం –

అంతకన్న ముందు, అసలు 20వ శతాబ్దిలో ఆరంభమైన 'నవ్య యుగం' అనగానే, మదిలో మెదిలే అంశాలేమిటో చూద్దాం –

1. ముత్యాల సరం, ఇతర గేయ ఛందస్సులు
2. ఖండకావ్యాలు
3. 'కాదేదీ కవిత కనర్హం!' అన్న శ్రీశ్రీ ప్రబోధం
4. ప్రక్రియా వైవిధ్యం
5. సామాజిక దృష్టి – సంఘ సంస్కరణం
6. అన్య భాషా, అన్య మత ప్రభావ సాహిత్యం

రేవణూరి వేంకటార్యుని తురంగ వృత్తమే ముత్యాల సరంగా రూపుదిద్దుకొన్న విషయం విదితమే. అలాగే శిష్టు కృష్ణమూర్తి 'ఆంధ్ర తులసీ రామాయణం'లో హిందీ భాషా సంబంధ గేయ గతుల ఛందస్సులను ప్రయోగించిన ప్రభావంతో అనేక ఆధునిక కవులు సంప్రదాయ ఛందస్సులను విడనాడి వివిధ రకాల గేయ గతుల ఛందస్సులలో రచనలు చేసారు. ముఖ్యంగా శ్రీశ్రీ, ఆరుద్ర, సినారె వంటి కవులు ఇలాంటి రచనలు కోకొల్లలుగా అందించారు. శ్రీశ్రీ 'మహాప్రస్థానం', ఆరుద్ర 'కూనలమ్మ పదాలు', సినారె 'కర్పూర వసంతరాయలు', 'నాగార్జున సాగరము' మొదలైనవి కొన్ని ఉదాహరణలు మాత్రమే!

ఇటీవలి కాలంలో ఉరుదూ భాష నుండి రుబాయీలు, గజళ్ళు, జపనీస్ భాష నుండి హైకూ వంటి ఛందస్సులు తెలుగు సాహిత్యంలో ప్రవేశించడానికి 'ఆంధ్ర తులసీ రామాయణమే' నాందిగా నిలిచిందని చెప్పవచ్చు. అంతే కాకుండా, 20వ శతాబ్దిలో దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటి చాలా మంది భావ కవులు తమ 'కృష్ణ పక్షం' వంటి అనేక కావ్యాలలో విరివిగా మాలికల రూపంలో తేట గీతి ఛందస్సు వినియోగించడానికి కూడా వావిలాల వాసుదేవశాస్త్రి వేసిన బాటే కారణమని భావించవచ్చు. ఆధునిక కవితకు తేటగీతి ఛందస్సు అనుకూలమైనదని ముందుగా గుర్తించి, 'సీజరు చరిత్రము', 'నందక రాజ్యము' వంటి తొలి తరం పద్య నాటకాల ద్వారా ఆయన మార్గదర్శనం చేసిన సంగతి విదితమే!



20వ శతాబ్దిలో వెలువడిన, 21వ శతాబ్దిలో ఈనాటికీ వెలువడుతున్న పద్య, గేయ, వచన కవితా ఖండ కావ్యాలకు ఆచంట సాంఖ్యాయన శర్మ రచించిన 'ఆంధ్ర పద్యావళి' స్ఫూర్తిగా నిల్చిందని చెప్పవచ్చు. ఒక కవితా సంపుటంగా కూడా ఇది 20వ శతాబ్దిలో పుంఖానుపుంఖాలుగా వెలువడిన కవితా సంపుటులకు మార్గదర్శిగా నిలిచింది.

20వ శతాబ్ది నవ్య కవిత్వానికి గురజాడ వారి 'పూర్ణమ్మ' ఖండ కావ్యం ఒక దిక్సూచిగా భావిస్తారు. దీనికి చాలా విశిష్టతలున్నాయి 1) నాయికా ప్రధాన కావ్యం, 2) విషాదాంత కావ్యం, 3) సామాజిక మూఢాచారానికి బలి అయినట్లు చూపడం వల్ల ఆ మూఢాచారం పట్ల పాఠకులలో వ్యతిరేక భావాన్ని నెలకొల్పడం – వంటివి ప్రధానంగా చెప్పవచ్చు. అయితే కట్టమంచి రామలింగారెడ్డి అంతకుముందే, 19వ శతాబ్దిలోనే రచించిన 'ముసలమ్మ మరణం' కావ్యంలో కూడా ఈ మూడు విలక్షణ లక్షణాలుండడం విశేషం. పైగా రెండు కావ్యాలలో కూడా నాయిక నీళ్ళలో దూకి ఆత్మార్పణం చేసుకోడం కావ్య నిర్మాణంలోని పోలికను చూపుతోంది. దీనిని బట్టి గురజాడ వారి పూర్ణమ్మపై రామలింగారెడ్డి గారి 'ముసలమ్మ' ప్రభావం ఉందని చెప్పక తప్పదు. అంతేకాదు రాయప్రోలు వారి 'స్నేహలత' పై కూడా ఈ ప్రభావం కొంతైనా ఉందని సహేతుకంగా నిరూపించవచ్చు.

"కాదేదీ కవిత కనర్హం!" – దీనిని ఇప్పటికీ శ్రీశ్రీ స్వీయ ప్రవచనం గానే ఆధునికులు భావిస్తున్నారు. కాని 19వ శతాబ్దిలోనే వచ్చిన 'పూచి పుల్ల శతకం' ఈ భావనతో వచ్చిన తొలి కావ్యమన్న విషయం సహృదయులు విస్మరించకూడదు. అలాగే బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు రచించిన 'అట్టు కథ' తినుభండారంపై వచ్చిన తొలి కవిత. ఆ తరువాత ఆ స్ఫూర్తితో 'పకోడి'పై, 'టీ', 'కాఫీ'లపై, 'వంకాయ' కూరపై ఇలా ఎన్నో రచనలు 20వ శతాబ్దిలో వచ్చాయి. ముఖ్యంగా చిలకమర్తి వారు రచించిన 'పకోడి' పద్యాలు బహుళ ప్రసిద్ధి నొందాయి. మచ్చుకి రెండు పద్యాలను ఉదాహరిస్తాను.

*"ఆ కమ్మదనము; నా రుచి,*
*యా కరకర, యా ఘుమ ఘుమ యా పొరకములా*

*రాకలు, పోకలు, వడుపులు*
*నీకేదగు – నెందు లేవు – నిజము పకోడీ!*

*కోడిని దినుటకు సెలవున్*
*వేడిరి మును బ్రాహ్మణులది వేదన తోడున్*
*కోడి వలదా బదులుగ ప*
*కోడిం దినుమనుచు జెప్పె కూర్మి పకోడీ!"*[4]

ఇలా అల్ప వస్తువులపై 20వ శతాబ్దిలో అనేక ఖండ కావ్యాలు రచించిన కవి జాషువా. ఆయన 'గిజిగాడు', 'సాలీడు' వంటివి అందుకు ఉదాహరణలు. కరుణశ్రీ జంధ్యాల పాపయ శాస్త్రి 'పుష్ప విలాపం', 'పాకీ పిల్ల', శ్రీశ్రీ 'భిక్షుకి', దాశరథి 'ఓసి కూలిదాన!" వంటి కవితలు ఇలా సర్వ సాధారణ, హీన, దీన వస్తువులపై రచించినవే!

*"విసిరేసిన ఖాళీ సీసా !*
*ఉసూరు మనకు*
*పగుల గొట్టుకో నీ ముఖాన్ని*
*పొడుచుకొస్తాయి పదునైన బాకులు"*[5]

వంటి ఆధునిక కవితల్లో సి. నారాయణ రెడ్డి వంటి మహాకవులు సాధారణ వస్తువుల నుండి అసాధారణమైన, ఉదాత్తమైన భావాలను మొలకెత్తించారు. అయితే ఇవన్నీ 19వ శతాబ్దిలో చీపురు పుల్లపై, పొగాకుపై, ముక్కు పొడుంపై పద్యాలు వచ్చాక, ప్రాణం పోసుకొన్నవే!

19వ శతాబ్దిలో తొలియాత్రా కావ్యాలను రచించిన మతుకుమల్లి సోదర కవుల వలెనే 20వ శతాబ్దిలో డా. దాశరథి, సినారె, బాపురెడ్డి, ఎన్. గోపి వంటి సత్కవులు తమ విదేశీయాత్రలపై కవితలను రచించారు. డా. దాశరథి అమెరికాలో నిర్వహించిన తెలుగు సభలలో పాల్గొన్నప్పుడు వ్రాసుకొన్న ఈ పద్యాన్ని గమనించండి.

*"డెట్రాయిట్ ప్రాంతములో*
*చట్రాయికికూడ తెలుగు సభలని తెలియున్ –*
*తొట్రు పడనేల? కలమూ,*
*గట్రా చేకొని కదలుము కవితలు వ్రాయన్!*[6]

క్లిష్ట ప్రాసతో చమత్కార భరితంగా సాగిన పద్యం ఇది.

20వ శతాబ్దిలో పరిఢవిల్లిన ప్రక్రియల్లో నూటికి తొంబై శాతం ప్రక్రియలు 19వ శతాబ్దిలోనే పురుడు పోసుకొన్నాయని చెప్పడం చర్విత చర్వణమే అవుతుంది. అయితే 19వ శతాబ్దిలో కనిపించక 20వ శతాబ్దిలోనే తొలుత ఉద్భవించిన ప్రక్రియ 'వచన కవిత' అని అంగీకరించక తప్పదు. 19వ శతాబ్దిలో కవిత్వమంటే పద్యమో, గేయమో – అంతే. 'వచన కవిత' 20వ శతాబ్ది నవ్యయుగ కవితా సామ్రాజ్యంపై ఎగురవేసిన జెండా. అయితే ముక్తచ్ఛంద కవిత్వ సృజనకు బాట వేసింది – 19వ శతాబ్దిలో రేవణూరి వేంకటార్యుడు, శిష్టు కృష్ణమూర్తి, మండ కామశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నశర్మ వంటి కవులు సంప్రదాయ ఛందస్సుల నుండి కొంత స్వేచ్ఛ కోరి గేయ గతులపై మొగ్గు చూపడమేనన్నది గమనార్హం.

ఆచంట సాంఖ్యాయనశర్మ, కందుకూరి వీరేశలింగం పురుషులపై దెప్పి పొడుపుల కవితలతో చేసిన స్త్రీ పురుష సమానత్వ ప్రబోధం నాందీ వాక్యమై 20వ శతాబ్దిలో మానవతావాదం, సామ్యవాదం వంటి అంశాలతో నవ్య కవిత్వం వెలువడడానికి దారి తీసిందని భావించవచ్చు. తరువాతి కాలంలో ఇదే స్త్రీవాద, దళితవాద కవిత్వ శాఖలుగా కూడా విస్తరించింది. అలాగే శ్రీరాములు కవి చేసిన కన్యాశుల్క దురాచార నిరసన మినుకు మినుకుమనే దీపంలా వెలిగినా, తరువాతి కాలంలో అదే ప్రచండ జ్యోతిలా మారి, 20వ శతాబ్దిలో వరకట్నం, ఇతర సామాజిక దురాచారాలపై కవులు కాస్త ఘాటుగానే ఉద్యమించే స్ఫూర్తి నిచ్చింది. సాంఖ్యాయన శర్మ దాదాభాయి నౌరోజీపై వ్రాసిన ఖండకావ్యం, 20వ శతాబ్దిలో తుమ్మలపల్లి సీతారామమూర్తి చౌదరి రచించిన 'గాంధీ తారావళి', ఉండేల మాలకొండారెడ్డి రచించిన 'నేతాజీ' వంటి జాతీయ నాయకులపై వచ్చిన కావ్యాలకు మూల బీజంగా నిలిచిందని చెప్పవచ్చు.

అయితే సామాజిక దృష్టిలో 19వ శతాబ్ది నవ్య కవులకు, 20వ శతాబ్ది నవ్య కవులకు కొంత వ్యత్యాసం ఉంది. 19వ శతాబ్ది నవ్య కవులు బ్రిటిష్ పాలనకు అనుకూలంగా ఉండి విక్టోరియా రాణిని, ఇతర బ్రిటిష్ అధికారులను స్తుతించారు. కాని 20వ శతాబ్దిలో స్వాతంత్ర్యేచ్ఛ రగిలి, బ్రిటిష్ వారిని, వారి పాలనను దుయ్యబడుతూ రచనలు వెలువడ్డాయి.

19వ శతాబ్దిలో కందుకూరి, వావిలాల వాసుదేవశాస్త్రి ప్రభృతులు షేక్స్పియరు, ఆలివర్ గోల్డుస్మిత్ వంటి ఆంగ్ల కవుల రచనలను అనువాదం చేసి, తులసీ రామాయణాన్ని శిష్టుకృష్ణమూర్తి, మండకామశాస్త్రి అనువాదం చేసి చూపిన బాటలో, 20వ శతాబ్దిలో అనేక కవులు ఆంగ్లం నుండి తెలుగులోకి, అలాగే దేశీయంగా బెంగాలీ, తమిళ, కన్నడ, ఉరుదూ భాషలలోని కావ్యాలను తెలుగులోకి విస్తృతంగా అనువదించారు. పారశీక భాషలోని ఉమర్ ఖయ్యాం కవితలను ఆదిభట్ట నారాయణదాసు, రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, ముద్దు కృష్ణ తదితరులు రమణీయంగా అనువదించారు. అలాగే రవీంద్రనాథ్ టాగోరు రచించిన 'గీతాంజలి' అన్న నోబెలు బహుమతి గ్రహీత కృతిని గుడిపాటి వెంకటచలం, కొంగర జగ్గయ్య వంటి కవులు ఆంధ్రీకరించారు. డా. దాశరథి గాలిబు గీతాలను కమనీయంగా తెలుగుజేసి, రాష్ట్ర ప్రభుత్వం నుండి ఉత్తమ అనువాద బహుమతిని గెలుచుకొన్నారు. 19వ శతాబ్దిలో కొక్కొండ వారి కవిత తలిసారి ఆంగ్లంలోకి అనువదించబడిన విషయం విదితమే. 20వ శతాబ్దిలో అనేక తెలుగు రచనలు దేశీయ భాషలలోనికే కాక విదేశీ భాషలలోనికి కూడా అనువదించబడ్డాయి. సంస్కృతం కాకుండా ఇంకా ఇతర భాషలతో ఈ అనువాద సంపర్కం తొలిసారి 19వ శతాబ్దిలో ప్రారంభమై, 20వ శతాబ్దిలో ఈ ఆదాన, ప్రదానాలు విస్తృతం కావడం గమనించదగ్గ విషయం.

1970వ దశకంలో నగ్నముని 'కొయ్య గుర్రం' పేరిట దివిసీమ తుఫాను బీభత్సంపై ఒక్క చక్కని కావ్యాన్ని రచించారు. సుప్రసిద్ధ విమర్శకులు ఆచార్య చేకూరి రామారావు దానిని ఆధునిక మహాకావ్యంగా ప్రశంసించారు. అయితే ఇలాంటి ప్రకృతి వైపరీత్యంపై తొలిసారి 'గాలివాన సీసమాలిక' కృతిని రాయభట్ట వీర రాఘవ కవి 19వ శతాబ్దిలోనే రచించారన్న విషయాన్ని విస్మరించకూడదు. అలాగే 20వ శతాబ్దిలో చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి 'జాతక చర్య', గుర్రం జాషువ 'నా కథ' అన్న పేర్లతో పద్య కావ్యాలుగా తమ స్వీయ చరిత్రలను వెలయించారు. ఇంకా ఎందరో వచనంలో స్వీయ చరిత్రలను రచించారు. అయితే ఈ ప్రక్రియకు తెలుగులో నాందీ వాక్యం పలికింది మండపాక పార్వతీశ్వర శాస్త్రి, అదీ 19వ శతాబ్దిలోనే.



ఆంధ్ర క్రైస్తవ కవి సార్వభౌమునిగా పేరొందిన పురుషోత్తమ చౌధరి తెలుగులో తొలి క్రైస్తవ కవి. 19వ శతాబ్దిలో క్రైస్తవ మత సంబంధ కీర్తనలను, గేయ, పద్య కావ్యాలను రచించి, ఆ రకమైన సాహిత్యానికి వైతాళికునిగా నిలిచి, 20వ శతాబ్దిలో అనేకమైన క్రైస్తవ భక్తి గీతాలు, శతకాలు వెలువడేందుకు ఆయన దారి చూపారు. ఆయన ఇచ్చిన స్ఫూర్తితో జాషువా, జ్ఞానానంద కవి తదితరులు క్రీస్తు జీవితంపై కావ్యాలను రచించారు. జాషువా రచించిన 'క్రీస్తు చరిత్రము' కావ్య గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమి పురస్కారం లభించింది. చౌధరి కవి ఇచ్చిన ప్రేరణలతో 20వ శతాబ్దిలో ఉమర్ – అలీషా, బూర్గుల రామకృష్ణరావు మున్నగువారు ఇస్లాము సంబంధ రచనలను తెలుగులో అందించారు. ఇటీవలి కాలంలో మైనారిటీ వాదం 'పేరిట ఒక కొత్త కవిత్వ శాఖ ఏర్పడడం గమనార్హం. తెలుగులో అన్య మత సంబంధ కవిత్వ బీజాలను నాటిన 19వ శతాబ్ది కవి పురుషోత్తమ చౌధరి సదా స్మరణీయులు.

ఈ విధంగా 19వ శతాబ్ది తెలుగు కవిత్వంలోని నవ్యత 20వ శతాబ్ది తెలుగు కవిత్వంపై బలమైన ప్రభావాన్నే చూపింది.

ఇక 19వ శతాబ్ది కవులలో యుగకర్తగా ఎవరిని పేర్కొనాలన్నది పెద్ద సమస్యేం కాదు. 20వ శతాబ్దిలో లాగ, "గురజాడనా? రాయప్రోలా? లేక ఇరువురా? " అన్న తర్కం అవసరం లేదు. ఒక వైపు సంఘ సంస్కరణ దృష్టితో రచనలు చేసి, మరో వైపు ఆనాడు వస్తున్న సాహిత్యంలోని చెడు పోకడలను ఎత్తి చూపి, ఇంకోవైపు తెలుగు సాహిత్యంలో అనేకమైన నూత్న ప్రక్రియలను ప్రవేశ పెట్టి మన సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కందుకూరి వీరేశలింగం పంతులుగారే 19వ శతాబ్ది యుగకర్త అనడానికి ఎట్టి సందేహం లేదు. (ఇక్కడ 19వ శతాబ్దిని ఒక యగం అనే యూనిట్‌గా భావిస్తే, ఆ యూనిట్ కి కర్తగా ఈ 'యుగకర్త' అన్న శబ్దాన్ని భావించాలి). ఆయనతో బాటు తొలి స్మృతి కావ్యాలు, తొలి పద్య నాటకాలను రచించిన వడ్డాది సుబ్బరాయకవి, వావిలాల వాసుదేవశాస్త్రి గార్లను ఆ శతాబ్ది వైతాళికులుగా పేర్కొనాలి. 19వ శతాబ్దిలో ఆ ముగ్గురిని 'కవిత్రయం' అని పిలచే వారట.[7] వీరితో బాటు ఖండ కావ్య ప్రక్రియను ప్రవేశ పెట్టిన ఆచంట సాంఖ్యాయనశర్మ; తొలి స్వీయ చరిత్రను, 'రాధాకృష్ణ సంవాదము' వంటి సోషియో ఫాంటసీ కృతిని రచించిన మండపాక పార్వతీశ్వర శాస్త్రి; కొత్త ఛందస్సులను ప్రవేశ పెట్టిన శిష్టు కృష్ణమూర్తి,

మండ కామశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నశర్మ; ఆధునిక జన వ్యవహార శైలిని వివరించిన దాసు శ్రీరాములు; ఆధునిక నగరాన్ని, నవీన నాగరికతను కావ్య వస్తువుగా మలచిన మతుకుమల్లి నృసింహశాస్త్రి; తొలి విషాదాంత కావ్యాన్ని సృజించిన కట్టమంచి రామలింగారెడ్డి; కావ్య సంప్రదాయాలను మార్చి వేసిన శొంఠి భద్రాద్రి రామశాస్త్రి, ఆదిభట్ట నారాయణ దాసు, జమాబంది వ్యవహారాలను చూసే కరణాల కష్టాల గురించి, వారి పరిభాషలోనే కావ్యంగా మలచిన వద్దిపర్తి కోనమరాజు, గిరిజన మహిళ వ్యవహార భాషను కావ్యంలో పొందుపరచిన తరిగొండ వేంకమాంబ, క్రైస్తవ మత సాహిత్యానికి రూప కల్పన చేసిన పురుషోత్తమ చౌధరి – ఇలా ఎందరో మహానుభావులు ఆ శతాబ్దిలోని వైతాళికులే!

క్షీణ యుగంగా నిరాదరణకు గురై, ఎన్నో కావ్యాలు ఈనాటికి అందుబాటులో లేకుండా మరుగున పడిపోయిన 19వ శతాబ్దిలో, దొరికినంత మేర గ్రంథాలలో, దొరికినంత మేర సమాచారంలోనే ఇంత నవ్యత ప్రస్ఫుటమౌతుంటే, 20వ శతాబ్ది ప్రారంభంలోనే 19వ శతాబ్ది కవిత్వంపై సమగ్ర పరిశీలన జరిగి ఉంటే ఇంకెంత నవ్యత ప్రకటితమై ఉండేదో ఆలోచించవలసిన విషయం.

అసలు 19వ శతాబ్దిని సాహిత్య చరిత్రలో క్షీణయుగంగా ప్రతిపాదించిన 20వ శతాబ్ది తొలితరం సాహితీవేత్తలు, పండితులు చర్విత చర్వణ రీతిలో వస్తున్న ప్రబంధాలను వేటితో పోల్చి, ఆ యుగాన్ని క్షీణ యుగంగా పేర్కొన్నారో గమనించాలి. రాయల వారి ప్రబంధయుగంలోని ప్రబంధాల నుండి చేమకూర వారి 'విజయ విలాసము' వరకు గల ప్రబంధాలతో పోల్చి. అంటే, ఒకవేళ ఆ క్షీణ ప్రబంధాల వెల్లువ లేకుండా ఉంటే, ఆ స్థానంలో వారు ఎటువంటి కావ్యాలు వెలువడి ఉండవలసిందని ఆకాంక్షించి ఉండేవారు? మళ్ళీ ప్రబంధయుగం నాటి ప్రామాణిక ప్రబంధాలనే సుమా! అంతే కాని ఈ సిద్ధాంత వ్యాసంలో ఇంత సవిస్తరంగా అధ్యయనం చేసిన నవ్య కావ్యాల వంటివి మాత్రం కావు. ఎందుకంటే వారికా దృష్టే ఉండి ఉంటే ఆ రోజుల్లో నవ్యదృష్టితో వెలువడిన అనేక నవ్య కావ్యాలను పరిశీలించి వాటిలోని నవ్యతను కూలంకషంగా అధ్యయనం చేసి ఆదరించి ఉండేవారు. వాటిలో నుండి ఎన్నో కావ్యాలు ఈనాడు మరుగున పడిపోకుండా కాపాడేవారు. కాని వారికా దృష్టి లేదనే చెప్పాలి. వారి చూపంతా వైభవోపేతమయిన ప్రాచీన సంప్రదాయ ప్రబంధ సాహిత్యం పైనే. అంతేకాని, అప్పుడప్పుడే ఉదయిస్తున్న నవ్య కవిత్వ సూర్యుని లేలేత కిరణాల పైన కాదు. అందుకే వారి దృష్టిలో 19వ శతాబ్ది క్షీణయుగం లేక అంధయుగంగా మిగిలింది.

ఇంతకు ముందు ఒక అధ్యాయంలో పేర్కొన్నట్టు 18వ శతాబ్ది అంతం వరకు కొనసాగిన నాయకరాజుల యుగానికి, 20వ శతాబ్దిలో వ్యవస్థీకృతమయిన నవ్య యుగానికి మధ్య 19వ శతాబ్ది ఒక ద్వార బంధం లాంటిది. 20వ శతాబ్దిలో తొలితరం పండితులు 19వ శతాబ్దిలో వెలువడిన ఒకటి, రెండు నవ్య కావ్యాలను గుర్తించినా, వారి దర్శనం ద్వార బంధానికి అటువైపు నుండి చేసిందే. కాని, ఈ సిద్ధాంత రచన 20వ శతాబ్ది నవ్యయుగ మహా వృక్ష ఫలాలను పూర్తిగా రుచి చూసి, ద్వార బంధానికి ఇటు వైపు నుండి చేసిన దర్శనం.

ఇంతకు ముందే వివరించినట్టు సాహిత్య చరిత్రను యుగాలుగా విభజించి చెప్పే కన్న, శతాబ్దుల వారీగా చెప్పడం వల్ల చాలా లాభాలున్నాయి. ఒక వేళ అలా కాదు, కూడదని, యుగ విభజన తప్పనిసరి అని ఎవరైనా భావిస్తే, 19వ శతాబ్దిని క్షీణయుగంగా మాత్రం పేర్కొన వద్దని నా మనవి. దానికి 'ఉషోదయ యుగం'గా నామకరణం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందని నా అభ్యర్థన. తెలుగు కవులకు, పండితులకు, విమర్శకులకు, సాహితీ ప్రియులకు ఆ పునర్నామకరణ మహోత్సవానికి ఆహ్వానం పలుకుతూ, ఈ సిద్ధాంత రచనను ముగిస్తున్నాను.

**పాద సూచికలు :**


1. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం – 13వ సంపుటం (ఆధునిక యుగం) – పుట. 26
2. ఫక్కి వెంకట నారసింహ కవి : కుమారీ శతకము – 11 మరియు 91 పద్యాలు
3. డా. సి. నారాయణ రెడ్డి : ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు, ప్రయోగములు – పుటలు. 165 నుండి 178
4. చిలకమర్తి లక్ష్మీనరసింహం – స్వీయ చరిత్ర – పుట. 181
5. డా. సి. నారాయణరెడ్డి : ఆరోహణ (కవితా సంపుటి) – పుట. 67
6. డా. దాశరథి : అమృతవల్లి – తెలుగు తల్లి (కవితా సంపుటి) – పుట. 1
7. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి : ఆంధ్ర రచయితలు – పుట. 94




**అనుబంధం : 1**

# భారత దేశ చరిత్రలో 19వ శతాబ్ది ముఖ్య సంఘటనలు

| సంవత్సరం (క్రీ.శ.) | సంఘటన |
|---|---|
| 1799 | టిప్పు సుల్తాన్ మరణం |
| 1801 | కర్నాటకపై ఈస్టిండియా కంపెనీవారి ఆధిపత్యం |
| 1803 | మరాఠాలతో ఈస్టిండియా కంపెనీ వారి యుద్ధం |
| 1806 | వెల్లూరులో సైనికుల తిరుగుబాటు అణచివేత |
| 1818 | ఈస్టిండియా కంపెనీ వారిచే మరాఠాల అణచివేత |
| 1820 | 'సమాచార దర్పణ్' వార్తా పత్రిక ప్రారంభం – మద్రాసు గవర్నర్‌గా థామస్ మన్రో |
| 1828 | విలియం బెంటింక్ గవర్నర్ జనరల్‌గా నియామకం– రాజా రామమోహన రాయిచే బ్రహ్మసమాజ స్థాపన |
| 1829 | సతీ సహగమనంపై నిషేధం |
| 1830 | రాజా రామమోహన రాయి ఇంగ్లాండ్ పర్యటన |
| 1831 | రంజిత్ సింగ్ నాయకత్వంలో సిక్కుల పురోగమనం |
| 1839 | మహారాజా రంజిత్ సింగ్ మరణం |
| 1845 | ఈస్టిండియా కంపెనీ వారిచే సిక్కుల అణచివేత |
| 1848 | డల్‌హౌసీ గవర్నర్ జనరల్‌గా నియామకం – పంజాబ్ ఈస్టిండియా కంపెనీ స్వాధీనం |
| 1853 | బొంబాయి నుండి థాణా వరకు మొట్ట మొదటి భారత రైలు మార్గం – కలకత్తా, ఆగ్రాల మధ్య 'టెలిగ్రాఫ్ సౌకర్యం' |
| 1856 | భారత విశ్వ విద్యాలయాల చట్టం |
| 1857 | ప్రప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం |
| 1858 | ఈస్టిండియా కంపెనీ రద్దు – భారత దేశంలో బ్రిటిష్ మహారాణి విక్టోరియా పరిపాలన |
| 1861 | భారతీయ శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడ్) – హైకోర్టుల చట్టం – ఇండియన్ కౌన్సిల్స్ చట్టం – విశ్వకవి రవీంద్రనాథ్ టాగోరు జననం. |
| 1865 | భారత్, యూరోపుల మధ్య టెలీగ్రాఫ్ సౌకర్యం |
| 1869 | మహాత్మాగాంధీ జననం |
| 1872 | మొదటి జనాభా లెక్కల సేకరణ |
| 1877 | బ్రిటిష్ రాణి భారత దేశ చక్రవర్తినిగా ప్రకటన |
| 1881 | మైసూరును రాజవంశీయులకు అప్పగించిన బ్రిటిష్ ప్రభుత్వం – భారతీయ కార్మిక చట్టం |
| 1885 | భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన – బొంబాయిలో ప్రథమ సమావేశం |
| 1892 | పరిపాలన నియంత్రణ కోసం, ఇండియన్ కౌన్సిల్స్ చట్టం. |
| 1899 | లార్డ్ కర్జన్ గవర్నర్ జనరల్ మరియు వైస్రాయిగా నియామకం. |



**అనుబంధం : 2**

# ప్రపంచ చరిత్రలో 19వ శతాబ్ది ముఖ్య సంఘటనలు

| సంవత్సరం (క్రీ.శ.) | సంఘటన |
|---|---|
| 1801 | అమెరికన్లచే తొలి సబ్‌మెరైన్ నిర్మాణం |
| 1802 | బ్రిటన్, ఫ్రాన్స్‌ల శాంతి సంధి – తొలి స్టీమరు క్లైడ్ నదిపై ప్రయాణం |
| 1804 | నెపోలియన్ ఫ్రాన్స్ చక్రవర్తిగా సింహాసన అధిరోహణం |
| 1807 | యూరోపంతా నెపోలియన్ రాజ్య విస్తరణ |
| 1814 | సంయుక్త సైన్యం చేతిలో ఫ్రాన్స్ ఓటమి – నెపోలియన్ ఎల్బాకు పలాయనం |
| 1815 | నెపోలియన్ ఫ్రాన్స్‌కి తిరిగి రాక – వాటర్లూ సమరంలో మళ్ళీ ఓటమి – మళ్ళీ పలాయనం |
| 1820 | ఇంగ్లండ్‌రాజు జార్జి 3 మరణం – జార్జి 4 కి పట్టాభిషేకం |
| 1821 | నెపోలియన్ మరణం |
| 1825 | గ్రేట్ బ్రిటన్‌లో తొలి రైలు మార్గం |
| 1828 | వెబ్‌స్టర్ రచించిన 'అమెరికన్ డిక్షనరీ ఆఫ్ ఇంగ్లీష్ లాంగ్వేజ్' ముద్రణ |
| 1830 | బ్రిటన్ సింహాసనంపై విలియం IV |
| 1837 | విక్టోరియాకు గ్రేట్ బ్రిటన్ సింహాసనం |
| 1839 | మొట్ట మొదటి సైకిల్ నిర్మాణం |
| 1840 | బ్రిటన్ ప్రభుత్వంచే ప్రపంచంలో మొదటి తపాలా బిళ్ళ విడుదల |
| 1841 | హాంకాంగ్ బ్రిటిష్ హస్తగతం |
| 1855 | టెలీగ్రాఫ్ ప్రింటింగ్ ఆవిష్కరణ |
| 1856 | ఉక్కు తయారీ విధానం కనుగొన్న బెసమర్ – బ్రిటన్ పార్లమెంట్ పై 13.5 టన్నుల గంట స్థాపన |
| 1858 | భారతదేశంలో విక్టోరియా రాణి పరిపాలన ప్రారంభం |
| 1860 | అబ్రహాం లింకన్ అమెరికా అధ్యక్షునిగా ఎన్నిక |
| 1861 | అమెరికాలో సివిల్ వార్ ప్రారంభం – బ్రిటన్‌లో ప్రతిదినం వాతావరణ విశేషాల అధ్యయనం ప్రారంభం |
| 1865 | అబ్రహాం లింకన్ హత్య – అమెరికాలో సివిల్ వార్ నిలిపివేత |
| 1866 | ఆల్‌ఫ్రెడ్ నోబెల్ చే డైనమెట్ ఆవిష్కరణ |
| 1867 | కార్ల్‌మార్క్స్ 'దాస్ క్యాపిటల్' ప్రచురణ |
| 1872 | బ్రిటన్‌లో రహస్య బ్యాలెట్ పద్ధతి అమలు |
| 1875 | మ్యాథ్యూ వెబ్ చే తొలిసారి 'ఇంగ్లీష్ ఛానల్' ఈత |
| 1876 | కొరియా స్వాతంత్ర్యం – గ్రాహంబెల్‌చే టెలీఫోన్ ఆవిష్కరణ |
| 1878 | విద్యుద్దీపాన్ని రూపొందించిన ఎడిసన్ |
| 1883 | మొట్టమొదటి పది అంతస్తుల భవన నిర్మాణం – చికాగోలో |
| 1886 | అమెరికాలో స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ ప్రతిష్ఠాపన |
| 1889 | ప్యారిస్‌లో ఈఫిల్ టవర్ నిర్మాణారంభం |
| 1893 | మొదటి మోటారు కారును రూపొందించిన కార్ల్ బెంజ్ |
| 1895 | రేడియోను కనుగొన్న మార్కొని |
| 1899 | రూథర్ ఫర్డ్‌చే రేడియో ధార్మికత ఆవిష్కరణ – దక్షిణాఫ్రికాలో బోయర్ యుద్ధాలు ప్రారంభం. |



అనుబంధం : 3

# ఆంధ్రదేశ చరిత్రలో 19వ శతాబ్ది ముఖ్య సంఘటనలు

| సంవత్సరం (క్రీ.శ.) | సంఘటన |
|---|---|
| 1800 | సైనిక సహకారానికి ప్రతిగా ఈస్టిండియా కంపెనీ వారికి దత్తమండలాలను (కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలు) అప్పగించిన నిజాం. |
| 1801 | నెల్లూరు జిల్లా ఈస్టిండియా కంపెనీ వశం |
| 1803 | నిజామలీఖాన్ మరణం - 5వ నిజాంగా సికిందర్ జాకు రాజ్యాధికారం |
| 1806 | తెలుగు అక్షరాల ముద్రణకై అచ్చుల తయారీ |
| 1816 | నిజాం రాజ్యంలో పిండారీల దౌర్జన్యాలు |
| 1820 | థామస్ మన్రో నాయకత్వంలో దత్త మండలాల్లో పాలెగాళ్ళ అణచివేత - రైత్వారీ పద్ధతి అమలు |
| 1823 | ఉత్తర సర్కారు జిల్లాలపై ఈస్టిండియా కంపెనీకి శాశ్వత హక్కు |
| 1829 | బందరులో ఉప్పెన - ఆరవ నిజాంగా నసీరుద్దౌలాకు సింహాసనం |
| 1835 | తొలి తెలుగు - ఇంగ్లీషు నిఘంటు నిర్మాణం |
| 1839 | తెలుగులో తొలి యాత్రాచరిత్ర గ్రంథం 'కాశీ యాత్ర' ముద్రణ - తెలుగులో మొట్ట మొదటి వార్తాపత్రిక 'వృత్తాంతిని' ప్రారంభం. |
| 1846 | భక్త శిఖామణి, సంగీత చక్రవర్తి త్యాగరాజు అస్తమయం |
| 1848 | సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం జననం |
| 1852 | ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణం పూర్తి |
| 1853 | సాలార్‌జంగ్ - నిజాం రాజ్య ప్రధానమంత్రిగా నియామకం |
| 1855 | విజయవాడలో కృష్ణా బ్యారేజి నిర్మాణం పూర్తి - నోబెల్ కళాశాల స్థాపన |
| 1856 | హైదరాబాదులో తొలిసారి పారిశ్రామిక వస్తు ప్రదర్శన ఏర్పాటు |
| 1857 | విజయనగరంలో సంస్కృత, సంగీత కళాశాలల స్థాపన - ఏడవ నిజాంగా అఫ్జలుద్దౌలాకి రాజ్యాధికారం -ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ ప్రభావంతో హైదరాబాదులో రెసిడెన్సీపై దాడి. |
| 1860 | పెన్నానదిపై ఆనకట్ట పూర్తి - చిన్నయ సూరి 'బాల వ్యాకరణం' ముద్రణ |
| 1861 | సంఘ సంస్కర్త, కవి గురజాడ అప్పారావు జననం |
| 1869 | 8వ నిజాంగా మహబూబ్ ఆలీఖాన్‌కు సింహాసనం |
| 1873 | రాజమండ్రిలో కళాశాల స్థాపన |
| 1885 | గుంటూరులో ఆంధ్ర క్రైస్తవ కళాశాల స్థాపన |
| 1886 | విశాఖపట్నంలో సరస్వతీ నిలయం (మొదటి గ్రంథాలయం) స్థాపన |
| 1887 | హైదరాబాదులో నిజాం కళాశాల స్థాపన |
| 1893 | తెలుగు దేశంలో అత్యధిక భాగాన్ని కలుపుతూ (మద్రాసు నుండి విశాఖపట్నం వరకు) రైలు మార్గం నిర్మాణం. |
| 1900 | హైదరాబాదులో ఆంధ్ర భాషాభిమానుల చేత భాషా పరిరక్షణకై 'శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం' స్థాపన |

**అనుబంధం : 4**

# 19వ శతాబ్దిలో తెలుగు పత్రికలు

| పత్రిక పేరు | వ్యవస్థాపకులు/ సంపాదకులు | వెలువడిన స్థలం | ప్రారంభ సంవత్సరం |
|---|---|---|---|
| సత్యదూత | క్రైస్తవ మిషనరీలు | బళ్ళారి | 1835 |
| వృత్తాంతిని | మండిగల వెంకట రామశాస్త్రి | మద్రాసు | 1838 |
| వర్తమాన తరంగిణి | సయ్యద్ రహమతుల్లా, పువ్వాడ వెంకటరావు | మద్రాసు | 1842 |
| హితవాది | రెవరెండ్ షర్కి | మచిలీపట్నం | 1848–62 మళ్ళీ 1882 నుండి |
| దినవర్తమాని | పెరీర్ పెర్సివాల్ | మద్రాసు | 1860 |
| శ్రీ యక్షిణి | వెంకట రమణ కవి, త్యాగరాజ మొదలియార్ | బళ్ళారి | 1863 |
| సుజన రంజని | వి. కృష్ణమాచార్యులు, బహుజన పల్లి సీతారామాచార్యులు | మద్రాసు | 1864 |
| స్వదేశ జన ప్రసిద్ధాభిప్రాయము | ఆంగ్లో వర్నాక్యులర్ | మద్రాసు | 1865 |
| తత్త్వ బోధిని | వేద సమాజం | మద్రాసు | 1865 |
| గోదావరి మం॥ విద్యాబోధిని | భరో | రాజమండ్రి | 1870 |
| ఆంధ్రభాషా సంజీవని | కొక్కొండ వేంకటరత్న శర్మ | మద్రాసు | 1871 |
| పురుషార్థ ప్రదాయిని | శ్రీరంగ నాయకులు నాయుడు | మచిలీపట్నం | 1872 |
| సకల విద్యాభివర్ధిని | పరవస్తు రంగాచార్యులు | విశాఖపట్నం | 1873 |
| ఈశ్వర వాది | – | మచిలీపట్నం | 1873 |
| వివేకవర్ధని | కందుకూరి వీరేశలింగం | రాజమండ్రి | 1874 |
| లోక రంజని | – | మద్రాసు | 1874 |
| శశిరేఖ | గట్టు శేషాచార్యులు | మద్రాసు | 1874 |
| రసికోల్లాసిని (హాస్య వర్ధని) | కొక్కొండ వేంకటరత్నశర్మ | మద్రాసు | 1875 |
| హాస్యసంజీవని | కందుకూరి వీరేశలింగం | రాజమండ్రి | 1876 |
| సతీహితబోధిని | కందుకూరి వీరేశలింగం | రాజమండ్రి | 1883 |
| హిందూజన సంస్కారిణి | మన్నవ బుచ్చయ్య | మద్రాసు | 1885 |
| అముద్రిత గ్రంథ చింతామణి | కొక్కొండ వేంకటరత్నం & పూండ్ల రామకృష్ణయ్య | మద్రాసు | 1885 |
| ఆంధ్ర ప్రకాశిక | ఏ.పి. పార్థ సారథి నాయుడు | మద్రాసు | 1885 |
| శ్రీధర్మ రక్షణ | – | విజయవాడ | 1891 |
| సన్మత దర్శిని | – | మద్రాసు | 1891 |
| చింతామణి | న్యాపతి సుబ్బారావు | రాజమండ్రి | 1891 |
| సత్యసంవర్ధని | ప్రార్థనా సమాజం | మచిలీపట్నం | 1892 |
| సంజీవని | కందుకూరి వీరేశలింగం | రాజమండ్రి | 1892 |
| తెలుగు జనానా | మల్లాది వెంటరత్నం | మద్రాసు | 1893 |
| శ్రీవైజయంతి | ఆనందాచార్యులు | మద్రాసు | 1894 |
| కృష్ణవృత్తాంతిని | దేవగుప్తం శేషాచలపతి | విజయవాడ | 1896 |
| బాలిక | సింగీతం బాపిరాజు | శ్రీకాకుళం | 1896 |
| సరస్వతి | చిలకమర్తి లక్ష్మీ నరసింహం | రాజమండ్రి | 1898 |

**అనుబంధం : 5**

# ఉపయుక్త గ్రంథ సూచి


1. అచలాత్మజా పరిణయము - బుక్క పట్టణం వేంకటాచార్య
2. అన్నమాచార్య కీర్తనల సంపుటి (తి.తి.దే. ప్రచురణ)
3. అమృత వల్లి : తెలుగు తల్లి - డా. దాశరథి
4. అలిమేలు మంగా పరిణయము - తూము రామచంద్రారెడ్డి
5. ఆత్మ సపర్యాచర్య - మండపాక పార్వతీశ్వర కవి
6. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు - డా. సి. నారాయణరెడ్డి
7. ఆధునిక ఆంధ్ర దేశ చరిత్ర - ఎం. హనుమంత రావు, కె.బి.వి.వి. ప్రసాద్
8. ఆముక్త మాల్యద - శ్రీకృష్ణ దేవరాయలు
9. ఆంధ్ర కవుల చరిత్రము - వీరేశలింగం పంతులు
10. ఆంధ్ర క్రైస్తవ కవి సార్వభౌముడు - పురుషోత్తమ చౌధరి రచనలు (ద్విశత జయంతి ఉత్సవ ప్రచురణ)
11. ఆంధ్ర కవి తరంగిణి (3 సంపుటాలు) - చాగంటి శేషయ్య
12. ఆంధ్ర తులసీ రామాయణము (సుందరకాండము) - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ
13. ఆంధ్ర దేశ చరిత్ర - సంస్కృతి (3 భాగాలు) - బి.ఎన్. శాస్త్రి
14. ఆంధ్ర బిల్హణీయము - వేదం వేంకట రాయశాస్త్రి
15. ఆంధ్ర మహాభారతము- తి.తి.దే. ప్రచురణ (మొదటి 4 సంపుటాలు)
16. ఆంధ్ర మేఘ సందేశము - వడ్డాది సుబ్బారాయకవి.
17. ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
18. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి
19. ఆంధ్ర శతక సాహిత్య వికాసము - డా. కే. గోపాలకృష్ణారావు
20. ఆంధ్ర సాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మీకాంతం
21. ఆంధ్ర సాహిత్య చరిత్ర - డా. కె. రామ్మోహనరాయ్
22. ఆంధ్ర సాహిత్యము : సాంఘిక జీవన ప్రతిఫలనము - నండూరి వేంకట సత్య రామారావు
23. ఆంధ్ర సంస్థానములు, సాహిత్య పోషణము - ఆచార్య తూమాటి దొణప్ప
24. ఇంద్రద్యుమ్నీయము - రంగరాజు కేశవరావు
25. ఉదయశ్రీ (2 భాగాలు) - కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి
26. ఉషః కిరణాలు - యండమూరి సత్యనారాయణరావు.
27. కచ్ఛపీ శ్రుతులు - దాస భారతి ప్రచురణ
28. కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్ర - డా. మలయశ్రీ
29. కరుణా రసతరంగిణి - గొట్టుముక్కల రమాకాంతచార్యులు
30. కల్యాణ రాఘవము - గడియారం శేషఫణి శర్మ
31. కళా పూర్ణోదయము - పింగళి సూరనామాత్యుడు
32. కళావతి పరిణయము - జయంతి భావనారాయణ
33. కవి సార్వభౌముడు పురుషోత్తమ చౌధరి-సాహితీ సౌరభాలు (ద్విశత జయంతి ఉత్సవ ప్రచురణ)
34. కాశీయాత్రా చరిత్ర - ఏనుగుల వీరాస్వామయ్య.
35. కాళిందీ పరిణయము - ధూళిపాళ వెంకట రామయ్య
36. కావ్య లహరి (యువ భారతి అష్టమ వార్షికోత్సవ సంచిక)
37. కావ్యాలోకము - డా. నండూరి రామకృష్ణమాచార్య
38. కీరవాణి శతకము - గంగాధర కవి
39. కీర్తి కాంతా స్వయంవరము - రాజా గోపాలరాయణం బహద్దూర్
40. కుబ్జా కృష్ణ విలాసము - అక్కెన ప్రగడ హరిదాసు
41. కుమార సంభవము - నన్నెచోడుడు

42. కుమార శతకము - పక్కి అప్పల నరసు
43. కుమారీ శతకము - ఫక్కి వెంకట నారసింహ కవి
44. కృష్ణ పక్షము - దేవుల పల్లి కృష్ణశాస్త్రి
45. కౌసల్యా పరిణయము - వావికొలను సుబ్బారావు
46. కందుకూరి వీరేశలింగం అధిక్షేప రచనలు - డా. అక్కిరాజు రమాపతిరావు
47. గజానన విజయము - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
48. గాలిబు గీతాలు - డా. దాశరథి
49. గురజాడ రచనలు ( కవితల సంపుటం) - గురజాడ అప్పారావు
50. గోలకొండ కవుల సంచిక - సురవరం ప్రతాపరెడ్డి
51. గౌతమీ మహాజల మహిమానువర్ణనము, గోదావరి ధూమనౌకా విహారము (చాటు ప్రబంధ ద్వయము) - వడ్డాది సుబ్బారాయకవి
52. చక్కట్ల దండ - దాసు శ్రీరాములు
53. చరిత్ర సంవత్సర దర్పణము - కొండూరి రామానుజాచార్యులు
54. చాటుపద్యమణిమంజరి (2 భాగాలు) - వేటూరి ప్రభాకరశాస్త్రి
55. చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర - డా. ముదిగొంటి సుజాతారెడ్డి
56. చిత్రసీమ - శొంఠి భద్రాద్రి రామశాస్త్రి
57. చిలకమర్తి సాహిత్య సేవ - డా. ముక్తేవి భారతి
58. చెన్నపురీ విలాసము - మతుకుమల్లి నృసింహశాస్త్రి
59. ఛందో దర్పణము - అనంతామాత్యుడు
60. తాలాంక నందినీ పరిణయము - ఆసూరి మరింగంటి వేంకట నరసింహాచార్య
61. తులసీ రామాయణం - అయాచితుల హనుమచ్ఛాస్త్రి అనువాదం - అయోధ్యకాండం (వ్రాత ప్రతి)
62. తులనాత్మక సాహిత్య వ్యాసాలు - పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ప్రచురణ.
63. తెలుగు కవిత : లయాత్మకత - డా. సి. నారాయణ రెడ్డి (యువ భారతి ప్రచురణ)
64. తెలుగు నాటక సాహిత్యం - ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ.
65. తెలుగునాడు - దాసు శ్రీరాములు
66. తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము - కల్లూరి వేంకట నారాయణ రావు
67. తెలుగులో అచ్చయిన తొలి పుస్తకాలు - డా. జోలెపాళెం మంగమ్మ
68. తెలుగులో గేయ నాటికలు - డా. తిరుమల శ్రీనివాసాచార్య
69. తెలుగులో చాటు కవిత్వము - ప్రొ. జి. లలిత
70. తెలుగులో తిట్టు కవిత్వము - విద్వాన్ రావూరి దొరస్వామి శర్మ
71. తెలుగులో సాహిత్య విమర్శ - డా. ఎస్వీ రామారావు
72. తెలుగులో స్వీయ చరిత్రలు - డా. అక్కిరాజు రమాపతిరావు
73. తెలుగు సాహిత్యకోశము (2 సంపుటాలు) - తెలుగు అకాడమి ప్రచురణ
74. తెలుగు సాహిత్య చరిత్ర (5 సంపుటాలు) - ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
75. తెలుగు సాహిత్య చరిత్ర - డా. ద్వా.నా. శాస్త్రి
76. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు
77. తెలుగు సాహిత్యంలో పేరడీ - డా. వెలుదండ నిత్యానందరావు
78. తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము - దేవులపల్లి రామానుజరావు
79. త్యాగరాజ కీర్తనలు - కల్లూరి వీరభద్రశాస్త్రి
80. దాశరథి కవిత - డా. దాశరథి
81. దుర్మార్గ చరిత్రము - విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడు
82. ధర్మ నందన విలాసము- కాళ్ళకూరి గౌరీ కాంత కవి
83. నన్నయ దర్శనము- ఆచార్య ఎస్వీ రామారావు
84. నన్నయ భట్టు - ఆచార్య దివాకర్ల వేంకటావధాని
85. నరసింహ శతకము - శేషాచలదాసు (పావని సేవాసమితి ప్రచురణ)

86. నల్లగొండ జిల్లా కవులు, పండితులు – డా. శ్రీరంగాచార్య

87. నవ్యాంధ్ర సాహిత్య వీధులు– కురుగంటి సీతారామయ్య

88. నందక రాజ్యము – వావిలాల వాసుదేవశాస్త్రి

89. నా వాఙ్మయ మిత్రులు – టేకుమళ్ళ కామేశ్వర రావు

90. నియోగి రత్న భూషణము – కొక్కొండ వేంకటరత్నశర్మ

91. పథిక విలాసము – కందుకూరి వీరేశలింగము

92. పద్య శిల్పం – డా. నండూరి రామకృష్ణమాచార్య

93. పరిశిష్టము – దాస భారతి ప్రచురణ

94. పల్లవీ పల్లవోల్లాసము – మాడభూషి నరసింహాచార్య

95. పాండవోద్యోగములు – తిరుపతి వేంకటేశ్వర కవులు

96. ప్రపంచ చరిత్ర – ఎం. చంద్రమోహన్

97. బసవ పురాణము – పాల్కురికి సోమనాథుడు

98. బాటసారి – ఆదిభట్ట నారాయణదాసు

99. బిల్వేశ్వరీయము – కొక్కొండ వేంకటరత్న శర్మ

100. బ్రహ్మానందము – కామ గ్రంథమాల ప్రచురణ

101. బ్రౌను – కావ్య సముద్ధరణము – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ

102. భామాకలాపము (19వ శతాబ్ది నృత్య నాటికలు) – తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయ ప్రచురణ

103. భామినీ విలాసము – ఆకుండి వ్యాసమూర్తి

104. మనుచరిత్రము – అల్లసాని పెద్దన (పొ. శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ)

105. మర్యాద రామ చరిత్రము – తురగా వెంకమరాజు

106. మహతి – యువ భారతి ప్రచురణ

107. మహాకవి జాషువ వ్యక్తిత్వం, కవిత్వం – ఆచార్య ఆర్. సుందరరావు

108. మహా ప్రస్థానం – శ్రీశ్రీ

109. మార్క్సిస్టు, లెనినిస్టు తత్త్వశాస్త్ర మౌలిక సూత్రాలు (గతి తార్కిక భౌతిక వాదం) – అనువాదకుడు : శేఖర్

110. ముసలమ్మ మరణము – డా. కట్టమంచి రామలింగారెడ్డి

111. రాధాకృష్ణ సంవాదము – మండపాక పార్వతీశ్వరశాస్త్రి

112. రాయభట్ట వీరరాఘవరాజు కవి రచనలు– సంపాదకులు : కొడాలి లక్ష్మీనారాయణ

113. రుక్మిణీ కల్యాణము – పంచాంగం రాఘవాచార్యులు

114. రంగరాయ కదనరంగచరిత్రము – దిట్టకవి నారాయణకవి

115. లంకా విజయము (రావణ దమ్మీయము) – పిండిప్రోలు లక్ష్మణ కవి

116. 20వ శతాబ్ది తెలుగు కవిత్వం – డా. కడియాల రామమోహనరాయ్

117. వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక – టి. శ్రీరంగస్వామి

118. వసంత కుసుమము – మంత్రిప్రెగడ భుజంగ రావు

119. వసు చరిత్రము – రామ రాజ భూషణుడు (పొ. శ్రీ. తె.వి.వి. ప్రచురణ)

120. వసురాయ చాటు ప్రబంధం – వడ్డాది సుబ్బారాయకవి

121. విజయరామ యశోభూషణము – చత్రాతి లక్ష్మీనరసుకవి

122. వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన – డా. అక్కిరాజు రమాపతిరావు

123. వీరేశలింగం యుగము – కల్లూరి వేంకట నారాయణ రావు

124. వేంకటాచల మాహాత్మ్యము – తరిగొండ వేంకమాంబ

125. వేమన శతకము – పావని సేవా సమితి ప్రచురణ

126. శకుంతలా పరిణయము – రేవణూరి వేంకటార్యుడు

127. శబ్ద రత్నాకరము – బహుజనపల్లి సీతారామాచార్యులు

128. శశిరేఖా పరిణయము – అప్పప్ప కవి

129. శేషేంద్ర కవిత : నవ్యత – డా. కలువగుంట రామమూర్తి

130. శ్రీకుమారాభ్యుదయము – వావిలకొలను సుబ్బరాయ కవి

131. శ్రీ కృష్ణ చంద్రోదయము– ఉత్పల సత్యనారాయణాచార్య

132. శ్రీకృష్ణ దేవరాయ చరిత్రము - ఆదిపూడి సోమనాథ రావు
133. శ్రీ తులసీ రామాయణము - దుగ్గిన రామచంద్రరావు
134. శ్రీదాసు శ్రీరాములుగారి కృతులు: ఒక సమీక్ష - డా. వెలగపూడి వైదేహి
135. శ్రీ పరవస్తు చిన్నయసూరి జీవితము- వావిళ్ళ ప్రెస్సు, చెన్నపురి ముద్రణ
136. శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము - గణపవరపు వెంకట కవి
137. శ్రీ పాద రేణు ప్రభావము - రేవణూరి వేంకటార్యుడు
138. శ్రీ మహాలక్ష్మీ పరిణయము - వద్దిపర్తి కోనమరాజు
139. శ్రీ మంత్రికూటాచల మాహాత్మ్యము -కొప్పరాజు నరసింహం
140. శ్రీ మహా భాగవతము - పోతన (శివజ్యోతి ప్రచురణ - గుంటూరు)
141. శ్రీ సూక్తి వసు ప్రకాశము - వడ్డాది సుబ్బారాయకవి
142. శ్రీరామచంద్ర విలాసము - గుండు లక్ష్మణ శాస్త్రి
143. సతీస్మృతి - వడ్డాది సుబ్బారాయ కవి
144. సత్య విజయము - అయ్యన కోట పార్థ సారథి శ్రేష్ఠి
145. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (14 సంపుటాలు) - ఆరుద్ర
146. సాత్రాజితీ పరిణయము - అడవి సాంబశివరాయుడు
147. సి. నారాయణ రెడ్డి సమగ్ర సాహిత్యం (18 సంపుటాలు)
148. సీజరు చరిత్రము - వావిలాల వాసుదేవశాస్త్రి
149. సురతాణీ పరిణయము - వారణాశి అచ్యుత రామయ్య
150. సూర్య రాయాంధ్ర నిఘంటువు (6 సంపుటాలు) - తె.వి.వి. ప్రచురణ
151. స్వీయ చరిత్ర - చిలకమర్తి లక్ష్మీనరసింహం
152. స్వీయ చరిత్రము- కందుకూరి వీరేశలింగం పంతులు
153. హర విలాసము - శ్రీనాథుడు
154. హైదరాబాదు : నాలుగు శతాబ్దుల సాహిత్య వికాసం - తెలుగు అకాడమి ప్రచురణ

హిందీ గ్రంథం :

155. ..................................................................

ఆంగ్ల గ్రంథాలు :

156. An advanced History of India by Majumdar, Ray chaudhuri and Datta.
157. An out line History of English literature by William Henry Hudson
158. An out line History of India by S. Natarajan
159. 'C. P. Brown' by V.V. Subrahmanya Sarma
160. 'Encarta' General knowledge series (compact discs)
161. The complete works of William Shakespeare
162. Vignettes of Telugu Literature by Dr. Sonti Venkata Surya Narayana Rao
163. Websters Third New International Dictionary

**పత్రికలు, ప్రత్యేక సంచికలు :**

164. ఆచార్య వి.యల్.యస్. భీమశంకరం సప్తతి సంచిక - సంపాదకులు : ఆచార్య ఎస్వీరామారావు
165. ఆంధ్ర పత్రిక (ఉగాది సంచికలు)
166. ఆంధ్ర వార పత్రిక (1938-40 సంపుటములు)
167. భారతి (1924-1963 సంపుటములు)
168. భారతి (1965- 1975 సంపుటములు)
169. వివేక వర్ధని పత్రిక - జూలై 1876 సంచిక
170. Manorama year book - 2005
171. Past 1000years : Come home to History (INDIA TODAY Millenium special issue)



కవిగా, విమర్శకునిగా, పరిశోధకునిగా
**డా. ఆచార్య ఫణీంద్ర** పరిచయం

పన్నెండేళ్ళ పసి వయసులోనే కందపద్యాన్ని రచించిన డా. ఆచార్య ఫణీంద్ర – ప్రముఖ తెలుగు కవి, సాహిత్య విమర్శకుడు, పరిశోధకుడు. ఆచార్య ఫణీంద్ర ఆయన కలం పేరు. అసలు పేరు గోవర్ధనం వేంకట ఫణీంద్ర శయనాచార్య. ఆచార్య ఫణీంద్ర 27 జూలై 1961 (వ్యాస పూర్ణిమ) నాడు నిజామాబాదు పట్టణంలో గోవర్ధనం దేశికాచార్య, ఇందిరాదేవి దంపతులకు జన్మించారు. ఆచార్య ఫణీంద్ర తండ్రి గారి స్వస్థలం ఉమ్మడి కరీంనగర్ జిల్లా (ప్రస్తుత జగిత్యాల జిల్లా) లోని బండ లింగాపురం గ్రామం. ఆచార్య ఫణీంద్ర మాతామహులు ఆచి వేంకట నృసింహాచార్యులు, పితామహులు గోవర్ధనం నారాయణాచార్యులు.. ఇరువురూ సంస్కృతాంధ్ర పండితులు, కవులు. తెలంగాణ వైతాళికులు సురవరం ప్రతాపరెడ్డి గారి "గోల్కొండ కవుల సంచిక"లో వారి పరిచయ వివరాలు ఉన్నాయి. ఫణీంద్ర బాల్యం, పాఠశాల విద్య నిజామాబాదులోనే గడిచాయి. హైదరాబాదులో ఉన్నత విద్యాభ్యాసం చేసారు.

ఆయన తొలుత మెకానికల్ ఇంజనీరింగ్ లో పట్టభద్రుడు. తరువాత తెలుగులో ఎం.ఏ. డిగ్రీతోబాటు, డాక్టరేట్ డిగ్రీని ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి "19వ శతాబ్దంలో తెలుగు కవిత్వం" అనే విషయంపై సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి సాధించారు. ముకుంద శతకం, పద్య ప్రసూనాలు, ముద్దుగుమ్మ, మాస్కో స్మృతులు, వరాహ శతకం, తెలంగాణ మహోదయం, మౌక్తికం వంటి పద్యకవితా గ్రంథాలను రచించి మంచి పద్యకవిగా గుర్తింపు పొందారు.

వృత్తిరీత్యా – భారత ప్రభుత్వ "అణు ఇంధన సంస్థ" లో శాస్త్రవేత్తగా పనిచేసి, 2021లో ఉద్యోగ విరమణ కావించారు. 2001 లో వృత్తిరీత్యా అణు ఇంధన శాస్త్రవేత్తగా – భారత ప్రభుత్వ ప్రతినిధిగా రష్యాలోని మాస్కో నగరంలో పర్యటించారు. తెలుగు సాహిత్యంలో "మాస్కో స్మృతులు" పేరిట 'తొలి సమగ్ర విదేశ యాత్రా పద్య కావ్యా'న్ని రచించారు. వచన కవిత్వంలో – కార్గిల్ యుద్ధంపై "విజయ విక్రాంతి" పేరిట దీర్ఘ కవితను రచించారు. తెలుగు వచన కవిత్వ సాహిత్యంలో "ఏక వాక్య కవితల" ప్రక్రియకు ఆచార్య ఫణీంద్ర ఆద్యులు. ఆయన రచించిన తొలి ఏక వాక్య కవితల గ్రంథం "వాక్యం రసాత్మకం" – "Single Sentence Delights" పేరిట ఆంగ్లంలోకి అనువదించబడింది. మలిదశ తెలంగాణ ఉద్యమ కాలంలో రచించిన తన కవితల నన్నిటినీ సంపుటీకరించి, "తెలంగాణ మహోదయం" కావ్యంగా అందించారు. "సాహితీ సల్లాపాలు" పేరిట కవి, పండితుల ఛలోక్తుల సంపుటిని వెలువరించారు. "తెలంగాణ సాహిత్య అకాడమీ" ప్రచురించిన, ప్రాచీన కాలం నుండి నేటి వరకు గల తెలంగాణ కవుల "పరంపర" గ్రంథంలో మరియు తెలంగాణ ప్రభుత్వ "భాషా సాంస్కృతిక శాఖ" ప్రచురించిన "తెలంగాణ కవులు – కావ్యాలు" గ్రంథంలో డా. ఆచార్య ఫణీంద్ర స్థానం సంపాదించుకొన్నారు.

తెలుగు సాహిత్యంలో పద్య, గేయ, వచన కవిత్వాలతో బాటు పరిశోధన, విమర్శ రంగాలలో విశేషంగా కృషి చేసి, అనేక సాహిత్య వ్యాసాలను కూడ రచించారు. 2017లో హైదరాబాదులో నిర్వహించబడిన ప్రపంచ తెలుగు మహా సభలలో ఆయన రచించిన "తెలంగాణలో తెలుగు భాష" అన్న వ్యాసం విశిష్ట బహుమతిని సాధించింది. ఈ సుదీర్ఘ వ్యాసం "నమస్తే తెలంగాణ" దినపత్రికలోనూ, అమెరికా తెలుగు సంఘం (ఆటా) రజతోత్సవ మహాసభల ప్రత్యేక సంచికలోనూ ప్రచురించబడి, బహుళ ప్రశంసల నందుకొంది. 2023వ సంవత్సరంలో ఆచార్య ఫణీంద్ర కవి రచించిన "సైసైరా చిన్నపరెడ్డి" అనే కావ్యం ఉత్తర అమెరికా తెలుగు సంఘం 'తానా' వారు ప్రపంచ స్థాయిలో నిర్వహించిన పద్య, గేయ కావ్యాల పోటీలో ఒక "ఉత్తమ పద్య కావ్యం" గా ఎంపిక చేయబడింది.

ఆయన ప్రధానంగా – శతాధిక సంవత్సరాల చరిత్ర కలిగిన 'శ్రీకృష్ణదేవరాయ తెలుగు భాషా నిలయం' నుండి 'మహాకవి దాశరథి కృష్ణమాచార్య' సాహితీ పురస్కారం, 80 సంవత్సరాలపై చరిత్ర కలిగిన 'తెలంగాణ సారస్వత పరిషత్తు' నుండి మరియు 'వానమామలై వరదాచార్య' శతజయంతి ఉత్సవ సంఘం నుండి వానమామలై వరదాచార్య స్మారక పురస్కారాలు', 'దివాకర్ల ట్రస్ట్' నుండి 'దివాకర్ల వేంకటావధాని' స్మారక పురస్కారం, ఏలూరు 'నవ్య సాహిత్య మండలి' నుండి 'పైడిపాటి సుబ్బరామశాస్త్రి' స్మారక పురస్కారం, 'తేజ ఆర్ట్ క్రియేషన్స్, భువనగిరి' నుండి 'ఆచార్య తిరుమల' స్మారక పురస్కారం, ఇంకా .. 'తెలుగు భాషా సంరక్షణ సంఘం, జగిత్యాల' నుండి 'బోయినపల్లి వేంకట రామారావు' స్మారక పురస్కారం, 'రంజని సాహితీ సమితి' నుండి "రంజని – విశ్వనాథ" పురస్కారం,

‘సిలికానాంధ్ర, యూ.ఎస్.ఏ.’ నుండి ‘సిలికానాంధ్ర’ గేయ కవితా పురస్కారం, మూడు సార్లు విజయవాడ ‘ఎక్స్ రే’ సంస్థ సాహిత్య పురస్కారాలు, ‘కమలాకర ఛారిటబుల్ ట్రస్ట్’ నుండి “వైజ్ఞానిక రత్న” పురస్కారం, పలుమార్లు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం మరియు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ‘ఉగాది’ సత్కారాలు పేర్కొనదగినవి. ఆయన 2012లో తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలోనూ, 2014 లో అమెరికాలో, అట్లాంటాలో జరిగిన “నాటా” తెలుగు సభలలోనూ ఆహ్వానం అందుకొని, ప్రాతినిధ్యం వహించి, సత్కారాలతో గౌరవింపబడ్డారు.

ఆయన హైదరాబాదులో వి.ఎల్.ఎస్. లిటెరరీ అండ్ సైంటిఫిక్ ఫౌండేషన్ నుండి “పద్య కళా ప్రవీణ” బిరుదును పొందారు. తూర్పుగోదావరి జిల్లా, ఏలూరు లోని నవ్య సాహిత్య మండలి నుండి “కవి దిగ్గజ” బిరుదును పొందారు. హైదరాబాదులోని నవ్య సాహితీ సమితి నుండి “ఏకవాక్య కవితా పితామహ” పురస్కారాన్ని పొందారు. ఆయన ప్రస్తుతం “యువభారతి” సాహిత్య సంస్థకు అధ్యక్షులుగా, “నవ్య సాహితీ సమితి” కి అధ్యక్షులుగా, “నండూరి రామకృష్ణమాచార్య సాహిత్య పీఠం” కు ప్రధాన కార్యదర్శిగానూ ఉన్నారు. ఆయన “ఆంధ్ర పద్య కవితా సదస్సు” తెలంగాణ ప్రాంత ప్రతినిధిగా వివిధ స్థాయిలలో పద్య కవితా ప్రచారానికి రెండు దశాబ్దాల పాటు విశేషంగా కృషి చేసారు. ఆ సంస్థ యొక్క పత్రిక “సాహితీ కౌముది” కి పదేళ్ళపాటు సహసంపాదకులుగా వ్యవహరించారు.

ఫణీంద్ర కవికి వరిష్ఠ పద్యకవి శ్రీ మంతెన సూర్యనారాయణ రాజు గారు తన “రస గుళికలు” అన్న పద్య కృతిని, మరొక పద్య కవి శ్రీ శంభుని కుమార్ తన “చిలిపి పద్యాలు – కలికి ముత్యాలు” అన్న కృతిని అంకిత మిచ్చారు. ఆచార్య ఫణీంద్ర ప్రతిభను గుర్తించి, 2013 సంవత్సరానికి గాను తెలుగు విశ్వవిద్యాలయం వారు ‘పద్య కవిత్వం’లో “కీర్తి పురస్కారం” ప్రదానం చేసారు. 2017 లో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన “ప్రపంచ తెలుగు మహాసభలు”లో డా. ఆచార్య ఫణీంద్ర “పద్య కవి సమ్మేళన” అధ్యక్షులుగా వ్యవహరించి సత్కరించబడ్డారు. అంతే కాకుండా ఆయన దేశంలోని పలు వేదికలపై “భువన విజయం”, “ఇంద్ర సభ”, “ప్రతాపరుద్ర వైభవం”, “తెలుగు సాహితీ వైభవం” వంటి సాహిత్య రూపకాలలో ప్రాచీన, ఆధునిక కవుల పాత్రలను పోషించి మన్ననలందుకొంటూ ఉన్నారు.

